# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

✶ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రను మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

------------ కూపన్ ------------

**డిసెంబర్ చతుర నవల భూమిపుత్రుడు**

సమీక్షకుని పేరు : ..............................

చిరునామా : ..............................

..............................

..............................

..............................

# పిట్ట కథలు

## డూప్

అమల, విమల స్నేహితురాళ్లే కాదు, హితురాళ్లు కూడాను. ఒకే కుటుంబంలోని వాళ్లు కాకపోయినా, ఇరుగు పొరుగు ఇళ్లవాళ్లు. ఒకే కంచంలో తినకపోయినా, కంచాలు పక్కపక్కన పెట్టుకుని తిన్నవాళ్లు. ఒకే మంచంలో పడుకోకపోయినా ఒకే పంచలో పక్కలు వేసుకునేవాళ్లు. ఒకే ఈడువాళ్లే కాక ఒకేసారి ఈడొచ్చిన వాళ్లు కూడాను. ఒకే స్కూలులో, ఒకే క్లాసులో చదివిన వాళ్లు! అందుకే కాబోలు ఒకే రకపు అభిరుచులు అబ్బాయి ఇద్దరికీను. సినిమాలలో నటించాలన్న ఆశకూడా వారితోటే పెరిగి పెద్దదయింది.

స్నేహితురాళ్లిద్దరూ టెన్త్ చదువుతుండగా ఒసారి ఫిల్మ్ యూనిట్ ఒకటి వారి గ్రామానికి రావడం, మూడు రోజులపాటు స్కూలు ఎగ్గొట్టి వాళ్లు షూటింగ్ చూడడమూ జరిగింది. ఆ అనుభవం ఇచ్చిన ఇన్‌స్పిరేషన్ ఫలితంగా ఆ యూనిట్‌తో పాటే జాయింటుగా అదృశ్యమయిపోయారు ఆ అమ్మాయిలిద్దరూ!

అలా తమ గ్రామంలో అదృశ్యమయిన ఆ పిల్లలు పట్నంలో ఫిల్ము స్టూడియోల ముందు ప్రత్యక్షమయ్యారు అర్జెంటుగా హీరోయిన్లమయిపోవాలన్న ఆకాంక్షతో.

పట్నంలోని స్టూడియోలన్నిటినీ పరామర్శించారు వాళ్లు అత్యంతాశతో. తెలిసిన వాణ్ణీ, తెలీని వాణ్ణీ అర్థించారు సినిమాలో ఛాన్సుల కోసం. పడవలసిన వారి చేతులలో కాక, పడకూడని వారి హస్తాలలో కూడా పడి చిక్కుకున్న కారణంగా ఎన్నో ఇక్కట్లుకు గురయ్యారిద్దరూ. విధి విసిరిన పూపుకు ఇద్దరివీ రెండు దారులయ్యాయి.

హీరోయిన్లు కావాలని కలలు కంటూనే, హీరోయిన్లకు డూప్‌లుగా మిగిలిపోయారిద్దరూ!

సినీప్రవాహంలో అయిదేళ్ళు కొట్టుకుపోయాయి.

ఇప్పుడు దక్షిణాదిన నంబర్ వన్ హీరోయిన్‌గా చెలామణీ అవుతూన్న మద్రాసులోని చంచలాదేవికి 'డూప్'గా పనిచేస్తోంది అమల.

మరో చిన్నసైజు తారకు 'డూప్' అయికూర్చుంది విమల హైద్రాబాద్‌లో.

ఒకరినొకరు కలుసుకోవడం కుదరకపోయినా స్నేహితురాళ్లిద్దరూ ఒకరి విషయం మరొకరు తెలుసుకుంటూనే వున్నారు అడపాదడపా.

ఒకసారి అవుట్‌డోర్ షూటింగ్ నిమిత్తం పాండిచ్చేరికి వెళ్లింది విమల. తాను డూప్‌గా పనిచేసే తారతో కలిసి.

అదే సమయంలో మద్రాసునుంచి షూటింగ్‌కోసం పాండిచ్చేరి వచ్చింది చంచలాదేవి. ఆమెతోపాటే ఆమె డూప్ అమల కూడాను.

షూటింగ్ ముగిశాక సైట్ సీయింగ్‌కి వెళ్లిన విమలకు అనుకోకుండా అమల ఎదురుపడింది.

ఎన్నేళ్లకో స్నేహితురాలు కనిపించడంతో పట్టలేని ఆనందం కలిగింది విమలకు.

"అమలా!" అంటూ పరుగున వెళ్లింది స్నేహితురాలి దగ్గరకు.

మోడర్న్ డ్రస్‌లో, మారిన హెయిర్ డ్రస్‌లో

---

కవర్‌పేజీ ఫొటోగ్రాఫర్: సత్యమూర్తి



కనిపిస్తున్న అమలను చూసేసరికి సంతోషం పొంగింది విమలకు. ఎంతైనా నంబర్ వన్ హీరోయిన్‌కి పర్మనెంట్ డూప్ కదా అమల ఆమాత్రం స్టయిలిష్‌గా వుండాలనుకుంది.

అయితే వేషంలో, రూపంలో పెద్దగా మార్పులేని విమల, అమలకు ఆడ్‌గా కనిపించింది.

"అబ్బ! ఎన్నేళ్లకు కలుసుకున్నామే, అమలా!" అంటూ ఆనందంతో స్నేహితురాలిని కౌగలించుకోబోయింది విమల.

అయితే ముఖం చిట్లించుకుని ఒక అడుగు వెనక్కువేసింది అమల.

ఓసారి స్నేహితురాలివంక ఎగాదిగా చూసింది. తరువాత, "చూడు, విమలా! నంబర్ వన్ హీరోయిన్‌కి డూప్‌ని నేను. నువ్వో ఓ సామాన్య తారకు డూప్‌వి మాత్రమే!... మన అంతస్థులు మరిచిపోయి పబ్లిగ్గా ఆలింగనం చేసుకోవడం బావుండదు. ఇంకెప్పుడూ నన్నిలా పలకరించి నలుగురిలోనూ నగుబాటుపాలు చెయ్యకు" అనేసి, విసురుగా వెళ్లి తన హీరోయిన్ కార్లో ఎక్కి వెళ్లిపోయింది.

నిర్ఘాంతపోయిన విమల, అమల వెళ్లినవైపే చూస్తూ వుండిపోయింది!

– తిరుమలశ్రీ

## అబ్జెక్షన్

రావు బి.కాం. పాసయ్యాడు. పాసయ్యాక అయిదేళ్లపాటు పత్రికల్లోని 'వాంటెడ్' కాలమ్స్‌ని అవుపోసనపట్టి అడ్డమైన గడపలూ ఎక్కిదిగాడు డిగ్రీ చేతపట్టుకుని.

'కామర్సా!' అంటూ చప్పరించేశారు మేనర్సులేనివారు కొందరు.

'బాటా షాపులో కాళ్లకు బూట్సు తొడగడానిక్కూడా పనికిరాదోయ్ నీ డిగ్రీ!' అంటూ ఎద్దేవాచేశారు ఇంకొందరు.

వేటికీ చలించని రావు మాడరన్ విక్రమార్కుడిలా ఆఫీసుల చూర్లు పట్టుకుని వదలలేదు. కనిపించిన వుద్యోగానికల్లా అప్లయ్ చేయక మానసూలేదు.

రావు మొండిపట్టుకు ఫలితంలా - అయిదేళ్లు ఆలస్యంగానయినా - అసలు సిసలైన వుద్యోగం, అదీ ప్రభుత్వోద్యోగం వచ్చేసింది. ఓవర్‌నైట్ ఆడిట్ డిపార్ట్‌మెంటులో ఆడిట



రయి కూర్చున్నాడు. రావు ఆనందానికి హద్దులులేకపోయాయి. 'పద్దులు చూసే ఉద్యోగమే కదా!' అని కొందరు చిన్నబుచ్చబోయినా పట్టించుకోలేదు. తనవనేమిటో, వర్తేమిటో చూపించాలనుకున్నాడు. ఆడిటర్‌గా తన కర్తవ్యం విజయవంతంగా నిర్వహించడానికి పూనుకున్నాడు.

ఉద్యోగంలో చేరిన మొదటినెలలోనే ఎయిర్‌ఫోర్స్ బేసెస్ ఒకదానిలో ఆడిటింగ్‌కి పంపారు రావును. ఎంతో వుత్సాహంతో పనిచేశాడు రోజంతా.

సాయంత్రం ఆఫీసునుంచి తిరిగొచ్చిన రావుని చుట్టేశారు బంధుమిత్రులు - అతని మొదటిరోజు అనుభవాలను వినడానికని..

వారిని చూడడంతో ఎక్కడలేని హుషారూ కలిగింది రావుకి. తనను ఎయిర్‌ఫోర్స్ ఆడిటింగ్‌కి పంపడమూ, అక్కడ తాను చేసిన ఘనకార్యమూ వుత్సాహంగా చెప్పుకుపోయాడు.

"మొదటిసారే ఆటంబాంబులాంటి ఆడిట్ అబ్జెక్షన్ వడేశాను. దెబ్బతో అదిరిపోయారు అంతటి ఎయిర్ మార్షల్సును" అన్నాడు సగర్వంగా.

"ఎయిర్‌ఫోర్స్‌మీద అబ్జెక్షన్ రాశావంటే నువ్వు ఘటికుడివే!" అంటూ మెచ్చుకున్నారంతా. "ఇంతకూ ఏమి అబ్జెక్షన్ రాశావేమిటి?" అనడిగారు.

"చెబుతాను వినండి. వింటే మీరూ డంగైపోతారు..." అన్నాడతను రెట్టించిన ఉత్సాహంతో. "అయిదేళ్లక్రితం ఎయిర్‌ఫోర్స్ అయిదు కాఫిన్సు (శవపేటికలు) కొంది. అయిదేళ్లయినా వాటిలో ఒక్కటీ వుపయోగించలేదు. ఆవిధంగా అనవసరపు ఖర్చు చేసి ప్రభుత్వానికి నష్టం కలుగజేశారు. అందుకే అయిదేళ్లలో ఒక్క కాఫినూ వుపయోగించకపోవడానికి సంజాయిషీ కోరుతూ అబ్జెక్షన్ రాసిపెట్టాను..."

రావు పలుకులకు నిజంగానే డంగైపోయి ఏకగ్రీవంగా మూర్ఛపోయారందరూ.

-విశ్వమోహిని

# చతురప్రపంచం

## చిన్నారి సాహసి

భయంకరమైన తుఫాను, వర్షం సముద్రాన్ని అల్లకల్లోలం చేస్తున్న తరుణంలో బొంబాయికి చెందిన ఓ పదమూడేళ్ల చిన్నారి, అత్యంత సాహసంతో సముద్రంలో 33 కిలోమీటర్ల దూరాన్ని వెల్లకిలా ఈది ప్రపంచాన్ని సంభ్రమాశ్చర్యాల్లో ముంచెత్తింది.

తొమ్మిదవ తరగతి చదువుతున్న స్వామిని వీరేంద్రకములాకర్ అప్పటికే 200 మీటర్ల ఫ్రీస్టైయిల్ స్విమ్మింగ్ ఈవెంట్స్‌లో పాల్గొంది. ఆ అనుభవంతో ఆ తర్వాత ఆమె సముద్రంలో దూకి 12 కిలోమీటర్ల దూరాన్ని కేవలం 2 గంటల 35 నిముషాల్లో ఈదింది. అనంతరం థానేనుంచి వాషి వరకూ గల 18 కిలోమీటర్ల దూరాన్ని వెల్లకిలా ఈదుతూ 4 గంటల 22 నిమిషాలలో గమ్యం చేరుకుంది.



ఆమె కోచ్ 'అలే' బ్యాక్‌స్ట్రోక్ ఈతలో ఎన్నో మెలకువల్ని కములాకర్‌కు నేర్పాడాయన. అదేసమయంలో ఆమె మిత్రుడొకాయన ధర్మతార్‌నుంచి ఇండియాగేట్ వరకూ బ్యాక్‌స్ట్రోక్ స్టెయిల్లో ఈదడం జరిగింది. అదిచూసి ఉత్సాహపడి తనూ అలా చేయాలని నిర్ణయించుకుంది కములాకర్. ఆమె నిర్ణయించుకున్న రోజున అప్పటికే వాతావరణంలో పెనుమార్పులు సంభవించి, పరిస్థితులు క్లిష్టంగా తయారయ్యాయి. అయినా కములాకర్ జంకలేదు. ఎవరెంత నచ్చచెప్పాలని చూచినా వెనుకంజ వేయలేదు. పట్టుదలగా అనుకున్న టైమ్‌కే కడలి వడిలో ప్రయాణం ఆరంభించింది. ఆ విధంగా ప్రతికూల పరిస్థితుల్ని ధైర్యంగా అధిగమిస్తూ బ్యాక్‌స్ట్రోక్ స్టైల్లో ధర్మతార్‌నుంచి ఇండియాగేటు వరకుగల 33 కిలోమీటర్ల దూరాన్ని 13 గంటల 14 నిముషాలలో ఈదింది. అంత దూరాన్ని అప్పటివరకూ ఏ మహిళా ఈదకపోవడంతో ప్రజలంతా ఆమెని ఆకాశానికి ఎత్తేశారు.




# ఎలెఫ్ఫెంట్ రేస్

ఆమధ్య తమిళ జర్నలిస్టులు ఏనుగు పందాల్ని పెడతామంటూ ప్రకటించి అన్నంత పనీ చేశారు. కోవిల పట్టి పట్టణంలో జరిగిన ఆ పందాలలో మొదట ఇరవై ఏనుగుల వరకూ పాల్గొంటాయనుకున్నారు. కానీ తీరా సమయంవచ్చేసరికి ఐదు ఏనుగులే హాజరయ్యాయి. వాటిలోనూ రెండింటికి ఆరోగ్యం బాగాలేదనీ, అవి పోటీకి అనర్హమని ప్రకటించారు మావటిగారు. ఇంక చేసేదేముంది? ముచ్చటగా మిగిలిన మూడు ఏనుగులతోనే పందెం ప్రారంభమైంది. ఆ మూడూ ఆడ ఏనుగులే కావడం ఓ విశేషం. ఇంకో క్షణంలోనో అరక్షణంలోనో పోటీ ప్రారంభంకాబోతోందనగా



హఠాత్తుగా ఓ పోలీసు అధికారి అక్కడ ప్రత్యక్షమయ్యాడు.

"ఇక్కడ పోటీలు జరపడానికి మీకు అనుమతి ఎవరిచ్చారు? ఈ రద్దీలో ఏదైనా ప్రాణహాని జరిగితే దానికి ఎవరిది జవాబుదారీ? పొండి... ఇంకెక్కడైనా దూరంగా జరుపుకోండి" అంటూ కూకలేసి అందరినీ తరిమేశాడతను.

ఉసూరుమన్నారు నిర్వాహకులు. చిన్నబోయాయి గజవదనాలు, చిరాకుపడ్డారు ప్రేక్షకులు. చివరికి ఎలాగైతేనేం? ఓ.వి.చిదంబరం క్రీడా మైదానంలో పోటీని నిర్వహించారు జర్నలిస్టులు. 3,000 మందిదాకా ప్రేక్షకులు వచ్చి ఆ పోటీని తిలకించారు. పోటీలో భవానీ అనే ఏనుగు కేవలం 9 నిముషాలలో నిర్ణీత ప్రదేశాన్ని చుట్టివచ్చి ప్రథమ బహుమతి అందుకొంది.

పోటీలయ్యాక-

"రుచీ పచీ లేకుండా చాలా చప్పగా సాగిందీ పందెం. కనీసం పై పందాలు కాసుకోడానికి కూడా ఒప్పుకోలేదు. అలాంటప్పుడు ఎందుకు? ఎవరిని ఉద్ధరించడానికీ పందెం పెట్టినట్లు?..." అంటూ నిట్టూర్పాడొక క్రీడాభిమాని.

"కేరళలోనే కాదు. తమిళనాడులో కూడా ఏనుగుల పందాలు పెట్టవచ్చుననీ నిరూపించడానికే ఈ పోటీ ఏర్పాటు చేశాం. ఇది ఆరంభమే గనుక ముందుముందు ఈ పందాల్ని మరింత ఆకర్షణీయంగా తీర్చిదిద్దగలమన్న విశ్వాసం మాకుంది" అన్నాడొక కార్యనిర్వాహక జర్నలిస్టు.



# చతుర

సంపుటి: 14 సంచిక: 11 డిసెంబర్ 1991

అతను... పుడమితల్లికి ప్రియమైన పుత్రుడు. తన స్వేదంతో ధరిత్రినభిషేకించి సేద్యంచేసి పదిమంది క్షుద్బాధను చల్లార్చే అన్నదాత.

కుటుంబమంతా రెక్కలు ముక్కలు చేసుకుని, మట్టిలో మట్టై శ్రమించినా రెండు పూటలా తిండికి కరువే! కొన్నిసార్లు అతివృష్టి, మరికొన్ని సార్లు అనావృష్టి ఘోరంగా దెబ్బతీసినా వరుణుని కరుణకోసం అంగలార్చాడే తప్ప భూమిని వదులుకునే ఆలోచనే రాలేదతనికి.

అలాంటి రైతుబిడ్డ ప్రాణప్రదంగా ప్రేమించిన తన పొలాన్నీ, పుట్టిపెరిగిన నేలనూ వదిలి కట్టుబట్టలతో భార్యాపిల్లల్ని వెంటబెట్టుకుని మరోచోటికి వలస వెళ్లాలన్న నిర్ణయం ఎందుకు తీసుకున్నాడు?

అనుబంధాలూ, కష్టసుఖాలూ, స్వార్థాలూ, త్యాగాలూ, దోపిడీలు వ్యక్తుల మనసులపై, జీవితాలపై ఎటువంటి ప్రాబల్యాల్ని చూపుతాయి? కష్టజీవులకే నష్టాలూ, వ్యథలూ, బాధలూ ఎందుకు?

తెలంగాణా రైతాంగణ జనజీవనానికి ఓ అపూర్వ దృశ్యకావ్యంలా, హృదయంగమంగా రూపకల్పన చేసిన

కాలువ మల్లయ్య రచన

# భూమిపుత్రుడు

ఈ నెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల.

ఇంటిముందున్న వాకిట్లో తాటికమ్మల పందిరి క్రింద నులకమంచంలో గొంగళేసుకొని వెల్లకిలా పడుకునున్నాడు కొండ మల్లయ్య.

గాలి స్తంభించిపోయి ఉంది... చెట్టు కొమ్మ లు కూడా ఊగడంలేదు... విపరీతంగా ఉబ్బర పోస్తోంది. మరో దిక్కు జుంయ్‌మంటూ దోమ లు సంగీతం పాడుతున్నాయి. దోమల సంగీతం భరించలేక కాళ్ళ దిక్కున్న దుప్పటి తీసి చెవులవరకు కప్పుకున్నాడు. మంచంలో అటూఇటూ దొర్లాడు... అర్ధరాత్రి కావస్తున్నా ఎంతకూ నిద్ర పట్టడంలేదు. లేచి కూర్చున్నా డు. మంచం క్రిందున్న కంచుచెంబులోని నీళ్లు తాగాడు. మళ్లీ పడుకున్నాడు. దగ్గర్లోవు న్న ఎరువు బొందలోంచి గబ్బువాసనొస్తోంది. తలగుడ్డ తీసి ముక్కుకడ్డం పెట్టుకున్నాడు. చొక్కాతో దోమలను పారదోలుతూ నిద్ర పోవడా నికి సతమతమవుతున్నాడు. ఎంత ప్రయ త్నించినా నిద్రరాక మెడవరకు దుప్పటి కప్పు కున్నాడు. తలలో ఎన్నో ఆలోచనలు. గత జీవితం, తండ్రి, తన ఆర్థిక పరిస్థితి, పిల్లలు అంతా అతనికళ్లముందు కదులుతున్నారు.

ఆ ఊళ్లో దాదాపు నాలుగువందల గడ పుంటుంది. వివిధ వృత్తులవారున్నా చాలా మంది వ్యవసాయదారులుగానో, వ్యవసాయ కూలీలుగానో బ్రతుకుతుంటారు. కులాలేవైనా వాళ్లు అంతా అన్నా, అక్కా, బావా అనీ, వదినె అనీ, తాతా అనీ వరుసలు పెట్టుకొని ఆప్యా యంగా పిలుచుకునేవారు. ఒకరి కష్టాల్లో ఒక రు పాలుపంచుకునేవారు. మొన్న మొన్నటివ రకు కూడా వాళ్లకు తాము ఎవరికి ఓటేస్తున్నా రో తెలిసేదికాదు. అయితే ఇప్పుడు పరిస్థితి మారింది. ఊరి వెలుపలున్న బస్సుస్టాపు దగ్గర అన్ని పార్టీల జెండాలున్నాయి. ఊర్లోని గోడ ల్నిండా విప్లవనినాదాలున్నాయి. రైతుకు టుంబాలవాళ్లు, కూలినాలిచేసుకునే వాళ్లు సాధారణంగా పూజలకు ప్రాధాన్యత నివ్వరు. కొన్ని పండుగ దినాల్లో ఉపవాసాలుంటారు. గుడికెళ్లి కొబ్బరికాయపీ కొడతారు. అటు తర వాత తమ జీవనపోరాటంలో నిమగ్నమవుతా రు. అయితే ఇంతకాలం పట్టణాలకే పరిమిత మయిన మతాలు, మతభేదాలు పల్లెలకు కూడా దిగుమతవుతున్నాయి. విప్లవ నినాదాల తోపాటు మతపరమైన నినాదాలూ గోడల మీ దున్నాయి. అయితే ఊళ్లో మార్పులొస్తున్నా ప్రజల సాంస్కృతిక సహజీవనం చెక్కు చెదరకుండానే వుంది.

ఆ ఊళ్లో చాలామంది రైతులు పండిన పంటను ఊళ్లోని షావుకార్లకమ్ముతారు. మరి కొందరు ఆ ఊరికి పాతిక కిలోమీటర్ల దూ రంలో వున్న టౌనులోని వ్యవసాయ మార్కెట్‌కు తీసుకెడతారు. ఇప్పుడా ఊళ్లో అప్పర్ ప్రైమరీ పాఠశాలున్నా పదిహేనేళ్ల క్రితం వరకు పాఠ శాలే ఉండేది కాదు.

ఆరేడేళ్ల క్రితంవరకు ఒక్క ఉపాధ్యాయు డితో, రెండు గదులతో మూడవ తరగతి వరకు న్న పాఠశాలుండేది. ఆ పాఠశాలను తనిఖీ చేయడానికి ఏ ఇన్స్‌పెక్టరూ వచ్చే అవకాశం లేదు కాబట్టి ఆ ఉపాధ్యాయుడు తనకు స్వంతపనులు లేనప్పుడు, తాను పాఠశాలకు పోవాలనుకున్నప్పుడు మాత్రమే పోయేవాడు. అతడు రాని రోజుల్లో ఆ ఉపాధ్యాయుడిచే వందరూపాయల జీతంపై నియమింపబడిన ఆ ఊరి యువకుడు పాఠశాల నడిపించేవా డు.

ఆ ఊరికి తూర్పు భాగంలో వున్న కొండ ల్లోంచి రోజూ కర్మసాక్షి ఉదయిస్తాడు. సూర్యోద యానికంటే ముందే కోడి కూతతోనే ఊరు, ఊరిలోని శ్రమజీవులంతా మేల్కొంటారు. ప్రొ ద్దు కరకర పొడవకముందే ఇంటిపనులు ము గించుకొని వ్యవసాయ పనుల కెళ్లడానికి సన్నా హాలు చేస్తారు. ప్రొద్దుపొడిచీ పొడవకముందే ఆ ఊళ్ళో పశువుల గిట్టల చప్పుడు వినబ డుతుంది. అవి నడుస్తుంటే దుమ్ము బజార్లలో లేస్తుంటుంది. 'మొండితోక బర్రె పెట్టే పెంట నాది. పొట్టి కొమ్మల బర్రెపెంటనాది' అంటూ చేతుల్లో తట్టలతో పోటీపడే పిల్లలు పశువుల వెంట ఉంటారు. సంధి యుగంలో కొత్తపాతల మేలు కలయికల మధ్యనున్నట్టుందా ఊరు.

ఆ ఊళ్ళో కొండమల్లయ్య ఓ రైతుబిడ్డ... శ్రమైక జీవన సౌందర్యానికి సమానమైంది ఏదీ లేదని నమ్మిన భూమి పుత్రుడు... వ్యవసా యాన్నే నమ్ముకొని, భూమినే జీవనాధారంగా




ఎంచుకొని బతుకును వెళ్ళదీస్తున్న రైతు. అతని వయసిప్పుడు అయిదు పదులు దాటింది. కాని తల నెరిసి కళ్ళు లోతుకు పోయి, ముఖంమీద ముడుతలతో అరవై ఏళ్ళు దాటిన వాడిలా కనబడతాడు. అతని శరీరంపై ఎముకలే తప్ప కండ లేదు. అతని మొలకు దొడ్డు ధోవతుంటుంది. తలకు రుమాలులాంటి గుడ్డముక్క ఉంటుంది. ఛాతీపై ఆపారమంగీ ఉంటుంది. అవేవీ మిల్లులో తయారైనవి కావు. ఊరి పద్మశాలి నేసినవే... ఆ బట్టలెప్పుడూ చెమట వాసనతోనే వుంటాయి.

తండ్రినుంచి కొండమల్లయ్యకు పదెకరాల భూమి సంక్రమించింది. ఆ భూమి సారవంతమైంది కాదు. విలువైందీ కాదు. కోస్తా ప్రాంతంలో ఒక్క ఎకరం భూమి అమ్ముకొనొచ్చి తెలంగాణలో పదెకరాల భూమి కొనుక్కొని వ్యవసాయం చేసిన వాళ్ళున్నారు. నాలుగైదేళ్ళ క్రితంవరకు, అంటే ఆ ఊరికి శ్రీరాంసాగర్ నీళ్ళు వచ్చేవరకు ఆ భూమిలో ఓ ఏడు పండేది, ఓ ఏడు ఎండేది. ప్రకృతి కరుణించడంపై పంటలాధారపడుండేవి.

తండ్రి ఇచ్చిన భూమిలో వ్యవసాయం ప్రారంభించిన కొండమల్లయ్యకు ఏ రాజకీయాలూ తెలియవు. కోడికూతలతోనే లేచి పనుల్లో లీనం కావడం, మళ్ళీ ఏ రాత్రికో నడుం వాల్చడం అతని నిత్యకృత్యాలు. అలా నలబై ఏళ్ళకుపైగా మట్టిలో మట్టై రెక్కలు ముక్కలు చేసుకుంటూ, నాగేటిచాళ్లకే అంకితమై ఘర్మజలాన్ని భూదేవి కర్పిస్తూ బతుకుతున్నాడు. అయినా తండ్రి ఇచ్చిన భూమిలో సగాన్నమ్ముకోక తప్పలేదు. తండ్రినుంచి సంక్రమించిన ఎనిమిది గజాల పొడవు, అయిదు గజాల వెడల్పున్న పెంకుటింట్లో కాపురముంటున్నాడు. శిథిలావస్థలో వున్న ఆ పెంకుటింట్లో ఓ మూల ధాన్యం పోసుకోవడానికి రెండు గుమ్ములున్నాయి. వాటి పక్కనే పార, పలుగు, తట్టలు, జోళ్ళు, తాళ్ళులాంటి వ్యవసాయ పనిముట్లున్నాయి. ఇంట్లో గుమ్ములున్నా అందులో ధాన్యముండేది చాలా స్వల్పకాలం మాత్రమే. ఆ ఇంట్లో వున్న ఒకేఒక చిన్న గదిని 'మల్లన్న' దేవునికని ప్రత్యేకించారు. అరుగు మీద మధ్యనుంచే తడిక ఉంది. తడికకు అటువైపు కొందరు, ఇటువైపు కొందరు పడుకుంటారు. వాకిట్లో రెండు రేకులు వంచి వంటకొరకేర్పాటు చేసుకున్నారు. అదే వంట గదీ, భోజనాల గదీ.

కొండమల్లయ్య భార్య నర్సమ్మ. వారి వంశం తాత, ముత్తాతల కాలంనుంచి కూడా వ్యవసాయ కుటుంబమే. ఎనిమిదేళ్ళ వయసులో కొండమల్లయ్య ఇంట్లో అడుగు పెట్టిందామె. శ్రమ జీవనంలోనే అందాన్ని చూసిందామె. వయసుకు మించిన పనులు ఆరిందాలా చేసింది. కష్టాల్లో, సుఖాల్లో భర్తకు చేదోడు వాదోడుగా వుంటూ కాపురం చేస్తుంది.

తండ్రి తనకు పదెకరాల భూమి పంచివ్వడం, చనిపోయేప్పుడు తల్లిని తన చేతుల్లో పెట్టడం అతని స్మృతిపథంలో కదిలాయి. తండ్రికాలంలో ఉమ్మడిగా వున్నప్పుడు తన కుటుంబం బాగానే వుండేది. ఇంటినిండా ఎప్పుడూ జనమే... మరిప్పుడో? అతిథులొస్తే భారమనిపిస్తుంది. తమ్ముళ్ళకు పెళ్ళిళ్ళు కాగానే తోడికోడళ్ళకు పడలేదు. తనకిరవై ఏళ్ళ వయసుకూడా రాకముందే వేరు కాపురం పెట్టాల్సివచ్చింది. 'వేరు పడితేనే మేలు మగడా-పొత్తుంటేనే పోరు మగడా' అన్నట్టు ఆడవాళ్ళు సంతోషించారు. కాని తమ ముగ్గురన్నదమ్ములకూ అంత తొందరగా విడిపోవడం ఇష్టంలేదు. తన తాతలిద్దరూ చనిపోయేంతవరకు వేరు కాపురాలే పెట్టలేదట. తన తండ్రి, చిన్నాన్న అందరికీ సంతానమయ్యేంతవరకు సగం జీవితం వరకు, కలిసే వున్నారు. మరి తన కొడుకులో? ఆ కాలమే వేరు...

నిట్టూర్చాడు కొండమల్లయ్య.

అతని ఆలోచనలు పెద్దకొడుకు పైకి పోయాయి.

తొలికాన్పులోనే కొడుకు పుడితే తానెంతో సంతోషించాడు. సంబరపడిపోయాడు. కొడుకునెంతో అపురూపంగా చూసుకున్నాడు. కాని కొడుకును చదివించాలన్న ఆలోచనే తనకు రాలేదు. కొడుకు చదువుకోకపోయినా తనకన్నిట్లో కుడిభుజంగా నిలిచాడు. ఐదారేండ్ల వయసప్పట్నుంచే తనకు వ్యవసాయపుపనుల్లో సాయం చేసేవాడు. తాను మోటగొడుతే నీళ్లు కట్టేవాడు. తాను నాగలిదున్ని విడిస్తే ఎడ్లను

మేపుకొచ్చేవాడు. తాను డబ్బులిచ్చి కూలీలను పిలిపించుకురమ్మంటే చెప్పి వచ్చేవాడు. రెక్క కూడా ముదరకముందే 'పాలె' చేతిలోకి తీసుకున్నాడు. అలా తనపని తాను చేసుకుంటూ తనదారిన తాను బతికే కొడుకు ఎలాగోగానీ తమ ప్రాంతంలో జరుగుతున్న పోరాటాలతో ఆకర్షితుడయ్యాడు. ఎక్కడెక్కడో తిరిగేవాడు. ఏమేమో చెప్పేవాడు. కొడుకు చెప్పే విషయాలు తనకర్థమయి కానట్టుండేవి. అందులో నిజాలున్నట్టనిపించినా తనకు భయమేసేది. కొడుకును తన బతుకు తాను బతుకమని బ్రతిమిలాడాడు. తనకు దూరం కావద్దని వేడుకున్నాడు. అయినా వాడు విన్లేదు.

తనింటికి పోలీసులు రావడం మొదలైంది. తరతరాలుగా పోలీసులంటేనే భయపడే తమ కుటుంబాన్ని వాళ్లు వేధించడం మొదలైంది. భూమినే నమ్ముకుని బతుకుతున్న తనకు కొడుకును గూర్చి పోలీసుల బెదిరింపులు తప్పలేదు. ఆఖరుకు అయిదేళ్లక్రితం తన కొడుకు, తనకెన్నో చెప్పిన కొడుకు, తన ఇంటి పెద్దకొడుకు ఎదురుకాల్పుల్లో మరణించాడంటూ శవాన్ని తీసుకొచ్చి వాకిట్లో పడేశారు పోలీసులు. శవంపైపడి తాను, భార్య, పిల్లలు కంటికొకడివెడు నీళ్లకేడ్చారు. నెత్తికొట్టుకున్నారు. మొత్తుకున్నారు. పోలీసులేమో తొందరపెట్టి దగ్గరుండి శవదహనం జరిపించారు. తనకు తలకొరివి పెట్టాల్సిన కొడుక్కు తానే తలకొరివి పెట్టాడు. తన చేతుల్తోనే కొడుకును బూడిద చేశాడు. ఏడాది తిరిగీ తిరగకముందే కోడలు మళ్లీ పెళ్లిచేసుకుంది.

పెద్ద కొడుకు జ్ఞాపకం వచ్చి కళ్లల్లో నీళ్లు తిరిగాయి. రుమాలుతో కళ్ళు తుడుచుకున్నాడు.

అతని ఆలోచనలు రెండవ కొడుకు రాజయ్య మీదికి పోయాయి.

రాజయ్యను చదివించి పైకి తీసుకురావాలనుకున్నాడు. తానెంత కష్టపడైనా సరే కొడుకును చదివించాలనుకున్నాడు. అయిదేళ్ళు నిండగానే బడికి పంపించాలనుకున్నాడు. కాని అప్పటికి ఊళ్లో బడిలేదు. చదువుకోవడానికని కొడుకును అత్తవారూళ్లో దించివచ్చాడు. కాని కొద్దిరోజులకే కొడుకు బెంగపెట్టుకున్నాడు. అక్కడ ఉండలేనని ఏడ్చాడు. చేసేదేంలేక తన మామ వాడిని వెంటబెట్టుకొచ్చాడు. మరికొన్ని రోజుల తర్వాత మళ్ళీ వదిలిపెట్టి వచ్చాడు తాను. కొడుక్కెన్నో విధాల నచ్చజెప్పాడు. అయినా పదిహేనురోజులైనా తిరగకముందే తిరిగొచ్చేశాడు. ఇక వాడిని చదివించే ప్రయత్నం మానుకున్నాడతను. అప్పటికి మూడో కొడుకు దాదాపు రెండేండ్ల వాడయ్యాడు. వాడిని చదివించొచ్చని తనను తానే సంతృప్తిపరుచుకున్నాడు. [illegible] రాజయ్య ఆరేళ్ల వయసునుంచే తనకన్నివిధాలా సహకరించాడు. తను నాగలి విడువగానే ఎడ్లను మేపడానికొచ్చేవాడు. ఎడ్లను కొట్టంలో కట్టేసేవాడు. తన చిన్ని చేతులతో వాములోంచి గడ్డిగుంజి ఎడ్లకు మేతవేసేవాడు. నీళ్లు కట్టేవాడు. తను చెప్పిన అన్ని పనులూ చేసేవాడు. పదేళ్లు





నిండీనిండకముందే 'పాలె' చేతబట్టుకుని తనతో నమానంగా అన్నిపనులు చేయడం మొదలుపెట్టాడు. రాజయ్యకు పన్నెండేళ్ల వయసప్పుడే తన బావమరిది బిడ్డతో పెళ్లయింది. జంట చిలుకా గోరింకల్లా వుంది. చిన్నప్పుడమ్మాయి మంచిగానే వచ్చేది... చెప్పిన పనులు చేసేది... అత్తమామలను గౌరవించేది. కొడుకుతో నమానంగా పోటీపడి పని చేసేది. కాని గత నాలుగేళ్లనుంచి, పెద్దమనిషి యింతర్వాత కూడా ఓ ఏడాదినుంచి ఎక్కువ కాలం తల్లిగారింటి దగ్గర్నే వుంటోంది. బలవంతంగా తీసుకొచ్చినా ఏదో గొడవ పెట్టుకుని మళ్లీ తల్లిగారింటికే పోతోంది. ఇద్దరి కలుపో

క్కతే తీసే మనిషి కలుపుకు పొమ్మంటే పోదు. పెరడికి నీళ్లు పెట్టమంటే వినదు. మగరాయుడిలా పనిచేసేదల్లా ఇప్పుడు కష్టం చేయడానికే ఒప్పుకోవడంలేదు. అసలది ఇక్కడుండడానికే ఇష్టపడటంలేదు. కడుపులో ఓ కాయకాసినా బాగుండేది, కాని అదీ లేదు. అసలది ఇక్కడున్నదెంతకాలం? దాని మనసెప్పుడూ అలంకరణలపైనే. భర్త కూడా మల్లెపూవుల్లాంటి బట్టలేసుకొని అందంగా వుండాలంటుంది. కాని, మట్టిలో మట్టయి పనిచేసే వ్యవసాయదారుడికలా ఉండటం ఎలా సాధ్యమవుతుంది...? తన ఇన్నేళ్ల వయసులో ఒక్కసారైనా నేతచొక్కా తప్ప వేసుకున్నాడా? దొడ్డు ధోతీ తప్ప కట్టుకున్నాడా? తన తండ్రి ఏడాదికి ఏ నాలుగైదుసార్లో- పండుగదినాల్లో ఊరికెళ్లినప్పుడో తప్ప నేతబనీను తొడుక్కోగా తాను చూళ్లేదు. తనకాలంలో, తన తండ్రికాలంలో ఇన్ని షోకులెక్కడివి...?

మొదట్లో లక్ష్మికీ షోకులన్నీ తెలియవు. పద్మశాలి అంజయ్య బొగ్గుబావి పనికిపోవడం మొదలెట్టినప్పట్నుంచి కోడలు మనసు మారింది. అంజయ్య భార్యేసుకునే బట్టల్లాంటివి తనకూ కావాలనుకుంది. ఊరికొచ్చినప్పుడు మంచిబట్టలేసుకుని, నున్నగా దువ్వుకొని అందంగా కనిపించే అంజయ్య భార్యలాంటి బతుకు తనకు కావాలనుకుంటుంది. అంజయ్యలాగే తన భర్త రాజయ్య కూడా పాంటు, షర్టు వేసుకుని తిరగాలనుకుంటుంది. ఎముకలు కలికలి అయ్యేట్టు పనిచేయాల్సుండే వ్యవసాయప్పనులపై ఆమె ఆసక్తి చూపడంలేదు. బొగ్గుబావి జీవితాల్లో ఏదో వుందనుకుంది లక్ష్మి. అందుకే ఇక్కడున్నన్నిరోజులూ తన భర్తను బావిపనికి పొమ్మని రోజూ పోరుపెడుతుంది. మోటుకష్టం చేయడానికి అలవాటుపడ్డ రాజయ్య మొదట్లో ఆమె మాటలు చెవిని పెట్టలేదు. అందుకే ఆమె ఈ అస్త్రం ప్రయోగిస్తోంది. తేవతేవకు తల్లిగారింటికిపోవడం, ఎన్నిరోజులైనా తిరిగి రాకపోవడం, తాము వెళ్లి తీసుకొస్తే కొద్దిరోజులుండి మళ్లీ పోవడం చేస్తోంది. ఉన్నన్నిరోజులూ కొడుకును బావిపనికి పొమ్మని బలవంతం చేస్తుంది. ఎవరెన్ని చెప్పినా, తుదకు ఆమె తల్లిదండ్రులు చెప్పినా వినడంలేదు. ఓసారి తండ్రి తిడితే బావిలోకి దూకింది. అక్కడున్నవాళ్లు వెంటనే దిగి ఆమెను రక్షించారు. భార్య ఒత్తిడికి తట్టుకోలేక రాజయ్య క్రమక్రమంగా మారుతున్నాడు. బావిపనికి వెళ్లడానికే మొగ్గు చూపుతున్నాడు. రాత్రింబవళ్లు ఒళ్లుహూనం చేసుకుంటున్నా లాభంలేని వ్యవసాయంకంటే బావిపనికెళ్ళి డబ్బు సంపాదించడం మేలనుకుంటున్నాడు. అదే విషయం తనతో చెప్పాడు. తల్లితో చెప్పాడు. తనను బావిపనికి పంపించమన్నాడు. కాని తామందుకొప్పుకోవడంలేదు. కొడుకునా మృత్యుకూపాల్లోకి పంపించడానికి తమ మనసులంగీకరించడంలేదు.

బావిపనిమీద మోజుతో కొద్దిరోజుల్నించి వ్యవసాయపనులమీద ఆసక్తి చూపడంలేదు రాజయ్య. ఒకవిధంగా ఆలోచిస్తే కొడుకు చెప్పేది కూడా నిజమేననిపిస్తుంది. వ్యవసాయంలో ఎంత కష్టపడ్డా ఏడే మాన్కలన్నట్టవుతోంది. కాగా తనకున్న భూమి తాను, తన ఇద్దరు కొడుకులు వ్యవసాయం చేయడానికి సరిపోదు. అయినాసరే బొగ్గుబావి పనికి కొడుకును పంపించడం తనకిష్టంలేదు. కల్లో, గంజో, అంబలో దొరికేది తిని కడుపు నింపుకోవాలనుకుంటున్నాడు తాను. కొడుకెంత చెప్పినా వినడంలేదు. అయిదారు నెలలనుంచి రాజయ్య మరీ ఒత్తిడి చేస్తున్నాడు. తాను డబ్బివ్వకుంటే తన మామనడిగి తీసుకుని వెళ్తానంటున్నాడు. లేదా రాడికల్స్‌లో కలిసిపోతానంటున్నాడు.

వద్దు... తన పెద్దకొడుక్కు పట్టినగతే రాజయ్యకు పట్టొద్దు. ఎక్కడున్నా కొడుకు మంచిగుంటే చాలు. కొడుకును బావిపనికి పంపించక తప్పేట్టులేదు.

చుక్కలు వంగుతున్నాయి. అర్ధరాత్రి దాటి చాలా సేపయింది. అయినా కొండమల్లయ్యకు నిద్రపట్టడంలేదు. అతని ఆలోచనలు కొట్టం దగ్గర పడుకున్న రాజయ్యపైనుంచి తన పక్క మంచంలో పడుకున్న చిన్నకొడుకు తిరుపతయ్యపైకి పోయాయి.

పెద్దవాళ్లిద్దరిని చదివించడం కుదురలేదు




కాబట్టి చిన్న కొడుకునైనా చదివించాలనుకు న్నాడు తాను. చిన్నకొడుక్కు అయిదేళ్లు వచ్చే సరికి ఊళ్లో బడిలేదు. ప్రయివేటు పాఠశాలలో ఒక్క సంవత్సరం చదివించి అత్తవారూళ్లో ఉంచి వచ్చాడు. కొడుకు పలకాబలపం చే తిలో పట్టుకొని బడికిపోయిన రోజున తానెంతో సంతోషించాడు. ఓనమాలు చదివినరోజున ఉప్పొంగిపోయాడు. పుస్తకంలోని బొమ్మలు చూ పెడుతూ చదివినరోజున ఎగిరి గంతేశాడు. గడుసుపిండమైన తిరుపతయ్య రాజయ్యలా కాకుండా ఆ ఊళ్లో వుండి చదువుకుంటూ ఒక్కొక్కతరగతి దాటుకుంటూ వస్తుంటే తా నెంతో సంబరపడిపోయాడు.

ఆ ఊళ్లోనే పదవతరగతివరకు చదివాడు తిరుపతయ్య. సెలవుల్లో ఇంటికొచ్చినప్పుడు వ్యవసాయపుపనులు చెబితే వినుక్కునేవాడు. తప్పకపోతే గొణుక్కుంటూ చేసేవాడు. చదువు కుంటున్నవాడికి పనిచెప్పొద్దని ఎంతనుకున్నా చెప్పక తప్పేది కాదు... తన అత్తవారింట్లో పదవతరగతి పూర్తిచేసి సుల్తానాబాద్‌లో ఇంటర్ చదివాడు. కాలేజీలో చేరింతర్వాత వాని ఖర్చులు పెరిగాయి. మాటిమాటికి డబ్బి వ్వమనేవాడు. మంచి బట్టలు కొనమనేవాడు. డబ్బాలస్యమైతే తనను నిందించేవాడు. తన పరిస్థితేంటో, కుటుంబ పరిస్థితేంటో ఎప్పుడూ ఆలోచించేవాడు కాదు. పట్టించుకునేవాడూ కాదు. అయినా తన కొడుకు చదువుకొని పైకొ స్తాడని, కుటుంబమెంత కష్టపరిస్థితిలో వున్నా అప్పో, సప్పో చేసి తిరుపతయ్యకు డబ్బిచ్చేవా డు. తిరుపతయ్య ఇంటర్ పూర్తిచేసి కరీంన గర్‌లో బి.ఎ.లో చేరాడు. ఖర్చులు మరింత పెరిగాయి. ఖర్చులు భరించలేక రాజయ్య తమ్ముని చదువు మానిపిద్దామన్నాడు. కాని తానొప్పుకోలేదు.

కుటుంబంలో ఒక్కరైనా చదువుకున్న వాళ్లుండాలని తాను పట్టుబట్టాడు. పెద్దకొ డుకు ఇవేమీ పట్టించుకునేవాడు కాదు. ఎలా గైనా కొడుకును బి.ఎ. పూర్తి చేయించాలనుకు న్నాడు తాను. తిరుపతయ్య ఒక్కసారి కూడా తప్పకుండా, పాసయి బి.ఎ. పూర్తిచేశాడు. చదు వయిపోగానే కొడుక్కు ఉద్యోగమొస్తుంది. తన కష్టాలు గట్టెక్కుతాయనుకున్నాడు. కాని, నాలు గేండ్లు గడుస్తున్నా ఉద్యోగం దొరకడంలేదు. అటు ఉద్యోగం లేక ఇటు వ్యవసాయప్పని చేయడం చేతకాక సతమతమవుతున్నాడు చిన్నకొడుకు. ఇలాగేవుంటే రాడికల్స్‌లో కలుస్తా డేమోనని తన భయం. చుట్టుపక్కల గ్రామాల్లో వాళ్ల ప్రభావం బాగావుంది. తిరుపతయ్య స్నేహితులిద్దరు వాళ్లలో కలిసిపోయారు. ఇప్ప టికే ఓ కొడుకు బలయిపోయాడు. చదువుకు న్న ఈ కొడుకూ తనకు దూరమవుతాడేమోనని వణికిపోతున్నాడు తాను. అప్పుడప్పుడు వాడంటున్న మాటలు తనకు భయం కల్గిస్తు న్నాయి. వాళ్ల మార్గం మంచిదో, చెడ్డదో తనకు తెలియదు. తనకు తన కొడుకు కావాలి. తన కొడుకు తనతోనే వుండాలి. తన కుటుంబాన్ని చూసుకోవాలి.

తిరుపతయ్యలో చదువుకుంటున్నప్పుడు న్న నిర్లక్ష్యం, విచ్చలవిడితనం ఇప్పుడు లేవు. నాలుగేళ్లుగా ఇంటిపట్టునుంటూ తన కుటుంబం, తనలాంటి రైతుకుటుంబాలు పడుతున్న బాధలను గమనిస్తున్నాడు. ఒక్కో రూపాయి సంపాదించడానికి రైతులెంత శ్రమ చేయాలో చూస్తున్నాడు. పంట పండించడానికి తామెంత స్వేదాన్ని ధారపోయాలో గమనిస్తు న్నాడు. తాను చదువుకున్నవాణ్ణని ఇదివరకు న్న గర్వం చాలావరకు దూరమయింది. తల్లి దండ్రులమీది చదువుకోని అనాగరికులనే నిర్ల క్ష్యభావం తొలగిపోయింది. చదువుకున్నప్ప టిలా కాకుండా ఇప్పుడు తాను చెప్పిన వ్యవసా యప్పనులు వినుక్కోకుండా చేస్తున్నాడు. చె ప్పకున్నా పనిచేస్తున్నాడు. తన పదిహేనేళ్ల చదువుకు ఫలితం లభించనందుకు చింతిస్తు న్నాడు. తనపై పెట్టుకున్న ఆశలను తీర్చలేక పోతున్నందుకు ఆవేదన చెందుతున్నాడు. తనలో తానే నలిగిపోతున్నాడు. ఒక్కోసారి అందర్నీ చీదరించుకుంటున్నాడు. క్రమక్ర మంగా అన్నిపనులూ చేయడానికి అలవాటు పడ్డాడు. తన చిన్నప్పుడు చదువుకున్నవాళ్లే తక్కువ. తమ కుటుంబాల్లో అసలుండేవారు కాదు. ఊళ్లో చదువుకునేవాళ్లు వ్యవసాయప్ప నులు కూడా చేసేవారు. అప్పుడు నాలుగైదువ రకు చదివితే ఎక్కువ. అదీ సుల్తానాబాద్‌లోనే. తన కొడుకు వినుక్కున్నా చదువుకునేటప్పుడు

కొంతయినా వ్యవసాయప్పనులు చేసేవాడు. మరిప్పటి పిల్లలో...? మునిగాళ్లమీదనే ఆడుతున్నారు. ఎవరినీ లక్ష్యపెట్టడంలేదు.

తనకు చదువుకున్న కొడుకు తిరుపతయ్యంటే ప్రత్యేకాభిమానం. ప్రేమ. తాను తిరుపతయ్యనెంతో అపురూపంగా చూసుకునేవాడు. చదువుకున్నవాడికే ఎక్కువ ఆలోచనుంటుందని నమ్మేవాడు. తన భార్య తిరుపతయ్యనేమన్నా అంటే తానెప్పుడూ ఈ కథ చెప్పేవాడు.

'ఓ తల్లికి ఇద్దరు కొడుకులు. ఒక కొడుకు చదువుకుంటున్నాడు. ఇంకో కొడుకు వ్యవసాయం చేస్తున్నాడు. ఇద్దరూ రాత్రి వెల్లకిల్లా పడుకొని నోరుతెరిచి నిద్రపోతున్నారు. ఇద్దరి నోళ్లలో వెన్నముద్ద ఉంచింది తల్లి. మోటుకష్టం చేసి అలసిపోయి ఏ విచారమూ లేకుండా నిద్రపోతున్నాడు కాబట్టి వ్యవసాయం చేసే కొడుకు నోట్లోని వెన్నెముద్ద అలాగే వుంది. నిద్రలోనూ తన చదువుగూర్చే ఆలోచిస్తాడు కాబట్టి చదువుకుంటున్న కొడుకు నోట్లోని వెన్నముద్ద వెంటనే కరిగిపోయింది. అంటే చదువుకుంటున్నవాళ్లకే ఎక్కువ విచారముంటుంది. నిద్ర కూడా సరిగా పట్టదు'

చదువుకున్న కొడుక్కు కష్టమైన పొలంవనులు చెప్పొద్దని వున్నా తప్పనిసరి పరిస్థితుల్లో చెప్పక తప్పడంలేదు. కొడుక్కెప్పుడు ఉద్యోగమొస్తుందో? మోటుపనులు చేయడమెప్పుడు తప్పుతుందో?

తమ కుటుంబాల్లో పదిహేను పదహారేళ్ల వయస్సు దాటకుండానే పెళ్లిళ్లు చేస్తారు. గొంగళ్లునేసే కురుమవాళ్లయితే ఇప్పటికీ ఏడెనిమిదేళ్లు దాటకుండానే పెళ్లిళ్లు చేస్తున్నారు. తిరుపతయ్యకు చదువుకుంటున్నప్పట్నుంచే పెళ్లి చేద్దామంటే వద్దంటున్నాడు. ఇప్పుడైతే మరీ ఒప్పుకోవడంలేదు. 'నాకే ఆధారంలేదు. నాకు గుదిబండా...?' అని పెళ్లి సంగతెత్తుతేనే కసురుకుంటున్నాడు.

నిట్టూర్చాడు కొండమల్లయ్య.

అర్థాంతరంగా జీవితం చాలించి వెళ్లిపోయిన పెద్దకొడుకు గూర్చి, చదువురాక ఇంకా జీవితంలో స్థిరపడని రెండవ కొడుకు గురించి, డిగ్రీ చదివినా బ్రతుకు అగమ్య గోచరంగానే వున్న చిన్నకొడుకు గురించి, తన తండ్రి గురించి, తన పరిస్థితి గురించి ఆలోచిస్తూ రెండుగంటల ప్రాంతంలో నిద్రలో కొరిగాడు.

★ ★ ★

"కొక్కొరోకో..." బిగ్గరగా కూసింది కోడిపుంజు. తొలికోడి కూత వినబడగానే ఉలిక్కిపడి లేచాడు. తెల్లవారితే ఉగాది. కొత్త సంవత్సరాది. రైతుకు పర్వదినం. ఉగాదిని కొత్త సంవత్సరపు పనుల కారంభదినంగా భావిస్తాడు రైతు. నూతన సంవత్సరాదిరోజున చేసే 'సాగువాటు'తో పనులారంభిస్తాడు రైతు.

కాళ్లు క్రిందికి చాపుకొని మంచంలో కూర్చున్నాడు కొండమల్లయ్య.

అప్రయత్నంగా ఆతని నాలుకపై పాట కదిలింది.

ఏరువాకా సాగుమురో రన్నో చిన్నన్నా
నీ కష్టమంతా తీరునురో రన్నో రైతన్నా
వలుపల దావల ఎడ్ల గట్టుకుని
నవధాన్యాలను గంపనెత్తుకొని
ఇల్లాలిని మరి వెంటబెట్టుకొని
ఏరువాకా సాగుమురో రన్నో చిన్నన్నా
నీ కష్టమంతా తీరునురో రన్నో రైతన్నా...

ఎంత సంబరంగా, ఉత్సాహంగా, పాటలు పాడుకుంటూ నాగలి దున్నేవాడు తాను...? పండుగదినాల్లోనూ, మామూలు దినాల్లోనూ ఎంతమంది జానపదులు ఊళ్లోకొచ్చేవారు...? కులాలవారీగా అడుక్కొని కొందరు. కథలు చెబుతూ కొందరు ఊరిపై ఆధారపడి బ్రతికేవారు. తమకు లేకున్నా కూలినాలి చేసుకు బ్రతికే జనమైనాసరే ఇంటిముందు కొచ్చిన ఏ బిచ్చగాణ్ణి ఉట్టిచేతులతో పంపేవారు కాదు. గంగిరెద్దులవాళ్లు, బాలసంతలవాళ్లు, బుడిగె జంగాలు, తోలుబొమ్మలవాళ్ళు, ఒగ్గువాళ్లు, మందెచ్చులవాళ్లు, ఆరెమరాటీలు, చిందుభాగవతులు, మిత్తిరి అయ్యావార్లు, ఉరుకుల య్యోర్లు ఇంకా ఎంతోమంది జానపద కళాకారులు ఊరిమీద బతికేవాళ్లు. మందెచ్చుల రాజమల్లు కథ చెబితే ఊరు ఊరంతా ఎంత పరవశం చెందుతూ వినేవాళ్లు జనం...?



కాటిపాపలవాళ్ల కనుకట్టువిద్యలు చూసి తామెంతో సంబరపడిపోయేవారు...? ఇప్పుడవన్నీ పేరుకే మిగిలాయి. సినిమాలొచ్చి అన్నిట్నీ మాయం చేశాయి. జానపదులంటే, వారి కళలంటే ఆదరణ లేదు. పండుగలంటే మునుపటి ఉత్సాహంలేదు.

తనలో తానే గొణుక్కున్నాడు కొండమల్లయ్య. ఈ సంవత్సరం చిన్న కొడుకు పేరుమీద బాగుందని పురోహితుడు చెప్పాడు. అతన్తో సాగువాటు చేయించాలనుకున్నాడు.

''తిరుపతయ్యా! లే బిడ్డా, లే...'' కొడుకును పిలిచాడు.

''ఊ...'' మూలిగి అలాగే పడుకున్నాడు తిరుపతయ్య.

''సాగువాటు కావాలె. తొందరగా లే కొడుకా'' తిరుపతయ్య కప్పుకున్న ఛద్దరమీద చెయ్యేసి మళ్లీ అన్నాడు.

''కొంచెం సేపయింతర్వాత లేస్త...'' అని అలాగే పడుకున్నాడు తిరుపతయ్య.

''చెప్పేది నీగ్గాదా? పొద్దుపొడువకముందే చేండ్లకు పొయ్యి చెట్టుగొట్టి రావాలె. తెల్లారితే బేకారయిపోతది, లే'' అని తిరుపతయ్య పైనున్న ఛద్దరు లాగేశాడు.

''అన్నతో కాకపోవునా సాగువాటు...? నన్నెందుకు లేపడం?'' అంటూ లేచి కూర్చున్నాడు తిరుపతయ్య.

''ఈ సంవత్సరం మా ఇద్దరి పేరుమీద మంచిగలేదు. తొందరగా మొకం కడుక్కొని తానం జెయ్యి.''

''ఇన్నిరోజులు మీరు సాగుబాటుచేసి వెయిపుట్లు పండించిండ్రు. ఇప్పుడు నేనయితే పండుతయి తియ్యి'' అని గొణుక్కుంటూ బయటకెళ్లాడు తిరుపతయ్య.

అరుగుమీదున్న నులకమంచంలో కొండమల్లయ్య భార్య నర్సమ్మ, కూతురు కాంతమ్మ పడుకొనున్నారు. లేచి వాళ్ల మంచం దగ్గరికి వెళ్ళి నిల్చుని కూతుర్నుద్దేశించి ''కాంతవ్వా... లే. లేచి వాకిలూడ్చి, అలుకుజల్లు. మీ అవ్వను గూడా లేపు. అన్న తానం చేసొచ్చేవరకు అన్ని పనులయిపోవాలె... లే'' అన్నాడు.

కండ్లు నులుముకుంటూ కాంతమ్మ, నర్సమ్మ లేచారు. మిగతా రైతుకుటుంబాల్లోనూ సాగువాటు హడావిడి మొదలైంది. నర్సమ్మ బట్టల్దీసి మంచాలెత్తింది. కాంతమ్మ చీపురుతో వాకిలూడుస్తోంది. నర్సమ్మ పొయ్యిలో బూడిదెత్తి పారబోసొచ్చింది. కాంతమ్మ వాకిలూడ్వటం పూర్తిచేసి చీపురు పట్టుకొని ఇంట్లోకెళ్లింది. కొండమల్లయ్య బయటకెళ్లాడు. నర్సమ్మ పాత కుండలో నీళ్లుచేది అందులో పేడ కలిపింది. సుయ్ సుయ్ అంటూ అలుకు చల్లుతోంది. అలుకు చల్లడం పూర్తిచేసి ఇంట్లోకొచ్చింది.

''ఇల్లూడ్సుడయిందా బిడ్డ?'' అంది కాంతమ్మతో.

''అయినట్టేనే అవ్వ. అలుక్కుండ తీసుకురా'' అంది కాంతమ్మ తనపని పూర్తిచేస్తూ.

ఓ చిన్నకుండలో నీళ్లుపోసి, అందులో ఎర్రమన్ను కలిపి, దాన్నే చేతిలో పట్టుకొని, మరో చేతిలో పాతచీరపేగు పట్టుకుని ఇల్లలకడానికి ఇంట్లోకొచ్చింది నర్సమ్మ.

''నేను ఇల్లలుకుత. నువ్వెళ్లి వాకిట్లో ముగ్గెయ్యి...'' కాంతమ్మకు పనిచెప్పి ఇల్లలకడం మొదలుపెట్టింది నర్సమ్మ.

గుడ్డిదీపపు వెలుతుర్లో వాకిట్లో ముగ్గేస్తోంది కాంతమ్మ. కాలువ దిక్కెళ్లి తిరిగొచ్చిన తిరుపతయ్య ముఖం కడుక్కుంటున్నాడు.

వాకిట్లో ముగ్గెయ్యడం పూర్తిచేసినాక కాంతమ్మ లోపలికొచ్చి ''అవ్వా! ఇంట్ల ముగ్గెయ్యనా?'' అంది.

''ఇల్లలుకుడు అయిన తరువాత నేను ముగ్గేస్త. అన్నకు స్నానానికి వేన్నీళ్లు పెట్టుపో'' అంది నర్సమ్మ.

బయట్నుంచి ఆ మాటలు విన్న కొండమల్లయ్య ''ఇదేమన్న చలికాలమా? తానం జేనుటానికి ఉడుకునీళ్లెందుకు? ఒదిక్కు మస్తు ఉడుకపోస్తంది. చన్నీళ్లతోనే చేస్తాడు స్నానం'' అన్నాడు.

''నరేగాని గా గూట్లున్న సబ్బు అన్నకియ్యిపోబిడ్డ'' అంది నర్సమ్మ.

కాంతమ్మ నగంకోసున్న లైఫ్‌బాయ్ సబ్బు ముక్క తీసుకెళ్ళి తిరుపతయ్యకిచ్చింది.




"నాన్న తొందరగా స్నానం చెయ్యమంటండు" అంది.

"నేనిక్కడేమన్న ఆడుకుంటున్ననా...?" విసుక్కున్నాడు తిరుపతయ్య.

అతనికీ సాగువాటు తతంగమంతా నచ్చడంలేదు. కాని తండ్రి కొరకు చేయక తప్పడంలేదు. గొణుక్కుంటూనే స్నానం ముగించి ఇంట్లోకొచ్చాడు. ఈలోగా నర్సమ్మ ఇల్లలకడం పూర్తిచేసి ముగ్గేసింది. తండ్రి ఓ ధోతీ చేతికిచ్చి కట్టు కొమ్మన్నాడు తిరుపతయ్యను. దాన్ని మలిచి లుంగీగా చుట్టుకున్నాడు. తండ్రి చెప్పినా వినకుండా ఇది చాలన్నాడు. అతని తలకో పంచె చుట్టాడు కొండమల్లయ్య. భుజమ్మీద తువ్వాలేసి పీటపై కూర్చుండమన్నాడు. పీటపై కూర్చున్న కొడుకు నుదుటి మీద కుంకుమ బొట్టు పెట్టింది నర్సమ్మ. తూర్పుదిక్కు తిరిగి దండం బెట్టింది. ఓ గొడ్డలి చేతికిచ్చి పోయిరమ్మంది. గొడ్డలిచేతిలో పట్టుకొని లేచాడు తిరుపతయ్య. అంచుపైకొచ్చేట్టు భుజం మీద పెట్టుకున్నాడు. కొండమల్లయ్య కొడుకును మందలించి గొడ్డల్ని తిరగేసి భుజమ్మీద పెట్టాడు.

"చేండ్లుకు పోదాం నడువు" అన్నాడు కొండమల్లయ్య. తిరుపతయ్య ముందు, వెనుక తండ్రి ఊరి బయటున్న చేల్లోకి నడుస్తున్నారు. ఇల్లు దాటి కొంతదూరం పోయేసరికి వాళ్లకు ఓ నడి వయస్సు స్త్రీ కంచుముంత నిండా నీళ్లతో ఎదురయింది.

"నిండు ముంతెదురయింది... మంచి శకునమే..." అన్నాడు కొండమల్లయ్య.

తండ్రి అమాయకత్వానికి, అల్పానంతోషానికి జాలివడ్డాడు కొడుకు. పుట్టి బుద్ధెరిగి నప్పట్నుంచీ తిరుపతయ్య ఈ సాగువాట్లను చూస్తూనేవున్నాడు. మంచి శకునమెదురైతే మురిసిపోవడం, కాకుంటే విచారించడం, దేవునిపై భారం వేయడం రైతుకు మామూలే... రోజురోజుకూ దిగజారిపోతున్నా భవిష్యత్తుమీద తమకే తెలియని ఏదో ఆశతో పనిచేసే తమలాంటి రైతు కుటుంబాలతనికి తెలును.

"మంచి శకునమయింది గదా... ఈ సంవత్సరం బాకీలన్నీ తీరుతాయనుకుంట..." అన్నాడు.

"ఏందుగనాడు కూడా వరాచికాలేనా?" కొడుకును మందలించాడు కొండ మల్లయ్య.

తండ్రీ కొడుకులు మాట్లాడుకుంటూ చేల్లోకి చేరుకున్నారు.

"నేనేం జెయ్యాలిప్పుడు...?" చేండ్లోనిల్చొని అన్నాడు తిరుపతయ్య.

కొడుకు చేతిలోని గొడ్డలి తీసుకుని "తూర్పు దిక్కు తిరిగి దండంబెట్టు..." అన్నాడు.

తండ్రి చెప్పినట్టు చేతులు జోడించాడు తిరుపతయ్య. "ఐదు చిన్నచిన్న కంపచెట్లు నరుకు.." కొడుకు చేతికి గొడ్డలిస్తూ అన్నాడు.

మసక చీకట్లో వెదికి ఐదు కంపచెట్లను నరికాడు తిరుపతయ్య... వాటన్నిట్నీ ఒక్కచోట వేసి, వాటిపై ఓ రాయుంచాడు. తండ్రి మాట ప్రకారం మరోసారి తూర్పు దిక్కు తిరిగి దండం పెట్టాడు.

"ఇక పోదామా నాన్నా...?" అన్నాడు.

చేల్లో కూచొనున్న తండ్రి లేచి "పోదాం పా" అని నడవసాగాడు. తెల్లవారకముందే ఇద్దరూ ఇల్లు చేరుకున్నారు. గొడ్డలి తల్లిచేతికిచ్చి బావి దగ్గరికెళ్లి కాళ్లు కడుక్కున్నాడు. వాకిట్లో వున్న మంచం వాల్చుకోబోయాడు తిరుపతయ్య.

"ఆగు... ఈరోజు పొద్దంత మంచంలో పడుకోవద్దు... పగటి నిద్ర అనలేపోవద్దు..." కొడుక్కు చెప్పాడు కొండమల్లయ్య.

"ఇప్పుడే నిద్రొస్తోంది. రాత్రి కెట్లుండాలె...?" విసుక్కున్నాడు తిరుపతయ్య.

"ఉగాదినాడు సాగువాటయినేల్లు పగటిని ద్రపోతే యాడాదంతా ఎవుసం నిద్ర పోయినట్టే వుంటది. నే జెప్పినట్టు విని నిద్రపోకు"

"అందుకే నేను సాగువాటుకానన్న. రాత్రి దాక నిద్రెట్లా ఆపుకోవాలె? ఎండాకాలంలో పగటి నిద్ర లేందెట్ల?"

"ఒక్కనాడు పగటి నిద్ర లేకుంటె చచ్చిపోతవా? విచిత్రంగా మాట్లాడుతవేందిర?" కొడుకు మీదికి కోపానికొచ్చాడు.

తెల్లవారుతోంది. ఊరి బయటకెళ్తున్న పశువుల గిట్టలచప్పుడు లయబద్ధంగా వినబడ్తోంది. ఊరంతా మేల్కొంది. జనమంతా పని పాటల్లో లీనమవుతున్నారు.



''నిద్రాపుకుంట... కంటిమీద రెప్పగూడ పడునియ్య... ఈ సంవత్సరం పంటెంత వస్త దో...? ఎన్ని బాకీలు తీరుతయో చూస్త...'' అని గడపదాటి స్నేహితుని ఇంటిదిక్కు వెళ్లాడు తిరుపతయ్య.

''చదువుకున్న పిల్లగాండ్లకేమెరుక గీవిష యాలన్ని? ఉడుకు రక్తం. అట్లనే ఉరుకులా డుతరు'' అని వాకిట్లో మంచం వాల్చుకొని కూర్చున్నాడు కొండమల్లయ్య.

''ఇంకా తిరుపతయ్య చిన్న పిల్లగాడేనా?'' అంది అక్కన్నే వున్న నర్సమ్మ.

''ఢిల్లీకి రాజయినా తండ్రికి కొడుకే. తిరుప తయ్య పిల్లగాడు కాకుంటే దండోడా...? సరే గాని బూరెలు తొందరగా కానియ్యి'' అన్నాడు కొండమల్లయ్య.

''ఆగెటట్టేలేవుగద.. ఎన్ని తింటవో చూ స్తగ... కొంచెం పొద్దెక్కేవరకు తయారయి తయి...'' అని రేకులువంచిన వంటగదిలోకి వెళ్లింది నర్సమ్మ.

రైతుకుటుంబాల్లో ఏరోజూ తీరికుండదు. పండుగ దినాల్లో కూడా ఎంతో కొంత పనిచేస్తా రు. అంతకు ముందు సంవత్సరం అధిక మాసం రావడం వల్ల ఈ సంవత్సరం ఉగాది ఏప్రిల్‌నెల చివర్లో వచ్చింది. వేసంగి పంట కళ్లాలు లేవడంలాంటి ముఖ్యమైన పనులన్నీ అప్పటికే పూర్తయ్యాయి. కొందరికి ఇంకా మిగి లున్నా తన పనులు పూర్తయ్యాయి... అందుకే తన కుటుంబ సభ్యులంతా ఆ పండుగరోజు వ్యవసాయపు పనులకెళ్లకుండా ఇంట్లోనే వున్నారు.

మండని పొయ్యితో, పిడుకలతో సతమతమ వుతూ, కళ్లవెంటనీరు కారుతుండగా గొట్టంతో పొయ్యూదుతూ పొయ్యంటుపెట్టింది నర్స మ్మ... కొంచెం పొద్దెక్కే సరికి శనగపప్పు ఉడక బెట్టి బెల్లంతో బూరెలు చేసింది. కొత్త చింత పండు పులుసుపిసికి అందులో బెల్లం, కొత్త మామిడి ముక్కలు వేపపువ్వు, కొబ్బరి ముక్క లువేసి ఉగాది పులుసు తయారుచేసింది. సంపన్న కుటుంబాల్లో అందులో కిస్‌మిస్ వేసుకుంటారు. కొందరు ఉగాది పచ్చడి తయారుచేస్తారు. కాని రైతు కుటుంబాల వారి కి వాటి సంగతి తెలియనే తెలియదు.

బూరెలు, పులుసు తయారుచేయడ మయింత తర్వాత ''కాంతవ్వా! నాన్నను, అన్న లను పిలువు... బూరెల్దింటరు'' అంది.

అప్పటికే అందరూ స్నానాలు చేసున్నారు.

కాంతమ్మ పిలువగానే కొండమల్లయ్య ఇద్ద రు కొడుకులను తీసుకొని వంటగదిలోకి వచ్చా డు.

ఆ గదిలో వేసున్న ఓ పీటమీద కూర్చున్నా డు. అతనికిరువైపులా తిరుపతయ్య, రాజయ్య చెరో పీటమీద కూర్చున్నారు.

''కాంతవ్వా! నువ్వచ్చి కూచో...'' తండ్రన గానే కాంతమ్మ వచ్చి తల్లికి దగ్గరగా కూర్చుంది.

నలుగురిముందు కంచాలుంచింది నర్స మ్మ. ఒక్కోకంచంలో నాలుగేసి బూరె లుంచింది. చిన్న గ్లాసులో పులుసుపోసి వాళ్ల పక్కనుంచింది.

బూరె తుంచి నోట్లోపెట్టుకుంటూ...

''నువ్వుకూడా తిన్లేవు మాతోని'' అన్నాడు నర్సమ్మతో.

భర్త దిక్కు కొత్తగాచూసింది నర్సమ్మ. రైతు కుటుంబాల్లో స్త్రీలు సాధారణంగా భర్త పిల్ల లు, అతిథులుంటే వారు భోజనం చేసింత ర్వాతే తాము చేస్తారు. ఉన్నదాంట్లో మంచిది అందరికీ పెట్టి మిగిలింది తింటుంది ఇల్లా లు.

''నాకేం తొందరచ్చింది..? మీరయితె తినుండ్రి...'' నర్సమ్మ మాట్లాడుతుంటే ము క్కుకున్న పోగు అటూఇటూ ఊగింది. దాన్ని చూసి చిరునవ్వు నవ్వాడు కొండమల్లయ్య.

''మీ అవ్వకెన్ని నగలున్నయో చూడు బిడ్డ... ముక్కుకు పోగు, చెవులకు గంటీలు, చేతికి బోలుకడెం... నాకేమన్న ఉన్నయా? మీ అవ్వ మారాణి'' అన్నాడు కొడుకుల్ని జూస్తూ.

ప్రతిజీవితంలోనూ హాస్యం ఏదో కొంతమేర కైనా వుంటుంది. నాకే హాస్యప్రియత్వంలే కుంటే ఎప్పుడో ఆత్మహత్య చేసుకునేవాడి నంటాడు గాంధీజీ. ఎన్ని ఇబ్బందుల్లోవున్నా పరాచికాలాడుకుంటూ వాతావరణాన్ని తేలిక చేయడం రైతుల్లో కనబడుతుంది.




భర్త మాటలు విన్న నర్సమ్మ కోపంగా చూసిందతన్ని... ముఖం మాడ్చుకుంది.

"నాకు ఏడువారాల నగలుచేయించిన్నని మురుస్తన్నవా? నగలున్నయ్యట, నగలు? చేతికున్నది వెండి కడుమేనాయె. పెండ్లిల మా నాన్న చేయించిన బంగారుకడెం గూడా అమ్మి వెండిది చేయిస్తివి. నల్లపూసలకు గుండ్లన్న చేయించుమని ఎన్నేండ్లనుంచి మొత్తుకున్నా వెల్లుత లేదనే అనవడితివి. నిన్ను చేసుకొని నేనేం సుఖపడ్డ...?" అంది.

ఆమె మాటల్లో దశాబ్దాల ఆవేదనుంది. నిస్సహాయతుంది.

"అట్ల పరాచికంగా అన్నందుకు పురాణమిప్పితివేంది? సంవత్సరాది పండుగనాడు తిడితె యాడాదంత ఇట్లనే వుంటది. మన కాంతవ్వకు పెళ్లయి, చిన్నోనికి నౌకరయితె మనకేం బాధలుండవు. ఎన్ని నగలయిన చేయించుకోవచ్చు" అన్నాడు కొండమల్లయ్య.

నలుగురూ ఉగాది పులుసు తాగుతూ, బూరెలు తింటున్నారు. "ఇగ నువ్వు చేయించిన ట్లేవుంది. రోజు రోజుకు బాకీలు పెరుగుతన్నయి కని తగ్గుతన్నయా? ఉన్నభూమి కాపాడుకుంటె అదే పదివేలు. నాకు నగలు కావన్నని ఏమంటలేను. నువ్వన్నవని అట్లంటి" అంది నర్సమ్మ.

"ఏం జెయ్యనే మరి...? కాపుదనపోల్ల సంగతి నీకు తెలువందేముంది? ఇంట్లునోల్లమంత శరీరం దాసుకోకుంట మట్లో మట్టై పన్జేత్తున్నమా? అయినా ఇట్లనే ఉండవట్టిమి. ఎంత జేసినా ఎక్కడేసిన గొంగడక్కడున్నట్టే వుండె.. వచ్చే జన్మల నువ్వేదేశంలనన్న రాణివై పుట్టు... నేను రాజునయి పుడుత. అప్పుడు ఏడువారాల నగలేంది? రోజుకో తీరున ముప్పై రోజుల నగలు చేయించుత... సరేనా?" అన్నాడు కొండమల్లయ్య.

ఆ మాటలకందరూ నవ్వారు.

"ఇయ్యాల్లనేమొ బాగ సంబరంగున్నవేంది? పరాచికాలు బాగ మాట్లాడుతున్నవు?" అంది నర్సమ్మ.

"రైతేరాజే... ఏందనుకున్నావుమరి. సరే గాని, నెయ్యుందా? నెయ్యితోని తింటె బూరెలు కమ్మగుంటయి"

"రాజువుగద... భటులతోని చెప్పితే నెయ్యి తేకపోదురా? ఇంట్ల నెయ్యేడుంది" అంది నర్సమ్మ.

"లేకుంటె లేపాయె తియ్యి... కాలం పాడుగాను ఎట్లుంది? మనం వేరుపడ్డప్పుడు మనకు రెండు బర్లుండె... మన వాడకట్టోల్లంత మనింటినుంచే చల్లదీసుకపోదురు. ఇంట్ల కావల్సినంత నెయ్యుండేది. ఎవ్వలడిగినా పోసేదానివి. ఇప్పుడు మనం తినుటానికే నెయ్యికరువాయె. కొంటే రూపాయికి చెంచెడన్న వస్తదా?" విచారంగా అన్నాడు కొండమల్లయ్య.

"నీ మాటలు మంచిగున్నాయి. అప్పుడే రాజునంటవు... వెంటనే దిగిపోతవు... మాటలయితె బాగనే నేర్చినవు" అంది నర్సమ్మ.

అందరి గిన్నెల్లో వాళ్లు వద్దంటున్నా మరో రెండు రెండు బూరెలేసింది నర్సమ్మ. కాంతమ్మ అందులోంచి ఒకటి తీసి తల్లికిచ్చింది.

"శక్కరితోని బూరెలు చెయ్యలేదా?" అన్నాడు కొండమల్లయ్య.

"దొరపద్దోలె ఇయ్యాల్ల శక్కరి బూరెలని, నెయ్యని పెద్దపెద్ద మాటలు మాట్లాడుతున్నవేంది? రొన్నొల్లనుంచి కంట్రోలు శక్కరియ్యలేదు. షావుకారి దగ్గరి కొనాల్నంటె కిలోకు నాలుగున్నర ఎక్కువ ధరుంది. ఇదువరకే మస్తు ఖాతయింది. నేను కనిపిస్తే పైసలడుగుతండు" అంది నర్సమ్మ.

"వడ్లమ్మినంక కడుదాం తియ్యి ఖాతపైసలు" అని మరేం మాట్లాడకుండా బూరెల్దిని కంచంలో చెయ్యి కడుక్కున్నాడు. మూతి తుడుచుకుంటూ "నువ్వు.తినిక" అని లేచాడు.

తిరుపతయ్యలేచి ఆవులించి నిద్ర నాపుకోవడానికి బయటకెళ్లాడు. రాజయ్య మౌనంగా పశువులకొట్టం దిక్కెళ్లాడు. కొండమల్లయ్య వాకిట్లో మంచం వాల్చుకొని కూర్చున్నాడు.

మధ్యాహ్నా సమయానికి ఇద్దరు కొడుకులు ఇంటికొచ్చారు. ఈలోగా నర్సమ్మ, కాంతమ్మ కలిసి వంట పూర్తిచేసారు. ఉగాది రోజు రైతు కుటుంబాల్లో మాంసాహారం ముట్టరు. అందుకని పప్పు వండింది నర్సమ్మ. శనగపప్పు

ఉడుకబెట్టిన నీళ్ళతో చారు చేసింది. రైతు కుటుంబాల వాళ్ళు కూరగాయలు కొని వండుకోవడం చాలా తక్కువ. తమ తోటల్లో పండినవి వండుకుంటారు. లేదా వప్పు, చారు, అప్పుడప్పుడు చేవలు, మాంసాహారం తింటారు.

కొడుకులతో భోజనాలకు కూర్చున్నాడు కొండమల్లయ్య. వప్పులో నూనె తక్కువై ఏ మాత్రం రుచిగా లేదు. చారు కూడా అలాగే వుంది. నూనె తక్కువయిందంటే నర్సమ్మ కోమటింటి దండకం చదువుతుందని ఏం మాట్లాడకుండా అన్నం తిన్నాడు. సాయంత్రం కొడుకులతో కలిసి మళ్ళీ బూరెలు తిన్నాడు. తర్వాత వంచాంగం చెప్పే గుడి దగ్గరకు పోదామన్నాడు కొడుకులతో.

“నువ్వు పో... మేము తర్వాత వస్తాం” అన్నాడు తిరువతయ్య. కొండమల్లయ్య ఆంజనేయస్వామి గుడి దగ్గరకు వెళ్ళాడు. అప్పటికే చాలామందక్కడికి చేరుకున్నారు. వంచాంగం చేతిలో వట్టుకొని వెంకటయ్యశాస్త్రి గర్భగుడి ముందున్న మంటవంలో కూర్చున్నాడు. అతని చుట్టూ ఊరిపెద్దలు, మోతుబరులు కూర్చున్నారు. రైతులు, మరికొంతమంది వాళ్ళ తర్వాత కూర్చున్నారు. కొంతమంది నిల్చున్నారు. కొండమల్లయ్య చోటు చేసుకొని వెంకటశాస్త్రికి కొంచెం దూరంగా కూర్చున్నాడు. రాజయ్య, తిరువతయ్య వచ్చి మంటవం కింద నిల్చొని చూస్తున్నారు. శాస్త్రి అందరిదిక్కు చూసి-

“వంచాంగం చదవమంటారా?” అన్నాడు. సర్పంచ్ తలూవగానే వంచాంగ వఠనం మొదలుపెట్టాడు శాస్త్రి.

...నామ సంవత్సరే... సూర్యుడు రాజు... మంత్రి చంద్రుడు... వర్షాధిపతి ఇంద్రుడు... వశుగణాధిపతి శ్రీకృష్ణుడు.

ప్రజలంతా శ్రద్ధగా వింటున్నారు. కొద్ది సేపట్లో వంచాంగవఠనం ముగించాడు శాస్త్రి.

“ఈ సంవత్సరం ‘కార్తులు’ ఏ వారమచ్చినయి అయ్యగారు...?” ఓ రైతు ప్రశ్నించాడు.

“సోమవారం... వర్షం సమృద్ధిగా వుంటుంది...” అన్నాడు శాస్త్రి.

“కాలమెప్పుడు కలుపుకుంటదయ్యగారు?”

పంచాగం తిరగేసి-

“మృగశిరనుంచే మంచి వర్షాలు వడుతాయి...”

“తొందరగనే కాలం కలుపుకుంటది” రైతులు మాట్లాడుకుంటున్నారు.

ఆదాయ, వ్యయాల గూర్చి అడుగుతున్నారు. కొందరికి వ్యవహార నామాలమీద, కొందరికి జన్మనామాల మీద ఆదాయ వ్యయాలు చెబుతున్నాడు శాస్త్రి.

కొండమల్లయ్యకు ఆదాయం వదకొండు పాళ్ళు...వ్యయం ఏడుపాళ్ళు... మిగులు నాలుగుపాళ్ళు అని చెప్పగానే బెలూన్‌లా ఉబ్బిపోయాడు.

మొత్తంమీద ఈ సంవత్సరం తమ కుటుంబానికి మంచిగానే వుందని సంతృప్తివడ్డాడు కొండమల్లయ్య.

ప్రతి ఏడూ ఉగాదిరోజున పంచాంగం వినడం, శాస్త్రి చెప్పిందాంట్లో కొన్ని కాకతాళీయంగానైనా జరిగితే శాస్త్రిని మెచ్చుకోవడం, జరుగకపోతే తమ తలరాతని సరిపెట్టుకోవడం రైతులకు మామూలే. ఈ సంవత్సరం సోమవారం కార్తులొచ్చాయి కాబట్టి కాలం తొందరగానే కలుపుకుంటుందని, గోపాలకృష్ణుడు వశువులకావరిగా వున్నాడు కాబట్టి గొడ్డూ గోదా బాగుంటుందని, ఆదాయ వ్యయాలగూర్చి మాట్లాడుకుంటూ ఇండ్లకెళ్ళారు జనాలు.



చైత్రమాసం చివరి రోజులు... ఎండలు ముదురుతున్నాయి. ఊరుబయట చెట్లకింద, ఊళ్ళో వున్న ఖాళీ ప్రదేశాల్లో ఇంతకుముందు పిల్లలు ఎండాకాలంలో, తీరిక సమయాల్లో




చిర్రగోనెలాటలాడుకునేవారు. తల్లిందెత్తా, పిల్లందెత్తా, మల్లపయ్య మ్యానత్తందెత్తా అను కుంటూ ఫర్లాంగుల దూరం కూతపెడుతూ చిర్రకోసం వరుగెత్తేవారు, బొంగరాలాట ఆడే వారు, గోలీలాటలాడేవారు. మోచేతులకు రక్తం కారుతుండగా దేకించేవారు. మామిడి పిక్కలాట ఆడుతుండేవారు. పిక్కలను గెలిస్తే ఎంతో డబ్బు సంపాదించినట్టు సంబరవడిపో యేవారు. ఉత్సాహంగా కబడ్డీ ఆడేవారు. క్ర మక్రమంగా ఈ ఆటలన్నీ కనుమరుగవుతు న్నాయి. చాలా కొద్దిమంది మాత్రమే ప్రస్తుతం ఆటలాడుతున్నారు. ఊరు వక్కనున్న పొలాల్లో కోతలయింతర్వాత ఎండాకాలంలో ఎంతో ఉత్సాహంగా గుంపులు గుంపులుగా ఖోఖో, కబడ్డీ, చిర్రగోనె లాడుకునేవాళ్ళు చాలా తక్కు వమంది కనబడుతున్నారు. పాఠశాలదగ్గరున్న గ్రౌండ్లో వాలీబాల్ ఆడేవాళ్ళెక్కువయ్యారు. మరికొన్నిచోట్ల కోర్టులు తయారుచేసుకొని వాలీ బాల్, బ్యాట్మెంటన్‌లాంటి ఆటలాడు కుంటున్నారు.

రైతులకు దాదావు వనులన్నీ పూర్త య్యాయి. గడ్డివాములు పేర్చడం కూడా అయి పోయింది. సంవత్సరమంతా వ్యవసాయవ్పను లతో సతమతమయ్యే రైతులకు ఈ కాలంలో కొంత తీరిక దొరుకుతుంది. పేడ ఎరువు పొలాల్లోకి చేరవేయడం, ఎడ్లకు మేతవేస్తూ నీళ్ళు త్రాగించడంలాంటి వనులు తవ్ప తొల కరి వర్షాలు వడేవరకు రైతుకు కొంచెం తీరు బాటు దొరుకుతుంది. అందుకే ఈ కాలంలో బంధువులిండ్లకు వెళ్ళిరావడం, పెళ్ళిళ్ళవీ వుంటే ముగించుకోవడం చేస్తారు రైతులు.

కొందరు రైతులు తీరుబడిగా పొలాల్లోకి, చేండ్లలోకి ఎరువు తోలుతున్నారు. కొందరు చెరువుల్లోని నల్లమట్టి, పాటిమట్టి తవ్వుకొచ్చి సారం కోసమై తమ భూముల్లో పోస్తున్నారు.

తిరుపతయ్య కరీంనగర్ వెళ్ళాడు. రాజ య్య ఎరువు జేరగొడ్తున్నాడు. మధ్యాహ్నానమ యమైనా ఇంకా బండి విడువలేదు. అన్నం తిని వాకిట్లో వాల్చున్న మంచంలో కూర్చున్నా డు కొండమల్లయ్య. కొద్దిగా ఆగి లేచి నిల్చున్నా డు.

'ఎండ బాగయింది... ఇంకా బండి నెందుకి డువలేదూ! చేస్తే గొడ్డు లెక్కనే పన్జేస్తడువీడు. కొడుకు రాజయ్య గురించి తనలోతానే అను కుంటూ పందిరికి చెక్కున్న మోతుకాకుల్లోంచి ఒకటి తీసుకున్నాడు. ఈనె తీసి దాన్ని చుట్టగా చుట్టాడు. పండ్లతో కొనను కొరికి మంచంలో కూర్చున్నాడు. రుమాల్లోంచి దారం తీసి చు ట్టకు చుట్టాడు. చొక్కా జేబులోంచి పొగాకు తీసి చిన్నచిన్న ముక్కలుగా తెంపి చుట్టలో పెట్టాడు. పైనుంచి బొటనవ్రేలు గోరుతో గట్టిగా అదిమాడు.

"కాంతవ్వా...! ఒక్క అగ్గినిపుక ...య్యి బిడ్డ" కూతురును కేకేసాడు. కొద్దిక్షణాల్లో కాంత మ్మ ఓ వగిలిన మట్టి గూనపెంకుమీద నిప్పు తెచ్చి తండ్రి ముందు వేసి లోపలికెళ్ళింది.

బాల్యవివాహాలు చేయకూడదని దేశంలో చట్టాలున్నాయి. సంఘసంస్కర్తలూ స్త్రీల కోసం ఎన్నో పోరాటాలు చేశారు. అంతకంటే పెద్ద పోరాటాలూ సాగుతున్నాయి. అయినా గ్రామాల్లో బాల్య వివాహాలు జరుగుతూనే వున్నాయి. మెడలో తాళిబొట్టుతో, కాళ్ళకు మట్టె లతో ముక్కువచ్చులారని ఆడపిల్లలు బాల ముత్తయిదువులుగా గ్రామాల్లో ఎంతోమంది కనబడతారు. కావు కుటుంబాల్లో బాల్య వివా హాలు మరీ ఎక్కువ.

పద్దెనిమిదేళ్ళు నిండుతూన్న ముద్దబంతి పువ్వులాటి కూతురును చూసిన కొండమల్ల య్య కండ్లు చెమర్చాయి. బిడ్డకింకా పెళ్ళి కానందు కతనికి విచారంగా వుంది. ఇవుడిప్పు డే మైనారిటీ తీరే వయసులోకొస్తున్న కూతురు పెళ్ళి చేయడం ఆలస్యమైందని బాధవడ్తు న్నాడతను. తమ కుటుంబాల్లో వదివన్నెండే ళ్ళ వయసురాగానే పెళ్ళిళ్ళయి పోతుంటే, తానింకా తన ఏకైక కూతురు పెళ్ళి చెయ్యలేక పోయినందుకు కించపడుతున్నాడు.

అగ్గినిపుక చుట్టపై పెట్టుకొని నాలుగైదు బుక్కల పొగ పీల్చాడు కొండమల్లయ్య. ముఖం చిట్లించాడు... "పొగాకు పాడుగాను వాసనొస్తుంది. ముక్కిపోయిన పొగాకిచ్చిండు షావుకారి" అని చుట్టనార్పి మంచం కింద





పెట్టాడు. మంచంలో వెల్లకిలా పడుకున్నాడు.

ఈడేరిన కూతురు ఇంట్లో తిరుగుతుంటే కొండమల్లయ్యకు బాధగా వుంది. అతని కళ్ళ ముందు ఎదిగినకూతురు, ఆమెకు పెళ్ళికాక పోవడం, ఎదుగని బతుకులు... కరువులు, కాటకాలు... పెళ్ళికాకపోవడానికిగల కారణా లు... అప్పులు, మరెన్నో సినిమారీళ్ళలా తిరు గుతున్నాయి.

★ ★ ★

ఓసారి అతివృష్టి... మరోసారి అనావృష్టి... కరువు... వర్షాలు బాగా కురిసినా పంటలు సరిగా పండకపోవడం... పంట పండిన సంవ త్సరం ధరుండకపోవడం, ఎన్నోసార్లు పండిన పంట పెట్టుబడులకే సరిపోకపోవడం, అప్పు లు, పెరుగుతున్న వడ్డీలు, ఓసారి తండ్రి మరణం, మరోసారి దాయాదుల మరణం, ఇలా ఎన్నో కారణాలవల్ల కూతురు పెళ్ళి పదేళ్ళ వయసులోనే చేయాలనుకున్నా చేయ లేకపోయాడు కొండమల్లయ్య.

ఆరేడేళ్ళ క్రితం సంగతి... రెండేళ్ళు వరు సగా కరువొచ్చింది. తిండిదినుసులు కూడా కొనుక్కునే పరిస్థితి దాపురించింది రైతుకు. రెండేళ్ళ అనావృష్టి తర్వాత ఆ సంవత్సరం సమృద్ధిగా వర్షాలు కురిసాయి. చెరువులు, కుంటలన్నీ నిండాయి. ఎక్కడ చూసినా పచ్చ దనమే. భూమాత పచ్చదనాన్నీనినట్టుగా వుంది. అంతకు ముందు బీళ్ళుగా వుండ టంవల్ల ఆ ఏడు పునాస పంట బాగానే వచ్చింది. పల్లి, పెసర, మొక్కజొన్న చేలు బాగా కాసాయి. వరి కూడా బాగానే పండింది. రెండో పంట వచ్చింతర్వాత వేసవి కాలంలో కూతురు పెళ్ళి చెయ్యాలనుకున్నాడు కొండ మల్లయ్య. అప్పులున్నా రైతుకవి మామూలే కాబట్టి ఈ సంవత్సరం బిడ్డపెళ్ళి గట్టెక్కించా లనుకున్నాడు. మొక్కజొన్న పేరడు కోత యింది. వేసంగి పొలం కోసి బంతి కట్టారు. రెండు రోజుల్లో బంతి కొట్టడం కూడా అయిపో యింది. రెండు రోజులుగా వడ్లు తూర్పారబట్ట డానికి సతమతమవుతున్నారు. గాలి సరిగా రాకపోవడంవల్ల ఆలస్యమవుతోంది. రాజయ్య



చేటతో అందిస్తుంటే కొండమల్లయ్య ఎడ్లబండి మీద నిల్చొని తూర్పారబడుతున్నాడు. నర్సమ్మ కళ్ళంలో అక్కడక్కడున్న వడ్లను కుప్పజేస్తోంది. రెండు రోజులుగా కష్టపడుతుంటే రాశి పూర్తి కావస్తోంది. ఇంకోగంటసేపు గాలొస్తే పనయిపోతుంది. కాని ఉన్నట్టుండి కొమ్మకూడా ఊగడం బందయింది. ఎండ విపరీతంగా వుంది. చేట బండ్లో పడేసి బండి దిగాడు కొండమల్లయ్య. తాను తాగి కల్లం దగ్గరున్నవాళ్ళకు నీళ్ళు తేవడానికి రాజయ్య ఇంటికెళ్ళాడు. నర్సమ్మ తూర్పారబట్టిన వడ్లరాశిని తృప్తిగా చూసుకుంటోంది. కొండమల్లయ్య రాశి కేసి తదేకంగా చూస్తున్నాడు. పంట గూర్చి అతని కెంతో సంతృప్తిగా వుంది. ఆరు నెలల కష్టానికి ఫలితంగా కళ్ళముందు కనబడుతున్న వడ్లరాశి అతనికి సంతోషాన్నిస్తోంది. రెండేళ్ళ తర్వాత మంచిపంట వచ్చినందుకా తనికి ఆనందంగా వుంది.

రాశిని తృప్తిగా చూసుకొని బండినీడకు కూర్చున్నాడు కొండమల్లయ్య. రుమాల్లో వున్న చుట్టదీసి చెకుముకి రాతితో అంటుపెట్టుకున్నాడు. నర్సమ్మ అతనికి దగ్గర్లో బండిచెక్రాల్నానుకొని కూర్చుంది. రాశిదిక్కు చూస్తూ తృప్తిగా పొగ తాగుతున్న భర్తనుద్దేశించి-

''ఇగో...ఇటు చూడు...'' అంది నర్సమ్మ.

''ఏందే...?'' అంటూ భార్యదిక్కు చూసాడు కొండమల్లయ్య.

''ఈ యేడన్న కాంతవ్వ లగ్గం జేసుడుందా? లేదా?''

నేనుగూడ ఆ సంగతే ఆలోచిస్తన్న. ఈ వడ్లు మార్కెట్ల అమ్ముకొచ్చి వరపూజ సేత్తాం... వాన

కాలం పంట పండినంక కార్తీక మాసంల పెండ్లి సేత్తాం... మరి బాకి గట్టకుంటె కోమటా యిన ఊకుంటడా? గా సంగతే భయమై తంది'' అన్నాడు కొండమల్లయ్య

''బాకి పాడుగాను ఎప్పటికున్నదేనాయే... ఒనాటికయిపోద్దా అది? పొల్ల (బిడ్డ) అకు కూరోలె పెరుగుతంది. పెద్దమనిషయేటట్టు న్నది. తొందరగ లగ్గం జెయ్యాలె. అయినా నాకు తెలువకడుగుత. వానకాలం వంట పల్లికా యమ్మిన పైసలిత్తివిగద పావుకారికి. ఇంకేపాటి బాకుంది? అది తీరదా ఇగ'' అంది నర్సమ్మ.

''పల్లికాయమ్మితే వచ్చిన పైసలు మిత్తి కిందికే కాకపాయె. ఈ వంట పండిన తర్వాత మొత్తం బాకి గట్టాలన్నడు. ఇప్పుడు ఇయ్యా నంటె ఏమంటడో ఏమొ?'' భయం వ్యక్తంచే స్తూ అన్నాడు కొండమల్లయ్య.

''ఏమనేదేంది? తలదీసి మొలేత్తడా? బాకి వచ్చేఏటికే కడుదాం. ఈ ఏడు బిడ్డ లగ్గం జెయ్యాలె. పెద్దోని సంగతేమొ గట్లుండె... సంఘాలని ఎక్కడెక్కన్నో తిరుగవట్టె. ఇంటిని గురించి పట్టించుకోకనేపాయె... నడిపోనికి మోటు కష్టం జేసుడేగాని ఇంకో సంగతి తెలవ కపాయె. చిన్నోడు చదువుకోవట్టే. బిడ్డ సంగతి పట్టించుకునేటోల్లెవలు చెప్పు? ఎట్లయిన ఇయ్యేడే కార్యమెల్లదీయాలే'' దృఢంగా అంది నర్సమ్మ.

''నేను గూడ గట్లనే అనుకుంటున్న. కాని, దానికి లగ్గబలం రాంది మనమెన్ని జేసినా లాబంలేదు. దానికెప్పుడు రాసిపెట్టుందో ఏమొ? అంతా మీదోని దయ'' చుట్టనార్పుతూ అన్నాడు కొండమల్లయ్య.

''గాలికి దీపంబెట్టి దేవుడా నీదే భారమంటే దీవమాగుతదా? మనం జేసేది మనం జె య్యాలె'' అంది నర్సమ్మ.

''నేను కాదంటన్నానె... ఇయ్యేడు కాంతవ్వ లగ్గం జేసుడే'' అని ''గాలి వచ్చినట్టయి తంది... మిగిలినయి కతం జేద్దాం లే'' అని లేచాడు.

నర్సమ్మ కూడా లేచినిల్చుంది. బజారుది క్కు చూసిన ఆ దంపతులలాగే స్థాణువులై నిల్చున్నారు. ఇద్దరు మనుమలను వెంటబెట్టు కొని రాజేశం పావుకారి కల్లందిక్కు వస్తున్నాడు. కొద్దిక్షణాల్లోనే వాళ్లలా చూస్తూ వుండగానే రోడ్డు రోలరులా దొర్లుతూ కల్లంలోకి ప్రవేశించాడు రాజేశం. తన తలపైవున్న గోనెసంచులకట్ట కల్లంలో పడేసాడు అతనితో వచ్చిన మనిషి ఇంకొకతను 'కుంచం' బిందె కల్లంలో పెట్టి నిల్చున్నాడు.

కొండమల్లయ్యను చూసి ''హి...హి...హి...'' అని నవ్వాడు రాజేశం.

''మంచిగున్నావేయ్ కాపయనె...'' అన్నా డు.

తలూపాడు కొండమల్లయ్య.

''ఏంది? దయ్యాన్ని చూసినట్టు చూడవ ట్టివి. ఎందుకొచ్చిన్ననా? వడ్లు తూర్పారవ ట్టడం అయిందిగదా! నా బాకీ కిందికి వడ్లు కొలునుకుపోదామని వచ్చిన'' సూటిగానే అన్నాడు పావుకారి.

''చెప్పితిగద పావుకారి... ఈ సంవత్సరమె ల్లనీయని. ఇయ్యేడు ఎట్లనన్న నా బిడ్డ పెండ్లి చెయ్యాలనుకుంటన్న... వచ్చే సంవత్సరం నీ బాకి మాకడుత'' బతిలాడుతున్న ధోరణిలో అన్నాడు కొండమల్లయ్య.

''పంట పండినేదేమొ బాకి గట్టవు! వచ్చే సంవత్సరం పంట పండుద్దన్న నమ్మకమే ముంది? మంచోనివే వున్నవు... వడ్లు కొలునుక పోత...'' అన్నాడు రాజేశం.

''పావుకారి! గిట్ల నడిగండ్లె గొంతు కోస్తనంటె ట్లు? బిడ్డ పెండ్లి జెయ్యాలనుకుంటన్ననంటే ఇంత కరాకండిగ మాట్లాడుతెట్ల?''

కొండమల్లయ్య ఎంత బతిమిలాడినా రాజేశం విన్లేదు. ఖచ్చితంగా వడ్లు తీసుకెళ్ళ డానికే నిర్ణయించుకొనివచ్చాడు. ఇక చేసేదేం లేక కొండమల్లయ్య-

''సరె పావుకారి! నీ బాకి మాకడుత. కాని, వడ్లు మార్కెట్లో అమ్ముకొచ్చి కడుత. అప్పట్దాక నన్న ఓపికవట్టు'' కొంచెం కోపంగా అన్నాడు.

''ఎందుకు? ఊరి కొమటయినె అక్కెరకు రాకుంటయిందా? బాకి తీనుకునెటప్పుడున్న మర్యాద తీర్చెటప్పుడుండద్దు కదా నేయ్? బాకి తీసుకునెడప్పుడు కొమటయినె బెల్లమే కని తీర్చుమంటె అల్లమయితడు కదా!''





''గామాటలెన్నెందుకుకాని ఒక్క నాలుగు రోజులు ఓపిక వట్టుండ్రి... అమ్ముకొచ్చి మీ బాకి కడుత''

''నువ్వు ఇదువరుకు గిట్ల మాట్లాడెటోని వేనా, కొండమల్లయ్యా. నీ కొడుకు అన్నలల్ల కల్సిండని బిర్రు చూపుతన్నవా? నాకేమన్న భయమనుకుంటన్నవా ఏంది?'' అన్నాడు చిర్రుబుర్రులాడుతూ రాజేశం.

''షావుకారి... పెద్దోని జోలెందుకు తీస్తన్న విప్పుడు? వాడు అల్లతోని కలిస్తే నేనేం సుకవడ్తున్న? మాటమాటకు పోలీసులచ్చి బెదిరిచ్చి పోతండ్రు, మార్కెట్టుకు పోతె నాలుగు పైసలెక్కు వత్తయని ఆశె''

కొండమల్లయ్యా మాటలకు గయ్యిమని లేచాడు రాజేశం. ''అక్కడ మీ చుట్టమున్నడా ఎక్కువ పైసలిచ్చుటానికి? అక్కడ కనేటోనికి పొట్ట లేదనుకుంటున్నవా? మచ్చులు చూసేటోని కాన్నుంచి, జోకెటోడు, లెక్కలు గట్టెటోడు అందరు ముంచుతె గప్పుడేర్పడుడ్డిగదా!'' వ్యంగ్యంగా దెప్పిపొడిచినట్టన్నాడు రాజేశం.

కొండమల్లయ్యేం మాట్లాడకుండా నిల్చున్నాడు.

''అరే రంగా అంచెతోని బిందెల వడ్లు పొయ్యిరా! కొంరా సంచి తెరిచి వట్టుకొని నా పక్కన నిల్చుండు'' అంటూ తనతో వచ్చిన ఇద్దరికి పనిచెప్పి బిందె వట్టుకొని వడ్లరాసి దగ్గర కూర్చున్నాడు రాజేశం. రంగయ్యా వడ్లు అంచెలోకి తోడి కుంచంలో పొయ్యడానికి సిద్ధమవుతున్నాడు. కొండయ్యా సంచి విప్పి సిద్ధంగా వున్నాడు.

''నరె షావుకారి... వడ్లు నువ్వే కొలునుకపో కాని, ధర మాట్లాడకపోతివేం లేపాయె... వడ్లు కొలువనే వడితి వేంది?'' రాజేశం దగ్గరికొచ్చి అన్నాడు కొండమల్లయ్యా.

''లోకంలున్న ధరవెడుత... పుట్లకొద్ది వడ్లు కొంటలేదా ఊళ్ళో! నువ్వొక్కనివే అమ్ముతన్నవా ఏంది?'' ఎకసక్కెంగా చేతులు తిప్పుతూ అన్నాడు రాజేశం.

''నువ్వు కొంటలేవని నేనెందుకంట... కాని, ధర మాట్లాడందే కొలునుడెట్ల...?''

''చెప్పితి గదనోయ్ ఊళ్ళో ఏ ధరుంటె ఆ ధర పెడుతనని. నామాట, నాబాకి నీకేమాత్రం బిసాయిదనిపిస్తలేదుగదోయ్? గందుకే అందరు ఊరికి కొమటాడు, అడివికి అందుగు మెత్తనని... దొర సోంటోని ముంగటనయితె గిట్లనే మాట్లాడెటోనివా? బాకీ తీసుకునెటప్పుడే మొ కాళ్ళమీద పడుతరు. ఇయ్యమంటె దుఃఖమొస్తది. గివ్వన్ని మాటలెందుకు మరి? నా పైసలు నాకు పారెయ్యప్పుడే, కింద పారేసినా మంచిదే తీసుకుంట'' విసుక్కుంటూ అన్నాడు రాజేశం.

''నేనేమన్ననని గంత కోపానికొస్తన్నవు షావుకారి... గిద్దెకేంధర పెడుతవో ఒక్కమాటన్లేవు''

''నువ్వొకో... ఊళ్ళో ఏ ధరుంటె ఆ ధర నీకిస్త...'' అని- ''రంగా... వడ్లు పొయ్యరా'' గట్టిగా అన్నాడు రాజేశం. రంగయ్యా కుంచంలో వడ్లు పోస్తున్నాడు. రాజేశం లెక్కపెడుతూ కొమరయ్యా తెరిచి వట్టుకొనున్న గోతంలో వాట్ని పోస్తున్నాడు.

''షావుకారి... కుంచం బిందె కొంచెం పెద్ద గున్నట్టుంది'' బిందె దిక్కు చూస్తూ అన్నాడు కొండమల్లయ్యా.

ఆ మాటలు విని అగ్గిమీద గుగ్గిలంలా లేచాడు రాజేశం. ''నువ్వు కొలుస్తన్నవు వెయిపుట్లని, నువ్వు కొలిచే వడ్లు కోసరం పెద్ద కుంచం చేయించినగదోయ్ కావయనె! నీయవ్వ ఏం కులమో ఏమొ? బాకి తీసుకునెటప్పుడోమాట ఇచ్చెటప్పుడోమాట... ఛీ నీయవ్వ'' అంటూనే తనపని కానిస్తున్నాడు రాజేశం.

తను పండించిన పంటపై తనకే అధికారం లేక, చేతికొచ్చిన పంట నోటికిరాక, దీనంగా చూస్తూ నిల్చున్నాడు కొండమల్లయ్యా. నర్సమ్మ గుడ్ల నీళ్ళు కుక్కుకుంటోంది. అప్పటికింకా ఉద్యమాల ప్రభావం ఆ ప్రాంతంలో పెద్దగా లేదు. అప్పుడప్పుడే మొదలవుతోంది. ఒకవేళ షావుకారితో గొడవచేసుకున్నా ఊరి మోతుబరులతనికే అండగా నిలుస్తారని కొండమల్లయ్యకు తెలుసు. చేసేదేంలేక నిస్సహాయంగా ధాన్యం రాశికేసి చూస్తూ నిల్చున్నాడు. మంచినీళ్ల చెంబుతో కల్లంలో కొచ్చిన రాజయ్యా షావుకారిని కోపంగా చూశాడు. తండ్రిదిక్కు

చూసి అతడు తలూపగానే మౌనంగా నిల్చు న్నాడు.

ఆరు కుంచాలు పోసింతర్వాత మరో కుంచం పోసి ఆరున్నొక్కటి అన్నాడు రాజేశం. ఆ తర్వాత మరొక్కటి పోసి ఏడు అన్నాడు. అలాగే పదిహేడు దగ్గర కూడా జరిగింది. తన కళ్ళముందే బహిరంగంగా దోపిడీ జరుగుతు న్నా గమనించేస్థితిలో లేడారైతుబిడ్డ. ఆ వడ్లు పెళ్ళి ఖర్చులకు సరిపోకున్నా మరికొంత అప్పుచేసి ఆ శుభకార్యం పూర్తిచేయాలనుకు న్న కొండమల్లయ్యకు ఆశాభంగమే అయింది. రాజేశం తనపనితాను కానిస్తుంటే తరుగుతు న్న రాశిని, పెరుగుతున్న వడ్ల బస్తాలను చూ స్తూ లోలోన మౌనంగా రోదిస్తూ నిల్చున్నాడు కొండమల్లయ్య.

ముప్పై బస్తాల్లో వడ్లన్నీ నింపి, ముష్టిగా కొన్ని కల్లంలో వదిలిలేచాడు రాజేశం. బస్తాల న్నిటికీ అక్కడే కుట్లేయించాడు.

"కాపయినే అటెనుక కిరికిరి పెట్టేవు మరి... వడ్లు పావుతక్కువ రెండు పుట్లయినయి... మంచిగ యాదికుంచుకో. నీకు పనుల్దీరినంక రా...లెక్కల్జూసుకుందాం... నీ బిడ్డ పెండ్లి పె ట్టుకుంటనన్నవుగదా! అవసరముంటె నేని య్యనా పైసలు... తెచ్చుకో...బాకి పాత బాకి కింద పడిపొద్దని కొలుసుకపోతన్న" అని నవ్వాడు రాజేశం.

కొండమల్లయ్యకు మాత్రం దుఃఖమొస్తు న్నది. ఏంమాట్లాడకుండా మౌనంగా నిల్చున్నా డు.

కొండమల్లయ్య ఎడ్లు, బండితోనే ఆ బస్తాల ను తన ఇంటికి చేర్చుకున్నాడు రాజేశం.

ఆరునెలలు మట్టిలో మట్టె పనిజేసిన కొండ మల్లయ్యకు కల్లంలో తిండికి సరిపోయే గింజ లు కూడా మిగల్చలేదు రాజేశం.

ఇలా జరగడం రైతులకేం కొత్తగాకున్నా కూతురు పెళ్ళి తలంపుకిలా ఆదిలోనే విఘ్నం కలుగడం కొండమల్లయ్యకు చెప్పలేనంత బాధగా వుంది.

రాజేశం వడ్ల బస్తాలతో వెళ్ళిపోయింత ర్వాత కల్లంలో పిచ్చిపిచ్చిగా తిరిగాడు కొండ మల్లయ్య. ముష్టిగా మిగిలిన వడ్లకేసి చూశా డు. అతని కడుపునిండా దుఃఖముంది. కళ్ళ నిండా నీళ్ళున్నాయి. పర్వతంలా వున్న వడ్ల రాశే అతని కళ్ళముందు తిరుగుతోంది. భార్య దిక్కు చూశాడు. కొడుకుదిక్కు చూశాడు. వాళ్ళూ వర్షించే మేఘాల్లాగే కనబడుతున్నార తనికి. నీరసంగా కల్లంలో కూలబడ్డాడు.

అతని కళ్లలో పాతికేళ్లక్రితం కట్టుబట్టల్తో ఆ ఊరికొచ్చిన రాజేశం రూపం కదుల్తోంది. దాయాదులు తరిమేస్తే, ఊరిదొర మోసంచేస్తే కోరుట్ల ప్రాంతంనుంచి కడుపు చేతిలో పట్టు కొని ఆ ఊరికొచ్చాడు రాజేశం. మొదట్లో అందర్నీ అవ్వబాంచెను, అయ్యబాంచెననే పిలిచాడు. ఊరి మోతుబరులకు దగ్గరయ్యా డు. పటేలు, పట్వార్లకు తలలో నాల్కలా మెదిలాడు. మొదట చిన్న దుకాణం పెట్టాడు. చేతిలో కొంత డబ్బు కూడింతర్వాత వడ్డీలకి వ్వడం ప్రారంభించాడు. అవసరాల్లో ఆదుకు న్నట్టుచేసి ఈతాకిచ్చి తాటాకు తీసుకున్నాడు. నెలకు పదికి పదకొండుకు వడ్డీకిచ్చాడు. వటు డింతై, ఇంతింతై అన్నట్టు ఊర్నంతా ఆక్ర మించుకున్నాడు. దొరలకే వడ్డీలకిచ్చే స్థితికెది గాడు. ఇల్లు కట్టుకున్నాడు. భూములు కొన్నా డు. పట్నంలోనూ పెద్ద బిల్డింగ్ కట్టాడు. మంచి బ్యాంకు బాలెన్సుతో, వడ్డీకి తిరుగుతు న్న పైసలతో, ఆస్తిపాస్తులతో, ఊళ్లోని ప్రముఖు ల్లో ఒకడయ్యాడు.

రాజేశంగూర్చిన విషయాలన్నీ మననం చే సుకుంటూ లేచి నిల్చున్నాడు కొండమల్లయ్య. నిండుగావుండే కల్లం బోసిగా కనబడ్తుంటే అతనికి కోపంగా వుంది. దుఃఖంగా వుంది. ఆక్రోశంగా వుంది.

"ఆ ఊరోల్లు ముడ్డిమీద తంతే పంచె, బనీనుతోని సంచి చేతిల పట్టుకోని వచ్చిండు కోమటాయన... పంచె విడుస్తె మారు కట్టు కుంటానికి ఇంకో పంచె గూడ లేకుండె. కల్లు దుకానాలకాడ బజ్జీలు, మిరపకాయలమ్మిండు. కల్లాలపొంటి తిరుక్కుంట ఫలారాలమ్మిండు. అటెనుక ఉప్పు, మిరపకాయల్తోని చిన్న దు కాణం పెట్టిండు. కొంచెం పైస జమ కాంగనె వడ్డీలకిచ్చుడు మొదలుపెట్టిండు. అటెనుక దినుసుబేరం మొదలుపెట్టిండు. మొదట్ల అందరి కాళ్లు పట్టుకున్నట్టే చేసిండు. ఇప్పు





డందరితోని కాళ్లు పట్టించుకునెటట్టయిండు. సగమూరును కొనేటట్టయిండు. కోమటాయనె కండ్లు నెత్తిమీదకొచ్చినయి. కల్లంలనుంచే వడ్లు గొలుసకపాయె. పాపపు ముండకొడుకు...'' కల్లంలో అటూ ఇటూ తిరుగుతూ కోపంగా అన్నాడు కొండమల్లయ్య.

''అనేదేదో ముందటనాలెగాని చాటునంటె ఏమొస్తది..? వడ్లు కొలుసుకునెటప్పుడేమొ నోరుమూసుకొనుంటివి. వెళ్లిపోయినంక తిడుతుంటివి. చెర్లనీళ్లు పోయి చెరువెనుక పడ్డంక మొత్తుకుంటే ఏమొస్తది..?'' అన్నాడు రాజయ్య.

''ఈనింట్ల పీనిగెల్ల. పిడుగోలె వచ్చి మీదపడ్డట్టు చేసె. ఏంమాట్లాడుదామంటె మాట్లాడనిస్తండా..? బిడ్డ లగ్గం జేద్దామనుకొంటె పండిన పంటంత ఊడ్సుకపాయె. ఆనికి మంచిదేంగాదు... నా ఉసురు తగులుద్ది...'' శాపనార్ధాలు పెడుతూ తిట్టింది నరసమ్మ.

''నీయవ్వ! భూమిని నమ్ముకోని బతికేటోన్ని భూమ్మీదనే ఉంటి... బజ్జిమిరపకాయలమ్ముక బతికినోడు ఇయ్యాల పెద్ద సేటయిపాయె. మట్టె మట్టె పస్జేత్తే మట్టే మిగులవట్టె'' బాధగా అన్నాడు కొండ మల్లయ్య.

''కోమటాయన వెళ్ళిపోయినంక అంటే ఏమొస్తది..? పొద్దు గూకుతుంది. మిగిలిన వడ్లు తూర్పారపడుదాం... రాయే నాయన్న'' అని బండెక్కాడు రాజయ్య. కొడుక్కు వడ్లందించడానికి చేట చేతిలోకి తీసుకున్నాడు కొండ మల్లయ్య. వంట చేయడానికి ఇంటికెళ్లింది నరసమ్మ.

అటు తర్వాత ఊళ్లో గొడవలు మొదలయ్యాయి. కూలిరేట్ల గూర్చి, పాలేర్ల జీతాలగూర్చి, దొరల జులుం గూర్చి, వడ్డీ రేట్ల గూర్చి, క్రమక్రమంగా అవి ఉధృతరూపం దాల్చసాగాయి. ఊరిపెద్దల, షావుకార్ల జబర్దస్తీ కొంత తగ్గింది. మరుసటి సంవత్సరం కూతురు పెళ్ళి చేద్దామనుకున్నాడు కాని, ఆ యేడే కొండ మల్లయ్య తండ్రి చనిపోయాడు. ఏడాది దినం అయ్యేంతవరకు ఇంట్లో శుభకార్యం జరుపవద్దన్నారు. తండ్రి ఏడాది దినం చేసి, కాంతమ్మ పెళ్ళి పెట్టుకుందామనుకుంటుండగానే పెద్ద కొడుకు పోలీసు కాల్పుల్లో మరణించాడు. కొడుకు శవంపైబడి భోరుభోరున దుఃఖించాడు. తనకు తలకొరివి పెట్టాల్సిన కొడుక్కి తానే తలకొరివి పెట్టాల్సివచ్చిన దుస్థితికి పొగిలిపొగిలి ఏడ్చాడు. ఎవరికోసమూ ఆగని కాలగమనంలో మరోసంవత్సరం గడిచిపోయింది. కూతురు పెళ్ళి పెట్టుకుందామని కొండ మల్లయ్య బావ లస్మయ్య దగ్గరికెళ్ళాడు.

''నీ కొడుకు అన్నలల్ల కలిసి సచ్చిపోయిండు. మాకు మీ పిల్ల వద్దు, మీ సంబంధమొద్దు. నా కొడుక్కు వేరే పిల్లను చూసుకుంటున్నం''

లస్మయ్య మాటలు విని షాక్ తిన్నాడు కొండ మల్లయ్య. ''వాడు చచ్చిపోవుటానికి, కాంతవ్వ పెండ్లికి సంబంధమేముంది బావ..? నా బిడ్డ పుట్టినప్పుడే నీ కొడుక్కు పెండ్లాం పుట్టిందన్నరందరు. చిన్నప్పట్నుంచి అనుకున్న సంబంధాన్ని కాదంటెట్ల..?'' బావను బ్రతిమిలాడుతూ అన్నాడు కొండ మల్లయ్య.

''అటెనుక పోలీసులతోని తిప్పలు పడుడు మానుంచిగాదు... మీ సంబంధమద్దు, ఏమద్దు'' ఖచ్చితంగా చెప్పాడు లస్మయ్య.

బావ గడ్డం పట్టుకొని బ్రతిమిలాడాడు. తన కూతురు కన్యాయం చెయ్యొద్దన్నాడు. కావలిస్తే మరింత కట్నం తీసుకోమన్నాడు. కాని ఎంత బ్రతిమిలాడినా విన్లేదు లస్మయ్య.

కాంతమ్మనే పెళ్లిచేసుకుంటనన్న కొడుకును తిట్టి, గద్దరించి నోరు మూయించాడు లస్మయ్య. కాని అతడు తండ్రి చూసిన ఇతర సంబంధాలను చేసుకోవడానికిష్టపడలేదు.

మేనరికాన్ని బంధుత్వాన్ని దూరంచేసుకోవద్దని చెల్లెను బుదురకించాడు. బావ కాళ్లావేళ్లా పడ్డాడు. రెండు మూడేండ్లు వాళ్ల ఇంటిచుట్టూ తిరిగి ఒప్పించాడు. అయినా అనుకూలించని ఆర్థిక పరిస్థితులు, గృహ స్థితిగతుల వల్ల ఇప్పటివరకూ కూతురు పెళ్ళి చేయలేక పోయాడు.

★ ★ ★

గత జీవిత పుటలను తిరగేస్తున్న కొండమల్లయ్య హృదయం భారమయింది. ఆరునూరైనా ఈ సంవత్సరం బిడ్డ పెండ్లి చేయాలనుకున్నాడు. ఎట్టి పరిస్థితిలోనూ ఈ కార్యం

పూర్తిచేయాలనే చాలారోజులుగా ఆలోచిస్తున్నాడు. ఈ వేసవిలో లభించే తీరిక సమయంలో ఈ పని ముగించడమే మంచిదనుకున్నాడు. 'అరే రాజయ్యింకా రాలేదేంటి?' తనలో తానే అనుకుంటూ లేచి మంచంలో కూర్చున్నాడు.

ఇంతలో రాజయ్య గబగబా లోపలికొచ్చాడు. కనాలు, జోళ్లు, ముల్లుకర్ర ధాన్యం గుమ్మల దగ్గరకు విసిరేశాడు. అతని శరీరం చెమటతో తడిసుంది.

కొడుకును జూసి కొండమల్లయ్య ప్రేమగా- "వచ్చినవా బిడ్డ... గింత పొద్దుపోయేదాక ఎందుకున్నవు? ఎండ తగ్గినంక మల్ల కట్టకపోదువా బండి..? చేస్తే మొస్సర మొస్సర చేసుడే... తానం జేసి అన్నం తినుపో జెప్పన... పొద్దుటినుంచేం తినలే" అన్నాడు.

రాజయ్య తండ్రిదిక్కు కోపంగా చూశాడు. "నామీద అంత ప్రేమ పొర్లుకస్తందా..?" అన్నాడు వ్యంగ్యంగా.

ఆ మాటలు విన్న కొండ మల్లయ్య విలవిల్లాడాడు.

"ఏంది బిడ్డ..? బాపేమన్నడని గంత కోపానికస్తన్నవు?" అంది అక్కడే వున్న నరసమ్మ.

తల్లి మాటలకేం జవాబు చెప్పలేదు రాజయ్య. విసురుగా బావిదగ్గరికెళ్లాడు. చేద బొక్కెనతో నీళ్లు తోడుకొని నాలుగైదు బొక్కెండ్లు తలపైనుండి పోసుకొని స్నానం అయిపోయిందనిపించుకున్నాడు. వంటగదికెళ్లి భోజనం చేశాడు. మూతి తుడుచుకుంటూ బయటకొచ్చాడు.

"రాజయ్యా... ఇట్రా... ఇటొచ్చి కూచో" బయటకొచ్చిన కొడుకును పిలిచాడు కొండ మల్లయ్య.

రాజయ్య ముఖం మాడ్చుకుని తండ్రి మంచంపట్టెమీద కూర్చున్నాడు.

"ఏంది? నీ సంగతేందో చెప్పలేవు... మొకమెందుకు బుడ్డితీరుగ పెట్టుకున్నవు. అసలు సంగతి చెప్పలేవు!"

"సంగతి నీకు తెలువదా? తెలిసిగూడ ఎందుకడుగుతవు? ఈ లేకిడి పని నేజెయ్య. ఇండ్ల ఎంతజేసినా బొక్కలే మిగుల్తన్నయి. బావిపనికి పోతనని రొండేండ్లనుంచి మొత్తుకుంటున్నా వింటన్నవా? నేనీ పని జెయ్య" అన్నాడు రాజయ్య.

"బావిపనికే బోదువుగని కొద్దిగాగ లేవు కొడుక.. మనం అనుకున్నప్పుడే కావల్నంటె ఐతదా? తోలిస్తనని చెప్పితిగదా"

"ఎప్పుడు తోలిస్తవు? నేను బొందలకు పోయినంకనా? నాకిప్పుడే కావాలె. నా సోపతికాల్లు ఇద్దరు ముగ్గురు పోయింర్రు"

"నిన్ను తోలిస్త బిడ్డ తొందరపడకు. బాయి వనిగావల్నంటె ఐదారువేలన్న కర్సయితయి గద. చెల్లె ఇంట్ల ఎదిగుంది కనవడుటలేదా? ఎట్లనన్నజేసి ఈ సంవత్సరం దాని లగ్గం సేత్తాం. అటెనుక నీ సంగతి. ఇద్దరికొక్కటేసారి పైసలు గావల్నంటె ఎట్ల చెప్పు?" అన్నాడు కొండ మల్లయ్య.

"ఎన్నిరోజులకయినా అప్పుల్జేసుడేకద. లేకుంటే నువ్వు సంపాయించి ఈ పనులు ఒడ్డెక్కిస్తవా? ఎప్పటికయిన భూమిని అమ్మంది పనులు గావు. అటువంటప్పుడు ఇంకా కాలం గడుపుతేమస్తది?" తండ్రిని నిలదీశినట్టన్నాడు రాజయ్య.

"భూమిని అమ్ముకొని బొగ్గుబావి నౌకరిజేసి సంపాయిస్తడిక కొడుకు! మమ్ములనుద్ధరిస్తడు. ఈనెకోసం తల్లిలాంటి భూమినమ్మాలె! కదా కొడుక..?" వ్యంగ్యంగా అన్నాడు కొండమల్లయ్య.

"నేను బావిపని చేసి సంపాయిస్తనో లేదో కని నువ్వయితె భూమి దున్నుకుంట సంపాయిస్తన్నవా! ఏం సంపాయించుడనుకున్నవు? వశంగాని సంపాదన! భూములు కొనవడితివి. బంగారం కొనవడ్తివి. బంగ్లాలు కట్టియ్యవడ్తివి. నే జూత్తలేనా నీ సంపాదనెట్లుందో?" సవాలుకు జవాబన్నట్టుగా తండ్రికి వ్యంగ్యంగానే జవాబిచ్చాడు రాజయ్య.

కొడుకు ఎత్తిపొడుపుకు బాధా, కోపం కలిగాయి కొండమల్లయ్యకు. సున్నితమైనచోట కొట్టినట్టయింది.

"గుడ్డొచ్చి తల్లినెక్కిరిచ్చిందట. నువ్వేం మాట్లాడక్కర్లేదు. చిన్నప్పట్నుంచి నేను భూమినే నమ్ముకున్న. మా తాతలు, ముత్తాతలు గూడ భూమిని నమ్ముకొనే బతికింర్రు. మునిగినా, తేలినా నా కాలం గిట్లనే గడుస్తది. నువ్వు




నౌకరి జేసి బాగా సంపాయిస్తవు తియ్యి. నేను నష్టంజేస్తె నువ్వు బాగ లాబంజేస్తువు తియ్యి. బాయిపనికి తోలిస్తఁని ఇయ్యేటికాగు. ఎది గుంది చెల్లె. దాని లగ్గం జేద్దాం. వచ్చేటికి పోదువు తియ్యి. నా మాటిను బిడ్డ కొంచెం'' మొదట వెక్కిరించినా తర్వాత అనునయంగా అన్నాడు కొండమల్లయ్య.

''కాదు బాపూ! నా మాట అర్థంజేసుకో కొంచెం. వచ్చేటికయితే మాత్రం పైసలేడి నించి వస్తయి? ఇదువరకే పదివేలకంటెక్కువ బాకీ ఉంది. వచ్చిన పంట మిత్తికిందికన్న చాలకపాయె. రేపు పంటనమ్మిన పైసల్తోని నన్ను బావిపనికి పంపిస్తవా చెప్పు? చెప్పవు మరి? ఎన్నటికయిన అప్పుదెచ్చుడేకద! అది ఇప్పుడే తెస్తే ఐపోతదిగద! పని దొరుకుతె బాకి మాతీర్చుత నేను. నాకు పైసల్దెచ్చియ్యి'' అన్నాడు రాజయ్య.

''నువ్వన్నది నిజమే, కాదంటలేను. కని అటు చెల్లె లగ్గానికి, ఇటు నీకు పనికోసం ఒక్కసారే పైసలు గావన్నంటె ఎట్ల చెప్పు? నామాటిని ఇయ్యేడాగు''

''బాపూ! నేనెంత మొత్తుకున్నా నువ్వింట లేవు. వారంరోజుల్లోపల నాకు పైసలిస్తివా సరె లేకుంటె మా అత్తగారింటికాన్నుంచి తెచ్చు కుంట. ఇన్నిరోజులు నీ మర్యాద కాపాడాలని ఆగిన. మా మామగూడ ఇయ్యేడనుకో... రాడిక ల్సుల గల్సిపోత. ఏంజేత్తవో చేసుకో? అటు అది రాదు. ఇటు నువ్వీనవు. ఎన్నిరోజులని ఓపికపట్టాలె నేను?'' ఆఖరి అస్త్రం ప్రయోగించాడు రాజయ్య.

కొడుకు తన మామద్వారా డబ్బు తీసుకెళ్లి ఉద్యోగం సంపాదించుకుంటే తనకు కాకుండా పోతాడేమోనని కొండమల్లయ్యకు భయంగా వుంది. ఆ ప్రాంతంలో ఎంతోమంది యువకులు రాడికల్సులో కలిసిపోవడం చూస్తున్నాడు ఇదువరకే. ఓ కొడుకును పోగొట్టుకున్న అతనికి తన రెండవ కొడుకు కూడా అందులో కల్సిపోవడం ఇష్టంలేదు. కొడుకు చేస్తానన్న రెండువనులూ అతనికి భయాన్నే కల్గించాయి.

కొద్దిక్షణాలు తనలోతాను తర్జనభర్జన చేసుకున్నాడు. ఇంకేం చెప్పినా కొడుకు వినడని అతనికర్థమయింది.

''నల్లమొకవు గాడిది. పెండ్లాం ఇంటికాన్నుంచి పైసల్దెచ్చుకొని నౌకరి సంపాయించుకుంటె వాళ్లకలుసైపోవా? వాళ్లాడిచ్చినట్టు ఆడవల్సివస్తది. రాడికల్ల గలుస్తడట, రాడికల్ల... పెద్దోని సంగతేమయింది? నా కడుపుల చిచ్చుపెట్టి ఎల్లిపోయిండు. నువ్వు గదే పన్జేస్తవా?'' కొండమల్లయ్య హృదయం భారమై కనుకొలకుల్నుండి రెండు కన్నీటిచుక్కలు రాలాయి. రుమాలుతో కళ్లు తుడుచుకున్నాడు.

రాజయ్యేం మాట్లాడలేదు.

''సరే... నువ్వన్నట్టే పైసలేడన్న దూసుకొచ్చి (అప్పుదెచ్చి) నీకిస్త. గోదావరిఖనికి పోయి పైరవికారిని మాట్లాడుకొనిరా పో...'' అన్నాడు కొండ మల్లయ్య.

తండ్రిమాటలు విన్న రాజయ్య ముఖం వెలిగింది.



పొలంలోకి ఎరువు జేరవేస్తున్నాడు కొండమల్లయ్య. అతని మనసంతా కోళ్లు కెలికిన చెత్తలా వుంది. ఏంచేయాలో తోచడంలేదు. ముందున్న కార్యక్రమాలనెలా గట్టెంక్కించాలో అర్థంకావడంలేదు. 'రాజయ్య గోదావరిఖనికి పోయాడు. వానికి ఆరేడువేలన్నా ఖర్చవుతుంది. ఎట్టి పరిస్తితుల్లోనూ కాంతవ్వ పెళ్ళిచేయాలి. మరీ రెండు పనులకు డబ్బెలా రావాలి? ఇప్పటికే కొంత అప్పుంది. సర్కారు బాకీ ఉండనేవుంది. ఛీ... నీయవ్వ... ఏంబతుకులో? ఇక భూమమ్మక తప్పదా?' తనలో తాననుకున్నాడు కొండమల్లయ్య.

తాను ప్రాణాధికంగా ప్రేమించే భూమిని

ఏరైతూ అమ్మడానికి సిద్ధంగా వుండడు. మట్టిని ప్రేమించే రైతు ఆ మట్టి పరులసొత్తు కావడం సహించడు. గ్రామాల్లో భూములుండి పనిచేయక చేయించుకు బ్రతికే దొరలలాంటి వాళ్ళు తమ విలాసాలకొరకు భూమినమ్మడానికే మాత్రం సంకోచించరు. అందుక్కారణం భూమి వాళ్లదే అయినా అందులో పనిచేసేది వాళ్లు కాదు కాబట్టి ఆ భూమితో మమేకముండదు వాళ్లకు. అందుకే ఒకప్పుడు నలభైయాభై ఎకరాలున్న వాళ్లు వాట్నిదున్నించుకునేసామర్థ్యం కూడా లేక కొంత, విలాసజీవితానికలవాటుపడి కొంత, మారిన పరిస్థితుల దృష్ట్యా కొంత, తమ భూములను ఒక్కొక్కటే అమ్ముకుంటూ కూర్చొని తిన్నవాళ్లున్నారు. కాని తనలా, కుటుంబసభ్యుల్లా భూమిలోనే పనిచేస్తూ బ్రతికే రైతుల సంగతలాకాదు. అతనికి భూమంటే ప్రాణం. ప్రాణంకంటే ఎక్కువే. రోజులో ఎక్కువభాగాన్నతడు భూమిలోనే గడుపుతాడు. నేలతో అతనికి విడదీయరాని సంబంధముంటుంది. అందుకే భూమి పోవడం తన శరీరంలోని భాగం పోవడంగానే, తన పరువు పోవడంగానే భావిస్తాడు. తాను పండించిన పంట వడ్డీలకు కూడా సరిపోకున్నా ఏ భూమినైతే తాకట్టుపెట్టి అప్పు తీసుకున్నాడో ఆ భూమి అప్పుకిందికి పోయే స్థితి వచ్చినా రైతు భూమిని అమ్మడానికి సంకోచిస్తాడు. అయినా ధరల సుడిగుండం, ప్రకృతి వైపరీత్యాలు, రాజకీయ సాంఘిక పరిస్థితులు, మరెన్నో విషయాలు భూమిపుత్రుడి భూమిని అతనికిగాకుండా చేస్తున్నాయి. రెక్కలు ముక్కలు చేసుకొని భూమాత సేవలోనే అంకితమైన రైతుకు భూమే లేకుండా చేస్తున్నాయి.

రాజయ్యకు సింగరేణిలో ఉద్యోగమయితే ఆ జీతంతో - అదృష్టంబాగుండి చిన్నకొడుక్కు నౌకరయితే ఆ డబ్బుతో - కొద్దో గొప్పో ప్రతి పంటకు ధాన్యమమ్మి మెల్లమెల్లగా అప్పు తీర్చవచ్చు. అలాంటప్పుడు భూమినెందుకమ్మాలి? అని మళ్లీ బాకీ చేయడానికే నిర్ణయించుకున్నాడు కొండ మల్లయ్య. తనను అప్పుల సుడిగుండం చుట్టుముట్టుతున్నా భవిష్యత్తుపై తనకే తెలియని ఏదో ఆశతో వున్నాడు.

ఎడ్లబండి పొలంలోకి చేరుకుంది. నొగలపైనుంచి పొనుక (కంకబద్దలతో చేసింది)లోకెక్కాడు. వెనుకభాగంలో వున్న రంధ్రానికడ్డంపెట్టిన పాతచేటను తీసేశాడు. ఎరువు భళ్లున క్రిందకు జారింది. ఎడ్లనదిలిస్తూ బండిలోని ఎరువునంతా పొలంలో అక్కడక్కడ కుప్పలుగా పోశాడు. బండిని పశువులకొట్టం దగ్గరకు తీసుకొచ్చి ఆపాడు. బండి నింపి మరో సారి పొలంలో పోసివచ్చాడు. ఎండ చుర్రుమంటోంది. బండి విడిచాడు. ఎడ్లకు నీళ్లు తాగించాడు. ఇంటికొచ్చాడు. గబగబ స్నానం చేశాడు. భోజనం చేయడం ముగించాడు. ఊళ్లోకి వెళ్లొస్తానని భార్యకు చెప్పి పండితుడింటికెళ్లాడు. అరుగుమీద కూర్చున్న శాస్త్రికి నమస్కారం చేశాడు. తమలపాకులు నములుతూ ప్రతినమస్కారం చేశాడు శాస్త్రి.

"ఏం కొండమల్లయ్యా! ఎందుకో వస్తివి..?" అన్నాడు.

"బిడ్డ పెళ్ళి చెయ్యాల్నుకుంటున్న అయ్యగారు. పంచాగం చూసి మంచిదినాలెప్పుడున్నయో చెప్పుండ్రి..?" అన్నాడు అరుగుమీద కూర్చుంటూ.

ప్రక్కనున్న పంచాగం చేతుల్లోకి తీసుకొని తెరిచాడు శాస్త్రి.

"అమ్మాయికి, అబ్బాయికి జన్మనామాలున్నాయా...?"

"మాకు గవ్వన్ని చూసుడేమెరుక అయ్యగారు... లెవ్వు"

"పోనియ్... వాళ్ల పేర్లు చెప్పు"

"నాబిడ్డపేరు కాంతమ్మ... ఆ పిలగానిపేరు రాంరెడ్డి"

"వాళ్ళు రెడ్లేనోయ్...?" అనుమానం వ్యక్తంచేశాడు శాస్త్రి.

"మ్యానరికమే... మా చెల్లె కొడుకేనాయె.."

"మరి రెడ్డని పేరు పెట్టుకున్నరేంది..?"

"ఇయ్యాల రేపు పేర్లగురించి చెప్పవచ్చేటట్టున్నదా అయ్యగారు... మునుపు వెలుమలు, కర్ణాలు, యెల్లాపులు రావులని పెట్టుకునేది... మరిప్పుడో..? హరిజనులు గూడా రావులనే పేరు పెట్టుకుంటండ్రు. మీకు తెలువందేముంది. కాపు బలిస్తే రెడ్డయితడు. కాపులు కొద్దిగ తీరుగుంటె రెడ్డని పేర్లు పెట్టు





కుంటం(డు. ఇప్పుడు చిటాటి, మొటాటి, మున్నూరు కాపోల్లు గూడ రెడ్డని పేర్లుపెడుతుం(డు''

'అవును... నువ్వన్నది నిజమే. సరే... మీ గో(తం, మీ వియ్యంకుడి గో(తం చెప్పు''

చెప్పాడు కొండ మల్లయ్య, తలూపాడు శా(స్త్రి.

''ఏవూరికిస్తున్నవమ్మాయిని?''

''నగునూరుకు''

''ఎప్పుడు పెట్టాలి పెండ్లి?''

''కాపుదనపోల్లకు ఎండకాలమయితె కొంత పురుసతుంటది. చినుకు పడ్డదంటె చస్తామన్నా తీరదిక. చినుకు పడకముందే అన్నయిపోవాలె'' అన్నాడు కొండ మల్లయ్య.

''నిజమే...'' అని పంచాంగంలో లీనమయ్యాడు శా(స్త్రి. ఏవేవో లెక్కలు పెట్టాడు.

''వైశాఖ బహుళ విదియ. దివ్యమైన ముహూర్తం'' అన్నాడు.

''అంటే ఇంకెన్ని రోజులుంది?''

''ఇరవైరోజులుంది. వెంకటేశ్వర్ల పౌర్ణమి పోయిన తర్వాత రెండవరోజు.''

''పూర్తి దగ్గరయిపోయిందిగద అయ్యగారు''

''ఈ ముహూర్తం తప్పుతె వాళ్ల పేరుమీద కుదరల్నంటె మళ్లీ (శావణమాసంలోనే... అప్పుడు మీకు తీరికుండదు''

''అయితెమానాయె అయ్యగారు... మా తిప్పలు మేం పడుతం. మీరు చెప్పిందో కాగితంమీద రాసియ్యం(డి. నగునూరుకు పోయి మా వియ్యంపునితోని మాట్లాడొస్త. వాళ్లు బాగ తొందరపడుతుం(డు''

శా(స్త్రి తేదీని కాగితంపై రాసిచ్చాడు.

దాన్ని చొక్కా జేబులో పెట్టుకొని ''మల్ల కలుస్త అయ్యగారు'' అని నమస్కారం చేసి ఇంటికెళ్లాడు కొండమల్లయ్య.

తెల్లవారి తిరుపతయ్యను ఎడ్లను చూసుకొమ్మని చెప్పి నగునూరుకెళ్లాడు. వియ్యంకుడు సాదరంగా ఆహ్వానించి కాళ్లకు నీళ్ళిచ్చాడు. కాళ్లు కడుక్కొని వచ్చి మంచంలో కూర్చున్నాడు కొండ మల్లయ్య. చుట్టాకు, పొగాకిచ్చి కుశల(ప్రశ్నలడిగాడు లస్మయ్య. బావకు నమాధానాలు చెప్పుతూనే చుట్ట చుట్టుకున్నాడు కొండ మల్లయ్య. అందులో పొగాకుంచాడు.

''మీ అన్నకు కొంచెం అగ్గి తెచ్చియి'' అన్నాడు లస్మయ్య అక్కడే నిల్చొనున్న భార్యతో.

లింగమ్మ లోపలికెళ్లి పిడుకమీద నిప్పు పెట్టుకొని తీసుకొచ్చి కొండమల్లయ్య ముందుంచింది.

''అంత. మంచిగున్నారె అన్న?'' అంది.

''మంచిగనే ఉన్నం చెల్లె'' అని నిప్పు చుట్టమీద పెట్టుకొని చప్పరిస్తున్నాడు కొండమల్లయ్య.

''వదినారోగ్గెం, బాగుందా? కాంతవ్వ మంచిగుందా?''

''గానడుమ మీ వదినెకు జ్వరమొచ్చింది. ఇప్పుడు మంచిగనే వుంది. కాంతవ్వ బాగనే వుంది'' చుట్ట తాగుతూ అన్నాడు.

లస్మయ్య వియ్యంకుని (ప్రక్కనే మంచంలో కూర్చున్నాడు.

''రాంరెడ్డెటుపోయిండు - కనవడుటలేదు'' అన్నాడు కొండ మల్లయ్య, కాబోయే అల్లుణ్ణి ఉద్దేశించి.

''ఏదో కొత్త సినిమా వచ్చిందట. సైకిల్‌మీద కరీంనగర్ పోయిండు. పగటివరకస్తడు'' అంది లింగమ్మ.

''లగ్గం లగ్గమని తొందరపడ్తివిగద... వచ్చే పున్నం పోయినంక రొండోరోజున్నదన్నడయ్యగారు''

''ఎగిర్తపడకుంటేంజేసుడు మరి? ఇద్దరూ రెడీగున్నరు! నువ్వు రాకుంటె నేనే రేపు వస్తమనుకుంటున్న. ఈ ఎండకాలంల ఈ కార్యమెల్లిపోతేనే మంచిది. వానలు పడితె మనకసలే తీరదు'' కొండమల్లయ్యతో అని ''ఎందుకయిన మంచిదే ఇక్కడయ్యగారితోని గూడా చూపిస్తాం పా'' అన్నాడు లస్మయ్య.

''నరె, పోదాం పా...'' అని లేచాడు కొండమల్లయ్య.

''ఇప్పుడేడికి పోతుం(డు?'' లోపల్నుంచి వస్తూ అంది లింగమ్మ.

"అయ్యగారి దగ్గరికి పొయ్యస్తం. నేను చాకలి కిష్టయ్యకు చెప్పిపోత. తెల్లకోడిని దొరు కవట్టి కోయించు. జెప్పున కూరండు. పొద్దుపో నియ్యకు" భార్యకు చెప్పి వియ్యంకున్ని తీసు కొని వెళ్లాడు లస్మయ్య. తోవలో ఇంటికెళ్లమని చాకలి కిష్టయ్యకు చెప్పి వెళ్లాడు.

ఎన్ని పోరాటాలు జరిగినా, జరుగుతున్నా గ్రామాల్లో ఇంకా పాత అవశేషాలు ఉన్నాయి. ఇప్పటికీ చాకలివాళ్లు ఇంటికొచ్చి కోళ్లను, గొర్రె లను కోసిపెట్టడం, ప్రతిగా వాటి కాళ్లు, తలకా యలు తీసుకెళ్లడం - మంగలివాళ్లు ఇండ్లకొ చ్చి క్షవరాలు చేయడం దాదాపు అన్ని గ్రామా ల్లో వున్నాయి. బీడీలు చేయడంలాంటివి గృహపరిశ్రమగా కొన్ని గ్రామాల్లో వుండి కొంత పారిశ్రామికీకరణ జరిగినా చాలా గ్రామాల్లో కులవృత్తులు చెక్కుచెదరకుండానే వున్నాయి. చదువుకున్నవాళ్లలో అన్నికులాలవాళ్లు ఉద్యో గాలు దొరికితే చేసేవాళ్లు చేస్తున్నా ఊళ్లలో ఉన్నవాళ్లు పాతవృత్తులే చేసుకుంటున్నారు.

నగునూరు అయ్యగారు కూడా అదే ముహూ ర్తాన్ని నిర్ణయించాడు. వియ్యంకులిద్దరూ తృ ప్తిగా తలలూపి ఇంటికొచ్చారు. వాళ్లు వచ్చేస రికి కోడికూర కుతకుత ఉడుకుతోంది. కమ్మటి వాసన బయటకొస్తోంది. కూరుడుకగానే ఇద్ద రూ భోజనాలు చేశారు. భోజనం అయిపోగానే వెళ్లిపోతానన్నాడు కొండమల్లయ్య. తెల్లవారిపో వచ్చుని బావ బలవంతం చేస్తే ఉండకతప్పలే దతనికి.

మార్నింగ్‌షో చూసి మధ్యాహ్నం మూడు గంటలకు ఇంటికొచ్చాడు రాంరెడ్డి. మామను చూసి నవ్వి పలుకరించాడు. సాయంత్రం వియ్యంకుడికి విందుచేశాడు లస్మయ్య. అను ములు, మొక్కజొన్నలు కలిపి గుడాలు (గుగ్గి ళ్లు) వండింది లింగమ్మ. ఉల్లిగడ్డతరిగి, నూనె, మిరప్పొడి కలిపుంచింది. నాలుగు బుడ్ల తెల్ల కల్లుతెప్పించాడు లస్మయ్య.

కొండమల్లయ్య, రాంరెడ్డి, లస్మయ్య అరుగు మీద పీటలమీద కూర్చున్నారు. వాళ్ల ముందు న్న గిన్నెల్లో గుడాలున్నాయి. ప్రక్కన గాజుగ్లాసు లున్నాయి. గ్లాసుల్లోకి కల్లువంచాడు లస్మయ్య.





గుడాలు తింటూ, కల్లు తాగుతూ వియ్యంకులి ద్దరూ మాట్లాడుకుంటున్నారు. రాంరెడ్డి తింటూ వాళ్ళ మాటలు వింటున్నాడు. లింగ మ్మవాళ్లకు కొంచెం దూరంలో కూర్చొనుంది.

"వరదక్షిణ గురించి తెల్లగోలుగ (స్ప ష్టంగా) మాట్లాడుకోవాలె" అన్నాడు లస్మయ్య.

"ఇంక మాట్లాడుటానికేముంది...? ఇదువర కే అన్నయిపోయె. దేవుడు మన్నిస్తె ఎప్పుడో లగ్గమయిపోయేదేనాయె. మన మేమన్న దూర పోల్లమా కిరికిరిలు పెట్టుకుంటానికి"

"దుతపొల్లం కాదుగని అన్ని తెల్లగోలు గుండాలె"

"ఇరవైవేల కట్నానికొప్పుకుంటి. నాలుగు నెల్ల కిందనే ఐదువేల వరపూజగడితి. మీరు గూడ ఆకుపోకలు (వధుపూజ) పెడితిరి. ఇంకేమన్న కావన్నా?" అన్నాడు కొండమల్ల య్య.

"వాటి సంగతిగాదు నేను చెప్పేది. నీ అల్లుడు రేడియో గడియారం, సైకిల్ కొనియ్యా మంటండు. పెండ్లిల రెండు మంచి డ్రెస్సులు కుట్టియ్యమంటండు. తల్లిచీర మంచి పట్టు చీర దేవాలె" అన్నాడు లస్మయ్య.

"భలేటోనివే బావ... ఆనాడు ఒక్క గడియా రమిచ్చుటానికి ఒప్పుకున్న. రేడియ, సైకిల్ వడ్డికిందికా?" నవ్వుతూ అన్నాడు కొండమల్ల య్య.

"నాకేమెరుక మీ అల్లున్నడుగు"

"అవు రాంరెడ్డి... మీ నాయిన్న చెప్పినయి కావలన్నవా?"

"అందరిండ్లల్ల రేడియోలు, సైకిల్లున్నయి గద... పెండ్లిలో కాకుంటె ఇంకెప్పుడు పెడుత రు?" మెల్లగా అన్నాడు రాంరెడ్డి.

"అవ్వన్ని ఇప్పుడెక్కడెల్లుతయి. నానుంచి గాదు"

"ఎవ్వలకిత్తన్నవు తియ్యలేవోయ్... నీ బిడ్డకు, అల్లునికేకద... నీ సైకిల్ నేనేం ముట్టు కోను తియ్యి. అలుగపోయిన కట్నం కిందికి రేడియ కొనియ్యి. సైకిల్దేమున్నది? ఓటి కొని య్యలేవు... బాగ పీసుకం (పిసినారితనం) చెయ్యవడితివి" అన్నాడు లస్మయ్య ఖాళీ అయిన వియ్యంకుడి గ్లాసులో కల్లుపోస్తూ.

"అవు బావ... మాటలు చెప్పుటానికేంది

మా చెప్పచ్చు. ముద్దినాది గాకుంటె పట్నందాక దేకుమన్నడుట నీ అనుంటోడు. సరె తియ్యి... ఎట్లనన్నజేసి దీపావళి వరకన్ని ముట్టజె ప్పుత'' అన్నాడు కొండమల్లయ్య.

''ఇంకోటి మరిసిపోవద్దు... పొల్లగాండ్లిద్దరు ఎదిగున్నరు. కాళ్లగోల్లు (శోభనం) వేరెచేసుడు కలువది. మునుముల మునుమని ఇది గూడ ఎల్లదీస్తె ఐపోతది. పట్టెమంచం, పరుపు, బట్ట లు, కాళ్లగోళ్ల కట్నాలన్ని తయారుజేసుకో'' కల్లు తాగుతూ అన్నాడు లస్మయ్య.

''నీకేంది మా చెప్పుతవు. మోసెటోని కెరుక కావడి బరువు. అన్నొక్కసారే నెత్తిమీద పడి మొనమర్లకుంటాయెటట్టున్నది. ఇప్పుడే నడి పోడు బాయిపనికి పోతనని పోరుపెడుతండు. వానికి పైసలియ్యంది ఊరుకునేటట్టులేడు. ఎట్లెల్లుతదో ఏమొ? అంత అగులు బుగుల యితంది''

''ఫికరెందుకు జేస్తవు బావ? అదే ఎల్లుద్ది. శుభకార్యాలకు తలో చెయ్యేస్తరు. ఏది తట్టుకో దు కని లగ్గంల మాట రాకుంట చూసుకో. నేను మొదలే కరాకండి మనిషిని'' సానుభూతి చూపెడుతూనే ఖచ్చితంగా చెప్పాడు లస్మ య్య.

''అంతట బావేకని వంగతోటకాడ అనద్దన్న ట్టున్నయి నీ మాటలు. నలుపదేండ్లువట్టి చూ స్తన్న నీ సంగతి నాక తెలువదా? నేను పెట్టేటి యన్ని ఖచ్చితంగ అడుగుతున్నవు. మంచిదే కని నువ్వేం బెడుతవో చెప్పకపోతివి. నా బిడ్డ కేం నగలు చేయిస్తవో చెప్పు?''

''ఇదువరకనుకున్నయే కద. తులం కడెం, చెవులకుపోగులు, కాళ్లకు వెండి కడాలు. పుస్తె లుండనే వుండె''

''ఇయ్యాల్ల రేపు కాళ్ళకు వెండి కడాలు ఎవ్వ లు పెట్టుకుంటలేరు. పట్టగొలుసులు చే యించుండ్రి''

''కాళ్ల కడాలయితె గట్టి మాలాయె. పట్టగొ లుసులు రాత్రిపోతయి. మోటు కష్టం జేసెటో ల్లకు పట్టగొలుసులెందుకుచెప్పు బావ?'' అన్నాడు లస్మయ్య.

''కాంతవ్వ పట్టగొలుసులే కావన్నంటుంది''

''సరె అది పట్టువట్టినంక వద్దనుడెందుకు? పట్టగొలుసులే చేయిస్తం తియ్యి'' అంది లింగ మ్మ వాళ్ల గిన్నెల్లో మరికొన్ని గుడాలుపోస్తూ

''బాజ తెప్పిద్దామా? డప్పుల్తోనే వెళ్లదీ ద్దామా?'' అన్నాడు కొండమల్లయ్య ఖర్చు తక్కువ చేయాలన్న ఉద్దేశ్యంతో.

''మీ అల్లున్నే అడుగు. ఇయ్యాల్లరే పెవ్వల న్న డప్పుల్తోని లగ్గాలు చేసుకుంటండ్రా? కైకిలి (కూలి) చేసుకునేటోడు గూడ బాజలే కావ ల్నంటండు'' అన్నాడు లస్మయ్య.

''కనుకుల దూదేకులోల్లది మంచి బ్యాండు మేళం. వాళ్లయితె మంచిగ వాయించుతరు'' అన్నాడు రాంరెడ్డి.

''వాళ్లది పెద్ద బ్యాండుగద. వెయిలడుగు తరు. చిన్న బాజయితె సరిపోదా?'' అన్నాడు కొండమల్లయ్య.

''వాళ్లే కావాలె'' పట్టుబట్టాడు రాంరెడ్డి.

''నాదేం బాయె. ఖర్చు చెరిసగమేనాయె. వాళ్లనే మాట్లాడుదాం తియ్యి'' అన్నాడు కొండ మల్లయ్య.

''లగ్గమాన్నేకద! పున్నం తెల్లారి మీరొచ్చి పిల్లగాన్ని తీసుకపోతరు అంతేకద?'' అన్నా డు లస్మయ్య.

''కొత్తగచెప్పవడితివేంది? మన కాపుదన పిండ్లల్ల లగ్గం ఆడుపిల్ల ఇంట్లగాకుంటె ఎక్క డయితది. ఎంత ఖర్చయిన మంచిదె అక్కన్నే చేస్త'' అన్నాడు కొండమల్లయ్య.

''ఐదారు రోజులైనంక నేనస్త. అన్ని మాట్లా డుకొని బాజకు అడ్వాన్సు ఇచ్చి వద్దామిద్దరం''

''అన్ని రోజులద్దు... రెండుమూడు రోజుల్ల నేరా. ఆల్చెమైతె బాజదొరుకది. అప్పుడు లగ్గా లు బాగుంటయి. ధరలు గూడపెంచుతరు. నువ్వు తొందరగ వస్తె ఇంకేమున్నంటె మాట్లా డుకొని ఖరారు జేసుకోవచ్చు'' అన్నాడు కొండ మల్లయ్య.

''సరే... రెండ్రోజులల్ల వస్తతియ్యి'' అన్నాడు లస్మయ్య.

మాట్లాడుకుంటూ విందు ముగించారు. రాత్రి కోడికూరతో భోజనాలు చేశారు. అర్ధరాత్రి వరకు కష్టసుఖాలు మాట్లాడుకున్నారు. పెళ్లిఖ ర్చులగూర్చి ముచ్చటించుకున్నారు. గత



జీవితం గూర్చి మననం చేసుకున్నారు. ఊళ్లలో వస్తున్న మార్పులగూర్చి చర్చించుకున్నారు. పంటలగూర్చి, రైతు బతుకుల గూర్చి మాట్లాడుకున్నారు.

తెల్లవారకముందే లేచి మొదటి బస్సుకే ఊరెళ్లాడు కొండమల్లయ్య.

★ ★ ★

వైశాఖమాసం... ఎండలు విపరీతంగా వున్నాయి. భూమ్మీద ఒక్క పచ్చగడ్డి మొక్క కూడా లేదు. పొలాలన్నీ నెర్రెలు పాసున్నాయి. బజార్లన్నీ దుమ్ముమయిమై వున్నాయి. పొద్దంతా చెమటలు. రాత్రంతా ఉబ్బరపోత. ఊరుప్రక్కనున్న చేలలో కొడార్లేసి అందులో ఎడ్లని కట్టేస్తున్నారు రైతులు. ఏరుకూడా పూర్తిగా ఎండిపోయుంది. చెలమల్లోనూ నీరు లేదు.

ప్రతి వైశాఖ పూర్ణిమకు ఊళ్లలో పాలేర్లు మారుతుంటారు. పాతరేటుగాని, కొత్తరేటుగాని నిర్ణయిస్తుంటారు. ఇంతకు ముందు ఏళ్ల తరబడిగా పాలేళ్ల రేట్లు, కూలీ రేట్లు ఊరి మోతుబరులే నిర్ణయించేవారు. నెలకింత ధాన్యం జీతంకింద ఇచ్చేవారు. ఏడాదికో గొంగడి, చెప్పులజత, తాగడానికి పొగాకిచ్చేవారు. అదీ గొణుక్కుంటూ, తిట్టుకుంటూనే ఇచ్చేవారు. చాలా ఏళ్లుగా రేట్లలో ఏ మార్పు లేకుండానే కొనసాగేవి. కాని ఐదారేళ్లుగా ఆ ప్రాంతానికి అన్నలొస్తున్నారు. వాళ్ల ప్రభావం గణనీయంగానేవుంది. నాలుగేళ్లుగా కూలిరేట్లను, పాలేళ్ల జీతాలను అన్నలే నిర్ణయిస్తున్నారు. వాళ్ల ప్రభావంతో పాలేర్ల జీతాలు, కూలిరేట్లు పెరిగాయి. ఆరోజు రేట్లు, జీతాలు నిర్ణయించడానికి అన్నలొస్తున్నారన్న వార్త రైతులందరికీ తెలిసింది.

కరకరపొద్దెక్కింది. రాత్రింబవళ్లు పనిచేస్తూ పెళ్లి పనులతో కొండమల్లయ్య అలసిపోయున్నాడు. ఎంత చేసినా ఇంకా మిగుల్తూనేవుంది.

రాత్రి మిగిలిన చలన్నముంటే బాగా ఆకలిగా వుండటం వల్ల తిన్నాడు కొండమల్లయ్య. చావడి దగ్గరికొచ్చే అన్నల దగ్గరకు పోవాలనుకుంటూ మంచంలో కూర్చున్నాడు. కొండమల్లయ్యకు ఇదువరకు పాలేరున్న రామయ్య అతని దగ్గరికొచ్చాడు. అతని ముఖంలో సంతోషముంది. ఏదో దొరికినవాడిలా సంబరపడిపోతున్నాడు. రామయ్యను జూచి కొండమల్లయ్య...

"ఏంర రామయ్యా... బాగ ఖుషీగున్నవు?" అన్నాడు.

"మనూరికి అన్నలస్తుం(డ్రు)గాదు పటేల"

"అయితె గంత సంబరమెందుకురా?"

"మా జీతాలు పెరుగుతయి"

"జీతాలు పెంచుకొని ఎవుసాలు మూలవడెటట్టు చెయ్యిండ్రి... ఇదువరకే సగంమూలకు పడ్డయి"

"భూమి పండాలెకాని మాకిస్తె పోతదా పటేల?"

"ఏం పండుడురా? నువ్వు జూస్తలెవ్వా? పాలేర్లను పెట్టుకున్నోలకు అల్లకు కొలుసుటానికే సరిపోతలెవ్వు... పెట్టుబడులు వెళ్లుడే కష్టం గావట్టె"

"అవు పటేల... మీరు జీతాలు కొలుస్తంటె మేం బలిసినమా? వశపడని జీతాలాయె"

"ఓ ఇగ మీరు పంటవండించి మాకు పోత్తంటె కొద్ది బంగలాలు గట్టినమా? మీరు జెయ్యవట్టే మేం బతుకుడాయె"

తమ ఆస్థితులకు ఒకర్నొకరు కారణాలుగా చూపెడుతూ నిందించుకుంటున్నారు వాళ్లు.

"వ్యవసాయం జేస్తే మాకు పాలేరు జీతమన్న వడుత లేదుగాదుర... ఇంతకంటె కూలిజేసుకునుడు నయం"

"కూలీలు పెరుగుతనే ఇట్లయితందంటవా పటేల...?"

"లేకుంటేందిర మరి? అటు కూలీలు, ఇటు పాలేర్ల జీతాలు వశం గాకుంట పెరుగవట్టె... మిగిలేది అల్లికల్లి సున్నకు సున్నే నాయె. పెద్ద వ్యవసాయదార్ల సంగతేమో కాని నా అసొంటోనికైతే చావే వచ్చింది"

"అన్నలతోని చెప్పుకో"

"చెప్పుకోకుంటె భయమా? కాని అల్లకు మీరే కావాలె... మాగురించి పట్టిచ్చుకోరు. సరె గని రామయ్య ఎందుకోవస్తివి?" అన్నాడు





కొండమల్లయ్య.

"మా పటేలుది నాగటిపాలె విరిగిపో యింది. మీ దగ్గర కట్టెగిన ఉన్నదేమొ అడిగి రమ్మన్నడు" అన్నాడు రామయ్య.

"లేదు... మొన్ననే ఒక్కటుంటె చే యించిన. చినుకు పడ్డదంటె ఇగ నాగలవుస రమే కద"

"సరె పటేల... కచ్చీరు (చావడి) కాడికిరా"

"ఇంక రాలేదు గదాల్లు... కొద్దిగాగివస్త" అన్నాడు కొండమల్లయ్య. రామయ్య వెళ్లిపో యాడు.

మంచంలో ఒరిగాడు కొండమల్లయ్య. ఇదు వరకెప్పుడూ లేనంతగా నాలుగైదుఏళ్ళుగా ఊళ్లోవస్తున్న మార్పులను మననం చేసు కుంటున్నాడు. అన్నలు... అన్నలు... అన్నలు... వాళ్లలోనే కలిసి తన పెద్దకొడుకు చనిపోయా డు. వాళ్లను అన్నలనిపిలవడం, వాళ్ల పనులా తనికి విచిత్రంగా కనబడుతున్నాయి.

అన్నలు... అన్నలని పిలువబడేవాళ్లు తమ్ములుకూడా కారు. తన కొడుకులంత వయ సున్న యువకులే చాలామంది. మీసంకట్టు అప్పుడప్పుడే మొలుస్తున్న వాళ్లే ఎక్కువ. కాని ఏంత విచిత్రం? వాళ్లు ఊళ్లలోకి రావడం మొదలయింతర్వాత దొరల జులుం తగ్గింది. కొన్ని ఊళ్లలో దొరలు ఊళ్లే వదిలిపెట్టి వెళ్లిపో యారు. అరే ఒరే అని పిలువడం, అయ్యా బాంచెను నీగులాపోన్ని అనడం చాలావరకు తగ్గింది. ఊళ్లో వడ్డీరేట్లు తగ్గాయి. ప్రభుత్వోద్యో గుల పెత్తనం రైతులపై మునుపటంతగా లేదు. వాళ్లు కొన్నే అప్పు పత్రాలను చింపివే సారు. ఇలాంటి పనులు సరియైనవో, కావో తాను నిర్ణయించుకోలేక పోతున్నాడు. వాళ్ల ప్రభావం పడింతర్వాత పాలేర్ల జీతాలు పెరి గాయి. కూలీరేట్లు పెరిగాయి. కాని, ఆరేట్లతో తనలాంటి చిన్న వ్యవసాయదారుడు పనిచే యడం కష్టమే. వ్యవసాయాన్ని కొనసా గించడం చాలామందికి భారమవుతుంది. ఆ రేట్ల ప్రకారం స్వంత వ్యవసాయమున్న చిన్న వ్యవసాయదార్లకు రోజు కూలి కూడా గిట్టడం లేదు. ఇంటిల్లిపాదంతా పనిచేస్తే పాలేరు జీతం కూడా పడటంలేదు. కూలీలు, కూలీలనే అన్నలు చిన్న రైతులనెందుకు పట్టించుకోరు? వాళ్లు కూలీనాలి వాళ్ల పక్షమే. తనలాంటి వాళ్లెంత దిగజారిపోతున్నా పట్టించుకోరు. అడ గాలి... వాళ్లనే అడగాలి... వాళ్లకొక్క కూలీలే కావాలేమో అడగాలి... తలదీసి మొలేస్తరా?

తనలోతాను తర్జన భర్జన చేసుకుంటూ కొండమల్లయ్య లేచి నిల్చున్నాడు. రుమాలు చుట్టుకొని ఊరు చావడి దిక్కు నడుస్తున్నాడు.

తన కొడుకు, చేతికెదిగిన కొడుకు, వీళ్లలో కలిసే చనిపోయాడు. ఏం సాధించదలుచుకు న్నారు వీళ్లు? వీళ్లొచ్చింతర్వాత ఊళ్లలో కొంత మార్పొచ్చినా అడుగడుగునా పోలీసుల భయం. తేపతేపకు పోలీసు క్యాంపులు. కాలుక దుపితే భయం. గట్టిగా మాట్లాడితే భయం. రాత్రయితే ఏమవుతుందోనన్న బుగులు. ఎంతమంది తన కొడుకులాంటి యువకులు పోలీసుకాలుపుల్లో మరణించారు? ప్రతి ఊళ్లో ఒకరిద్దరున్నారేమో? అయినా వాళ్లు తమ పనిని చేస్తూనేవున్నారు. వాళ్లుచేసే పనులు మంచివో, చెడ్డవో తనలాంటివాడికి తెలియదు. కాని హత్యలు, కొట్లాటలు, పోలీసు కాల్పులు, అరెస్టులు, హింస, అమాయకులను పోలీసు లు వేధించడం, బాధించడం, ఇవన్నీ ఊళ్లను అల్లకల్లోలం చేస్తున్నాయి. అడుగడుగునా భయాన్ని కల్గిస్తున్నాయి. తనలాంటి వాడికివ న్నీ అవసరంలేదు. తానేంటో? తన పనేంటో? ఇప్పటికే ఓ కొడుకు బలయిపోయాడు. మిగతా ఇద్దరన్నా మంచిగుంటే చాలు.

ఆలోచిస్తూ చావడి దగ్గరకు చేరుకున్నాడు కొండమల్లయ్య. అక్కడ జనం చాలామందు న్నారు. అందులో పాలేర్లు, కూలినాలి చేసుకునే వాళ్లే ఎక్కువ. కొంతమంది రైతులున్నారు. కొండమల్లయ్య అక్కడకు చేరుకున్న కొద్దిసేప ట్లో నలుగురు యువకులక్కడికొచ్చారు. వాళ్లలో ఇద్దరి చేతుల్లో తుపాకులున్నాయి. జనం మధ్యలో నిల్చున్నారువాళ్లు.

"ఈ సంవత్సరం పాలేరు జీతం నాలుగున్న రవేలు. ఆడకూలి రోజుకూలి పదిహేను రూపా యలు. మగకూలి ఇరవై రూపాయలు. ఈరేట్లు పనిలో భేదం వున్నప్పుడే... లేకుంటే ఇద్దరికొకే కూలి ఇరవై రూపాయలు" అన్నాడు తుపాకీ పట్టుకొనున్న ఓ యువకుడు.




పాలేర్లు, కూలిచేసుకునేవాళ్ళు ఆ మాటలు విని సంతోషించారు. రైతులు ముఖం మాడ్చుకున్నారు. మోతుబరులు తామేం మాట్లాడినా వినరని ఏ భావం కనిపించనీయకుండా జాగ్రత్తపడుతున్నారు.

"ఈ రేట్లివ్వడం మానుంచిగాదు... ఇవి చాలా ఎక్కువ"

"ఈ రేట్లు ఇప్పటి ఆంధ్రప్రాంతంలోని రేట్లకంటె తక్కువే. మీరెందుకర్థం చేసుకోరు" అన్నాడు అన్నల్లో మరొకతను.

"కాని అక్కడి, ఇక్కడి పరిస్థితులకు చాలా తేడాలున్నాయన్న సంగతి మీకు తెలుసనుకుంటాను. అక్కడ ఎకరానికి పండేపంటలో సగం కూడా ఇక్కడ పండదు. ఇక్కడ నాలుగెకరాలమ్మినా అక్కడ ఒక్క ఎకరం భూమి రాదు" అన్నాడు ఆ వూళ్ళోని ఓ యువకుడు.

"కావచ్చు... కాని, ఈ రేట్లు ఖచ్చితంగా అమలుజరపాలి"

"ఇగ మేం వ్యవసాయాలు బందు జేసుకునుడే మంచిది... ఇప్పటికే ఎన్నో ఎవుసాలు మూలకు పడ్డయి" అన్నాడోరైతు.

"అది మావల్లకాదు... అందుకు కారణమైన ప్రభుత్వాలను నిలదీసి అడగండి. వ్యవసాయాలు బందు చేయదలుచుకుంటే చేసుకోండ్రి. భూములు లేనివాళ్ళే వాట్ని దున్నుకుంటారు. పాలేర్లకు చాలీచాలని జీతాలిస్తూ కూచొని తినాలనుకోవడం తప్పు... కష్టపడి పనిచేయాలి కామ్రేడ్"

"పని చేసుకోటానికి మేము సిద్ధమేసార్... మాకుద్యోగాలిప్పించండి. మా భూములు మీరే తీసుకోండి" అన్నాడు ఆ ఊళ్ళోని నిరుద్యోగి యువకుడు.

"అది మా బాధ్యత కాదు కామ్రేడ్. నీకీ వ్యవస్థపై అసంతృప్తిగా వుంటే మాతో కలువు. ఉద్యోగాలు ఎందుకివ్వడంలేదని మీ ఓట్లతో పాలిస్తున్న ప్రభుత్వాన్నడుగు"

ఆ యువకుడేం మాట్లాడలేదు... కొద్దిక్షణాలు నిశ్శబ్దం. "అయ్యా! మేము కూచుండి తినేటోల్లంగాదు. నాకుంది నాలుగెకురాల చెలుక నేనే రెండెడ్లతోని దున్నుకుంటున్న. నాకు పాలేర్లు కూడా లేరు. మా ఇంటోల్లమంతా ఆ వనే చేత్తం. అయినా మా కడుపులు నిండుత లేవు. కాని, మీరిచ్చిన కూలి ఇయ్యాలంటె మానుంచిగాదు. మాకు మా పనిల రోజుకూలన్న గిడుతలేదు. అందుకే ఎవుసాలన్ని మూలకు పడ్తున్నయి" అన్నాడింకోరైతు.

"కామ్రేడ్స్! మేం మీకు వ్యతిరేకులంగాదు. కాని, కూలీలెలా బతకాలో మీరే చెప్పండి? ఈ రేటు ప్రకారమైనా నెలకు నాలుగు వందలు రావడం కష్టం. కూలికి రోజూపని దొరకడం సాధ్యమేనా చెప్పండి. మరీ డబ్బుతో వాళ్ళెలా బతికాలి?"

"మరి మా సంగతేందో చెప్పండి!! మాకు రోజు కూలి కట్టియ్యండి చాలు. అన్ని వస్తువులకు విపరీతమైన ధరలు. మేము పండించిన పంటకేమొ ధరుండదు. మీరు ఇట్లనే చేస్తె మేం అడుక్కతినాలె" అన్నాడు మరో రైతు.

"కూలీలూ మీ సోదరులే. ఒక విధంగా మీరూ కూలీలే. రేట్లు పెరగడంవల్ల వాళ్ళేదో బాముకుంటున్నారని అనుకోవడం తప్పు. మీరు వాళ్లవల్ల నష్టపోతున్నామనుకోవడం పొరపాటు. రైతు ఈ స్థితికి వెనుకున్న శక్తులగూర్చి మీకు తెలియదు. మీ ఈ పరిస్థితికి ముఖ్యకారణం మీ పంటలకు గిట్టుబాటు ధరలు లేకపోవడం. మా పోరాటక్రమంలో అదీ ఓ భాగమే"

"మీరది చేసేవరకు మా చేతులకు చిప్పలస్తయి"

"కోపానికి రావద్దు కామ్రేడ్, మేం చేసేది మీకోసమే"

"మీరెవరికోసం చేస్తున్నరో మాకు తెలుసు. మీకు కూలోల్లే కావాలి. వాళ్ళకోసమే చేస్తరన్ని. మాఅసొంటి రైతులను పట్టించుకోరు. వాళ్ళనే చంకకెక్కిచ్చుకోండి. వ్యవసాయాలన్ని మూలకుపడితే అప్పుడేర్పడుతది" అన్నాడు కొండ మల్లయ్య.

"కోపమద్దు కామ్రేడ్... మేము మీగురించి కూడా ఆలోచిస్తున్నాం. మాకు రైతులు, కూలీలంతా సమానమే"

"మీరందర్ని సమానం జేత్తరుగదసార్! చిన్నచిన్న రైతులను కూడా కూలోల్లనుజేసి, ఎవ్వలకు భూమి లేకుండజేసి అట్ల అందర్ని సమానం జెయ్యండ్రి"

"మీరు మమ్మల్నపార్థం చేసుకుంటున్నారు. గిట్టుబాటుధరలకోసం మేము తప్పకుండా పోరాటం సాగిస్తాం. ఇప్పుడు మాకు టైంలేదు, వెళ్ళిపోవాలి. మేం చెప్పిన రేట్లు అమలుపర చాలి" అన్నాడు తుపాకి పట్టుకొనున్న యువ కుడు. వాళ్ళు అక్కణ్ణుంచి వెళ్ళిపోవడానికి సిద్ధమవుతున్నారు.

ఇంతలో "పోలీసులొస్తున్నారు... పోలీసులొ స్తున్నారు" అని అరిచారెవరో- మెరుపు మెరి సినంత సమయంలో ఆ నలుగురు యువకు లు మాయమయ్యారు. రెండు నిమిషాల్లో పోలీ సు జీపక్కడకు వచ్చింది. జనమంతా చెల్లాచె దురయ్యారు. "వాళ్లను పిల్చుకొచ్చిన వాళ్ళెవ రు? వాళ్ళెక్కడున్నారో చెప్పండి?" అని అంద ర్నీ తరిమితరిమి లాఠీలతో బాదారు పోలీసు లు. ఆ ప్రదేశమంతా హాహాకారాలతో నానా భీభత్సంగా మారింది. కొండమల్లయ్యకూ రెండు లాఠీదెబ్బలు తగిలాయి.

"ఇంట్లో వున్నోన్ని ఉండుక బాగ బల్సి అక్కడకి పోయిన" తనని తాను నిందించు కుంటూ ఇల్లు చేరుకున్నాడు.

అన్నలని పిలువబడే ఆ యువకులకోసం ఇల్లిల్లూ గాలించారు పోలీసులు. కాని వాళ్లు దొరుకలేదు. చివరకు నలుగురు హరిజన యువకులను జీపెక్కించుకొని తీసుకెళ్లారు.

పెళ్లివనుల్లో నిమగ్నమయిన కొండమల్ల య్య 'రైతునాదుకునేటోడెవ్వడూ లేడు' అని నలుమార్లు తనలో తానే అనుకున్నాడు.

వడ్లు మరపట్టించడం అయిపోయింది. పె నలు విసిరి వప్పు తయారు చేశారు. వసువు, పిండి, మిరప్పొడి తయారయ్యాయి. పెళ్లిబట్ట లవీ కొనుక్కొచ్చారు. బ్యాండుమేళం మాట్లా డటం అయిపోయింది. బంధువులందరికీ చె ప్పి వంపించారు. పొయ్యిల కట్టెలు సిద్ధంచేశా రు. ఇక పందిర్లేయాలి. ఆ ప్రయత్నంలోనే వున్నారు.

"బాపూ! గోదావరిఖనిల అన్ని మాట్లాడిన. పైరవికారి మంచోడు దొరికిండు. ఎవరి పేరు మీదో ఎంప్లాయిమెంటు కార్డు గూడ ఉన్నదన్న డు. మూడురోజుల్ల ఆరువేల రూపాయలు గావాలె. ఇంటర్వ్యూకింక వారంరోజులే ఉంది. ఇప్పుడు భర్తీ ఐపోయిందంటె నాలుగైదునెలల దాకుండదు"

చెల్లలి పెళ్ళికోసం ఇంట్లో జరుగుతున్న పనుల గూర్చి ఏం పట్టించుకోకుండానే గోదావ రిఖనినుంచి వస్తూనే తండ్రితో అన్నాడు రాజ య్య.

కొండమల్లయ్య తలపై పిడుగు పడ్డట్ట యిందా మాటలు వింటే.

"చెల్లె పెండ్లయితె కానియ్యి బిడ్డా తర్వాత సూత్తాం"

"అల్లుడొచ్చెదాక అమాసాగుద్దా? ఇప్పుడు భర్తీ ఐపోతే మల్లెన్నటికో? అన్ని కుదిరినంక పుల్ల అడ్డేస్తవెందుకు?" కోపంగా అన్నాడు రాజయ్య.

"ఇంత తొందరయితెట్ల బిడ్డ? ఇంత మెడ లమీద కూసుంటె పైసలేన్నుంచి రావాలె?"

"పెండ్లికేన్నుంచి తెచ్చినవు? ఎట్లయిన బాకే నాయె"

"లగ్గమయె దాకనన్న ఆగలేవు బిడ్డ"

"చెప్పుతెందుకు అర్థంజేసుకోవు బాపు. ఇప్పుడయిపోయిందంటె అటెనుక దొరుకుడు కష్టం. కారటు గూడ తయారున్నది. పైసల్దీసుక స్తనని చెప్పి వచ్చిన"

"ఎవ్వల్లపేరుమీదనో వనికి దిగుతె అటె నుక కిరికిరి గాదా? ఇల్లు పాయె, ముల్లె పాయెనన్నట్టు అయితెట్ల?"

"ఏంగాదు... చదువు, సర్టిఫికెట్లున్న నౌకర్ల సంగతే వేరు. బాయివనిదేమున్నది? చదూరా నోడు ఏపేరుమీద నౌకరికెక్కితేమయితది? గోదావరిఖని బావుల్ల నగానికెక్కోమంది మంది కారట్లమీదనే దిగుతండ్రు. ఎవ్వలకేంకాన్ది మనకేమయితది? కిరికిరిగాదేం గాదు" అన్నా డు రాజయ్య.

"సరె... పైసలు మా తీసుకొస్త.. షావుకారి మునుపటితీరుగ నమ్ముటలేదు. ఎగవెడుత రని భయపడుతండు. ఇంకెవల్లన్న అడిగి తెస్త.

అక్కన్నే వుండి వాళ్ల మాటలు వింటున్న తిరుపతయ్య "బాపూ! ఇప్పటికే చాలా బాకుంది. చెల్లె పెండ్లికి ఇంకింత తీసుకొచ్చి నవు. వంట వండించి బాకి తీర్చుడనేది కాని




పని. అందుకోసం రెండెకరాలమ్మి ఇప్పుడయితె పనిగానిద్దాం. ఇంకా బాకి చెయ్యడం బాగుండదు'' అన్నాడు.

స్వాతంత్ర్యం వచ్చింతర్వాత గాంధీజీ ప్రభావంవల్ల కావచ్చు, పైకులాలవాళ్లు, చాలా కులాల్లోని చదువుకున్నవాళ్ళు, కొందరు వ్యవసాయ కుటుంబాలవాళ్లు కూడా తండ్రిని నాన్నా అని పిలవడంతోపాటు, బాపూ అని కూడా సంబోధిస్తున్నారు. గ్రామాల్లో బాపూ అని పిలవడం కొంచెం పైతరగతి నాగరికతగా భావించబడుతోంది.

తిరుపతయ్యా మాటలు కొండమల్లయ్యాకు రుచించలేదు. ''ఉన్న భూమిలనుంచి రెండెకరాలమ్మితె ఏం మిగులతదిగ? రాజయ్యాకు నౌకరయిందంటె ఆ పైసల్తోని, పంటతోని మెల్లమెల్లగ బాకి కట్టరాదా? భూమెందుకమ్ముడు?'' అన్నాడు కొండమల్లయ్యా.

''నాన్నా! ఇలా అనుకుంటూనే ఐదెకరాలు పోయింది. ఇప్పుడయితె భూమమ్మిదాం డబ్బు కూడితె మళ్లీ కొనుక్కోవచ్చు. డబ్బున్న తర్వాత భూమి దొరకడం కష్టమా? లేకుంటె వడ్డీకి వడ్డి పెరిగి ఏం మిగులకుంటయితది'' అన్నాడు తిరుపతయ్యా.

రాజయ్యా కూడా తమ్ముణ్ణే సమర్థించాడు. కొండమల్లయ్యాకు భూమిని అమ్మడానికి మనసొప్పడంలేదు. ఇప్పుడమ్ముదామంటున్న రెండెకరాల భూమి తండ్రి పంచి ఇచ్చినప్పుడు ఏమంత సారవంతమైందిగా ఉండేదికాదు. దాన్ని సారవంతమైందిగా మార్చడానికి ఎంతో కష్టపడ్డాడు కొండమల్లయ్యా. ఆ భూమిని తన శరీరంలోని భాగంగానే తలచాడు. అక్కడే చాలాకాలం గడిపాడు. అందులో వున్న చెట్లను, కంపను నరికేశాడు. రాళ్లు, రప్ప తీసేశాడు. ఎత్తువంపులను సరిచేశాడు. అందులోకి సారవంతమైన మట్టిని జేరగొట్టాడు. దొరికిన ఎడ్లపేడను అందులోకి విసిరేశాడు. అందులో గొర్రెల మందను పెట్టించాడు. పశువుల మందను పెట్టించాడు. బావి తవ్వించాడు. మోట పెట్టించాడు. రాత్రనక, పగలనక ఆ భూమిని సారవంతం చేయడానికి మట్టిలో మట్టయ్యాడు. ఆ భూమిని సాగుచెయ్యడంలోని శ్రమలోనే ఆనందాన్ని జూశాడు. శ్రమకు సమానమైంది లేదని భావించి పనిచేశాడు. అయినా రెండేళ్ళు అందులో పెట్టిన విత్తనాలు కూడా తిరిగి రాలేదు. అటు తర్వాతే అది ఓతీరున పండటం మొదలయింది.

ఆ భూమితో కొండమల్లయ్యాకెంతో అనుబంధముంది. దానిపై చెప్పలేని ప్రేముంది. దాన్ని అమ్మాలంటే తన శరీరంలోని ఓ భాగాన్నమ్ముకున్నట్టుగానే భావిస్తున్నాడుతను.

''భూమిని అమ్మద్దు కొడుక... బాకీలెట్లనో కడుదాం అటెనుక'' కొడుకులను బుదరకించినట్టుగా అన్నాడు.

''బాపూ! మా మాటలర్థంజేసుకో... నీకు, నీలాంటివాళ్లకు భూమ్మీద ప్రేముండటం సహజమే. కాని, ఇంకా ఆలస్యమయితే మనకేం మిగలదు. మన పరిస్థితి మంచిగయిన తర్వాత మళ్లీ కొనుక్కుందాం'' అన్నాడు తిరుపతయ్యా.

కొడుకులిద్దరూ భూమినమ్మడానికే మొగ్గు చూపుతున్నారు. అతని కడుపునిండా దుఃఖముంది. వాళ్ల మాటలు వింటున్న కాంతమ్మ, నరసమ్మ కనుగుడ్లనిండా నీళ్లున్నాయి. భూమిని అమ్మకుండా ఉండడానికి కొడుకులతో రకరకాలుగా వాదించాడు కొండమల్లయ్యా. కాని వాళ్లు చెప్పే మాటలముందు ఓడిపోతున్నాడతను.

''భూమినమ్ముకుంటె తల్లినమ్ముకున్నట్టురా... కన్న తల్లినమ్ముకున్నట్టురా... తల్లినమ్ముకుంటార్రా... మీరేం మనుమలా?'' కనుగుడ్లనిండా నీళ్లతో ఆఖరి అస్త్రం ప్రయోగించాడు.

కొడుకులిద్దరూ అతన్ని సముదాయించారు. అమ్మకపోవడంవల్ల జరిగే నష్టాలగూర్చి వివరించారు. రకరకాలుగా చెప్పి ఎలాగైతేనేం అతన్ని ఒప్పించారు. భూమినమ్మాల్సి వచ్చిన ప్రతీసారీ అతడు అమ్మకుండా ఉండడానికి రకరకాల ప్రయత్నం చేస్తూనేవున్నాడు. అతని మనసు విలవిల కొట్టుకుంటూనేవుంది. అయినా పరిస్థితులతనితో ఔననిపిస్తున్నాయి. కాని చేతికొచ్చిన ఇద్దరు కొడుకులున్న తర్వాత కూడా భూమినమ్మాల్సిరావడం అతనికి బాధాకరంగా వుంది. అయినా ముందున్న పనులు

గట్టెక్కాలంటే భూమిని అమ్మక తప్పడంలేద తనికి.

'మా కాలపోల్లకు భూమ్మీదున్న ప్రేమ ఇప్ప టివాళ్లకు లేదు. ఏంజేద్దాం' తనలో తానే గొణుక్కున్నాడు కొండమల్లయ్య.

కడుపునిండా తాగి తూలుతూ అక్కడికొచ్చి నిల్చున్నాడు తెనుగు కొమరయ్య. కొండమల్ల య్య భూమిని అమ్మవద్దనడం, కొడుకులు అమ్మాలనడం కొద్దిక్షణాలక్కడ నిల్చొని విన్నా డు.

''కొండమల్లన్నా... నేనొక్కమాట చెప్పుతె వింటావె. అమ్మెయ్, భూమినమ్మెయ్. భూమి లేంపాడయిందే? అమ్మెయ్. నేను భూమినే నమ్మిన. బొక్కలన్నీ కలికలికాంగ పన్జేసిన. మా నాయన మూడెకరాలిచ్చిండు. అండ్ల రొండెక రాలమ్ముడుపోయింది. ఉన్నొక్కెకరంల ఉసికె పెట్టింది. భూమెందుకే? భూమేంజేత్తదే? అమ్మిపారెయ్. నేంజూడు ఎంత మంచిగు న్ననో? కైకిలి చేసుకుంటున్న... దొరికిన్నాడు తింటన్న తాగుతున్న. లేన్నాడు మలునుక పంటన్న. నాకిప్పుడేమన్న రందున్నాదే? భూ ముంటె పెద్దారాటం. అమ్మెయ్, అమ్మెయ్. మనమెంత దుబ్బల దుబ్బయినా భూముల్ద క్కవ్... అమ్మెయ్'' తడబడుతూ, చేతులు తిప్పుకుంటూ అంటూ తూలుతున్నాడు కొమర య్య.

''కొంరయ్యా... నువ్వట్లాగు'' అంటూ అతని దగ్గరకొచ్చాడు తిరుపతయ్య.

''నేనెందుకాగుత... ఆగనే ఆగ... అరే తిరు పతయ్యా! నువ్వు చదువుకున్నోనివిగదా బిడ్డ. నిన్ను రారా అనద్దు. తిరుపతన్నా! అరె రాజ న్నా! భూమమ్మి పారెయ్యంద్రి. మొత్తమమ్మిపా రెయ్యంద్రి. అటెనుక మీ నాయనను గూడ మ్మంద్రి. మీ అవ్వను గూడ అమ్మంద్రి. అమ్ముకొంద్రి బిడ్డ... అమ్ముకొంద్రి... అన్నమ్ము కోంద్రి? అమ్ముకోంద్రి...'' అరుస్తూ, తూలుతూ వెళ్ళిపోయాడు కొంరయ్య.

వాళ్ళిద్దరి హృదయాలు భారమయ్యాయి. కొద్దిక్షణాలెవ్వరూ మాట్లాడలేదు.

కొద్దిసేపయిన తర్వాత కొడుకులిద్దర్నీ తీసుకొని పద్మశాలి మల్లేశం దగ్గరికి పోయాడు కొండమల్లయ్య. పెళ్లికోసమని డబ్బు ఇంతకు ముందు అతనిదగ్గరే తెచ్చాడు. తన భూమిని అమ్మదలుచుకున్న విషయం గూర్చి చెప్పాడు. 'పిలిచి పిల్లనిస్తానంటే కులం తక్కువ' అన్న ట్టు అవసరానికి భూమమ్ముతాననేసరికి తక్కువ ధరకడిగాడు మల్లేశం. అయినా అవ సరం తనది కాబట్టి ఒప్పుకోక తప్పలేదు కొండ మల్లయ్యకు. మిగతా విషయాలు పెళ్లి తర్వాత పూర్తిచేసుకోవచ్చని, మల్లేశందగ్గర తనకవసరమున్న డబ్బు తీసుకొని కొడుకులతో ఇంటికొచ్చాడు కొండమల్లయ్య.

తెల్లారి రాజయ్య చేతిలో ఆరువేలుంచి- ''కోడల్ను తీసుకొచ్చి ఇక్కడుంచిపో... పనులు న్నయి. నీకక్కడ ఎన్నిరోజుల పనుంది? పెండ్లి వరకన్న వస్తవా? రావా?'' అన్నాడు.

''చెల్లి పెండ్లింక ఎనిమిది రోజులుంది గద..? ఐదురోజులకే నా ఇంటర్యూ. అదయి పోంగనే వచ్చేస్త. మిగతా పనులు పైరవికారే చూసుకుంటడు'' అని డబ్బు తండ్రికే తిరిగి యిచ్చి అత్తగారింటికెళ్లాడు రాజయ్య. సాయంత్రంవరకు భార్యను తీసుకొచ్చి ఇంట్లో దిగవిడిచి డబ్బు తీసుకొని గోదావరిఖనికి వెళ్లి పోయాడు.



జ్యేష్ఠమాసపు వెన్నెల పిండారబోసిన ట్లుంది. ఇంకా వర్షాలు పడలేదు. అరుగుమీద తడుకచాటుకు పడుకొని రాజయ్య, లక్ష్మిలు గుసగుసలు మాట్లాడుకుంటున్నారు. లక్ష్మికి చాలా సంతోషంగా వుంది. వాకిట్లో ఓ మంచంలో నర్సమ్మ, మరోమంచంలో తిరుపత





య్య కొండమల్లయ్యకిరువైపులా పడుకున్నారు. నరసమ్మ గాఢనిద్రలో వుంది. కాంతమ్మ అత్తగారింటికెళ్లిపోయింది. పెళ్లికార్యక్రమాలన్నీ ముగిసిపోయాయి. ఇల్లునింకా పెళ్లికళ వీడలేదు. ఉబ్బరపోస్తోంది. దోమలు సంగీతం పాడుతున్నాయి. కొండమల్లయ్యకు నిద్ర పట్టడంలేదు.

కూతురు వెళ్లిపోయి ఆమె ఓ యింటిదైనందుకాతనికి సంతోషంగానే వుంది కాని పెళ్లిలో జరిగిన కొన్ని సంఘటనలాతనికి బాధకలిగిస్తున్నాయి. వాట్నింకా మరిచిపోలేకపోతున్నాడు.

కాంతమ్మ ఆడబిడ్డలకోసమని కొన్న చీరలు ఖరీదైనవి కావని, వీటిని గతిలేనివాళ్లు కూడా కట్టుకోరని గొణిగారు. ఎంత బ్రతిమిలాడినా వినక చీరలను విసిరిపారేశారు. ఇద్దరాడబిడ్డలకు చెరో రెండువందలిస్తేకాని ఊర్కోలేదు. తన చెల్లిలికి, పెళ్లి చీరగా ఐదువందల రూపాయలు పెట్టి మంచి చీరే కొన్నా మెచ్చలేదు. తనకు చెల్లెలే అయినా వియ్యంకురాలైందన్న గర్వంతో తన మాటనేమాత్రం లక్ష్యపెట్టలేదు. తాను తన కూతురుకోసం కొన్న బిందె, తాంబూలం, కొప్పెర, స్టీలుపళ్ళాలు, చెంబులు ఏవీ బాగాలేవన్నారు. అల్లుడికి అలకకట్నంగా ఇదువరకున్నవే కాకుండా మరో అరతులం బంగారమడిగారు. తాను ఇవ్వలేనన్నాడు. రాంరెడ్డిని లేవనీయలేదు తన వియ్యంకుడు. గంటలసేపు బ్రతిమిలాడినా విన్లేదు. గొడవ జరిగింది. అయినా చివరకొప్పుకోక తప్పలేదు. పెళ్లినాడు పెద్దపెద్దవి మూడు గొర్రెలు కోసినా సరిపోలేదని గొణిగారు. అందరికి మాంసం సరిగా రాలేదని, చివరివాళ్లకు పులుసే మిగిలిందని దెప్పిపొడిచారు. ఇంకా ఇలాంటివే గొడవలయ్యాయి. బాగా తిని ముఖం మాడ్చినట్టు చేశారు వాళ్లు. భూమమ్మితె వచ్చిన డబ్బంతా రాజయ్యకివ్వగా మిగిలింది ఖర్చయింది. ఇంకా చిల్లర చేబదుళ్లయ్యాయి. అయినా చల్లి తిన్నమ్మకు మగనాక లేమెరుక? ఎద్దు పుండు కాకికేం ముద్దు? మగపెళ్లివాళ్లకు తన బాధలెందుకు తెలుస్తాయి? తెలిసినా ఖాతరెందుకు చేస్తారు. తాను పిల్లనిచ్చినవాడు కాబట్టి వాళ్లకు లోకువే. అయినా తానుమాత్రం తక్కువ చేశాడా? తన కొడుకు పెళ్లిలో తన వియ్యంకుడిలాగే తానూ చేశాడు. ఏదైనా తనదాకా వస్తే కాని తెలియదంటారు. తమ ఇళ్లలో ఇంతే. పెళ్లన్న తర్వాత చిన్న చిన్న గొడవలు రావడం మామూలే మింగమెతుకు లేకున్నా మీసాలకు సంపెంగ నూనె అన్నట్టు పెళ్లి ఖర్చులవీ బాగానే వుంటాయి. ఇంట్లో ఏం లేకున్నా మంది చూడటానికైనా ఖర్చుచేయాలి. ఇంకా నయం. కల్లుతో విందుచేయడం మాట్లాడుకోలేదు. ఇంతకుముందు పెళ్లిళ్లలో తప్పకుండా కల్లుగుడాల విందుండేది. కల్లు తాగింతర్వాత ఒకర్నొకరు తిట్టుకునేవారు. తనకు తక్కువయిందని, కొందరికెక్కువయిందని పెళ్లిలో పక్షపాతం చూపారని గొడవలు పెట్టుకునేవారు. కొన్నిసార్లు కులతప్పులనీ పంచాయతులు కూడా జరిగేవి. ఈమధ్య పెళ్లిళ్లలో కల్లు పోయించడం దాదాపందరూ మానుకున్నారు. అంతగా అలవాటున్నవాళ్లు తామే తాగొస్తున్నారు. లేదా దగ్గరివాళ్లు తీసుకెళ్లి తాగిస్తున్నారు.

పల్లకీని మోస్తూ చాకలివాళ్లు పరుగెత్తడం, వాళ్ల వెనుక ఎడ్లబండ్లు పరుగెత్తడం ఉండేది. బండ్లు ఒకరికంటె ఒకరు మించి తోలడం, పైబట్టడం, ఉత్సాహంగా పరుగులెత్తించడం పెళ్లినవార్లలో జరిగేవి. ఒక్కోసారి ప్రమాదాలూ జరిగేవి. అదేం చిత్రమోగాని చాకల్లు పల్లకీ మోస్తూ ఎంత మంచి ఎడ్లుకైనా అందకుండా పరుగెత్తేవారు. గడకంబల్లు తాగేవాళ్లకు అంత బలం ఎక్కన్నుంచి వచ్చేదోమరి? పెళ్లిళ్లంటె ఎంత ఉత్సాహం? ఎంత సంబరం? పెళ్లినవార్లంటే ఎంత పట్టుదల? ఇప్పుడవన్నీ పోయాయి. రాడికల్లు రావడం మొదలైన తర్వాత చాకల్లు పల్లకీ మోయడం బంద యింది. అయినా ఇప్పటి పిల్లలు పల్లకీల్లో పెళ్లి చేసుకోవడాన్కి ఒప్పుకోవడంలేదు. దుమ్ము, ధూళి పడుతుండగా మైళ్లతరబడి నవాగుబండ్లలో పెళ్లిళ్లకెళ్లడానికి ఎవరూ ఇష్టపడడంలేదు. జీపులు, బస్సులు మాట్లాడుకుంటున్నారు. తన కూతురు పెళ్లి కూడా జీపుతోనే అయింది. అదో ఖర్చు అనవసరంగా.

తమలాంటి కాపుదనపు కుటుంబాల్లోనే ఇలా వుంటే చౌదర్లని పిలువబడే రెడ్ల కుటుంబాల్లో ఆడంబరాలు మరీ ఎక్కువ.

పెళ్ళిళ్ళాంటి శుభకార్యాలకు మరీ ఎక్కువ ఖర్చుచేస్తారు. అప్పుచేసైనాసరే పప్పుకూడు తినాలన్నట్టు చేస్తారు. రెడ్లకు ఎంతెంత ఆస్తులుండేవి? ఎన్ని భూములుండేవి? అన్నీ అమ్ముకున్నారు. కూచోని తింటే కొండలు కూడా తరుగుతాయన్నట్టు ఒక్కొక్కటి అమ్ముకొని తింటే ఏమవుతుంది? వాళ్ల ఆడవాళ్లు పెద్దింటి ఆడపడుచుల్లా ప్రవర్తిస్తారు. వాళ్లు తింటూ, తాగుతూ, పేకాడుతూ కాలంగడుపుతారు. చాలామంది ఉన్న భూములను కూడా సేద్యం చేయించుకొని దక్కించుకోలేకపోయారు. ఇంతకష్టపడితే తనలాంటివాళ్లకు మాత్రమేం మిగిలింది? అదంతె...

పెళ్లిలో జరిగిన గొడవలను మరిచిపోలేకపోతున్నాడు కొండమల్లయ్య. గతాన్ని నెమరువేసుకుంటున్నాడు. తన స్వంత బావ, స్వంత అక్కే అయినా వాళ్లు ప్రతిదానికీ అంత ఖచ్చితంగా ఉండటమాతనికి బాధగా వుంది.

ఇంకా తమ కులంలో నయం... పద్మశాలి కుటుంబాల్లో పట్టింపులు మరీ ఎక్కువ. మాంసం వడ్డించేటప్పుడు ఒకరికెక్కువ, ఇంకొకరికి తక్కువ వచ్చినా గొడవే జరుగుతుంది. తానేం కులంతక్కువవాడా, తనకెందుకు తక్కువేయాలని కోపగించుకుంటారు. అందుకోసం కులతప్పులు, పంచాయతులూ జరిగాయి. అందుకోసం అందరికీ సమానంగా ముక్కలు పడేట్టుగా ఒకే గంటె (గరిటె) తో వడ్డించేవారు. ప్రస్తుతం మునుపట్లా పట్టింపులుండటంలేదు.

ఏదేమైనా తన కూతురు పెళ్లికి తడిసి తడిసి మోపెడయినంతయింది. అయినాసరే, తన తలమీదనుంచి పెద్ద భారం దిగినట్టయింది. ఎదిగున్న బిడ్డ ఇంటిమీదుంటే తనకు బాధగా వుండేది. కాంతవ్వ చక్కగా కాపురం చేసుకుంటూ బ్రతుకుతే తనకంతే చాలు... అల్లుడు మంచివాడే. తన బావ డబ్బుమనిషి. తన చెల్లెలు నోరు కొంచెం పెద్దది. ఏం గొడవలు రాకుండా కాంతవ్వ కాపురం చేస్తే చాలు. అయినా ప్రతి కుటుంబంలో చిన్న చిన్న గొడవలుండనే వుంటాయి. వాళ్లు బాగానే కలిసుంటారన్న నమ్మకం తనకుంది.

కొద్దిరోజుల్లో రాజయ్యకు నౌకరొస్తుంది. మిగిలిన అప్పులు తీర్చి ఉన్న భూమినన్నా దక్కించుకోవాలి. కాని, చదువుకొని నౌకరి లేక మోటుకష్టం చేస్తున్న చిన్న కొడుకుసు చూస్తుంటే తన ప్రాణం తరుక్కుపోతోంది.

అరుగుమీద పడుకున్న ముసలమ్మ మూల్గింది. కొండమల్లయ్య ఆలోచనాస్రవంతికి అడ్డుకట్టపడింది.

''ఏమయిందే అవ్వ ఏమయింది?'' అన్నాడు మంచంలో పడుకునే తల్లినుద్దేశించి.

ముసలమ్మేం మాట్లాడలేదుగాని మూల్గింది.

''ఏంగావాలంటె చెప్పవెందుకు?'' గట్టిగా అన్నాడు.

''ఏంలేదు బిడ్డ... చేయివట్టి కొంచెం లేపు'' అంది ముసలమ్మ.

కొండమల్లయ్య లేచి కూర్చున్నాడు. ''ఏయ్... ఏయ్...'' ప్రక్కమంచంలో పడుకున్న భార్యను పిలిచాడు.

నర్సమ్మ విననట్టూరుకుంది.

''ఏయ్... నిన్నే పిలుత్తుంటె వినవత్తలేదా?'' గట్టిగా అన్నాడు.

బద్దకంగా పక్కకు దొర్లింది నర్సమ్మ.

''ఏంది...?'' పడుకునే అంది.

''అవ్వను అలా తీసుకపో''

నరసమ్మ లేవలేదు.

కొంచెమాగి- ''చెవులినత్తలేవా? లే...'' అన్నాడు గట్టిగా.

''నాకే చాతనయితలేదు. ఈ పీడపాడుగాను... నాకొక్కదానికే ఎందుకు? నేదీసుకపోను'' అంది అలాగే పడుకొని.

కొండమల్లయ్య మరి రెండుసార్లు పిలిచినా ఆమె లేవలేదు. ఇక కొండమల్లయ్యకు లేవక తప్పలేదు. భార్యను తిట్టుకుంటూ అరుగెక్కాడు. తల్లి చేయి పట్టుకుని అరుగు దింపాడు. దూరం తీసుకుపోయాడు. అక్కడామెను కూర్చోబెట్టి మంచందగ్గరికొచ్చాడు. కొంచెంసేపయింతర్వాత తల్లిదగ్గరికెళ్లి చేయి పట్టుకొని నడిపించుకొచ్చాడు. మంచంలో పడుకోబెట్టాడు. తానూ పడుకొన్నాడు.





# పాఠకులకు మనవి

ఇటీవలి కాలంలో న్యూస్‌ప్రింట్ తదితర ముద్రణ సామాగ్రి ధరలు అసాధారణ స్థాయిలో పెరిగాయనీ, ఫలితంగా అన్నిరకాల పత్రికల ప్రచురణ ఖర్చులు అధికం అయ్యాయనీ పాఠకులకు విదితమే.

ఈ పరిస్థితులలో మీ అభిమాన మాసపత్రిక **చతుర** ధర కూడా స్వల్పంగా పెంచటం తప్పనిసరి అవుతోంది. జనవరి *1992* నుండి కేవలం ఒక రూపాయి పెంచుతూ, అందుకు అనుగుణంగా పాఠకులకు మరింత ఆసక్తికరమైన నవలలు మీరు ఆహ్వానించే మార్పులు, చేర్పులతో అందించనున్నామని మనవి చేస్తున్నాం.

**చతుర**

**1992 జనవరి సంచిక నుండి**

**విడిప్రతి వెల రు: 5/-**

**సంవత్సర చందా రు: 50/-**

తల్లిగురించేం చేయాలో కొండమల్లయ్యకు అర్థంకావడంలేదు. ఇప్పుడామెకు మరీ చేతగాకుంటయింది. అతని భార్య అత్తకు సేవలు చేయడానికొప్పుకోవడంలేదు. అతని తమ్ములిద్దరూ తల్లిని పట్టించుకోవడంలేదు. ఐదారు నెలలుగా కొండమల్లయ్య చెల్లెలింట్లో వుంటున్న ఆ వృద్ధురాలు అతని కూతురు పెళ్లప్పుడు ఇక్కడికొచ్చింది. తల్లిగూర్చాతనికి బాధగా వుంది. ఆ సమస్యనేంజేయాలో అతనికి తోచడంలేదు. భార్య ఎంత చెప్పినా వినడంలేదు. తానొక్కతే అత్తనెందుకు చూడాలంటుంది?

''భూమంత మనకొక్కలకే పంచిచ్చిందా?''

''నువ్వొక్కనివే కొడుకువు కాని మీ తమ్ములు కొడుకులు కారా?''

''నువ్వే పుట్టినవు కాని వాళ్ళామెకు పుట్టలేదా?''

''భూమి తీసుకునెటప్పుడు కొడుకులు కాని చూడుటానిగ్గాదా?''

''నేనొక్కదాన్నే ఎందుకు జేత్త...? ఆమె దాచుకున్న ముల్లె నాకియ్యకపోనియ్యి''

ఇదీ నర్సమ్మ వాదన.

పని...పని...పని... రెక్కలు ముక్కలు చేసుకున్నా డొక్కలు నింపని పని... విరామ మెరుగకుండా నేలతల్లికే అంకితమై పని చేస్తున్నా కడుపులైనా నింపని పని. పని రాక్షసి నర్సమ్మలోని సున్నితత్వాన్ని నాశనంచేస్తోంది... స్త్రీ సహజమైన జాలిని తినేసింది. ఆమెను అలా మాట్లాడేలా చేసింది.

కొండమల్లయ్యకు భార్యవాదంలోనూ నిజం కనబడుతుంది. అతని తమ్ములాతనికి జ్యేష్ఠపుత్రుడికిచ్చేభాగం కింద అర ఎకరం భూమివ్వడానికి నానా గొడవ చేశారు. వేరు పడేప్పుడు తల్లిదండ్రులకోసమని రెండెకరాల భూమి తీశారు. తండ్రి మరణానంతరం అతని తమ్ములు బలవంతం చేసి దాన్ని పంచుకున్నారు. తల్లి బతికున్నంత కాలం దాన్ని అలాగే ఉంచుదామని కొండమల్లయ్య ఎంత చెప్పినా విన్లేదు. ఆ భూమి చేతుల్లో కొచ్చేంతవరకు తల్లితో, అన్నతో తియ్యగా మాట్లాడిన అతని తమ్ములు ఆటుతర్వాత తల్లిని పట్టించుకోవడం మానేశారు. చాలాకాలం ఆమె కొండమల్లయ్య ఇంట్లోనూ, అతని పెద్ద చెల్లెలింట్లోనూ వుంటోంది. తన తోటికోడళ్ళిద్దరూ పట్టించుకోకున్నా తానొక్కతే అత్తను గూర్చి పట్టించుకోవడానికాతని భార్య ఒప్పుకోవడంలేదు.

తల్లిగూర్చేం చేయాలో అతనికి తోచడంలేదు. తానుకూడా తల్లిని పట్టించుకోకుంటే ఆమె గతేంకావాలి? తనకు తల్లి, నిజమే. కాని తన భార్య సహకరించడంలేదు. అయినా ఆమెందుకు సహకరిస్తుంది? తోడికోడళ్ళకు లేని ఆరాటం ఆమె కొక్కదానికే ఎందుకుంటుంది? ఆమేం మహాత్మురాలు కాదు. వాళ్ళలాంటిదే తన భార్యకూడా! పోగా తన ఆర్థికపరిస్థితి కూడా బాగేంలేదు. తమ్ముల పరిస్థితి తనకంటే అధ్వాన్నంగానే వుంది. మరి తన తల్లినెవరు పట్టించుకోవాలి? తమకు తల్లే బరువవుతుందా? కనిపెంచిన కన్నతల్లే భారమవుతుందా? అవును నిరంతరం పనిచేయాల్సివుండే తమలాంటి వ్యవసాయ కుటుంబాల్లో పనికిరాని వృద్ధులు భారమే. ఏంటివ్వాళ్ళ తానూ ఆలోచిస్తున్నాడు? తనకు తల్లినుంచుకోవాలనే వుంది. తమ్ముళ్ళు దూరం కొట్టినా పోషించాలనే వుంది. కాని, ఆడవాళ్ల సహకారం లేందెలా సాధ్యమవుతుంది? కాలం పాడుగానెలా తయారయింది? మునుపున్న ఆ ఆప్యాయతలు, ప్రేమలు, అనురాగాలన్నీ పోయాయి. తాను ఉపాయాల ముసలోడి కథ పద్మశాలి మచ్చయ్య చెప్పగా విన్నాడు. చివరి దశలో తన దగ్గర డబ్బుందని నమ్మకం కల్గించాడా ముసలివాడు. తన నెవరు బాగా చూసుకుంటే వాళ్ళకే ఆ డబ్బన్నాడు. అంతకు ముందు నిర్లక్ష్యం చేసిన కొడులాతనికి బహ్మారథం పట్టారు. అతడు చనిపోయిన తర్వాత నిజం తెలుసుకొని తిట్టినా బతుకున్నంతకాలం అతనికి బాగానే గడిచింది. అది కథ. అలా చేయడం సాధ్యమా?

తన తల్లిచేతిలో కొంత డబ్బున్నా బాగుండేది. బెల్లంచుట్టు ఈగల్లా ఆ డబ్బు కోసమైనా కోడళ్ళు ఆమె చుట్టు తిరిగే వారు. చేద్దామని లేకున్నా ఆ డబ్బుకోసమైనా సేవలు చేసేవారు. కాని అమాయకురాలైన తల్లి, పాత కాలపుదైన తన తల్లి డబ్బేందాచుకోలేదు. తన దగ్గరున్న కొద్దిపాటి డబ్బుకూడా ఎప్పుడో కూతుర్లకిచ్చేసింది. తన చేతుల్లో ఏం లేకుండా




చేసుకుంది. అందుకే కోడళ్ళామెను లక్ష్యపెట్ట డంలేదు.

తల్లి సమస్యకు పరిష్కారం గూర్చి ఆలోచిస్తున్న కొండమల్లయ్యకు ఆ రాత్రెంతకూ నిద్ర పట్టలేదు. నిష్ఠురమైనా, తన నెవ్వరేమనుకున్నా సరే తెల్లవారి నలుగుర్లో ఆ సమస్య లేవనెత్తి పంచాయతీ పెట్టాలనుకున్నాడు. తుదకతనికి ఒకే ఒక్క పరిష్కారం తోచింది. ఆలోచిస్తూ రాత్రి ఆలస్యంగా నిద్రపోయాడు కొండమల్లయ్య.

తెల్లవారి చావడి దగ్గర ఊరిపెద్దలందర్నీ జమచేశాడు కొండమల్లయ్య. మునుపట్లా ఊళ్ళో పంచాయతులు సర్పంచ్, పట్వారీ, పటేండ్లు, పెద్దలు మాత్రమే చేయడంలేదు. పట్వారీలు, మాలీ పంటేడ్లు, మునసబులు మాజీలయ్యారు. ఊరి నుంకర్లు మాత్రమలాగే వున్నారు. ఇప్పుడు ఇదువరకు పంచాయతులు చెప్పే పెద్దలతోపాటు యువకులు కూడా పంచాయతుల్లో కూర్చుంటున్నారు. కొన్ని ఊళ్ళలోనైతే వాళ్ళే అన్ని నిర్ణయాలు తీసుకుంటున్నారు. చాలా ఊళ్ళలో పాత పెద్దమనుమలు నామమాత్రంగానే మిగిలారు.

పెద్దగా పని పాటల్లేని కాలమవడం వల్ల చాలామంది ఊరివాళ్ళు పంచాయతీ వినడానికొచ్చారు. యువకులతోపాటు పంచాయతీ పెద్దలు చావడి గద్దెమీద కూర్చున్నారు. కొండమల్లయ్య కిందున్న వేపచెట్టు నానుకొని నిల్చున్నాడు. అతని పక్కనే అతని తమ్ముడు కొండయ్య నిల్చున్నాడు. ఇంకో తమ్ముడు వెంకటయ్య ఇంకా రాలేదు. అతన్ని తీసుకురావడానికి వెళ్ళిన నుంకరి తిరిగొచ్చాడు. అతన్ని చూసిన సర్పంచ్-

''వెంకటయ్యేడిరా...?'' అన్నాడు.

''అన్నం తింటుండు... వస్తనన్నడు'' జవాబిచ్చాడు నుంకరి.

''ఉరికి పొయ్యి తొందరగ రమ్మనుపో... అందరచ్చింద్రు. ఒక్కనికోసం ఇంతమంది చూడాల్నా?'' అని ఓ బూతు సామెతన్నాడు మాజీ పట్వారి. అతనికి మాట్లాడితే ఓ బూతు అనడం అలవాటు. ఈ మధ్య యువకులాతనికి ఎక్కడబడితే అక్కడ బూతు మాట్లాడొద్దని వార్నింగిచ్చారు. అప్పట్నుంచి విచ్చలవిడిగా బూతులు మాట్లాడటం లేదు. ముఖ్యంగా ఆడవాళ్ళున్న దగ్గర మాట్లాడటానికి జంకుతున్నాడు.

నుంకరి పరుగెత్తుకెళ్ళి కొద్దిసేపట్లో వెంకటయ్య నక్కడకు తీసుకొచ్చాడు... ఇద్దరన్నల పక్కనే నిల్చున్నాడతను.

''కొడుకులను కనంగనే ఏమచ్చె? తల్లిని సాదుటానికి నలుగుట్ల వడుతండ్రు నల్లమొకపు గాడిది కొడుకులు. అదేపాటి తింటుంది? బుక్కెడు బవ్వయితె ఐపాయె... ఛీ నీయవ్వ... దాని కడుపున చెడబుట్టిండ్రు. రేపు మీగ్గూడ సాలుంది. ఎడ్లెనుక ముడ్లని మీ కొడుకులు గూడ మీకు ఇట్లనే చేస్తరు. ముగ్గురు కొడుకులున్నరు. అందరు మునలోల్లయితండ్రు. తల్లి కోసం పంచాయితులు పెట్టుకుంటరట పంచాయితులు. ఏం మనుమ్రలా మీరు'' కోపంగా అని ఉమ్మేశాడో వృద్ధుడు.

అన్నదమ్ములు ముగ్గురూ తలలు వంచుకున్నారు.

''ఇంటింటికి మంటిపొయ్యే. ఏం జరిగిందో చెప్పు కొండమల్లయ్య'' అన్నాడు సర్పంచ్.

కొండమల్లయ్య కొంచెం ముందు కొచ్చాడు.

''ఏమయ్యేదేంది? ఎప్పటిచివ్వ ఏనుగుల కన్నట్టే అయింది. మునుపటి పంచాయితప్పుడు మీరేమన్నరు? అవ్వను నన్నుంచుకొమ్మన్నరు. మా తమ్ముళ్ళు నెలకు చెరికుంచెడు బియ్యం, పదిరూపాయలు, యాడాదికో చీరె, రయికె పెట్టాల్నని చెప్పిండ్రు. ఎవ్వడేమిచ్చిండో అడుగుండ్రి. చెరొక్క నెల ఇచ్చిండ్రు. అటెనుకంతే... మీ ఎదురుంగనే ఉన్నరు గద అడుగుండ్రి'' తమ్ములను చూపెడుతూ అన్నాడు కొండమల్లయ్య.

''మీ అన్న చెప్పింది నిజమేనా?'' అడిగాడో యువకుడు.

వెంకటయ్య, కొండయ్యేం మాట్లాడలేదు.

''ఏం సంగతి? మాట్లాడరేంది?''

తలలు వంచుకున్న తమ్ములను చూసి కొండమల్లయ్యకు బాధకల్గింది. ఒకే రక్తం వంచుకుపుట్టిన తమ్ములను పదిమంది పెద్దల ముందు తలవంచుకునేట్టు చేయడం అతని



కిబ్బందిగానే వుంది. తనతో ఒకే కంచంలో తింటూ, ఒకే మంచంలో పడుకుంటూ ఒకే భూమిలో పనిచేస్తూ పెరిగిన స్వంత తమ్ముల ను నల్గురిముందు నిలబెట్టడం అతనికి కష్టంగా తోస్తోంది. అయినా తప్పడంలేదు.

తల్లి... తనను కన్నతల్లి నిజమే. కాని తన తమ్ముళ్ళను కూడా కన్నతల్లామె. అటువంట ప్పుడు తానొక్కడే ఆమెనెందుకు పోషించాలి? తనను తాను ప్రశ్నించుకున్న కొండమల్ల య్యకు తాను చేస్తున్న పని సబబుగానే తోస్తోంది.

"ఏం జెప్పుతరు నల్లమొకపోల్లు? చెప్పుటా నికి మొకముంటెగద?" తమ్ములను చూస్తూ అన్నాడు కొండమల్లయ్య.

అతన్ని కోపంగా చూశారాతని తమ్ములు.

"తల్లి దండ్రులమీద దయలేని పుత్రుడు
పుట్టనేమి? వాడు గిట్టనేమి?
పుట్టలోన చెదలు పుట్టవా? గిట్టవా?
విశ్వదాభిరామ వినరవేమ"

పద్యం చదివి "మీకు కన్నతల్లి బరువై తందా?" అన్నాడొకతను.

"వెంకటయ్యా! అట్ల నాలెముచ్చేనోలె చూ స్తే ఏమన్నది? ఏం సంగతో చెప్పు?" అన్నాడు మాజీపటేలు.

"ఇదువరకియ్యాని మాట నిజమే... ఇప్ప ట్నుంచి తప్పకుండ ఇస్త" అన్నాడు వెంకట య్య మెల్లగా.

"నువ్వేమంటవు కొండయ్య?" ఓ యువకు డడిగాడు.

"నాకు నాపిల్లలే ఎక్కువయితండ్రు. ఆరు గురు పిల్లగాండ్లతోనేనెట్ల ఎల్లదియ్యాలె? అవ్వ మీద ప్రేమలేక కాదుగని ఇన్నిరోజులు వెల్లకి య్యలే. ఇప్పట్నుంచి సరిగ్గనే ఇస్త" అన్నాడు కొండయ్య.

"మీ తమ్ములమాట విన్నవుగద కొండమల్ల య్య? మీ అవ్వను మీ ఇంట్లనే ఉండనియ్యి. మీ తమ్ముళ్ళతోని బియ్యమవీ సరిగ్గా ఇప్పిస్తా. ఏమంటవు?" అన్నాడు సర్పంచ్.

"నేనన్నలే విన! ఇటువంటి పంచాయితులె న్ని సార్లయినయి? వాళ్ళియ్యకున్నామంచిదే నేనొక్కన్నే అవ్వనుంచుకుందామంటె నాగ్గూడ వెల్లుతలేదు. నాభార్యగూడ వింటలేదు. నేనే బియ్యం, పైసలు నావంతుకచ్చినయిస్త. అవ్వ ను తమ్ములిండ్లల్లనే ఉండనియ్యండ్రి"

ఆ మాటలువిన్న మాజీపట్వారి

"మీ అన్న చెప్పినట్టు చేద్దామా వెంకట య్య?" అన్నాడు.

"ఆ పని నా నుంచిగాదు. నా పెండ్లానికెప్పు డు రోగాలే. అదో రోగాలకుప్ప. ఇంట్లపని చేసుడే దానికి చాతగాదు. నా పిల్లలుగూడ అందరు పెద్దోల్లుగాలేదింక. అటు పిల్లల సవ రిచ్చుడు, ఇటు ముసల్దాన్నరుసుకునుడు దాన్నుంచిగాదు. అవ్వ దానిపనది చేసుకునెట ట్టున్న లేకపాయె. అవ్వనిజూసుకుంటో మని మండాలె. నా నుంచి గాదా పని" తన అశక్తత గూర్చి చెప్పాడు వెంకటయ్య.

"కనిపెంచిన తల్లికి చాతగాకుంటయితె మీకు బరువయిపోయింది. ఏం బతుకుల్రా మీయి" అన్నాడు వృద్ధుడు.

"మీరేమన్ననుకోండ్రి... అవ్వనుంచుకును డు నానుంచి గాదు. బియ్యం, పైసలియ్యి మంటె ఇస్త" అన్నాడు కొండయ్య నిర్మొహమా టంగా.

తన భార్య ఆరోగ్యం గూర్చి పాతపాటే పాడాడు వెంకటయ్య.

"అయ్యకు పుట్టిన ముగ్గురు పరమ భాగో తులే అన్నట్టుంది మీకత. మీ పెండ్లాలకు నొయ్యద్దు. మీకు నొయ్యద్దు. మరి ముసల్దే డుండాల్నో చెప్పుండ్రి?" అన్నాడో పెద్దమనిషి.

"కాదే పెద్దనాయిన్న... మాకు అవ్వమీద కోపమా చెప్పు? ఇంట్ల వెల్లక అంటున్న" అన్నాడు కొండయ్య.

"మరయితె ముసల్దాని పీక పిసికి అవ్వ తల పారెయ్యండ్రి" కోపంగా అన్నాడో పెద్దమ నిషి.

అక్కడున్న వాళ్ళంతా రకరకాలుగా మాట్లా డుకుంటున్నారు. కొద్దిసేపు పంచాయతీ పె ద్దలేం మాట్లాడలేదు.

"అయితె ఇప్పుడేం జెయ్యమంటారో చె ప్పండి?" అడిగాడు సర్పంచ్.

"ఏం జేసేదేముంది? అవ్వను అన్నింట్లనే ఉండనియ్యండ్రి. అన్నకు పిల్లలు పెద్దవాళ్ల




యింద్రు... మాకెళ్ళదు. దాని తిండి ఖర్చులకు పెద్దమనుషులు చెప్పినట్టు వింటాం''

వెంకటయ్యా మాటలకు గయ్‌మని లేచాడు కొండమల్లయ్యా

''ఇదువరకొస్తె తాయెత్తుల్ల పెట్టుకున్న మీరిచ్చిన పైసలు! ఇప్పుడొస్తె చెవుల్ల బెట్టుకుంట. నేనొక్కన్నే అవ్వనెందుకు చూడాలె? మీరు పుట్టలేదా దానికి?''

''కొండమల్లయ్యా! అంత కోపమెందుకు? కొంచెమాగు''

''అయితే ఇప్పుడేం చేద్దామంటారు?'' అన్నాడు సర్పంచ్.

''నలుగురున్నదగ్గర న్యాయముంటదనచ్చిన... ఎవ్వలకు నష్టం గాకుండా చూడుండ్రి'' అన్నాడు కొండమల్లయ్యా.

పెద్దమనుషులు తమలో తాము చర్చించుకొని ఓ నిర్ణయానికొచ్చారు.

''మేమిప్పుడు చెప్పబోయేది అందరికి నచ్చుగలదనే మేమనుకుంటున్నం. దీని కెవ్వరు ఎదురు చెప్పొద్దు. ముసలమ్మ నెలకొక్కరింట్లుంటది. అమావాస్యనుంచి, అమావాస్యవరకు నెల. ఏడాదికో చీర కొనాలి ప్రతివాడు... ఎవ్వరింట్లో వున్నప్పుడు వాళ్ళు ముసలామెకయ్యే ఖర్చులన్నీ భరించాలి''

సర్పంచ్ చెప్పిన తీర్పును ఒప్పుకోక తప్పలేదు వాళ్ళకు. తర్వాత ఎవ్వరింట్లోంచి ప్రారంభం కావాలన్నదో చర్చయింది.

''కొండమల్లయ్యా... మొదట్నెల నువ్వే ఉంచుకో'' అన్నాడు మాజీ పట్వారి.

ముసలమ్మ ఆరోగ్యం బాగాలేదు. ఆమె ఏక్షణాన పోతుందో తెలియకుండా వుంది. పోగా వర్షం చినుకుపడితే తీరికలేకుండా పనులారంభమయ్యే కాలమది. అందుకోసం ఆ ముగ్గురూ ఎవరికి వాళ్ళే ఇతర్ల ఇంట్లోంచి ప్రారంభం కావాలని చూస్తున్నారు.

''ఇన్ని రోజులు నాదగ్గరే వుంది. ఇప్పుడు తమ్ముల దగ్గర్నుంచి మొదలు కావాలె'' అన్నాడు కొండమల్లయ్యా.

''నువ్వేమంటావు కొండయ్యా?'' అన్నాడు సర్పంచ్.

''ఓలెక్క పద్ధతనేది ఉండద్దా? మొదలు పెద్దోనింట్లనుంచో, చిన్నోని ఇంట్లనుంచో మొదలు కావాలి. నడిపోన్ని నన్ను మొదలుంచుకొమ్మనుడేం బాగుంటది?'' అన్నాడు కొండయ్యా.

''నీ సంగతేంటి వెంకటయ్యా?'' అడిగాడో యువకుడు.

''నాకంటె పెద్దవాళ్లిద్దరుండగ నేనే ఎందుకుంచుకోవాలె..?''

''భలేగున్నర్రా అన్నదమ్ములు? ఒకన్ని మించినోడొకడు. ఒకడు కాలుకు పెడితె ఇంకొకడు మెడకు పెడతడు. మీలాంటి కొడుకులనెక్కడ జూడలే... ఇటువంటి కొడుకులను కనేబదులు పుట్టినప్పుడే బొండిగె పిసికిపారేస్తే నయం... ఛీ'' కోపంగా అని లేచి నిల్చున్నాడు వృద్ధుడు.

ముగ్గురన్నదమ్ములు తలలు వంచుకున్నారు. ముగ్గురికీ తాము చేస్తున్న పని తప్పనే బాధుంది. కన్నతల్లిని గురించలా బజార్లోపడటం అవమానకరంగానే భావిస్తున్నారు. కాని పరిస్థితులు వాళ్లతో అలా చేయిస్తున్నాయి.

''ఒళ్లో పెట్టుకొని ముద్దుగ పెంచుతె తల్లే బరువైందిప్పుడు ముగ్గురు కొడుకులకు...''

''వీళ్లకు కూడ ముందుంది కాలం...''

''ముసల్దానికి వెనుకముందెవ్వరు లేరు. చేతులింత ముల్లున్నా బిడ్డలు చూసుకునేటోల్లు''

''వాళ్లెందుకు చూసుకుంటరు? సొమ్మెతినేది కొడుకులు. భూములు పంచుకున్నది కొడుకులు. వాళ్లెందుకు చూసుకుంటరు?''

''ఎవ్వల రాతెట్లున్నదోమరి?''

అక్కడున్న జనాలు రకరకాలుగా మాట్లాడుకుంటున్నారు. పంచాయతీ పెద్దలు మరోసారి తమలో తాము చర్చించుకొని లాటరీద్వారా నిర్ణయించాలనుకున్నారు. దానికందరూ ఒప్పుకున్నారు. ముగ్గురన్నదమ్ముల పేర్లను మూడు చిట్టీలపై, 1, 2, 3 నంబర్లను మరో మూడు చిట్టీలపై రాసి ఓ పిల్లవానితో తీయించారు. అలా తీసిందానిప్రకారం కొండయ్యకు మొదటి నంబరు, వెంకయ్యకు రెండవ నంబరొచ్చాయి. గొణుక్కుంటూనే ఒప్పుకున్నాడు కొండయ్యా.

తలలు వంచుకొని భారమైన హృదయంతో

ఇంటిముఖం పట్టారన్నదమ్ములు. నవమాసాలు మోసిన కన్న తల్లిని, స్తన్యమిచ్చి పెంచిన అమ్మను, భుజాలమీదెత్తుకొని త్రిప్పిన మాతృమూర్తిని పంచుకోవాల్సిరావడం వాళ్లకెంతో బాధాకరంగా వుంది. కాని, అనుకూలించని పరిస్థితులు, దినదినం దిగజారుతున్న ఆర్థిక దుస్థితి...

"కలికాలం ఎట్లచ్చింది చూడు..."

ఒకర్నొకరు చూడని కాలమొచ్చె..."

"బహుగ బతికింది ముసలవ్వ... ఇప్పుడు తిండికోసం నెలకో ఇంటికి తిరగాలె..."

"ఎంతయినా ఇది మంచిదిగాదు. కన్నతల్లిని సాదుటానికి ఇన్ని పంచాయితీలా? వాళ్లకు మంచిదేంగాదు"

"ఎవ్వలగతేమయితదో ఎట్ల తెలుస్తది?"

రకరకాలుగా మాట్లాడుకుంటూ ఇండ్లకెళ్లారు జనాలు. తలవంచుకొని ఇంటికెళుతున్న కొండమల్లయ్య మనసదోలా వుంది. చెప్పరాని బాధగా వుంది. ఈరోజు తాము తల్లికోసం ఇలా చేశారు... రేపు తనగతి...? రోజురోజుకు దిగజారుతున్న పరిస్థితులు, దూరమవుతున్న ఆప్యాయతలు తన కొడుకులతో ఇలా చేయించదన్న నమ్మకమేముంది? తాను నెలకో కొడుకింట్లో తినడానికొప్పుకుంటాడా...?

కొండమల్లయ్యలో అనేక ప్రశ్నలు. భారమైన హృదయంతో, కడుపునిండా దుఃఖంతో ఇంటికెళ్లాడు.



కోస్తాప్రాంతంలో వరదభీభత్సం, తుఫాను తాకిడిలాంటి ప్రకృతివైపరీత్యాలవల్ల చేతిదాకా వచ్చిన పంట నోటికిరాక నేలపాలై రైతు విలవిలలాడటం ఎన్నోసార్లు జరుగుతుంది. కోస్తా రైతు సాధారణంగా అతివృష్టి వైపరీత్యం వాతబడుతుంటే రాయలసీమ, తెలంగాణా రైతు అనావృష్టి వాతబడి నష్టపోవడం మామూలు విషయం. నెర్రెలు పోసున్న నేలతల్లిని తడిపే వానచినుక్కోసం తపించిపోవడం రాయలసీమ ప్రజలకు సర్వసాధారణం... నేలపైపడ్డ విత్తనాలు మొలకెత్తి మలమల మాడిపోతుంటే, విలవిల కొట్టుకుంటూ వర్షంకోసం ఎదురుతెన్నులు చూడటం, కనబడని దేవుని ప్రార్థించడం రాయలసీమరైతుకు ప్రతియేడూ జరిగేదే.

పెరళ్లలో, చేల్లలో గుంటకలు కొట్టడం పూర్తి చేసి తొలిపంట సాగడానికై ఎదురుచూస్తున్నారు రైతులు. తొలకరి వర్షాలకోసం కళ్లల్లో వత్తులేసుకొని ఎదురుతెన్నులు కాస్తున్నారు. మృగశిరకార్తె ప్రవేసించినరోజు కొండకెదురు చూసినట్టు చూశారు.

రైతులకు కొన్ని నమ్మకాలున్నాయి. ఇంటిమీద కూచోని కాకి అరిస్తే బంధువులొస్తారని, మృగశిర ప్రవేశించినరోజు చినుకు పడితే ఆ సంవత్సరం మంచి వర్షాలుంటాయని నమ్ముతారు. పంచాంగంలో గోపాలకృష్ణుడు గోవులకాపరిగా వుంటే పశుసంపద ఆ సంవత్సరం వృద్ధిచెందుతుందనీ నమ్ముతారు. మృగశిర రోజు ఒక్క చినుకైనా పడ్తుందేమోనని ఆశించారు. కాని ఉరుము, మెరుపుమాట దేవుడెరుగు ఒక్క చినుకైనా రాల్చకుండానే మృగశిరకార్తె ప్రవేశించింది. రోజులు గడిచినా ఒక్క చినుకు కూడా పడలేదు. మృగశిరలోనే కాలం కలుపుకుంటుందని శాస్త్రి చెప్పిన మాటలు నిజం కాకపోయేసరికి రైతులకాశాభంగమయింది. రోజులు గడుస్తున్నా వర్షాలు లేకపోయేసరికి రైతులంతా నిరాశచెందారు. రైతులంతా కళ్లలో వత్తులేసుకొని ఎదురుచూస్తుండగానే వాళ్లకు నిరాశ మిగిల్చి నామమాత్రానికూడా ఒక్క చినుకైనా రాల్చకుండానే మృగశిరకార్తె వెళ్లిపోయింది. రైతులు నిలవుంచుకున్న పశువులమేత నిండుకుంటోంది. వాళ్ల కళ్లలో నీళ్లు నిండుతున్నాయి. కడుపులో సొద నిండుతోంది. ఇంకా వర్షాలు పడకుంటె పశువులు చనిపోయే పరిస్థితి వచ్చేట్టుంది. కొంతమంది రైతులు వేరేప్రాంతాలనుండి వరిగడ్డి, చొప్ప





కొనుక్కొచ్చుకుంటున్నారు. కంట్లాం జొన్నచొప్ప వందాపాతిక రూపాయలుండేది ఇప్పుడు రెండువందలపైనే ధర పలుకుతోంది. భూములన్నీ నెర్రెలుపాపున్నాయి. పొలాల్లో నామ మాత్రానికి కూడా కొయ్యకాలు లేదు. మూడు నాలుగు వర్షాలు పడ్డా ఒక్క నీటిచుక్క కూడా భూమీమ్మద నిలిచేట్టులేదు. గొర్రెలు, మేకలకు తుమ్మకాయతప్ప మరేమేత దొరకడమూ కష్టంగానే ఉంది. పచ్చదనాన్నీనినట్టుండే గుట్టలపై ఇంచుమించు మొక్క కూడా లేదు. ఆకలితో అలమటించేవాడు పిడికెడు మెతుకులకోసం, కనీసం గంజినీళ్లకోసమైనా అలమటించేవాడిలా వానచినుక్కోసం రైతు ఎదురు తెన్నులు చూస్తున్నాడు.

కొండమల్లయ్యకిప్పుడు రెండెకరాల మాగాణి, ఎకరం పొలం మాత్రమే వుంది. సాయంత్రంపూట చేల్లోకి పోయాడు. ప్రేమగా భూమిని చూసుకున్నాడు. మట్టిని చేతిలోకి తీసుకున్నాడు. ఆశగా ఆకాశంవంక చూశాడు. మేఘాలొస్తున్నాయి. గాలి రాగానే విడిపోతున్నాయి. ఆకాశంపై మబ్బుతునక కనబడితే చాలు అతని గుండె ఆనందంతో కొట్టుకుంటుంది. కాని మరుక్షణమే అతనికి నిరాశ మిగుల్తుంది. వర్షంపడే సూచనలేమాత్రం అతనికి కనబడటంలేదు. ఈ సంవత్సరమైనా సమయానికి వర్షాలువడి పంటలు పండితే బాగుండేదనుకున్నాడు. కొడుకెలాగూ నౌకరికి పోతాడు. ఎంతలేదన్నా నెలకు కొంతైనా డబ్బు పంపుతాడు. పోయిన భూమి ఎలాగూ పోయింది. ఉన్నదన్నా దక్కించుకోవాలని ఆలోచిస్తున్నాడు. ఆలోచిస్తూనే ఆకాశంవంక చూస్తూనేవున్నాడు. మేఘాలు కనబడితే చినుకు పడుతుందేమోనని ఆశపడుతూనేవున్నాడు. కొద్దిసేపు ఆశగా చూశాడు. ఇక లాభంలేదనుకున్నాడు. చేతిలో వున్న మట్టిని నేలపై విడిచాడు.

తొలకరి వర్షాలెప్పుడు కురియాలి? పునాస విత్తనాలెప్పుడేయాలి? మరీ ఆలస్యమయితే పంట సరిగా పండదు. ఆలోచిస్తూ చేలో అటూ ఇటూ తిరుగుతున్నాడు.

అతనిదగ్గర ఇంకో పదిరోజులకు సరిపోయే పశువుల మేత మాత్రమే వుంది. ఇంకా వర్షాలు పడకుంటె తన పరిస్థితెంత ఘోరంగా వుంటుందోనని ఊహించుకుంటూ భయపడుతున్నాడు. తాను పుట్టి బుద్ధెరిగినప్పట్నుంచి, నాగటిపాలె చేతిలో పట్టుకున్నప్పట్నుంచి, నాగేటి చాళ్లకే అంకితమై బ్రతుకుతున్న బ్రతుకు, పడ్డ పాట్లు అతనికి జ్ఞాపకం వస్తున్నాయి. కొడుకు తిరుపతయ్య ఓసారి పేపరు చదివి చెప్పిన ప్రకాశం జిల్లా రైతుల ఆత్మహత్యలు జ్ఞాపకం వచ్చి అతని హృదయం భారమయింది.

రైతుబతుకంతా కష్టాల కడలులే. ఏడాదంతా ఏరోజూ తీరిక దొరకదు. అట్లని ఏరోజూ హాయిగా, సుఖంగా తినితాగింది లేదు. మండుటెండల్లో మాడిపోతూ పనిచేయాలి. కడవలకొద్ది ఘర్మజలాన్ని ధారపోయాలి. రైతు శరీరంపై ఎప్పుడూ చెమటకంపు, పేరుకొనున్న ఉప్పే వుంటుంది. కాళ్లు పగుల్లు దేలి దుబ్బమయమై వుంటాయి. ఎముకలు కొరికే చలిలోనూ ముడుచుకుపోతున్నా పనిచేయకతప్పదు. చాలామందికి కప్పుకోవడానికి చిరుగులువడ్డ గొంగళ్లు తప్ప వేరే లభించవు. చలికి శరీరమంతా పగిలి తెల్లగా బూడిద రాసుకున్నట్టుంటుంది. కుండపోత వర్షాలు పడుతున్నా రైతు నానక తప్పదు. వర్షాకాలంలో బురదలో నాగల్లు దున్నడంవల్లా, కాళ్లెప్పుడూ నానుతుండడంవల్ల పుళ్లుపుళ్లుగా తయారవుతాయి. అయినా పని... పని... పని... ఏకాలంలోనూ తప్పని పని.

తన జీవితాన్ని మననం చేసుకుంటున్నాడు కొండమల్లయ్య. వేసవికాలం తన ప్రతాపాన్ని చూపి, నేలను బీటలువారేట్టుచేసి పోయింతర్వాత వర్షాకాలం ఆగమనం కొరకు వేయికళ్లతో ఎదిరుచూస్తాడు రైతు. ఆకాశంలో ఎంత చిన్న మబ్బుతునక కనబడినా ఆనందపడిపోతాడు. స్వాతి చినుక్కోసం ఎదురుచూసే చకోర పక్షిలా తొలకరి చినుకుకోసం తహతహలాడుతూ ఎరుదుతెన్నులు చూస్తాడు. తొలకరి చినుకు పడిందంటె రైతు హృదయం ఉప్పొంగుతుంది. తొలకరివానతో తడిసిన మట్టివాసన రైతుకెంతో హాయినిస్తుంది. పేదవాడికి పెన్నిధి దొరికినట్టనిపిస్తుంది. కాని చాలాసార్లు రైతు ఏ వర్షంకొరకైతే ఎదురుచూస్తాడో అది సమయానికి పడదు. ఒక్కోసారి

రోహిణి, మృగశిరకార్తుల్లోనే నాలుగైదు వర్షాలు కురుస్తాయి. కాలం ముందుగానే కలువుకుంద న్న సంబరంతో పునాన సాగుతాడు రైతు. ఎద్దుకో నాగలి కట్టి దున్నుతారన్న సామెతగా ఎక్కడ చూసినా చేళ్లనిండా నాగళ్లే. భూమీనిన ట్టుగా నాగళ్లే. రైతు ముఖంలో సంతోషం. 'ఏరువాకా సాగుమురో రన్నో చిన్నన్నా' అని సంబరంగా పాటలు పాడుకుంటూ దుక్కులు దున్నుతాడు. పెనల్లలుకుతాడు. పల్లివిత్తనాలే స్తాడు. మొక్కజొన్న విత్తనాలేస్తాడు. విత్తనాల న్నీ భూమిలో పడగానే వర్షాలు మటుమాయ మవుతాయి. రైతుమీద పగబట్టినట్టుగా నిప్పు లుగక్కుతూ సూర్యుడు బయటకొస్తాడు. మండిపోయే కర్మసాక్షిని చూసి రైతు గిజగిజ లాడుతాడు. ఏంచేయాలో తోచదు. వర్షంకొరకు కనబడని అన్ని దేవుళ్లకూ, కనబడే రాయిరప్పు లన్నిటికీ మొక్కుతాడు. కప్పలకు పెళ్లిళ్లు చేస్తాడు. కప్పతల్లాటలాడతాడు. ఊళ్లో విరాట పర్వం హరికథ చెప్పిస్తారు. సారంగధర బతుక మ్మ పాట పాడిస్తారు. తమ కష్టాలను మొరపె ట్టుకుంటూ వానదేవుడి బతకమ్మ పాట పాడిస్తా రు. వరుణదేవున్ని రకరకాలుగా పూజిస్తారు. అయినా ఫలితం శూన్యం. నేలపైపడ్డ ప్రియ మైన విత్తనాలు సరియైన పదును (తడి లభించక సరిగా మొలకెత్తవు. మొలకెత్తిన విత్తనాలు ఎండకు మాడిపోతాయి. వాడిపో తాయి. వాడిపోయి రాలిపోతున్న లేత మొక్క లను చూసి ఆవేదన చెందుతాడు రైతు. గుడ్ల నీళ్లు కుక్కుకుంటూ, కడుపు తరుక్కుపో తుంటే చేసేదేంలేక మౌనంగా రోదిస్తూ నిస్సహా యంగా చూస్తూంటాడు. ఇలా లెక్కకు మించి నన్నిసార్లు జరిగింది.

వేసిన విత్తనాలు భూమిపాలయిపోయి నాశ నంకాగా తిరిగి వర్షాలు పడేసరికి రైతుదగ్గర విత్తనాలుండవు. రైతుల అవసరాన్ని గ్ర హించిన షావుకార్లు ధర రెండింతలు పెంచి విత్తనాలిస్తారు. కొందామంటే రైతుదగ్గర ఆ సమయంలో డబ్బుమాత్రమెక్కడుంటుంది?



వడ్డీకి పావుశేరు చొప్పున అప్పులు తప్పవు. లేదా పంట పండింతర్వాత ఒక్క కుంచానికి రెండున్నర కుంచాలివ్వాలన్న షరతుపై పావు కార్లు విత్తనాలధాన్యమిస్తారు. అయినా రైతుకు కొనక తప్పదు.

ఇలా సమయానికి వర్షాలు లేక కొన్నిసార్లు పంట నష్టమైతే, అతివృష్టివల్ల మరెన్నోసార్లు నష్టమవుతుంది. ఒక్కొసారి సముద్రంలో వర్షంలా, ఆకలి లేనివాడికి మృష్టాన్న భోజనంలా అనవసర సమయాల్లో సమృద్ధిగా వర్షాలు కురుస్తాయి. వాటివల్ల ప్రయోజనం లేకపోగా ఎన్నో నష్టాలు. వేసిన నాట్లు నాటుకోకముందే పెద్ద వర్షాలు పడటంవల్ల నారు నీళ్లపై తేలి కొట్టుకుపోతుంది. చెర్లు, కుంటలకు గండ్లు పడి సాగుభూముల్లో ఎన్నోసార్లు ఇసుకమేటలు పెడతాయి. పాటుకు తెచ్చుకున్న భూముల్లో గండ్లు పడి ఎందుకు పనికిరాకుండా పోతాయి. విరగకాసిన పెసరచేలు ఏరివేతకొచ్చిన సమయంలో కుండపోత వర్షాలు కురియడంవల్ల పెసలు చేల్లోనే మురిగిపోతాయి. బుడ్డిపోయి చేలోనే మొలకలొస్తాయి. మరోసారి పల్లిచేలు కాతకొచ్చి పాలుపట్టే సమయంలో కుంభవృష్టి కురవడంవల్ల, వర్షం నీరు భూమిలోపలికెళ్లి కాయలకు నీరుపట్టి లోపల విత్తు సరిగా తయారుకాకపోవడంవల్ల చట్టబోతాయి. ఇంకోసారి వరిపొలాల కోతల సమయంలో వర్షాలు పడి పంటంతా పాడవుతుంది. ఇలా ఎన్నోసార్లు ఓసారి అనావృష్టివల్ల, ఇంకోసారి అతివృష్టివల్ల, మరోసారి గాలిదుమారంలాంటి ప్రకృతివైపరీత్యాలవల్ల రైతు నష్టపోతుంటాడు. లబోదిబోమని మొత్తుకుంటాడు. తల కొట్టుకుంటూ ఏడుస్తాడు. అయినా రైతునాదుకునేవారెవ్వరు?

సమయానికి వర్షాలు పడి అన్నీ సానుకూల



మైతే పెట్టుబడికి రైతుదగ్గర సమయానికి డబ్బుండదు. ఎరువులు, క్రిమిసంహారక మందులు కొనడానికి, కలుపునాట్లకు చేతిలో పైసైనా వుండదు. ఇక షావుకారి చెప్పిన రేటుకు అప్పు తెచ్చుకోక తప్పదు. చీడపీడల బారినుండి పంటను రక్షించుకోవడం మరో తపస్సులాంటిది. పంట చేతికి రావడమే కష్టం. పంట చేతికివచ్చే సమయానికి ధరుండదు. ఓ సంవత్సరం ఓ దినుసుకు మంచి ధరుంటుంది. దానికి ధరుందికదాని పండిస్తే పంట చేతికొచ్చేసరికి దాని ధర అట్టడుక్కు పడిపోతుంది. ఇలా ధరల గడబిడలూ రైతుకర్థంగావు. అప్పిచ్చిన షావుకారి కల్లంమీదనే పంటను కొలుచుకుపోతాడు. వ్యవసాయమార్కెట్‌కెళ్లి అమ్ముకొచ్చినా పెద్దగా లాభముండదు.

రైతు జీవితంలోని చేదు సంఘటనలను మననం చేనుకుంటున్న కొండమల్లయ్య కనుకొలుకుల్నుండి రెండు కన్నీటిబొట్లు రాలాయి. ఆ చుక్కలు నేలను తడిమాయి.

ఈసంవత్సరమైనా వర్షాలు పడి పంటలు బాగా పండుతాయో లేక తనింకా కష్టాల్లో కూరుకుపోవాల్సివస్తుందోనని విచారిస్తున్నాడు. తనకింతకుపూర్వం ఎన్నోసార్లు ఇలాంటి పరిస్థితి వస్తే పశువులను కాపాడుకోవడానికి పశువులమేతకు రెండింతలు, మూడురెట్లు ధరపెట్టి కొనుక్కొచ్చిన సంగతి జ్ఞప్తికొచ్చిందాతనికి. తన కళ్లముందే ఎన్నో పశువులు డొక్కలెండిపోయి, ఎముకలు పైకి తేలి అస్థిపంజరాల్లా తయారై దయనీయంగా చనిపోయిన దృశ్యాలు కళ్లముందు కదిలి అతని కళ్లు చెమర్చాయి. ఏళ్లతరబడి ఆ మూగజీవాలతో చాకిరీ చేయించుకొని, దుర్భర కరువు పరిస్థితుల్లో వాటికి మేతవేయకపోవడంవల్ల అవి బక్కచిక్కి తమకళ్లముందే చనిపోతుంటే నిస్సహాయంగా కంటనీరు పెట్టుకున్న తనలాంటి రైతులు జ్ఞాపకం వచ్చి ఆవేదన చెందుతున్నాడతను. మరికొందరు దయాదాక్షిణ్యాలు లేక కసాయింటికి పంపిన దృశ్యాలు స్మృతిపథంలో మెదిలి బాధపడ్తున్నాడు.

ఆకాశందిక్కు పరీక్షగా చూశాడు. మబ్బులొస్తూ పోతున్నాయి. వర్షం పడే లక్షణాలేం కనబడటంలేదు. 'ఇక మృగశిర పూర్తిగా పోయినట్టే' అనుకున్న కొండమల్లయ్య కళ్ల వెంట నీళ్లు కారాయి. రాని వర్షం గూర్చి విచారిస్తూ, రాబోయే గడ్డుకాలం గూర్చి భయపడుతూ ఊరిదిక్కు నడుస్తున్నాడు. అతని మనసంతా గడబిడగా వుంది. చిరాకుగా వుంది. నిస్సహాయంగా వుంది. దుఃఖంగానూ వుంది.

ఊరిదిక్కు నడుస్తున్న కొండమల్లయ్యకు కొంచెందూరంలో తాడిచెట్లు కనిపించాయి.

'రారే ముల్లో కల్లుదాగ పోదాము
తాటికల్లు దాగుదాము తమ్ముని పెళ్ళాన్నమ్ముదాం
ఈతకల్లు తాగుదాము ఇద్దరి పెళ్ళాల్నమ్ముదాము
రారే ముల్లో కల్లుదాగ పోదాము...'

అప్రయత్నంగా కొండమల్లయ్య నాలుకపై పాట కదిలింది.

పల్లెల్లో తాగడం మామూలే... బ్రాహ్మణులు, వైశ్యులాంటి కొన్ని కులాలవాళ్లుతప్ప మిగతావాళ్లలో మెజారిటీ జనాలు తాగుతారు. కొందరు పొద్దంతా పనిచేసి అలసటను మరిచిపోవడానికి తాగుతే, కొందరు దానికి బానిసలై తాగుతారు. కొందరికయితే అది లేంది రోజే గడువదు. ఆర్థికంగా మంచిగున్నవాళ్లు కొందరు రోజూ వాడుకగా కొంత ఇంటికే తెప్పించుకుంటారు. తాగని కులాల్లోని వాళ్లు కూడా కొందరు చాటుగా ఈమధ్య తాగుతున్నారు.

'చాలారోజులాయె కల్లుదాగక... ఇప్పుడు కల్లు మంచిగున్నదట. మొన్న కలిసినప్పుడు అన్నగౌడు చెప్పిండు. ఓ బింకెడు తాగొస్త' తాళ్లను చూసి తనలో తాననుకొని వాటిదిక్కు నడవసాగాడు కొండమల్లయ్య. కొంచెందూరం పోయిన తర్వాత అతని కాళ్లు ఠకీమని ఆగిపోయాయి. 'ఇంక నా బ్రతుక్కు తాగడమా? ఓదిక్కు బాకీలున్నాయి. కల్లు తాగకుంటేంబోతుంది? చచ్చిపోతానా? రెండుమూడు రూపాయలు దండుగ' మనసు మార్చుకొని ఊరిదిక్కు నడవసాగాడు. కొద్ది దూరం నడిచి ఆగిపోయాడు.

'ఏమైతదది? ఒక్కరోజు తాగుతె మునిగిపోయేదేముంది? నేనేమైన రోజూ తాగుతున్నానా? నా మనసుకూడ బాగాలేదు. ఓ బింకెడంత




తాగొస్త. చచ్చేటప్పుడు ముల్లె మూటగట్టుకపో యేదుందా?' అనుకొని తాళ్లదారి పట్టాడు. కల్లు తాగాలని మనసుపడింతర్వాత దాన్ని మరల్చుకోవడం కష్టం. మెల్లమెల్లగా నడుస్తూ అక్కడికి చేరుకున్నాడు.

కొండమల్లయ్య అక్కడకు రావడం చూసిన అన్నగౌడు- '' రా పటేల రా... కల్లు మంచి గుంది'' అన్నాడు. ఓ తాడిచెట్టు మొదట్లో కొన్ని కల్లుబుడ్లున్నాయి. చెట్టుకింద కూర్చున్న వాళ్లకు ఆకుల్లో కల్లు వంచుతున్నాడు అన్నగౌడు.

కొండమల్లయ్యకు అన్నగౌడు తనని పటేలని సంబోధించడం దెప్పినట్టనిపించింది...

''కారెడ్డమా (వ్యంగ్యం)డుతున్నావేయ్ గౌండ్లయినె. నన్ను పటేలని పిలువ వడితివేంది...?'' అన్నాడు చెట్టుకింద నిల్చుంటూ

''అట్లెందుకనుకుంటారు పటేల? పులి బక్కపడ్డా పులిచారలు బక్కవడుతయా? మీ నాయన్న కాలంల మీరు ఎంత మంచి గుంటిరి?''

తనదగ్గరికొచ్చిన వాళ్లను పొగిడి, ఉబ్బించి, ములగచెట్టెక్కించి ఎక్కువ తాగించడం అన్నగౌడుకి వెన్నతోపెట్టిన విద్య...

''మా చచ్చిపోయిన బర్రె పగిలిపోయిన బుడ్డెడు పాలిచ్చేది అంటేమొస్తది?''

''నిజమే పటేల... కాని వెనుకటి సంగతుల పుడే మర్చిపోతమా?''

''వెనుకటి మరియాదలు ఇప్పుడెక్కడున్నయి? పెద్దపెద్ద దొరలే ఊళ్లనిడిసి పోయింర్రు. ఇప్పుడు వడుచుపిల్లగాండ్లదే రాజ్జెం... మీ అటువంటోల్లదే కాలం...''

''అవు పటేల, నువ్వన్నది కూడా నిజమే. కాని మనం వెనుకటోల్లం. ఆ మర్యాదలెట్ల మర్చిపోతం...'' అక్కడున్న మరొకతనికి కల్లు వంచుతూ అన్నాడు అన్నగౌడు.

''నిజమేగాని ఒక్క బింకెడు ఒక్కచెట్టు కల్లు వంచు...''

''బింకెడేంది పటేల... నీ ఇష్టమున్నంత తాగు. నేను పొయ్యనంటన్ననా ఏంది? కడుపు నిండ తాగు...?''

''నువ్వెందుకు పొయ్యవు? మాపోస్తవు. కాని తాగినోడు కట్టి తాళ్లవన్నని అటెనుక పైసలిచ్చేది నేను. పైసలడగనంటె ఎంతైన తాగుత...'' నవ్వుతూ అన్నాడు కొండమల్లయ్య.

''వీటి బిసాయిదెంత..? ఏమడుగ, తాగు పటేల''

''అవ్వన్ని వట్టిమాటలే... అయినా నీబాకీల నేనెందుకు వడాలె''

మోతుకాకు దులిపి కొండమల్లయ్యచేతికిచ్చాడు అన్నగౌడు. దాన్ని మలిచి నోటిదగ్గర పెట్టుకున్నాడు కొండమల్లయ్య. అన్నగౌడు పెద్దకుండలోవున్న కల్లును ఖాళీగావున్న బింకిలోకి వంచాడు. అది నిండింతర్వాత చేతిలోకి తీసుకొని కొండమల్లయ్యకు వంచుతున్నాడు... కొంత తాగిన తర్వాత తలూపగానే అన్నగౌడు కల్లు వంచడం ఆపాడు.

కొండమల్లయ్యకు కొద్దిదూరంలో కూర్చొని పద్మశాలి కిష్టయ్య, కురుమ బీరయ్య మాట్లాడుకుంటున్నారు. వాళ్ల దృష్టాతనిపై పడింది.

''వానలు ఎప్పుడు పడతయంటరు పటేల?'' కిష్టయ్యన్నాడు.

''ఏమో...? ఎవ్వలకు తెలుసు... ఆరుద్ర కార్తెలనన్న పడుతయేమో చూడాలె... వాన రాకడ, పానం బోవుడు ఎవ్వలకు తెలువది. ఇంకనన్న వానలు పడకుంటె కష్టమె'' అన్నాడు కొండమల్లయ్య.

''జగతిమీద నియ్యతనేది (నిజాయితీ) లేకుంటయింది. ఒకల్నొకలు దోసుకతినవట్టిరి. కులమర్యాదలు లేకుంటాయె. చిన్న పెద్ద గౌరవం లేకుంటాయె. మాకాలంల ఎప్పుడు కుండపోతానలే'' అన్నాడు అరవై అయిదేళ్ల వృద్ధుడు బీరయ్య.

''నా చిన్నప్పుడు కూడ ఏరు ఎండిపోయింది నేను చూడలే... ఆయిటి పూనిందంటె మస్తు నీళ్లు. ఏరు అవుతలంచులకు, ఇవుతలంచులకు తట్టిపారేటిది.ఇరువై అయిదేండ్లకాన్నుంచి చూస్తున్న... ఓయేడు మంచివానలు కొడితే ఇంకోయేడు కొట్టయి. మునుపటి వర్షాలే పోయినయి'' అన్నాడు కొండమల్లయ్య.

''లోకంల నియ్యతనేది లేకుంటయితె వానలెట్ల వడుతయి...? బ్రహ్మంగారు చెప్పలేదా?



ఎంపలి చెట్లకు నిచ్చెండ్లేసెటోల్లు పుడుతరని, అన్యాయం బాగ పెరుగుతదని... వీరభోగ వసంతరాయలసొంటోడు పుడితేనే లోకం బాగుపడుతది...'' అన్నాడు లోకంగూర్చి బాధ పడుతూ కిష్టయ్యా.

''మునుపు ఒక్కంటికి ఇప్పుడు పదిండ్లాయె. మస్తు జనాభా పెరిగె... చెట్లన్ని నరుకుతంద్రుట. అడవులు తగ్గుతన్నయట. అందుకే వర్షాలు తగ్గుతన్నయని రేడియల చెప్పంగ విన్న'' బింకుల్లోకి కల్లు వంచుతూ అన్నాడు గౌడు.

ముగ్గురికీ ఒకరితర్వాత ఒకరికి కల్లు పంచుతున్నాడతను. మాట్లాడుతూ తాగుతు న్నారు వాళ్లు. మాటలసందర్భంలో వాళ్లెంత తాగుతున్నారో గమనించడంలేదు. వంచినకొ ద్దీ తాగుతూనే వున్నారు. కొండమల్లయ్యా తా గిందప్పటికే రెండు బింకులు దాటింది.

''వ్యవసాయమెట్ల నడుస్తుందే కొండమల్ల న్న? మొన్న భూమమ్మినవటకద... మంచిభూ మది''

బీరయ్యా మాటలకు చిన్నబుచ్చుకున్నాడు కొండమల్లయ్యా.

''వ్యవసాయంల గడియ రికాముండది గవ్వ రాకయుండది అన్నట్టుంటది... ఎక్కడే సిన గొంగడక్కడేసినట్టే వుంటది... వెళ్లకుంటె భూమమ్మక ఏంజేసుడు?'' అని దాన్ని పొడు గించడం ఇష్టంలేక

''కిష్టయ్యా... నీ కొడుకు బాగ తిరుగు తుండని అందరంటంద్రు... కొంచెమంత అదుపుల పెట్టుకో...'' అన్నాడు కొండమల్ల య్యా.

''వాడేమన్న ఆగేటట్టున్నడా? చెప్పుతె వినేట ట్టున్నడా? ఈడుమీదున్నడు. సింగిబింగాడు తండు. కొల్లాగోలె చెంగుచెంగునెగురుతండు. భూమ్మీన కాలే నిలుస్తలేదు. ఎగిరే కోల్లాగె (కోడెదూడ)కో పెయ్యదూడంజూసి ముడేసిన వంటె ముగుదాడేసినట్టయితది. పెండ్లయితె తప్ప అడు ఇంటిపట్టునుండడు. ఏమంటవే కిష్టన్న'' బీరయ్యా నవ్వుతూ అన్నాడు.

''నేను గూడ అదే అనుకుంటున్న... వాని మ్యాసమామ బిడ్డ ఓ పోరి (ఆడపిల్ల) మా ఉంది. అటగ ఎర్రగ లగ్గోలె మంచిగుంది. దసుర పండుగ పోయినంక లగ్గం చెయ్యాన్న నుకుంటున్న'' అన్నాడు కిష్టయ్యా.

''దసరింక కొద్దిరోజులుందా? అన్ని దినాలా గుడెందుకు? ఓ మంచిదినం జూసి పెండ్లిజే సెయ్యి. వాడే రౌతుకస్తడు. లేకుంటె చెయ్యిజా రిపోతడు'' కిష్టయ్యతో అని,''కొండమల్లన్నా... నీకొడుక్కెప్పుడు పెళ్ళి చేస్తవే? చెట్టోలె పెరిగి పోతండు'' అన్నాడు బీరయ్యా.

ఆ మాటలకు కలుక్కుమన్నట్టనిపించింది కొండమల్లన్నకు. ''నేను మా చేస్తనంటన్న. వాడే చేసుకుంటలేదు. చెప్పినా వింటలేదు. నాకే నౌకరిలేదు. ఇప్పుడే పెండ్లెందు కంటండు. నౌకరాయెదాక పెండ్లిమాట ఎత్త ద్దంటండు''

''ఇయ్యాల్లరేపు నౌకరిదొరుకన్నంటె మాటలా? దానికి దీనికి పొత్తువెడితె ఇగ ముసలోడయితడు. ఎట్లనో బతుకడా, లగ్గం జెయ్యి'' అన్నాడు అన్నగౌడు.

''నేనెంత జెప్పినా వింటలేడు. ఇయ్యాల్లరే పటి పిల్లగాండ్లు మనమాటలేమింటరు? మన కే చెప్పుతరు. వాళ్లనేమన్న మందలిచ్చెటట్టు న్నదా?''

''తెలుకుంటెరికేకద... అక్కడో మంచి పిల్లుంది. దాన్ని చూసిండంటే మీవోడసలే విడువడు. ఓసారి అక్కడికి తీసుక పొయ్యి చూపించు'' అన్నాడు బీరయ్యా.

''ఆ ఊరు కాపోల్లంత మాకు చుట్టాలే. వరదక్షిణ ఎంతిస్తరో చెప్పలేవు?'' అన్నాడు కొండమల్లయ్యా.

''పిల్ల ఎర్రగ మంచిగుంది. ఏడో, ఎనిమిదో చదివింది గూడ. కాని వాళ్లు బీదోల్లు. పదివేల కంటెక్కువియ్యరు''

''చుట్టాకుల లింగయ్యా బిడ్డ గురించేనా నువ్వనేది?''

''అవు... ఆ పిల్ల గురించే మంచిగ లేదా పిల్ల?''

''పిల్ల మంచి గుండంగనే ఏమచ్చె? చెప్పే స్తె కుండతలుగనోడు కూడ ఇయ్యాల్లరేపు ఇరువై వేలకు తక్కువిస్తలేడు. కూలిజేసుకునె టోడుగూడ తక్కువ కట్నానికి చేసుకుంటలే





డు. నా కొడుకును బియ్యే చదివిండు. మాకింత భూముంది. ఇప్పుడు గాకున్నా ఇంకొన్ని రోజులకన్న నా కొడుక్కు నౌకరిగాదా? మా దండి సంబంధమే తెచ్చినవు తియ్యి'' నిష్ఠూరంగా అన్నాడు కొండమల్లయ్య. కడుపులో పడ్డ కల్లు తన ప్రభావాన్ని చూపెడుతోంది.

కూతురు పెళ్లిచేయడానికెన్ని ఇబ్బందులు పడ్డా, అప్పుల పాలైనా అవమానాలెదుర్కొన్నా అవన్నీ మరిచిపోయి, కొడుకు పెళ్లి విషయంలో బిర్రబిగుసుకొనుండటం, తమది పెద్ద సంబంధమని తమకు తామే భావించడం రైతు కుటుంబాల్లో మామూలు విషయమే. తమకు తెలియకుండానే పురుషాధిక్య సమాజ ప్రభావం తమపై పడుతోందన్న విషయం వాళ్లకు తెలియదు.

కొండమల్లయ్య మాటలకు కోపమొచ్చింది బీరయ్యకు.

''పిల్ల మంచిగుందని చెప్పినందుకు నామీదికి కోపానికి ర్రావడితివేంది? నీ కొడుకు, నీ ఇష్టం... ఏమన్న అలిమా? బలిమా? మొన్న మా చుట్టపోనింటికి పోతె లింగయ్య కనపడి చెప్పిండు- మంచి సంబంధముంటె చూడుమన్నడు. నీ కంతకంటె పెద్ద సంబంధం దొరుకుతె చేసుకో. నాదేం బాయె?'' అన్నాడు.

''నిన్ను నేనేమంటున్న బీరయ్యా? మొన్న నా బిడ్డకు గంత కట్నమిచ్చి వ్యవసాయం చేసుకునెటోనికే ఇచ్చి పెండ్లిజేస్తి. బియ్యేదాక చదివిన నా కొడుక్కు అంత తక్కువ కట్నమనేవరకు నాకు కోపమచ్చె. అయినా నేను చేస్తనన్నా వాడు చేసుకునెటట్టున్నడా?'' అని బ్రేవ్‌మని త్రేన్చాడు కొండమల్లయ్య. కల్లువాసన గుప్పుమని కొట్టింది.

ఒక్క బింకెడనుకున్నది మూడు బింకులు తాగాడు కొండమల్లయ్య. కిష్టయ్య, బీరయ్య కూడా బాగానే తాగారు. అందరికీ మాటలు తడబడుతున్నాయి. ఇక చాలని లేచి నిల్చొని ఊళ్లోకి నడుస్తున్నారు ముగ్గురు.

''పైలంగ పొంద్రి'' వెనుకనుంచి అన్నాడు అన్నగౌడు.

''అం... అం...'' అంటూ నడుస్తున్నారువాళ్లు.

మాట్లాడుతూ నడుస్తున్నారా ముగ్గురు. వాళ్ల మాటల్లో ఎన్నో విషయాలు దొర్లుతున్నాయి. మాజీ పట్వారిగూర్చి, ఆతని ప్రవర్తన గూర్చి, ఆతని కొడుకుల గూర్చి ప్రస్తావనొచ్చింది. మామూలు సమయాల్లో సాధారణంగా బీరయ్యకాని, కొండమల్లయ్యకాని పట్వారిలాంటి ఊరి పెద్దల గూర్చి విమర్శిస్తూ మాట్లాడటం జరుగదు. ఇప్పుడు వాళ్లున్న పరిస్థితివేరు. కడుపులో పడ్డ పొద్దాటి కల్లు హుషారిస్తుంది. ఆ మత్తే వారితో మాట్లాడిస్తుంది. దానికితోడు కిష్టయ్య మొదట ఆ ప్రసక్తి తెచ్చాడు.

''వాన్ని గొట్టి వీన్నిగొట్టి బాగనే సంపాయించిండు పట్వారి పంతులు. కాని పిల్లలను హద్దులుంచలే. పాచి పండ్లోడు సంపాయిస్తె బంగారు పండ్లోడు ఖర్చుబెడుతడన్నట్టు కొడుకులేమొ అడ్డగోలుగ ఖర్చుపెడుతంద్రు'' అన్నాడు కిష్టయ్య.

''వాళ్లేమన్న కర్నపోనింట్ల పుట్టినట్టు చేస్తంద్రా? గౌండ్లు ఇండ్లుకుపోయి తాగుడాయె. మాంసం కూడ తినవట్టిరి'' అన్నాడు కొండమల్లయ్య.

''ఇయ్యాల్లరేపు గవ్వన్ని ఉన్నయాపటు... తినుడు, తాగుడు అన్ని కులాలల్లుంది. బ్రాంది బీరులు తాగెటోడు పెద్దోడు, కల్లు, సార తాగెటోడు చిన్నోడు'' అన్నాడు బీరయ్య.

''తాగుడు, తినుడు సంగతేముందికని పట్వారి కొడుకు హరిజనుల పిల్ల లక్ష్మిని తీసుకచ్చుకోని ఇంట్లనే ఉంచుకునె. కాలమెట్లచ్చింది చూడు?'' అన్నాడు కిష్టయ్య.

''అయినె తీసుకచ్చుకున్నడా? అది నెల తప్పంగనే బలవంతంగ అన్నలు ఇంట్లపడుగొట్టింద్రు. మునుపటి కాలమయితె ఇట్ల జరిగేదా? పటేండ్లు, దొరలు ఎంతమంది పనిపాటలోల్లను పాడు జెయ్యలేదు? అన్నల భయానికి ఎక్కడోల్లక్కడ నోరు మూసుకొనున్నరు. ఊళ్లపొంటి ఇట్లాంటి యెన్నో చేస్తంద్రన్నలు!'' అన్నాడు బీరయ్య.

''అన్నలు... వాళ్ళు ఇసొంటి పనులు మాచేస్తరు. వాళ్ళకు హరిజనులు కూలోల్లు, కైకిలి గంబలి చేసుకునెటోల్లు కావాలె. కూలిరేట్లు పెరుగాల్నంటరు. పాలేర్ల జీతాలు పెరుగా

ల్నంటరు. కాని ఒక్కొకరం పొలంల వంట పండియ్యన్నంటె ఎంత ఖర్చయితందో వాళ్ళకే మన్న తెలుసా? రెండు మందు బస్తాలకు నాలుగు వందలు. విత్తనాలకు రెండు వంద లు. కలుపు తీసుకానికి మూన్నాలుగు వంద లు. నాటేసుటానికో రెండుమూడు వందలు. ఇంక కోతలకు వాటికి వీటికి ఉండనే వుండె. మంచిగ పండుతె ఖర్చులు పోంగ ఎకరానికి ఏడెనిమిది వందలు మిగుల్తె ఎక్కువేనాయె. ఇంటోల్లంత ఆర్నెల్లు కష్టపడితె వచ్చేలాబం గిది. రెండెడ్లు, బండితోని కిరాయలకు పోతె అంతకన్నెక్కువనే గిడుతంది. గాలి, ధూళి, రోగాలు, వర్షాలు అన్నిట్ని తప్పించి వంట చేతులకు రావాల్నంటె మాటలా? అన్నలకు గివ్వన్ని తెలుసా? కూలీలయితె పెంచవట్రి మరి దినుసుకు ధరేది? ఎవుసాయాలు మూ లకు వడుకుంటె ఏమయితయిగ" ఈ సంవ త్సరం కూడా వర్షాలు లెవ్వన్న బాధతో, కళ్ళ ముందున్న గడ్డుపరిస్థితికి చలించిఎవర్ని నిందించాలో తెలియక- కడుపులో పడ్డ కల్లు ఇస్తున్న హుషారుతో తన ఆవేదనంతా వెళ్ళగ క్కాడు కొండమల్లయ్య.

"వాళ్ళు రైతుల వంటకు మంచి ధర ఉండాల్నని కొట్లాడుతురట గాదె కొండమల్ల న్న?" అన్నాడు కిష్టయ్య.

"కొట్లాడుతరు... ఎప్పుడు? నా అసోంటోల్లు చచ్చినంకనా?"నిష్టూరంగా అన్నాడుకొండమల్ల య్య.

మాట్లాడుతూ కొండమల్లయ్య ఇల్లు దరికొ చ్చారు వాళ్ళు. చీకటిపడుతోంది.

"పొయ్యొస్తనే" అని వాళ్ళకు చెప్పి ఇంట్లోకి ప్రవేశించాడు కొండమల్లయ్య. తూలుతూ ఇంటికొచ్చిన భర్తను చూసి గయ్‌మని లేచింది నర్సమ్మ.

"నల్లమొకపోడ... తాగచ్చినవా? నీ అందా నికి తాగుడు గూడనా? గంతగనం తాగ కుంటేంబాయె?" అని తిట్టసాగింది.

"తాగుడేందే? నేనేమన్న రోజు తాగుత న్నానె? లం... ముండ బాగ దూపయితంటె అట్ల తాళ్ళళ్ళకు పొయ్యచ్చినేంది? ఎందుకో బాగ మొత్తుకుంటన్నవు?" అని నర్సమ్మను కొట్టబోయాడు కొండమల్లయ్య. రాజయ్య, తిరు పతయ్య తండ్రినాపారు. ఆరాత్రి భోజనం చె య్యకుండానే నిద్రపోయాడు.

తెల్లవారేసరికి తాగిన కల్లు జీర్ణమయిపో యింది. మత్తు దిగింది. రాత్రి భోజనం చెయ్య కపోవడంవల్ల ముఖం ఈడ్చుకుపోయింది. కడుపులో నకనకలాడుతూ ఆకలి... దూరం పోయొచ్చి బావిదగ్గర వేపపుల్లతో పండ్లుతోము కుంటున్నాడు కొండమల్లయ్య నర్సమ్మ అతని దగ్గరికొచ్చి నిల్చుంది. "రాత్రేమొ బాగ మీది మీదికురికొస్తివిగద. కడుపుల పడ్డదంత అరి గిందా?" అంది నవ్వుతూ.

సిగ్గుతో ముఖం పక్కకు తిప్పుకున్నాడు కొండమల్లయ్య.

"సరే కాని ఆషాఢమానం వచ్చుటానికిగ మూడ్రోజులుగూడలేదట. కొత్తగ లగ్గమయినో ల్లు ఆషాఢమానంల అత్త మొకం చూడద్దంట రు. నగునూరుకు పొయ్యి కాంతవ్వను తీసు కురా?" అంది నర్సమ్మ.

"నిజమే... నేను మరిచేపోయిన. చిన్నోడెటు పాయె. రేప్పొద్దుగాల వాన్ని నగునూరుకు తోలాలె. నెల రోజులయింది బిడ్డపోయి. ఎట్లుందో ఏమొ? ఇన్ని రోజుల్నుంచి అటు మొకమన్న చూడకపోతిమి"

"ఒగలింటి కడప తొక్కినంక కష్టమో, సు కమో ఆడపిల్ల కక్కన్నే అన్నీ... లగ్గమ యిందంటే ఆడపిల్లంటె ఇగ అక్కడి పిల్లే నాయె. ఎనిమిదేండ్లల్ల లగ్గం జేసుకొని నువ్వు రాలేదా? మా అవ్వతోని మాటకు మాటను కుంటు ఉండలే? కాని, కాంతవ్వ కొంత మ్యాద కురాలే"

"నేనేమొ గడుచుదాన్ని... నీ బిడ్డేమొ అమాయకురాలు. అయితె మానాయెవటు... మరి చుట్టాలింటికి పోవన్నంటె చిన్నోడు సిగ్గు పడుతడు. రాజయ్యను పొమ్మందామేంది?"

"వాడేడ పొయ్యేటట్టున్నడు. గోదావరిఖని నుంచి నౌకరి కాగితం కోసం ఎదిరి చూస్తండు. ఇయ్యాల రేపట్ల వస్తదట. కోడలేమంటంది? ఇప్పుడన్న సంబురంగుందా?"

"కొట్టంకాడికి పిడుకల్జెయ్య పోయింది. ఆదె ప్పుడు రుసరుసలాడుకుంటనే ఉంటది. దాని కి ఇప్పుడే మనం కండ్లకు కనవడుతలేం.





వాడికి బావి పనయితే మనమొకమన్న చూస్త దో చూడదో?''

''అత్తను మెచ్చుకున్న కోడల్ను కోడల్ని మంచిదన్న అత్తను నేనిదివరకు చూడలే. కాలేరు మీద మనుసుపడి అదట్ల జేస్తంది. లేకుంటే మంచిదే''

''మంచిదో పాడుదో అక్కడికి పోయినంక తెలుస్తది. రాజయ్యేమొ గోవసోంటోడు. కొడుకును ఆటాడిచ్చేటట్టుంది''

''నువ్వు నన్ను ఆడియ్యలేదా ఆడోల్లయన్ని వంకర బుద్ధులే. వాళ్ళు కలిసిమెలిసి చక్కగ బతుకుతె చాలదా మనకు? రాజయ్యకు జీత మస్తె వేన్నీళ్ళకు చన్నీళ్ళోలె తోడుంటది మనకు''

''అట్లనే ఎదిరిచూసుకుంటుండు... కట్టలకు కట్టల రూపాయలు తెచ్చిస్తడు కొడుకు నీకు. దాని సంగతుల్చూత్తె బాగనే పంపిచ్చేటట్టు కనపడుతండ్రు!''

''ఎట్లుంటె అట్లయితది... వాళ్ళమీదెందుకేడుస్తవు తియ్యి'' అని ముఖం కడుక్కోవడంలో లీనమయ్యాడు కొండమల్లయ్య. అది పూర్తిచేసేనరికి తిరుపతయ్యొచ్చాడు. కొడుకుంజూచి కొండమల్లయ్య

''రేపు నగునూరుకు పొయ్యి చెల్లెందీను కురా'' అన్నాడు.

''రేపెందుకు ఇప్పుడేపోతా'' అని స్నానం చేసి తయారై వెళ్ళిపోయాడు తిరుపతయ్య.

''బస్సులో కూర్చున్న తిరుపతయ్యకు చిన్నప్పుడు చెల్లితో ఆడుకున్న కచ్చకాయలు, బెత్తాలాటలు జ్ఞాపకం వచ్చాయి. చెల్లి పాడే బతుకమ్మ పాటలు జ్ఞాపకం వస్తున్నాయి.

ఇద్దరక్క చెల్లెండ్లు ఉయ్యాలో
ఒక్క ఊరికిచ్చి ,,
ఒక్కడే మాయన్న ,,
వచ్చన్నా పోడు ,,
ఎట్లత్తు చెల్లెలా ,,
ఏరద్దమాయె... ,,

చెల్లెలు తనకోసం అన్నరాలేదని నిష్టూరాలాడటం, అన్న రాకపోవడానికి కారణాలు చెప్పడం ఈ పాటలోని అంశం.

తన ఒక్కగానొక్క చెల్లెలు అక్కడెట్లుందో అని ఆలోచిస్తూన్న తిరుపతయ్యకు చాలా రోజులతర్వాత చెల్లెలు దగ్గరికి పోయిన అన్నను చూసి కంటినీరు తీసుకున్న చెల్లెలు గూర్చిన పాట జ్ఞాపకం వచ్చింది.

కలవారి కోడలు కలికికామాక్షి
అప్పుడే వప్పు కడవలో పోసి
కాళ్ళకు నీళ్ళిచ్చి కంటినీరు తీసె...

చెల్లెలింట్లో అడుగుపెట్టిన తిరుపతయ్యకు కాళ్ళు కడుక్కోవడానికి చెంబుతో నీళ్ళిచ్చింది కాంతమ్మ. తల్లి దండ్రుల గూర్చి కుశలప్రశ్నలడిగి నిజంగానే కంటినీరు తీసింది.

కొండమల్లయ్య ఊహించని విధంగా కాంతమ్మను వెంటబెట్టుకొని తిరుపతయ్య అదే రోజు పొద్దుగూట్లో పడేవేళకు తిరిగొచ్చాడు. ముఖం ముడుచుకొని కోపంగా వున్న తిరుపతయ్యను చూసిన కొండమల్లయ్య భృకుటి ముడివడింది. నర్సమ్మ కూతుర్ని కౌగిట్లోకి తీసుకొని కన్నీరు కార్చింది. కొడుకు వాలకాన్ని వెంటనే తిరిగిరావడాన్ని చూసిన కొండమల్లయ్య ఏదో గొడవ జరిగిందని ఊహించాడు. రాత్రి భోజనాలయింతర్వాత కూతుర్ని దగ్గర కూర్చోబెట్టుకున్నాడు.

''కాంతవ్వా... మీ అత్తగారింట్లంత మంచి దేనా?'' అన్నాడు కూతురు తలమీద చెయ్యివేస్తూ.

''ఊం...'' ముభావంగా అని ఊర్కుంది కాంతమ్మ

''ఏంది బిడ్డ? చిన్నబోయినట్టున్నవేంది?'' ఆప్యాయంగా కూతురు తల నిమురుతూ అన్నాడు.

''ఏం లేదు'' అని వచ్చే దుఃఖాన్నాపుకోవడానికై కొంగును నోటికడ్డంగా పెట్టుకుంది.

నర్సమ్మ కూతుర్ని దగ్గరకు తీసుకుంది.

''ఏమైంది బిడ్డ? మీ అత్తమామలేమన్న తిట్టిండ్రా?'' అంది.

ఇక కాంతమ్మకు దుఃఖమాగలేదు. తల్లిని పట్టుకొని భోరునేడ్చింది.

''ఏమైంది బిడ్డ... ఏమైంది?'' ఆతురతగా అడిగాడు కొండమల్లయ్య.

కాంతమ్మ మాట్లాడలేదు.



వాళ్ళకు సమీపంలోనే మంచంలో కూర్చొనున్న తిరుపతయ్యా ''అయ్యేదేముంది? దగ్గరోల్లని, మేనవాళ్లని వేలకు వేలు కట్నమిచ్చి పెండ్లిచేస్తే వాళ్ళేం చేసిండ్రో తెలుసా? చెల్లె వాళ్ళింటికి పోయిన రెండు రోజుల తర్వాత ముసలావు చచ్చిందట. బిడ్డచ్చిన వేళ గొడ్డచ్చిన వేళని చెల్లె వాళ్ళింట్లో అడుగుపెట్టగానే ఆవు చనిపోయిందని తిడుతండ్రట. మొదటి వారంలోనే ఆవుపోయింది. ఇంకేం జరుగుతాయోనని గొణుగుతండ్రుట. మన చెల్లెను శనంటండ్రుట. ఇంకా కట్నం గూర్చి, వరదక్షిణ తక్కువైందని గుణిపిస్తున్నరట'' అన్నాడు కోపంగా.

''కట్నం తక్కువైనాది! అయినె బిడ్డలకేపాటిచ్చిండు? మనకంటెక్కో ఇచ్చిండా? ఆవు చచ్చిపోయిందానికి నా బిడ్డేం జేస్తది? వాళ్ళ తల్లిదండ్రులంటె రాంరెడ్డి ఏ మంటలేడా? పిల్లగాడు బుద్ధిమంతుడని ఇచ్చుడయింది'' కోపంగా అన్నాడు కొండమల్లయ్యా.

''వాళ్లందరొక్కటి కాదా?'' కోపంగా అని ''బావ ఇంట్లో లేనప్పుడు చెల్లెను గుణిపిస్తండ్రుట. శనంటండ్రట'' అన్నాడు తిరుపతయ్యా.

''ఆవు చచ్చిపోతె నా బిడ్డని దిడుతరా? వాళ్లసంగతి జూత్త''

అక్కడ నిల్చొని వాళ్ళ సంభాషణ వింటుంది లక్ష్మి. ఆ మాటలు వింటుంటే ఆమెకు తన పదవయేట ఆ ఇంట్లో అడుగుపెట్టినప్పటిసంగతి జ్ఞాపకం వస్తుంది. తెలిసీతెలియని వయసులో వున్న తన చిన్నారి మనసును తన అత్తమామలు ఎలా గాయపెట్టారో జ్ఞాపకం చేసుకుంటుంది. లక్ష్మి కొండమల్లయ్యా కోడలుగా వచ్చిన నెలలోనే అతని పెదనాన్న ఎప్పట్నుంచో అస్వస్థుడై చావుకు సిద్ధంగా వున్న వృద్ధుడు చనిపోయాడు. కోడలొచ్చినవేళ చీపురు కట్ట వచ్చిన వేళని ఆ పసిదాన్ని తిట్టారు. అత్తమామలతోపాటు ఇరుగుపొరుగు వాళ్ళూ ఆ వృద్ధుడి చావుకు లక్ష్మేకారణమన్నట్టు నింధించారు. ఆ పసిమనసును గాయపరిచారు. ఆమె వయసుతో నిమిత్తం లేకుండా సూటిపోటి మాటలని బాధపెట్టారు.

''అంత బలుపా వాళ్లకు. కలిసినప్పుడడుగుతా...''

మామ మాటలు విన్న లక్ష్మి తనదాకా వస్తే కాని బాధేంటో తెలియదు అనుకుంది.

''ఆషాఢం కట్నాలకిందకి మంచి బట్టలు పెట్టల్నట. బావకో సఫారిడ్రెస్, చెల్లెకు పట్టుచీర కొనల్నట. ఇంక పెద్దపెద్ద కోరికలే కోరిండ్రు'' అన్నాడు తిరుపతయ్యా.

సఫారీ డ్రెస్ అంటే ఏమిటో తెలియకున్నా అది చాలా విలువైందని మాత్రం అర్థం చేసుకున్నాడు కొండమల్లయ్యా.

''ఇయ్యాల్లో తీరుగ బతుకుతన్నమని మిడిసిమిడిసి ఆడుతున్నట్టున్నరు. ఎద్దుముడ్డి పొడుచుకుంట బతికెటోనికి సపారి పైంట్లుగావన్నా? సిరిమంతం బాగనే వచ్చింది గద! భూమ్మీదనే ఆగెటట్టులేరు గద!'' వ్యంగ్యంగా అన్నాడు కొండమల్లయ్యా.

కొద్దిక్షణాలెవరూ మాట్లాడలేదు.

''సరె... అవ్వన్నట్లుండెకని నువ్వాల్లతోని జగడం పెట్టుకోనచ్చినవా?'' అన్నాడు.

''నాముందట్నే కోర్కెల లిస్టు చదువుతుంటె, చెల్లెను గుణిపిస్తుంటె చూసుకుంట కూర్చోవాల్నా? నా ముందే ఇన్ని మాటలన్న వాళ్ళు చెల్లెను ఒక్కదాన్నెంత ఏడ్పించుంటరు? అందుకే నాలుగు మాటలు దులిపి చెల్లెందీసుకొనొచ్చిన'' అన్నాడు తిరుపతయ్యా.

తను చేసిన పనికి తండ్రి మెచ్చుకుంటాడనుకున్నాడు తిరుపతయ్యా. కాని అందుకు విరుద్ధంగా జరిగింది.

''కాల్చుక రమ్మంటె మాడ్చుకచ్చుడేనా బిడ్డ! చదువు కున్నోనివి కొంచెమన్నా ఆలోచించద్దా? ఇప్పుడు తీసుకచ్చినవు నిజమే. రేపది మల్ల వాళ్ళింటికే పోవాలెగద. అప్పుడు ఇవ్వన్ని మనసుల పెట్టుకోని ఇంకింత గుణిపిస్తె ఏం జేస్తం మనం? ఏదో సదురుకపోవాలె''

మొదట్లో వియ్యంకుడిపై కోపానికొచ్చిన తండ్రి ఇలా మాట్లాడటం చూసి ఆశ్చర్యపోయాడు తిరుపతయ్యా.

''ఏంది సదురుకపొయ్యేది? వాళ్లేమన్నా ఊర్కోవాల్నా? అది నా నుంచిగాదు. పెద్దపెద్ద కట్నాలు కావన్నట కొంచవో... బాకెక్కడ వుడుతదో ఆలోచించు'' అన్నాడు తిరుపతయ్యా




"లోకంలున్న మాటే వాళ్ళన్నరు. మనకు బాకుంటే వాళ్ళకేంది? ఆడపిల్ల పెండ్లి చేసినంక యాడాదిరాక వచ్చుడు పోవుడు కట్నాలు అన్నుంటయి. ఎవ్వలకచ్చేటియి వాళ్ళుడుగరా? రాత్రియింది పండుకో పోండ్రి" కట్నాలడగడం వియ్యాలవారి జన్మహక్కున్నట్టుగా మాట్లాడాడు కొండమల్లయ్య.

రాత్రవడంవల్ల ఎవరి మంచాల్లో వారొరిగారు.



**గో**ధూళివేళ... పొద్దంతా చిటపటలాడిన సూర్యుడు విశ్రాంతి తీసుకోవడానికై పశ్చిమాద్రికి చేరుకుంటున్నాడు. ఊళ్ళోకి తిరిగివస్తున్న పశువులగిట్టల చప్పుడు లయబద్ధంగా వినబడుతోంది. ఉండి ఉండి సుడిగాలి లేచింది. చెట్లు పడిపోయేట్టూగుతున్నాయ్. బొంయ్ మంటూ గాలి ప్రళయ భీభత్సం చేస్తోంది. బజార్లనిండా దుమ్ములేచి ఒకరి ముఖాలొకరికి కనబడకుండా వుంది..ఊళ్ళోకొస్తున్న పశువులు చిందరవందరగా పరుగిడుతున్నాయి. పందిళ్ళూగుతున్నాయి. గుడిసెలమీద వదులుగా వున్న తాటికమ్మలు లేచిపోతున్నాయి. చొప్పకట్ట పందిర్లు కూలిపోతున్నాయి. కొండమల్లయ్య ఇంటికి కొంచెం దూరంలో వున్న చింతచెట్టుకొమ్మ ఫెళఫెళమని విరిగి కిందబడింది. అందరూ తలుపులు మూసి లోపలికెళ్ళారు. వాతావరణమంతా మహా భీభత్సంగా వుంది. అరుగుమీద వాల్చున్న మంచంలో కూర్చొనున్న కొండమల్లయ్య మనసు బయటివాతావరణం కంటె ఆందోళనకరంగా వుంది. మీద దుమ్మువడుతున్నా అక్కణ్ణుంచి లేవడం లేదతను. కొద్దిసేపు సుడిగాలి వీచి, నానా భీభత్సంచేసి ఒకటి రెండు చినుకులు రాల్చి ఆగిపోయింది. కొద్ది నిమిషాల్లోనే వాతావరణం ఇంతవరకేం జరుగనట్టుగా ప్రశాంతంగా మారింది. యుద్ధం జరిగేది కొద్దిరోజులే అయినా, ఓ ప్రదేశంపై బాంబు విడవడానికి కొన్ని నిమిషాల సమయమే తీసుకున్నా యుద్ధంవల్ల కల్గిన గాయాలు మానడానికి, నష్టం పూడడానికి సంవత్సరాలు, దశాబ్దాలు, పట్టినట్టు ఆ కొద్ది నిమిషాల సుడిగాలి భీభత్సం గుడిసెవాసులకెంతో నష్టాన్ని కలుగజేసింది.

కొండమల్లయ్య మనసదోలావుంది. నర్సమ్మకు దుఃఖంగావుంది. తిరుపతయ్య నిర్లిప్తంగా వున్నాడు. రాజయ్యకు ఓ దిక్కు బాధగానూ, మరో దిక్కు సంతోషంగానూ వుంది. లక్ష్మికానందంగా వుంది. కాంతమ్మ ముభావంగా వుంది.

తెల్లవారితే రాజయ్య గోదావరిఖని బొగ్గుగనుల్లో బదిలీ ఫిల్లర్‌గా చేరడానికి వెళ్లబోతున్నాడు.

కొడుకు సింగరేణి గనుల్లో, వెళ్ళడానికి ఊరు విడిచి పోతున్నందుకు కొండమల్లయ్యకు బాధగా వుంది. రెక్కలకష్టం చేసుకుంటూ పుట్టినూళ్లో బతుకక బొగ్గుబావి పనికి పోతున్నందుకు కొడుకుపై జాలిగా వుంది. అదేమైనా సుఖంవనా? ఊరిపెట్టు లోపలకు దిగాలి. లోపలకు దిగిన వ్యక్తి మళ్ళీ పైకొస్తాడన్న నమ్మకం లేదు. పెద్దపెద్ద తట్టల్లో బొగ్గు నింపాలి. బొగ్గు మొయ్యాలి. పై దొరలు చెప్పినట్టు వినాలి. ఒకరి కింద బానిసగా పడివుండాలి. వ్యవసాయం చేసుకుంటూ గదుకో, అంబలో తింటూ స్వతంత్రంగా బతికేవాడు అక్కడ కూలీగా బతకాలి. ఇలా బతకడం కొండమల్లయ్యకిష్టంలేదు. కాని, కొడుకు కోదలు పట్టుబట్టింతర్వాత కాదనలేకపోయాడు. కాని తన కన్నకొడుకును, ఇన్నేళ్ళుగా తన కష్టసుఖాల్లో పాలుపంచుకున్న తన రక్తాన్ని మృత్యుకూపాల్లాంటి బావుల్లోకి పంపడం అతనికి బాధాకరంగా వుంది. తాను బతికినట్టే బతుకుతూ కొడుకు కళ్ళముందుంటే చాలనుకున్నాడు. కాని, తన కళ్ళముందే కొడుకు ఊరు విడిచి వెళ్ళిపోవడానికి సిద్ధంకావడం, తనకు దూరంగా గోదావరిఖనిలో ఉండడానికి

తయారవడం అతడు భరించలేకపోతున్నాడు. కొండమల్లయ్యా వంశంలో ఇంతవరకెవ్వరూ ఆ ఊరును వదిలిపెట్టి బతకడానికి వేరే చోటికి వెళ్ళలేదు. తాతముత్తాతల తరంనుంచీ వాళ్ళదదే ఊరు. వాళ్ళంతా ఆ ఊళ్ళోనే పుట్టారు. అక్కణ్ణే పెరిగారు. అక్కణ్ణే భూమిని నమ్ముకునే బతికారు. ఆ మట్టిలోనే కలిసిపోయారు. మొట్టమొదటిసారిగా తన వంశంలో తన కొడుకే ఊరును వదిలిపెట్టి బతకడానికి పోతున్నందుకాతనికి బాధాకరంగా వుంది. అదయినా రాత పూతలాంటి నౌకరయితే బాగుండేది. ప్రమాదకరమైన, కష్టమైన పనికి పోతున్నందుకే వ్యథ చెందుతున్నాడు. అంతే కాకుండా అక్కడెలాంటి స్నేహాలు చేస్తాడో, తర్వాత తన మాట వింటాడో లేదో, తనగ్గాకుండా అయిపోతాడేమోనని ఆందోళన చెందుతున్నాడు. తనగ్గాకుండా పోయినా ఫర్వాలేదుకాని కొడుకు సుఖంగా వుండాలని, ఏ ప్రమాదానికి గురికాకుండా ఉండాలని వేయి దేవుళ్ళకు మొక్కుకుంటున్నాడు కొండ మల్లయ్యా.

'గోదావరిఖనిలో ఎలా పనిచేస్తాడో కొడుకు? బావిలోకి వెళ్ళితే తల్లి గర్భంలోకి పోయినట్టే నంటరు. ఎట్లుంటడో కొడుకు? ధర్మరాజు లాంటోడు నా రాజన్న. పెండ్లాం మాటవిని బావి పనికి పోవట్టె. ఎన్నో చెప్పి బలవంతం చేసి కొడుకును మార్చింది కోడలు. అక్కడ వాళ్ళిద్దరే ఉంటారు. ఇంకెన్ని చెప్పుతదో? కొడుకును నాకు గాకుంట చేస్తదేమొ? రాజన్నకు నామీద.ఎంత ప్రేముండె? ఎప్పుడన్న నేను వాళ్ళ తండ్రి తిట్టినప్పుడు అలిగి అన్నం తినకుంటె కొడుకు కూడా తినకపోవు. నేను తినేంతవరకు తినకపోయ్యేవాడు. చిన్నప్పట్నుంచి నేనంటే ఎంత ప్రాణం కొడుక్కు? ఇక కోడలు ఎట్ల మారుస్తదో? ఏమొ? రాజన్నకు మందు పెట్టిందో? మాకు పెట్టిందో? బావి పనికి పోతానని ఒకేపట్టువట్టె. అక్కడెట్లుంటడో ఏమొ? కొడుకన్న సుఖంగుంటె చాలు?' కొడుకును గూర్చి రకరకాలుగా ఆలోచిస్తోంది నర్సమ్మ. కొడుకు ఊరు వదిలిపోడానికి కోడలే కారణమని నిందిస్తోంది.

దిక్కుమాలిన ఆర్థిక ఇబ్బందులవల్ల ఉన్న ఊరును, కన్న తల్లిదండ్రులను, పుట్టిపెరిగిన వాతావరణాన్ని, ప్రాణానికి ప్రాణమిచ్చే స్నేహితులను, బంధువులను అందర్నీ వదిలిపెట్టి అన్న ప్రమాదభూయిష్టమైన పనికి పోవలసి వస్తున్నందుకు తిరుపతయ్యకు విచారంగావుంది. అన్న ఊరు విడిచి పోవడానికి కారణమైన పరిస్థితులగూర్చిబాధపడుతున్నాడతను.

అంతగా మాటకారి, చతురుడు కాని అన్నయ్యా గోదావరిఖనిలో ఎలా వుంటాడో, ఎలా నెట్టుకొస్తాడో, కష్టమైన బావిపని నెలా చేస్తాడోనని విచారిస్తోంది కాంతమ్మ. వదిన లక్ష్మి చాకచక్యంపై గడుసుదనంపై నమ్మకముందామెకు.

రాజయ్యకు ఓదిక్కు సంతోషంగా, మరోవైపు విచారంగా వుంది. అంతా కలగాపులగంగా ఉంది.

బావిపని చేయడంవల్ల ప్రతినెలా పన్నెండువందలు, ఒక్కోసారి పదిహేను వందల రూపాయలకు పైన్నే సంపాదించవచ్చు. ప్రతి చిన్న అవసరానికి నాన్ననడిగే అవసరముండదు. ఊళ్ళోలా మట్టి బతుకు బతికే పనుండదు. లోపల పనెలావున్నా బయటకొచ్చింతర్వాత ఇస్త్రీ బట్టలేసుకొని ఊళ్ళో తిరగొచ్చు. మంచి బట్టలేసుకొని ఊరికి రావచ్చు. నౌకరి చేస్తున్న వాడంటే ఊరివాళ్ళు గౌరవిస్తారు. చుట్టూ మూగుతారు. తన చేతిలో ఇప్పట్లా కాకుండా ఎంతో కొంత డబ్బుంటుంది. ప్రతిపైసకూ ఇబ్బందిపడే అవసరముండదు. నాన్నకు కూడా వీలును చూసుకుని కొంత సహాయం చెయ్యొచ్చు. వ్యవసాయం చేస్తూ ఎన్నేండ్లు మట్టిలో రాత్రింబవళ్ళు పనిచేసినా తేపకింత భూమి అమ్ముడుపోతూనే వుంది. కొద్దికాలం గడిచి తన దగ్గర డబ్బు కూడితే అప్పులు తీర్చవచ్చు. వీలైతే మరికొంత భూమిని కూడా కొనుక్కోవచ్చు. ఇన్ని విధాలుగా బావి పనికి పోవడం ఆనందంగానే వుందతనికి. కాని పాతికేళ్ళకుపైగా అలవాటుపడ్డ పనిని, ఉన్న ఊరును, కన్న వాళ్ళను, బంధువులను, దగ్గరి వాళ్ళను, ప్రాణానికి ప్రాణమైన స్నేహితులను వదిలి పోవాల్సివస్తున్నందుకాతనికి వేదనగా వుంది. పోగా బావుల్లో జరిగే ప్రమాదాల గూర్చి విన్న రాజయ్యకు కొంత భయంగానూ




వుంది. ఆయువు మూడిందంటే ఎక్కడున్నా పోతారని తనను తానే సమాధానపర్చుకున్నాడు.

లక్ష్మి మాత్రం ఊహల్లో తేలిపోతోంది. తనకింకెప్పుడూ మట్టిబతుకు బతకాల్సిన అవసరముండదు. మట్లెమట్లె మోటుపని చేసే అగత్యముండదు. మోటగొట్టే ఎడ్లలా వెనుకెనుకకు నడుస్తూ నాటేసే పనుండదు. తనమీద అత్తమామల పెత్తనముండదు. భర్త, తాను మాత్రమే అక్కడుంటారు. భర్త డబ్బు సంపాదించి తన చేతుల్లోనే పోస్తాడు. తాను, తన భర్త మంచి బట్టలు కొనుక్కోవచ్చు. మంచి తిండి తినొచ్చు. తమకిష్టమైనట్టు ఖర్చు పెట్టుకోవచ్చు. కాబోయే పిల్లలకొరకు డబ్బు సంపాదించుకోవచ్చు. బావి పని చేసే మగవాళ్ళకు కొంత కష్టమే. కాని ఆడవాళ్ళకేమంత పనుండదు. వంట చేయడం బట్టలుతకడం, పిల్లలను సవరించుకోవడంలాంటి పనులు తప్ప మోటు కష్టం చేయాల్సిన పనుండదు. ఇక్కడిలా రాత్రి పగలు, ఎండలో, వానలో, చలిలో వ్యవసాయప్పనులు చేసే అవసరముండదు.

రకరకాలుగా ఆలోచిస్తున్న లక్ష్మికి భర్త తన మాటలు విని బావిపనికి పోతున్నందుకు సంతోషంగా వుంది. 'ఏరువడితెనే మేలు మగడా, మనము పొత్తుంటేనేపోరు మగడా' తనలో తానే పాడుకుంటూ ఆనందపడ్తోంది లక్ష్మి.

దుఃఖంతో కొందరు, సంతోషంతో కొందరు ఆ రాత్రెవరూ సరిగ్గా భోజనం చేయలేదు. ఎవరికీ సరిగ్గా నిద్రకూడా పట్టలేదు.

పంటచేను వదిలిపెట్టి పరిగేరుకున్నట్టుగా భావిస్తూ కొండమల్లయ్య, కాంతమ్మ రాజయ్యను ఆ పనికి పంపడానికే రాత్రంతా తమనుతాము తయారు చేసుకున్నారు.

తెల్లవారింది... అందరి ముఖాల్లోనూ విచారం. లక్ష్మి మాత్రం హుషారుగా వుంది. ట్రేనింగ్ పూర్తయ్యేవరకు లక్ష్మిని ఊళ్లోవుంచి పొమ్మన్నాడు కొండమల్లయ్య. వర్షం పడితే వ్యవసాయప్పనులుంటాయని, తమ కవనరంగా వుంటుందని రాజయ్యతో చెప్పాడు. రాజయ్యకు భార్యను ఇంట్లోనే వుంచి పోదామనుంది. కాని, లక్ష్మి ఎంత చెప్పినా వినడంలేదు. భర్తతో పోవడానికే పట్టుబట్టింది. బలవంతంగా వదిలిపోతే అత్తా కోడళ్ళమధ్య గొడవలొస్తాయని రాజయ్య భార్యను వెంటతీసుకుపోవడానికే నిర్ణయించుకున్నాడు. గోదావరిఖనిలో బావిపని చేస్తున్న రాజేశం గుడిసెలో ఓ గది ఖాళీ వుందని, ప్రస్తుతాని కక్కడ్నే వుంటానని తండ్రికి చెప్పాడు.

సగం బస్తా బియ్యం, కొంత పప్పు, చింతపండు, మిరప్పొడి, రెండు వంట పాత్రలు, ఇద్దరు తినడానికి గిన్నెలు, ఓ ఇత్తడి చెంబు పక్కబట్టలవీ సర్దుకున్నారు రాజయ్య, లక్ష్మి. భోజనాలు ముగించి వాట్ని బండ్లో వేసుకొని బస్టాపుదగ్గరికెళ్ళారందరు.

''బిడ్డా... ఎవ్వలజోలికి పోకు. కొట్లాటలు పెట్టుకోకు''

''అక్కడ గూండాలుంటరట... పైలం''

''కడుపునిండ తిను''

''ఆరోగ్యం పాడుజేసుకోకు''

''ఆపేక్షకొద్ది రుక్సత్ లేకుండ పన్జెయ్యకు''

''మీరిద్దరు మంచిగ కలిసిమెలిసి ఉండుండ్రి''

''బస్సొచ్చేవరకు కొడుక్కు, కోడలుకు ఎన్నో బుద్ధి మాటలు చెప్పారు నర్సమ్మ, కొండమల్లయ్య.

తల్లిదండ్రుల ఆప్యాయతకు రాజయ్య కళ్ళు చెమర్చాయి. లక్ష్మికామాటలు వినడం విసుగ్గావున్నా భరిస్తోంది.

కొద్దిసేపట్లో బస్సొచ్చింది. రాజయ్య, తిరుపతయ్య కలిసి సామాన్లను బస్సులో కెక్కించారు. అమ్మనాన్నలకు, చెల్లె, తమ్ముడికి వీడ్కోలు చెప్పి రాజయ్య బస్సెక్కాడు. అందరితో పొయ్యొస్తానని చెప్పి లక్ష్మి బస్సెక్కి కూర్చుంది. కడివెడు దుఃఖాన్ని కడుపులో పెట్టుకొని కొండమల్లయ్య, నర్సమ్మ కదులుతున్న బస్సులో వున్న కొడుకు, కోడలుదిక్కు చూస్తూ నిల్చున్నారు. బస్సు కనుమరుగయ్యేంతవరకలాగే నిల్చున్నారు. తన కొడుకును తనకు గాకుండా దూరంగా తీసుకెళ్తున్న రాక్షసిలా తోస్తోంది వాళ్ళకాబస్సు.

''వెనుక ముందు లేనోడు... నోట్లో నాలుకే

లేనోడు. ఎవ్వల దీము (అండ) లేనోడు నా కొడుకు. మమ్ముల నిడిసిపెట్టి పోవట్టె. రాజ్జంగాని రాజ్జంల ఎట్ల బతుకుతడో ఏమొ?'' అక్కడున్న కాపు కాంతవ్వను పట్టుకొనేడ్చింది నర్సమ్మ. అక్కడున్నవాళ్ళు సానుభూతి ప్రకటి స్తుంటే కొంగుతో కళ్ళొత్తుకుంది నర్సమ్మ. భార మైన హృదయాలతో బండెక్కి ఇంటికెళ్ళారు వాళ్ళు.

బస్సులో కూర్చున్న రాజయ్య తాను పుట్టిపె రిగిన మట్టిని, తిరిగిన నేలను, బతికిన ఊరు ను, తన ఇన్నేళ్ల జీవితంలో సంబంధమున్న ప్రదేశాలను దాటుతూ, బస్సు పోతుంటే బాధగా కళ్లు మూసుకున్నాడు. అతని స్మృతిప థంలో తాను చిన్నప్పుడాడుకున్న బొంగరా లాట, చిర్రగోనెలాట, గోలీలాట, పిక్కలాట, దాగుడుమూతలాట, బిళ్ళాట, కబడ్డీ ఆటల లాంటి దృశ్యాలు కదులుతున్నాయి. ఎడ్లను, బర్లను ఏట్లోస్నానం చేయించి వాటిపై కూర్చొని పాటలు పాడుకుంటూ ఊళ్ళోకొచ్చిన సంఘటనలు జ్ఞాపకం వస్తున్నాయి.

అతని బాల్యస్నేహితులు, వాళ్ళతో కొట్లాట లు, అలగడాలు, ఆటలు, గుట్టలెక్కుతూ ఎడ్ల మేపడం, మోట దూలమెక్కి బావుల్లోకి దుము కుతూ ఈత కొట్టడం, ఏట్లో ఈ ఒడ్డునుండి ఆ ఒడ్డుకు ఈదుతూ పోవడం, ఎడ్ల మేపుతూ పాటలు, ఆటలు అన్నీ అతని కళ్ళముందు కదులుతున్నాయి. చెట్లకు ఊయలలు కట్టి ఊగడం, తల్లి లాంటి ఏరు, చిర్రగోనెలాడుతూ ఫర్లాంగుల దూరమురకడం జ్ఞప్తికొస్తున్నాయి. కాట్రేవుల పండుగ, దసరాపండగ, కాముని పాటలు స్మృతిపథంలో మెదులుతున్నాయి. పచ్చిపెసరకాయ, కందికాయ, వల్లికాయ తిను కుంటూ ఎగరడం, దుముకడం, పచ్చి అటుకు లు కాల్చుకుతినడం, తంపులు పెట్టి పచ్చి మొక్కజొన్న కంకులు కాల్చుకొని తినడం జ్ఞా పకం చేసుకుంటున్నాడు. కాళ్ళు చేతులు నొప్పి పెట్టేంతవరకు పనిచేయడం, వ్యవసా యవ్వనులు చేస్తూ వడ్డపాట్లు, బాల్యస్మృతు లు, తీపిచేదు జ్ఞాపకాలు అన్నీ కళ్ళముందు కదిలి రాజయ్యకు తాను కూర్చున్న బస్సు తనను తనకాత్మీయమైన మట్టినుండి, ఆత్మీ యులనుండి దూరంగా తీసుకుపోతున్నట్లని పిస్తోంది. ఆ ఊళ్ళోని ప్రతి చెట్టుతో చేనుతో, ఏటితో నీటితో, చెరువుతో కుంటతో, గుట్టతో పుట్టతో, ఎత్తువల్లంతో, చేనుతో చెలకతో, పొలంతోప్రతి అంగుళం భూమితోనూ ఆత్మీయ తాభావముంది రాజయ్యకు. అక్కడి గాలిపీలు స్తూ, నీరు తాగుతూ, ఆ నేలలో పండిన ఆహారం తింటూ ఇన్నేళ్ళు బతికిన రాజయ్యక క్కడిగాలితో విడదీయరాని మమేకముంది. బస్సు ఆ ఊరి పొలిమేరలు దాటుతున్న సమయంలో చల్లటి పిల్ల తెమ్మెరొచ్చి రాజయ్య ముఖానికితాకి వీడ్కోలు చెప్పింది.

తాను లేకుంటే తండ్రి ఒంటరిగా వ్యవ సాయం చేయగలడా? తమ్ముడున్నా చదువుకు న్నవాడు కాబట్టి తనలాగా పనిచేయగలడా? నాన్నకు తానన్ని విధాల కుడిభుజంగా వుండే వాడు. వృద్ధాప్యంలో తల్లిదండ్రులనొదిలి తాను దూరంగా పోవడం న్యాయమేనా?

రాజయ్య ఆలోచనలతో తనకేమీ సంబంధం లేనట్టు బస్సు తన గమ్యస్థానం దిక్కు సాగిపోతూనేవుంది.

పరిస్థితులు తరిమివేయగా కడుపులు చే తుల్లో పట్టుకొని కొంతమంది, బ్రతుకుతెరువు ను వెతుక్కుంటూ కొంతమంది, కడుపులు నింపని వృత్తులను వదిలి కొంతమంది, చదు వుకొని ఉద్యోగాలు చేస్తూ కొంతమంది, ఉద్యో గాలను వెతుక్కుంటూ కొంతమంది ఊళ్లనొ దిలి వలసపోతున్నారు. అందువల్ల ప్రతి ఊళ్లోనూ కూలిపోతున్న గోడలు, పగిలిపోతున్న పెంకులతో శిథిలావస్థలో వుండి వాట్ని చూసే దిక్కులేక పాడుబడ్డ ఇండ్లు తాళం కప్పలతో ఎన్నో కనిపిస్తాయి. మరికొన్నేళ్లలో బ్రతుకుతె రువుకోసం యువకులు ఊరొదిలిపోతే బిక్కుబి క్కుమంటూ ఇంటిపట్టునవున్న వృద్ధులు కని పిస్తారు.

★ ★ ★

తెలంగాణాలో ఓ విచిత్రమైన పరిస్థితి కొనసా గుతోంది. ఓ దిక్కు ప్రజాపోరాటాలు ఉధృ తంగానే వున్నాయి. మరోదిక్కు అవ్వబాంచెను, అయ్యబాంచెను సంస్కృతీ వుంది. అన్నలు పాడే పాటలతోపాటు అదుగో లేడీ బంగరులేడీ లేడి బాయెరా, బాగామిడువురాలాంటి సాంప్ర దాయకమైన పాటలూ వున్నాయి. ప్రజలనోళ్ల

ల్లో భారతం నిత్యం నానుతూ వుంటుంది. ఎంత చదువురానివాడైనా భారత కథ గూర్చి కొంతైనా తెలుసుకొనుంటాడు. సినిమాలొచ్చి జానపద కళలు దెబ్బతింటున్నా కొంతలో కొంతైనా వాటికిప్పటికీ ఆదరణుంది. అందు క్కారణం అన్ని ఊళ్లలోనూ సినిమా హాళ్లుండ కపోవడం కావచ్చు.

ప్రతి ఊళ్లోను ప్రజాపోరాటాలకు మద్ద తుంది. పోచమ్మ, మైసమ్మలాంటి దేవతలను కొలవడమూ వుంది. చిరుతల రామాయణం పాటలతో పాటు, ''దొర ఏంటిదిరో దొరతన మేంటిదిరో'' పాటలు కూడా ప్రతిగ్రామంలోనూ వినిపిస్తాయి.

ఆతురతతో ఆందోళనతో రైతులు ఎదురు చూస్తున్న తొలకరి వర్షాలుపడ్డాయి. దాహార్తియై వున్న భూమి పులకరించింది. బీటలువారున్న నేల పరవశించించి. దుమ్ముధూళిమయమై పగుళ్లు బడున్న ధాత్రి పచ్చదనాన్ని సంత రించుకుంది. తొలకరి వర్షాలు రైతులకు అమృతపు జల్లుల్లా వున్నాయి. మట్టిమనుమల ముఖాల్లో ఆనందం వెల్లివిరిసింది. వెలవెల బోతున్న ముఖాలు కళకళలాడుతున్నాయి.

అయితే కొత్త పచ్చగడ్డి తిన్న గొర్రెలు చిటుకు రోగాలొచ్చి చనిపోతున్నాయి. గొర్రెల కాపర్లు ఆందోళన చెందుతున్నారు. గొర్రెల మాంసం కిలోకు ముప్పైయారుండేది. చనిపో యిన గొర్రెల మాంసం కావడం వల్ల పదిహేను రూపాయలకే దొరుకుతోంది. డాకులు వేయ డంలాంటి సాంప్రదాయక వైద్యంతోపాటు పశు వుల డాక్టర్ను పిలిచి ఇంజక్షన్లవీ ఇప్పిస్తున్నా రు. పశుపుల డాక్టర్లు ఉచితంగానే గొర్రెలకు మందులివ్వాల్సిఉన్నా మందకు కొంతని డబ్బుతీసుకొని ఇంజెక్షన్లిస్తున్నారు. ఇదువర కైతే బ్రతిమాలించుకొని చుట్టూ తిప్పుకొని ఒక గొర్రెకింతని డబ్బు తీసుకొని మందులిచ్చేవా రు. అన్నల భయానికిప్పుడు ఖచ్చితంగా డి మాండు చేయకున్నా కొంత డబ్బు తీసు కుంటున్నారు. రైతులు కూడా తమ పశువు లకు ఇంజెక్షన్లవీ ఇప్పిస్తున్నారు. గొల్లలు సాంప్రదాయబద్ధంగా పనుకపిల్ల పండుగ చే సుకున్నారు.

రైతులు పునాస నాగళ్లు సాగుతున్నారు. ఎద్దుకో నాగలన్నట్టుగా చేలనిండా ఎక్కడ చూ సినా నాగళ్లే. పెసళ్లు, మొక్కజొన్నలు, పల్లీ ల్లాంటి విత్తనాలేయడానికై దుక్కులు దున్ను తున్నారు. ఆడవాళ్లు విత్తనాలేస్తుంటే, పడుచు వాళ్లు వాళ్ల ఒంపుసొంపుల దిక్కు చిలిపిగా చూస్తూ ,చిలిపి చిలిపి పాటలు పాడుతూ ఉత్సాహంగా కొండ్రలేస్తున్నారు. దుక్కి దున్ను తున్నారు. వరుసైనవాళ్లు పరాచికాలాడు కుంటున్నారు. పడుచు జంటలు శ్రమజీవ నంలోనే అందాన్ని ఆనందాన్ని చూస్తూ పను లుచేస్తున్నారు.

జెజ్జెనకర జెనారే జెనక జెనా జెనారే, ఊరు మేలుకొన్నదీ, ఏరు మేలుకొన్నదీ పాటలను కొందరు పాడుతున్నారు. రారేముల్లో కల్లుదాగ పోదాము, ఏరువాకా సాగుమురో రన్నో చిన్నన్న లాటి పాటలు కొందరు పాడుతున్నారు. చేలల్లో ఎక్కడ చూసినా సందడి. ఎడ్లు, దున్నపోతు లు, గొడ్డుటావుల నాగళ్లు సాగిపోతున్నాయి. పిల్లల్నుంచి, ముసలివాళ్లవరకు ఏకొంచెం చే తనైనవాళ్లయినా వ్యవసాయ పనుల్లో మునిగి పోతున్నారు. తెల్లవారిందంటే పనిమొదలు. రాత్రివరకు విరామం లేకుండా పని. భక్తిగీతా లు, జానపదగేయాలతోపాటు అన్నల పాటలూ నాగళ్లు దున్నుతున్న వాళ్ల నోళ్లలో నానుతు న్నాయి.

తొలకరివర్షాలు చూసిన కొండమల్లయ్య ఆనందపరవశుడయ్యాడు. కష్టకాలంలో పశు వులమేత కొనడం తప్పినందుకు సంతోషించా డు. అతనికిప్పుడు రెండెకరాల మాగాణి, ఒక్క ఎకరం మెట్ట మాత్రమే వుంది. ఎకరం చేలో పెసలు, మిగతాదాంట్లో పల్లి, మొక్కజొన్న వేయాలనుకుంటున్నాడు. తన ఎకరం పొలంతోపాటు, మరో ఎకరం ఎవ్వరిదైనా కౌ లుకు దున్నాలనుకుంటున్నాడు.

రాత్రి కుంభవృష్టి కురిసి వెలిసింది. తెల్ల వారి ఆకాశంలో సప్తవర్ణాల ఇంద్రధనుస్సు అందాలు చూపుతూవుంది. ఆకాశమంతా ఎర్ర డాలు పడుంది. వాతావరణం ఆహ్లాదకరంగా వుంది. నాగలి కట్టుకొని చేలోకెళ్లాడు కొండమ ల్లయ్య. కొండ్రలేశాడు. పంచెలో వున్న పెసళ్ల ను కొండ్రల మధ్య తిరుగుతూ అంతటా

సమానంగా పడేట్లు చల్లాడు. ఈరోజు పెసల్లల కడం పూర్తిచేసి తెల్లవారినుంచి మొక్కజొన్న పల్లి వేయడానికి దుక్కి దున్నాలనుకుంటున్నాడు. పగ్గం చేతిలో పట్టుకొని ముల్లుగఱ్ఱతో కొట్టి ఎడ్ల నదిలించాడు. నాగలి సాగుతోంది. దాపలెద్దు (ఎడమదిక్కు) బాగానే నడుస్తుంది. కాని వలుపలెద్దు సరిగా నడవడంలేదు. తేపతేపకాగుతుంది. జా, జా అని అదిలిస్తూ ముల్లుకఱ్ఱతో పొడుస్తున్నాడు. కొద్దిసేపు నడిచి ఆగిపోతుందది. ఎంత అదిలించినా, కొట్టినా ఆ ఎద్దు అంతంతమాత్రంగానే నడుస్తుంది.

'ఎద్దు నడవడంలేదు. పదిహేను దుక్కులుంది. ముసలిదైనట్టుంది. ముప్పయ్యారు రోగాలకు మందు చురుకని వాతలు కూడా పెట్టించాడు. అయినా వయసుడిగిపోతున్న తర్వాతెలా నడుస్తుంది? కొత్తదాన్ని కొంటే బాగుండేది. కాని, కష్టకాలంలో కొనడం సాధ్యంకాదు. మరీ ఎద్దుతో పనివెళ్లుతుందా...? పునాస, మడికట్టు ఈ ఎద్దు దున్నుతుందా...? పచ్చగడ్డిని బాగా మేపితే...? ఉలవలపిండి పెడితే...? ఎలాగోలా వెళ్లదీయాలి. పునాస విత్తనాలు పడితే మడికట్టు సంగతి తర్వాత చూడొచ్చు. అయినా దున్నడానికేమంత మడికట్టుంది? అదయినా వెళ్లడం కష్టమే. ఈసారి పంటపండిన తర్వాత ఎలాగైనాచేసి ఓ ఎద్దును కొనాలి. రెండేళ్లనుంచి ఇలాగే గడిచిపోతోంది. ఏదో అవసరాలు. ఎప్పుడూ డబ్బుకు కటకటే. ఈ పంట పండేవరకయితే మెల్లమెల్లగా ఈ ఎద్దుతోనే వెళ్లదీయాలి. తనలోతాను అనుకుంటూ నాగలి దున్నుతున్నాడు కొండమల్లయ్య. ఎంత ప్రయత్నించినా వలుపలెద్దు దాపలెద్దులా నడవడంలేదు. కొండమల్లయ్యకు చిరాకుగా వుంది. పని తొందరగా కావడంలేదని బాధగా వుంది. ఆ ఎద్దుతో పనెలా వెళ్లుతుందోనని విచారంగా వుంది. అతని మనోనేత్రం ముందు పాతజ్ఞాపకాలు కదులుతున్నాయి. నాగలి సాగిపోతూనే వుంది.

ఏటికింది పొలంలో మడికట్టు దున్నుతున్నాడు కొండమల్లయ్య. మోకాళ్లవరకు దిగబడుతుంది. ఎంతో కష్టంగా ఎద్లు ఒక్కో అడుగే తీసివేస్తున్నాయి. దిగుబాట్లో అతికష్టంగా నడుస్తున్నాయి. దాపలెద్దు ముసల్దయింది. మొదలే దిగుబాటు. అందులో ముసలెద్దు. దానికి నాగలి లాగడం మరీ కష్టమవుతోంది. అప్పటికే చాలామంది పొలాల్లో నాట్లేయడం అయిపోయింది. కొండమల్లయ్య పనులు వెనుకబడుతున్నాయి. పొలం దున్నడం ఎదగడంలేదు. మరీ ఆలస్యంగా నాటేస్తే పంట సరిగా రాదేమోనన్న భయం ఓవైపు. పనిసాగడంలేదన్న రోషం మరోవైపు. ముల్లుకఱ్ఱతో దాపలెద్దు దండంతా చితకపొడిచాడు. దండ వెనుక భాగం జల్లెడ రంధ్రాల్లా తయారై ఎఱ్ఱగా వుంది. పొడిచిన చోటునుండి రక్తం కారుతోంది. ఎద్దు కండ్లవెంట నీళ్లు కారుతున్నాయి. పుండుమీద పురుగులు వాలుతున్నాయి. తోకతో ఈగలు, దోమలు పారద్రోలడం కూడా ఆ మూగజీవికి కష్టంగానే వుంది. కొండమల్లయ్యకు పనికావడంలేదన్న బాధుంది. పనిపూర్తిచేయాలన్న ఆరాటముంది. ఎద్దు బాధను గమనించేస్థితిలో లేడతను. ఎద్దు జబ్బల్లో పొడిచాడు. ముల్లుకఱ్ఱతో ఇష్టమొచ్చినచోటల్లా పొడుస్తూ కొడుతున్నాడు. అయినా ఎద్దు నడవడంలేదు. నాలుగైదు అడుగులేస్తూ ఆగిపోతుంది. పొడుస్తే మరికొన్ని అడుగులేస్తూ నిల్చుంటుంది. నాగలి తాబేలు నడకలా సాగుతోంది.

ఓ దిక్కు వృధాగా పొద్దుపోతోంది. కడుపులో నకనకలాడుతూ ఆకలి. పనసలే ఎదగడంలేదు. కొండమల్లయ్య దున్నాల్సిన పొలం అదికాకుండా ఇంకా వుంది. ఎద్దును అదిలిస్తున్నాడు. బురదకిస్తున్నాడు. బూతులు తిడుతున్నాడు. ముల్లుతో పొడుస్తున్నాడు. కఱ్ఱతో కొడుతున్నాడు. కానా ఎద్దు ఇప్పుడు ఒక్కచాలు (లైను) కూడా పూర్తిగా నడవకముందే ఆగిపోతోంది. కొండమల్లయ్యకు భలే చిరాకుగా వుంది. వినుగ్గా వుంది. కఱ్ఱతో దబదబా బాదాడు. కొంచెం నడిచి నిల్చుంది ఎద్దు. తల విదిలించి బురదలో పడుకుంది. నాగలాపి నిస్సహాయంగా నిల్చున్నాడు కొండమల్లయ్య. కొద్దిక్షణాలాగి తోక కొరికి దాన్ని లేపాడు. నాలుగైదు చాళ్లయినా నడవకముందే మళ్లీ పడుకుంది ఎద్దు. ఈసారి తోక కొరికినా లేవడంలేదు. గజ్జల్లో చేయిపెట్టి నిమిరి లేపాడు. లేచి నిల్చుంది కానది నడవడంలేదు. కట్టెతో కొడితే తోక విసుర్తుంది. బురదంతా అతనిమీద పడు




తోంది. కొండమల్లయ్య బట్టలన్నీ బురదమయమై అతని శరీరం బురదతో స్నానం చేసినట్టుంది. కాలుకొంకుల మధ్య విపరీతంగా కొట్టాడు కొండమల్లయ్య. కొద్ది అడుగులేసి ఆగిపోయింది. కొడ్తున్నా వినకుండా పడుకుంది. ఈ సారాతడెన్ని ప్రయత్నాలు చేసినా అది లేవడంలేదు. విసుగొచ్చి నాగలాపి నిస్సహాయంగా నిల్చున్నాడు కొండమల్లయ్య. ఎద్దుదిక్కు జాలిగా, కోపంగా చూస్తున్నాడు. తన పొలం దగ్గరికెళ్తున్న రామారావు పంతులు అక్కడికొచ్చి నిల్చున్నాడు. ఒడ్డుపై నిల్చున్న పంతుల్ను చూసి కొండమల్లయ్య రెండు చేతులు జోడించి నమస్కరించాడు. ప్రతి నమస్కారంచేసి ముఖమదోలా పెట్టాడు రామారావు.

"ఏందోయ్ కాపయినె... ఎద్దును పొడిచి పొడిచి చంపుతున్నవేంది?" అన్నాడు.

"ఏంజెయ్యాలె పంతులు? ఎద్దేమొ నడుస్త లేదు. పని వెనుకబడి పోవట్టె. ఎద్దుంజూస్తె పాపమనిపిస్తంది. కాని, నడుస్త లేకపాయె. ఎట్ల పంతులు?" "ముసలెద్దును పొడిస్తే ఎట్ల నడుస్తదనుకుంటున్నావు? కసాయోని కంటే అధ్వాన్నం చేస్తున్నవేంది? ఎద్దుంజూస్తె పాపమనిపిస్తలేదా...? ఏం మనిషివోయ్?"

"నాకు మాత్రం ముసలెద్దుతోని దున్నన్ని వుందా పంతులు? కాని, ఏం జెయ్యన్నో చెప్పుండ్రి. ఇప్పుడు ఎద్దును కొనన్నంటె వెళ్ళేటట్టున్నదా...?"

"ఏం వెళ్లుడో ఏమొ? రక్తం జూస్తుంటే కండ్లుతిరుగుతున్నాయి.ఏం కొట్టుడది? ఎద్దు శరీరంనిండ జల్లెడరంధ్రాల్లా తిరుగపొడిచిన వుగద... నువ్వేమన్న కాపోనివేనా...? ఎద్దును పొడిచి చంపెటట్టున్నవు. ఏం కట్టెకోత కుల మోయ్ మీది? దాన్ని జూస్తె పాపమనిపించ డంలేదా? నీకేమన్న బుద్ధుందా? ఓ ఎద్దును కొను..."

"కొనల్నని! మా ఉంది. కాని, నా దగ్గర పైసలేడున్నయి పంతులు?"

"ఎప్పటికి పైసలెల్వని ఏడ్పుడే. బరుకతితక్కె కులం మీది... ఛీ"

"మీరు వెయ్యికాళ్ల జెర్రులు. ఎద్దుముడ్డి పొడుచుకుంటూ బతికేటోల్లం మేం. ఎంత జేసినా ఎప్పటి చిప్ప ఏనుగులకే అన్నట్టుంది వ్యవసాయం"

"మా మాట్లాడినవు తియ్యి. కాని, నువ్వు ఎద్దును కొందామనుకున్నంక డబ్బులే దొరకవా? నేనిస్త పైసలు. ఎల్లుండి గర్రెపల్లి అంగట్లోకి పోయి కొనుక్కచ్చుకో... నీకు వెళ్లినప్పుడే డబ్బులియ్యి. అబ్బ... రక్తం జూస్తంటే కండ్లు తిరుగుతన్నయి"

పంతులుచూపినవాత్సల్యానికి ఉబ్బి తబ్బిబ్బయ్యాడు కొండమల్లయ్య. తనమీద అతనికంత ప్రేమెందుకు కలిగిందో అతని కర్థం కాలేదు. ఎలాగూ ఎద్దును కొనకుండా వెళ్ళేట్టు లేదు. ఆ కొనడం అప్పుచేసే కొనాలి. ఆ అప్పేదో అడగకముందే ఇస్తానంటున్న పంతులు దగ్గరే చేస్తే సరిపోతుందనుకున్నాడు. కాని, జిత్తులమారయన రామారావు తర్వాతేమయినా మోసం చేస్తాడేమోనన్న భయం కొండ మల్లయ్యకు లోపల్లోపల ఉండనే ఉంది. అయినా ముందున్నది తన అవసరం.

"సరే పంతులు. మరి పైసలకు వడ్డెంత?"

"వడ్డీదేముంది? ముందయితె నీ అవసరం తీరనియ్యి. వడ్డీ సంగతి తర్వాత మాట్లాడుకుందాం. రేపు పొద్దునొచ్చి డబ్బు తీసుకో" అన్నాడు రామారావు.

"అటు తర్వాత కిరికిరయితె బాగుండది పంతులు? వడ్డెంతో ముందే మాట్లాడితే మంచిది"

"వందకు నెలకు నాలుగు రూపాయలు. అందరికి ఐదు రూపాయలకంటె తక్కువకి వ్వడం లేదు... ఎద్దుఘోష చూడలేక నీకు నాల్గులెక్కన ఇస్తనంటున్న..."

"అంత మిత్తయితె (వడ్డీ) చచ్చిపోత పంతులు...! రెండు రూపాయల లెక్కనియ్యి..."

"భలేటోనివున్నవు కాపయినె... ఇవ్వాళ్ల రేపు రెండు రూపాయల లెక్కన ఎవ్వలిస్తుండ్రు? నేనేమన్న ధర్మవడ్డీకిస్తున్ననుకుంటున్నవా..? పిలిచి పిల్లనిస్తానంటె కులం తక్కువన్నడట నీలాటోడు. సరే... కాపుదనపోనివి... కష్టపడి బాకి తీర్చెటోనివి... మూడ్రూపాయల చొప్పున తీసుకో... లేకుంటె నీ ఇష్టం..." అని అక్కడ్నుంచి వెళ్లిపోయాడు రామారావు పంతులు.




కొండమల్లయ్యా పిలుస్తున్నా విన్లేదు.

తెల్లవారి పంతులింటికెళ్లాడు కొండమల్ల య్యా. కాగితంపై వేలిముద్ర వేశాడు. ఐదు వందల రూపాయలు తీసుకున్నాడు. ఆ డబ్బుతో మరునాడు గర్రెపల్లికి పోయాడు. అంగట్లో ఎద్దును కొనుక్కొచ్చాడు. ఆ ఏడలా వ్యవసాయం నడిచింది.

ఏడాది తర్వాత అప్పు తీర్చుతానని పంతులు దగ్గరికెళ్లాడు కొండమల్లయ్యా. పదిహేను వందల రూపాయల అసలు సొమ్ముకు వడ్డీ కలిపి రెండువేల నలభై రూపాయలివ్వాలన్నాడు రామారావు. తాను అప్పుగా తీసుకున్నది అయిదువందలే అని మొత్తుకున్నాడు కొండమల్లయ్యా. పదిహేనువందలన్నాడు రామారావు. కేసు పంచాయితీకెళ్లింది. కాగితంమీద పదిహేనువందలు తీసుకున్నట్టుంది. పంతులు అబద్ధం ఆడటంలేదని కొండమల్లయ్యానే ఊరిపెద్దలంతా తిట్టారు. అతడెంత మొత్తుకొనేడ్చినా ఎవరూ విన్లేదు. పదిహేను వందల రూపాయలు, ఆ సొమ్ముకు వడ్డీ చెల్లించక తప్పలేదు.

★ ★ ★

కొండమల్లయ్యా నాసికాపుటాలనుండి దీర్ఘమైన నిట్టూర్పు వెలువడింది.

నాగలి మెల్లమెల్లగా సాగుతోంది.

'ఇప్పుడు మునుపటి పరిస్థితిలేదు. ఎంత సాగించుకునేవారు దొరలు? వాళ్లదొకప్పుడెంత వటాటోపముండేది? వెలమలున్న ఊళ్లోనైతే మరీ ఎక్కువ. దొర ఎదురుగా కనబడితే చాలు చెప్పులు విడిచి చేతుల్లో పట్టుకొని నడవాలి. దొరముందు చెప్పులు తొడుక్కొని నడువడానికి వీల్లేదు. వంగి వంగి నమస్కారాలు చెయ్యాలి. దొరకెదురేం మాట్లాడొద్దు. దొర చెప్పిందే వేదం. మరిప్పుడు...? దొరలు, జమీందార్లు చాలామంది ఊళ్లొదిలి వెళ్లిపోయారు. చాలావరకు భూములమ్ముకున్నారు. నడిచినన్ని రోజులు నడిపించుకొని నడువకుండా అయ్యేనరికి తోకముడిచారు...'

తనలోతానసుకున్నాడు కొండమల్లయ్యా. మధ్యాహ్నంవరకు నాగలి దున్నాడు. నాగలి విడిచి ఎడ్లు తోలుకొని పశువుల కొట్టం దగ్గరికెళ్లాడు. కొట్టంలో ఎడ్లను కట్టేసి మిగిలున్న కొంతమేత వేశాడు. ఇంటికెళ్లి స్నానం చేశాడు. భోజనం ముగించి కొంచెంసేపు మంచంలో నడుంవాల్చాడు. కొద్దిసేపట్లోనే ఉలిక్కిపడి లేచాడు. చూరునీడలు చూశాడు. లేచి గబగబ కొట్టందగ్గరికెళ్లాడు. ఎడ్లు తోలుకొని చేలోకెళ్లాడు. నాగలి కట్టి మళ్లీ దున్నుతున్నాడు.

నోటికొచ్చిన అన్నల పాట పాడుతూ నాగలి దున్నుతున్నాడు పక్కచేలో రాజేశం. సాయంత్రమయింది. ఇంకొంచెం పొద్దుంది. వాతావరణం నిర్మలంగా వుంది. ఆ పాట ఎంతోదూరం వినబడుతోంది. కొద్దిసేపు ఎడ్లను మేపాలని నాగలి విడిచి, రాజేశం దగ్గరికెళ్లాడు కొండమల్లయ్యా.

"కాలం మంచిగలేదు. ఆ పాటలెందుకు పాడుతున్నవు రాజేశం..?" అన్నాడు.

"ఈ పాటలు గాకుంటె ఆంజనేయ దండకం చదువాల్నా తాత..?" నాగలి విడుస్తూ అన్నాడు రాజేశం.

'పడుచోల్లు వినేటట్టు లేరు... వాళ్లకు తోచింది వాళ్లే చేస్తరు. పెద్దవాళ్లు చెప్పితె వినరు. వీళ్లను పోలీసోళ్లు తీసుకపోతే తల్లి దండ్రులేడవాలె...!' తనలో తాననుకుంటూ కొద్దిసేపు ఎడ్లు వచ్చిగడ్డి అందీఅందకుండా వున్నా కంకుతుంటే చూస్తూ నిల్చున్నాడు. పారల్తో తవ్వుకొచ్చిన వచ్చిగడ్డి వేయొచ్చని వాట్ని తోలుకెళ్లి కొట్టంలో కట్టివేశాడు. ఇంటికెళ్లాడు. ప్రొద్దుగూకుతోంది. ఇల్లంతా చిందర వందరగా వుంది. అరుగుమీద పిల్లలు వల్లికాయ కొడుతున్నారు. అంతటా వల్లిపొట్టు. తన చేతిలోవున్న బారెడు జొల్లు చిలక్కొయ్యకు తగిలించాడు, ముల్లుగర్ర ధాన్యంపోసుకునే గుమ్మికానించాడు.

"కాంతవ్వా... పిల్లలను పొమ్మనకపోయినవా...? వల్లీలు కొలునుకొని పైనలిచ్చి పొమ్మను... ఇంకేమన్నుంటే రేపు చెయ్యొచ్చు"

అక్కడేవున్న కూతురుతో అన్నాడు కొండమల్లయ్యా. అలాగేనని కాంతమ్మ వల్లీలు కొలిచింది. చిల్లరడబ్బులు పిల్లల చేతుల్లో పెట్టింది. వల్లిపొట్టంతా ఊడ్చివేసింది. బావిదగ్గరికెళ్లి కాళ్లు, చేతులు, ముఖం కడుక్కొనివచ్చి వాకిట్లోవున్న మంచంలో నడుం వాల్చాడు

కొండమల్లయ్య. నిద్రపట్టబోతుండగానే భోజనం చెయ్యమని నర్సమ్మ పిలిచింది. లేచి వంటగదిలోకెళ్లి అన్నం తిన్నాడు. అరుగుమీద మంచంవేసుకొని పడుకున్నాడు. అలసిన శరీరం తొందరగానే నిద్రలోకొరిగింది.

మరోరెండు రోజుల్లో పెసరు విత్తనాలేయడం పూర్తయింది. ఈలోగా పల్లివిత్తనాలు తయారయ్యాయి. పల్లిదుక్కి దున్నాడు కొండమల్లయ్య. సూపర్‌ఫాస్పేట్ మందుబస్తా కొనుక్కొచ్చాడు. నర్సమ్మను, కాంతమ్మను తీసుకొని నాగలి కట్టుకొని చేండ్లోకెళ్లాడు. నాగలికి గొట్టం కట్టి నాగేటిచాలు లోతులో మందు పడటానికోసం గొట్టంలో మందుపోస్తోంది కాంతమ్మ. ఆమె వెనుక నర్సమ్మ నాగేటిచాళ్లలో పల్లి విత్తనాలేస్తూ నడుస్తోంది. కొండమల్లయ్య నాగలి దున్నుతుంటే ఒకరు మందు, మరొకరు విత్తనాలేస్తున్నారు.

కొన్నిరోజుల్లో పునాస పని పూర్తయింది. ఇక మడికట్టు (పొలం) దున్నడానికి సిద్ధమవుతున్నాడు.



గలగలా వాన... జలజలా వాన... మంటికి మింటికి ఏకధారగా వాన... ఆకాశం తూట్లుపడ్డట్టుగా వాన... పాతగోడలు కూలిపోతున్నాయి. మెత్తగా వున్నచోట భూమికి వుండయి దిగబడుతోంది. కుంటలన్నీ నిండాయి. చెరువులోకి చాలావరకు నీళ్లొచ్చాయి. ఏరు పరవళ్లు తొక్కుతూ పారుతోంది. ఊర్నిండా బురద... తడిసిన పెంటబొందల్లోంచి వాసన.. రెండురోజులుగా ప్రళయం వస్తుందన్నట్టుగా కురిసింది వాన. రెండురోజులుగా ఏ పని చేయకుండా ఇంట్లోవున్న రైతులు పొలాలు దున్నడానికి సిద్ధంగా వున్నారు. వాన వెలియగానే పనికి సాగాలని వున్నారు. కాని వెలిసినట్టే వెలిసి ముసురు మొదలయింది. మూడురోజులుగా ఎడతెరపిలేకుండా ముసురు... ఇంట్లోకాలు బయటపెట్టనీయడంలేదు. పశువులు ఈగలబాధకాగలేక తోకలతో విసురుకుంటున్నాయి. రొచ్చులో అసహనంగా అటూ ఇటూ కదులుతున్నాయి. వణికిపోతున్న ముసలి గొర్రెలను, గొర్రె పిల్లలను ఖాళీగావున్న పశువుల కొట్టాల్లో వుంచుతున్నారు.

నిర్విరామంగా ముసురు పడుతూనేవుంది. ఇంట్లోంచి కాలు బయటపెట్టనీయడంలేదు. ఊర్నిండా ఎక్కడ చూసినా బురద... ఈగలు... దోమలు... ఏ పనీ సాగడంలేదు. అరుగుమీద వాల్చున్న మంచంలో చుట్టతాగుతూ కూర్చున్నాడు కొండమల్లయ్య. తిరుపతయ్య మరో మంచంలో పడుకొని పుస్తకం చదువుకొంటున్నాడు. నర్సమ్మ వంటింట్లో పొయ్యంటుబెట్టడానికి సతమతమవుతోంది. వెదురుబొంగుతో చేసిన గొట్టంతో ఎంతూదినా పొయ్యి మండటంలేదు.

"ఈ సంసారం ఈదుడు నానుంచిగాదు. ఒక్క కట్టెపుల్లగూడ లేకపాయె. వర్తి పిడుకలతో వంటెట్ల జెయ్యాలె..? అవ్విగూడ తడిసి పాడాయె. అటుకమీద ఉరుస్తంది. అటుకుమీ' దేంది...? ఇల్లంత ఉరునుడేనాయె.ఇల్లు నదిరియ్యమంటె నదిరియ్యకపాయె. ఈ యమచెరెట్ల దప్పాలె? కూడెట్ల వండాలె?" గొణుగుతూ భర్తను తిడుతూ పొయ్యి రాజెయ్యడానికి ప్రయత్నిస్తుంది నర్సమ్మ.

నర్సమ్మ గొణుగుడు విన్నాడు కొండమల్లయ్య.

"ఇల్లు కప్పించాలని మా అనుకున్న. కాని, ఇయ్యేడు ఎండకాలంల కూడ తీరినచ్చిందా..? ఈ సంవత్సరమే బిడ్డ లగ్గమాయె. రాజయ్య నౌకరికిపాయె. అన్ని పనులయిపోయెవరకు వానలు కొట్టనేవట్టె. ముచ్చట సంబురాన దొంగ తిండి మరిసినట్టు ఎండాకాలంల యాదికే రాలేదు... వచ్చే ఏటికి మా నదిరిస్త తియ్యి" అన్నాడు కొండమల్లయ్య.

"వచ్చే ఏడు ఏరాజు ఏ పట్నమేలుతడో





ఎవ్వలకెరుక? వచ్చేటికి కప్పిస్తడుట వచ్చేటికి. మరి ఇయ్యేడెట్ల సావాలె? ఇల్లంత ఉరుసుడే నాయె. ఎన్ని ఔగల్లని గిన్నెలు పెట్టాలె?'' పొయ్యూదుతూనే అంది నర్సమ్మ.

చివరకు పిడుకలంటుకొని మంట లేచింది. ఆమె ముఖంలో ఆనందం... ఏదో సాధించిన ఆనందం... పొయ్యిమీగ వప్పెనసరు నీళ్లుపెట్టి అరుగుమీదికొచ్చింది. భర్త మంచం దగ్గర కూర్చుంది. వంటగదిలో వున్న కాంతమ్మ నుద్దేశించి-

''కాంతవ్వా... ఎసరచ్చినంక ఎసట్ల పప్పు పొయ్యి'' అంది.

తల్లి మాటలు విని''ఆం... ఆం..'' అంది కాంతమ్మ. వాకిట్లోకి చూసింది నర్సమ్మ.

''వాన పాడుగాను... వెలిసెటట్టేలేదు. కారింది కారినట్టే. పెసల్లు, పల్లీలు ఏనుకున్నయి. ఈ ముసురుకు రోగాలు తలుగుతయేమొ?'' అంది నర్సమ్మ.

''అదంత మన చేతులుందా? ఎట్లుంటె అట్లయితది. ఎన్నిసార్లు భూమ్మీదపడ్డ విత్తనాలు నాశినం గాలేదు!'' అన్నాడు కొండమల్లయ్య.

''అవు... నిజమేమరి... ఇయ్యేడేమి ఇత్తనాలు పెడదాం! నిరుడు సురేఖలని అలుకుతె మంచిగ పండలే''

''ఏ మిత్తనమని చెప్పాల్నే? కొద్ది రకాలున్నయా? అందుకే వడ్లుపేరు, ఎడ్లపేరు చెప్పుడు వశెం గాదంటరు. ఎడ్లకు చెప్పలేనన్ని పేర్లున్నయి. అట్లనే వడ్లకు గూడ మస్తు పేర్లున్నయి. సాంబమైసూర్లు, సురేఖలు, మశూర్లు, సోనమశూర్లు, రామచిలుకలు, దొరసాని పిర్రలు, పెండ్లి బీటివడ్లు, లుచ్చలు, పెద్దవడ్లు, నల్లవడ్లు, కిచిడీలు, తెల్లహంసలు... చెప్పుకుంట పోతె అంతేలేదు. రోజుకో తీరు వడ్లస్తన్నయి''

''విత్తనమేది పెడుదామంటె పురాణం చదివినట్లు వడ్లపేర్లన్ని చదువబడితివేంది? నువ్వు రైతువని మా తెలును. నీకు వడ్లపేరు తెలువయంటినా నేను? నువ్వు మాదండి ఎవ్వదారునివేనైతివి'' నవ్వుతూ వ్యంగ్యంగా అంది నర్సమ్మ.

''మన పొలంల సోనమశూర్లు, పాలుకు (కౌలుకు) పట్టిందాంట్లో మశూర్లు పెడుదాం. సరెగని నన్నేమొ దెప్పవడితివి? రైతేరాజు తెలుసా?'' అన్నాడు కొండమల్లయ్య.

''అవు నిజమే... మన రాజరికం కండ్లవడ్తనే వుంది. మనం వట్టి రాజుల మెందుకైతం? మా రాజులం. ఒక్క తరాజే తక్కువుంది'' అని లేవబోయి ఆగింది నర్సమ్మ.

''అయ్యో! చెప్పుడు మరిచేపోయిన... అల్లునికి ఆషాఢకట్నాలు కొంచవోతవా లేదా? ఆషాఢమాసం మూఢ్రోజులే ఉందట. నెల వెళ్లుటానికచ్చె ఉలుకుత లేకపోతివి, పలుకుతలేకపోతివి?'' అంది.

ఆ మాటలు విని ఉలిక్కిపడ్డాడుకొండమల్లయ్య.

''నిజమే... నేను మరిచేపోయిన... ఇటు మందు బస్తాలకుగావాలె. అటు కట్నాలకు గావాలె పైసలు? కష్టాలొంటరిగ రావంటరు. ఖర్చులు గూడ ఓటెనుకోటి రావట్టె. మొసమల్ల కుంట కావట్టె'' అన్నాడు కొండమల్లయ్య.

''మనకెన్ని ఖర్చులున్నా పిల్లనిచ్చిన కాడ తక్కువ జేయద్దు. వాళ్లకు లోకువగావద్దు. వాళ్ల వాల్లకు ముట్టజెప్పాలె!''

''నువ్వన్నది నిజమే! కాని, పైసలకిప్పుడెవ్వల దగ్గరికి పోవాలె?''

వంటింట్లోంచే తల్లిదండ్రుల మాటలు వింటున్నది కాంతమ్మ, మరిగిన ఎసట్లో పప్పు పోసి గరిటతో కలిపింది.

''బాపు! కట్నాలద్దేమద్దు... మీరు చప్పుడు జేకుండుండ్రి. ఉంటె పెట్టినా ముద్దు'' అంది అరుగుమీదికొస్తూ.

''నీకు తెలువదు బిడ్డ ఊకో... మా కష్టాలు మేం పడుతం... వాళ్ల బాపతులు వెళ్లదీయాలె. లేకుంటె నిన్ను గుణిపిస్తరు'' అన్నాడు కొండమల్లయ్య.

''కాదు బాపూ! ఇప్పుడు కట్నాలు తీసుకపోకుంటేంది? వాళ్ళేమన్న చక్కగ నడుస్తుండ్రా?'' అంది కాంతమ్మ.

పెళ్లయిన మొదట్లో తల్లిదండ్రుల పక్షమే మాట్లాడుతుంది స్త్రీ. కాని అత్తగారింట్లో ఉమ్మడి కుటుంబం నుండి వేరుపడి తన సంసారం

తనకైన తర్వాత భర్తతోపాటు తల్లిదండ్రుల నుండి తానూ వీలైనంత లాగడానికి ప్రయత్ని స్తుంది. ఇది వ్యవసాయ కుటుంబాల్లో సాధార ణంగా జరిగే విషయం.

"కాంతవ్వా! నువ్వొకో... మా తిప్పలు మేం పడుతం... ఒక్క బిడ్డవు. అక్కడుండే దానివి. నిన్ను వాళ్లు కష్టపెడితె, గుణిపిస్తె మాకు మంచిగనిపించది" అంది నర్సమ్మ.

చదువుడాపి తల్లిదండ్రుల మాటలు వింటూ మంచంలో పడుకొనున్నాడు తిరుపత య్య. తల్లిదండ్రులపై ఆప్యాయతతో కూడిన జాలి కల్గుతోందతనికి. తాను బుద్దెరిగినప్ప ట్నుంచీ తల్లిదండ్రులు మట్టిలో మట్టై పని చేయడం చూస్తున్నాడు. పొట్ట నింపుకోవడానికే తన కుటుంబమంతా నాగేటి చాళ్ల కంకితమ వడం గమనిస్తున్నాడు. తాను చదువుకొని ఇంత వయసొచ్చినా తల్లిదండ్రులకు భారం కావడం తిరుపతయ్యకు బాధాకరంగా వుంది. తల్లిదండ్రుల కెలాగైనా చేయూతనందించా లని చాలారోజులుగా ఆలోచిస్తున్నాడు. మంచంలో లేచి కూర్చున్నాడు.

"బాపూ! నేను కూడ బావిపనికే పోత" అన్నాడు.

కొడుకు మాటలు విన్న కొండమల్లయ్య ఆందోళన చెందాడు. బి.ఏ. చదివిన కొడుకు బొగ్గుబావిలో తట్టమోసే పనికిపోతాననడం అతనికి బాధాకరంగావుంది. తిరుపతయ్యకు ఉద్యోగం దొరికినా, దొరకకున్నా చదువురానివా ళ్లు చేసే కష్టమైన పనికి అతన్ని పంపించడా నికి కొండమల్లయ్య మనసంగీకరించడం లేదు. కొడుకు ఏ పని చేయకుండా కూర్చొని తిన్నా మంచిదేనను కుంటున్నాడు.

"అవ్వేం మాటలు బిడ్డ? నువ్వు తట్టమోసే మోటుపనికి పోతనంటున్నవేంది?" అన్నాడు కొండమల్లయ్య.

"నాకు కలెక్టర్ నౌకరొస్తదనుకుంటున్నవా నాన్న?"

"నీకే నౌకరి రాకున్నా మంచిదే... నువ్వా పనికిపోవద్దు..."

"అన్న పోయాడుకదా! నేనెందుకు పోవద్దు?"

"వాన్ని మాత్రం నేను పొమ్మన్ననా? చేతికి రాకుంటయితడని పంపిస్తి. అయినా వాడు నువ్వొక్కటేనా? నువ్వు చదువుకున్నోనివి. అన్నె మొ మొదట్నుంచి మోటుకష్టం చేసినోడే. నువ్విగా పనికి పోవుడేంది బిడ్డ?"

"బాపూ! ఉద్యోగం కోసం తిరిగి తిరిగి నా కాళ్లరుగుతున్నాయి. ఈకాలంలో ఉద్యోగం రావడం సులభమేంకాదు. ఉద్యోగాలు వెళ్ల డమే కష్టం. ఒకటి అరా వెళ్లినా చెప్పలేనన్ని పైరవీలు డబ్బు... రికమండేషన్లు... మన కి వేవీ లేవు. ఇంకొద్ది రోజులయితే సింగరేణి ఉద్యోగం కూడా కష్టమే. బి.ఎ.లు, ఎమ్మేలు ఎంతోమంది గోదావరిఖనిలో తట్టమోస్తున్నరు"

"అవ్వన్ని నాకు తెలువదు. నువ్వాపనికి పోవద్దు... నిన్ను పువ్వోలె సాదుకున్నం. నీకిష్టం లేకుంటె ఎవసాయప్పని కూడ చెయ్యకు. నా రెక్కలు మంచిగున్నన్ని దినాలు ఎట్లనో ఎల్లదీ స్త. ఓపికవడితె ఒరంగల్లే పట్నమైతదంటరు. ఆ సంగతి మర్చిపో" అని మంచంలోంచి లేచాడు కొండమల్లయ్య.

మరికొద్ది సేపట్లో వానవెలిసేట్టుంది.

"అయ్యగార్ని అడిగొస్త" అని బయటకెళ్లా డు గొంగడి ముసుగేసుకొని.

తెల్లవారి అల్లునికో పాంటు, షర్టు బట్టలు, టవల్, వియ్యపురాలికో చీర, రవికెబట్ట, వియ్యంకుడికో రుమాలు కొనుక్కొని తనతో ఓ పెద్దమనిషిని వెంటబెట్టుకొని నగునూరుకు పోయాడు కొండమల్లయ్య. కట్నాలతో వచ్చిన వియ్యంకుణ్ణి సాదరంగా ఆహ్వానించాడు లస్మయ్య. కాళ్లకు నీళ్లిచ్చింది లింగమ్మ. ఇద్ద రూ కాళ్లు కడుక్కున్న తర్వాత అరుగుమీద మంచం వాల్చింది. మంచంలో ఇద్దరూ కూర్చు న్నారు. అతిథులిద్దరికీ చుట్టాకు, పొగాకు ఇచ్చి వాళ్ల ప్రక్కనే కూర్చున్నాడు లస్మయ్య. ముగ్గు రూ చుట్టలు చేసుకున్నారు. చుట్టలు తాగుతూ మాటల్లోబడ్డారు. ముగ్గురు కాలుస్తున్న చుట్టల వాసనకు లింగమ్మ కొంచెం దూరంలో నిల్చు నుంది.

"వదినె, కాంతవ్వ బాగున్నారె అన్న?" అంది లింగమ్మ.

తనకూతురు ఇక్కడున్నప్పుడు గుణిపించి, ఏడిపించి తన ముందేమో ప్రేమున్నట్టు నటి స్తున్న చెల్లెలు మీద కోపంగావుంది కొండమల్ల





య్యకు. కాని ఆడపిల్ల తండ్రిగా ఓపిక పట్టాలని నిర్ణయించుకొని కోపాన్ని అణుచుకున్నాడు.

''మంచిగనే వున్నరు'' ముక్తసరిగా జవాబిచ్చాడు.

ముగ్గురూ వ్యవసాయంగూర్చి, ఊళ్లోవస్తున్న మార్పుల గురించి, మంచి చెడ్డల గురించి మాట్లాడుకుంటూ కూర్చున్నారు. లింగమ్మ ఇంట్లోకెళ్లి భోజనం తయారుచేసింది. కాళ్లుకడుక్కొని వాళ్లంతా భోజనాలు చేశారు. సాయంత్రం కల్లు, కోడిమాంసం, పూరీలతో అతిథులకు విందు చేశాడు లస్మయ్య. ముగ్గురూ కల్లు కొంచెం ఎక్కువే తాగారు. రాత్రి అల్లునికి, చెల్లెలికి, వియ్యంకునికి కట్నాలందజేసాడు కొండమల్లయ్య. ఆ బట్టలను చూసి మూతి ముడిచించి లింగమ్మ. కొండమల్లయ్యది గమనించినా ఏం మాట్లాడలేదు. రాత్రి భోజనాలైన తర్వాత కూతురు సంగతి కదిపాడు కొండమల్లయ్య.

''బావా! మేమెంత ఖర్చులల్లున్నా ఖాతపెట్టి ఆషాఢ కట్నాలు తీసుకచ్చిన. వెల్లకుంటున్నా ఆచారం తప్పద్దని తెచ్చిన. వచ్చే నెలల కాంతవ్వకు శ్రావణపట్టి కట్టిచ్చి తీసుకచ్చుకోండ్రి''

''వీడు మాదండి కట్నాలుతెచ్చిండని శ్రావణపట్టి పెట్టాలట'' తనలోతానే గొణుక్కున్నాడు లస్మయ్య. పైకి మాత్రం-

''నువ్వు చెప్తన్నావేయ్... మాకెరుకలేదా?'' అన్నాడు.

''మీకు తీసుకునుడే కాని ఇచ్చుడు తెలువదిగద... అందుకోసురమే అంటన్న...''

''నువ్వేవ్వల్లకో పెట్టవడ్తివి? ఒక్కతే బిడ్డాయె''

''నిజమేకని... ఒడ్డెక్కేదాక ఓడమల్లప్పని ఒడ్డెక్కినంక బోడిమల్లప్పంటె నేనూకుండ... మీ అక్కెరొడ్డెక్కిందని తేకుంటె మంచిగుండది'' ఖచ్చితంగా చెప్పాడు కొండమల్లయ్య.

''నువ్వు జెప్పున్నా? మా కోడలేనాయె.... మా ఇంట్లనే వుండె. దానికో చీరె కొంటే ఏడికిపోతది?'' అన్నాడు లస్మయ్య.

''లగ్గమయిందంటె ఆడపిల్ల అత్తగారింటిపిల్లేనాయె. ఎట్లుంచుకున్నా మీ ఇంట్లనే వుంటది. సరేకని బావా... తలువాలు (తలంబ్రాలు) పోసుకొని వచ్చినంకనే కాంతవ్వను గుణిపించిండ్రట. అదేం జేసింది?'' అన్నాడు కొండమల్లయ్య.

''ఇగో బావ... నీకు తెలువందేముంది? రెండు చేతులు కలువందే చప్పట్లురావు. మీ చెల్లెనే అడుగలేవు. అదేమన్న దూరపుదా?'' అన్నాడు లస్మయ్య.

అక్కడేవున్న లింగమ్మ దిక్కు చూశాడు కొండమల్లయ్య.

''అన్నా! నా నోటినుంచి అనొద్దుకని కాంతవ్వకు ఏ పని చక్కగ చెయ్యరాదే! నాగ్గూడ బిడ్డలున్నరు'' అంది లింగమ్మ.

తన కూతురుకు పని రాదనేసరికి కొండమల్లయ్యకు కోపమొచ్చింది.

''చెల్లే! కాంతవ్వకు పని రాదన్న మాట నీ ఒక్కదాని నోట్లోనుంచే వింటన్న. ఇటు ఇంటివనిల, అటు ఎవుసపునిల దానికి వంక పెట్టినోల్లే లేరు. ఎంత పనయిన భయపడదది''

''నాకు కోడలైనా బిడ్డైనా ఒక్కటేనే అన్న? అక్కడట్ల చేస్తది కావచ్చు కాని ఇక్కడ్నయితె మంచిగ పన్జెయ్యది''

''నువ్వన్న మాటలు నమ్మల్నంటె నాకు మనుసొప్పుతలేదే చెల్లె... పని దగ్గెర కాంతవ్వ వెనుకముందు చూడది. గొడ్డోలె పనిజేత్తది. కలుపుకు వంగిందంటె మునుమెల్లెదాక నడుం లేవది. దానికి పనో బిసాయిదే కాదు. నరె... ఈ సంగతిట్లుండనియ్యి. అది బన్జెయ్యకుంటె మా చెప్పుత. కాని, ముసలావు చచ్చిందని బిడ్డనేడ్పిచ్చిండ్రట ఎందుకు? ఆవు జత్తె దాన్నేంజెయిమంటరు?''

''ఆవు చచ్చిపోయిందన్న ఏడ్పుతోని ఓసారి మా తిట్టిన దాన్ని. అయితేనేం బాయె దాన్ని నా బిడ్డగానే చూసుకుంటున్న. నాకు దాన్ననటానికి బలం లేదా?'' అంది లింగమ్మ.

''చెల్లె... నువ్వేన్నన్న చెప్పు దాని మనుసును కష్టపెట్టినవు నువ్వు. ఆ మాటట్ల పోనియ్. కట్నాలేమన్న వచ్చేటియుంటె నన్నడుగాలెకని దాన్నెందుకేడ్పియ్యాలె?''

లింగమ్మేం మాట్లాడలేదు.

"నేను మీ చెల్లెను మా తిట్టిన నువ్వెందుకు కోపానికస్తవేయ్? అత్త కోడండ్ల నడుమ చిన్నచి న్నయి వస్తనే ఉంటయి. ఇది ఇంటింటికున్న భాగోతమే... సరెకని నీ కొడుకు తిరుపతయ్య సంగతే మంచిగనిపియ్యలే నాకు. ఒక్క మాట న్నందుకే ఎగిరెగిరిపడ్డడు. చదువుకున్నవాని పోకడా అది? మేం నల్లగ కనవడ్తున్నమా? మమ్ముల తిట్టి పిల్లందోలుకపోయిండు. వానికి గంతురుకులాటెందుకు? పిల్లనిచ్చినోల్లకు మీ కే గంతుంటే మాకెంతుండాలె? ఎంత చదువు కున్నా గానీలుగుడు పనికిరాదు" అన్నాడు లస్మయ్య.

సాయంత్రం తాగిన కల్లు ఇద్దరిపై ప్రభావా న్ని చూపుతోంది. చదువుకున్న తన కొడుకును తన వియ్యంకుడైనా లస్మయ్య తిట్టడం కొండ మల్లయ్యకు నచ్చలేదు. తాను కూడా తిట్టని కొడుకు నాతడు నిందించడం కొండమల్ల య్యకు కోపం తెప్పించింది.

"వాని ముందట్నే వాని చెల్లెను మాట లంటుంటె ఎందుకూరుకుంటడాడు? దమ్మిడీ కి కొరగానోల్లు కూడ ఇయ్యాల్ల మమ్ముల ననెటో ల్లయ్యింద్రు?" అన్నాడు.

"ఎవ్వలు దమ్మిడికి కొరగానోల్లో తెలున్త లేదా? ఇంకనాల్గు రోజులయితె ఉన్న భూమి పోయి చిప్పలు చేతులకస్తయి. వెనుకట మా తాతలు నేతులు తాగింద్రు మా మూతుల వానన చూడు మంటే ఏమచ్చె?" వియ్యంకుడి మాటలకు వ్యంగ్యంగానే జవాబిచ్చాడు లస్మ య్య.

తన పరిస్థితినెత్తి చూపేసరికి కొండమల్ల య్యకు మరింత కోపమొచ్చింది. ఇయ్యంకులి ద్దరూ శృతిమించుతున్నారని గ్రహించిన పెద్ద మనిషి ఏదో అనబోయాడు. కాని అంతలోనే-

"వెనుకట పాలేరుండి బతికినోడు గూడ నన్ననెటోడయిండియ్యాల్ల. పాలేరుండి బతికి నోనికి భూమి కనబడంగనే కండ్లు నెత్తిమీదిక చ్చినయి" కోపంగా అన్నాడు కొండమల్లయ్య.

ఆ మాటలకు రెచ్చిపోయి బూతుమాటన్నా డు లస్మయ్య.

మరో మాటనబోతున్న కొండమల్లయ్య నాపా డు పెద్దమనిషి. రాంరెడ్డి, పెద్దమనిషి ఇద్ద ర్నాపి చెరోదిక్కు తీసుకెళ్లారు. కొద్దిసేపాగి అందరూ నిద్రలో కొరిగారు. తెల్లవారే సరికిద్దరి కీ కల్లుమత్తు దిగింది. రాత్రి జరిగింది మరిచి పోయి ఒకర్నొకరు ఆప్యాయంగా కౌగలించు కొని విడిపోయారు వియ్యంకులు. కొండమల్ల య్య పెద్దమనిషిని వెంట బెట్టుకొని ఊరెళ్లా డు.

ఉన్న వాళ్లకైతే ప్రయాణబడలిక. ఊరెళ్లి రావడంవల్ల అలసిపోయామని కొంత విశ్రాంతి తీసుకుంటారు. కాని వ్యవసాయ కుటుంబాల్లో అలాంటి అవకాశంలేదు. ఊరెళ్లి వస్తూనే ఊరు బయట్నుంచే పొలం దగ్గరికి పోయొస్తారు. పశువులను చూసుకొనొస్తారు. మరెన్నో పనుల్లో మరుక్షణమే లీనమైపోతారు. కొండమల్లయ్య ఊర్నుంచి వస్తూనే నాగలిక ర్రుకు మొనవేయించుకు రావాల్సిన అవసరా న్ని జ్ఞాపకం చేసుకున్నాడు. తట్టలో బొగ్గులు తీసుకొని కమ్మరి బక్కయ్య ఇంటికెళ్లాడు. మొ నవేయించాల్సిన రెండు కర్రులను తీసుకెళ్లా డు.

అది మడికట్టునాగళ్లు దున్నే సమయమవ డంవల్ల అక్కడ చాలామంది రైతులున్నారు. ఒకరి తర్వాత ఒకరి పనిచేసి పంపిస్తున్నాడు బక్కయ్య. కొండమల్లయ్య తట్టముందు పెట్టు కొని తన సమయం కొరకు నిరీక్షిస్తూ కూర్చున్నా డు.

ఇలాంటి ఊరుమ్మడి స్థలాలు చర్చలకు వేదికలుగా వుంటాయి. చాలామందక్కడ కలు స్తారు కాబట్టి ఎన్నో విషయాలు మాట్లాడు కుంటారు. అక్కడున్న రైతులు మాటల్లోపడ్డా రు.

"ఏమయింది మందు బస్తాలచ్చినయా ఏమంటున్నడు సర్పంచు కారొబారి"

"కారొబారి పూలరంగడు. మల్లె పూవుల సొంటి తెల్లబట్టలు వేసుకొని మీద మైల పడకుంట తిరుగుతుంటడు. మందు బస్తా లింకా రాకపాయె అంటె అడిగినప్పుడల్ల వస్త య్య అంటడు. ఎప్పుడస్తయో ఆ మీదోనికే ఎరుక"

"అన్ని మండలాఫీసులల్ల రైతుల దగ్గర లంచాలు తీసుకుంటే చేతులు విరగ్గొడతన న్నారట అన్నలు.."




''అవున్నిజమే... కాని జరిగే కాడ జరుగుత నేవున్నయి. లేకుంటె కారోబారిలాంటోడు ఎట్ల బతుకుతండు? ఎంత కష్టపడ్డా మనకు వెళు తందా? ఏ పని జెయ్యకుంట పైరవీల మీద బతుకవట్టె కారోబారి''

''నిజమే కాని... ఏం బతికినా పాడు బతు కే... తంర్డి పంచిచ్చిన భూమినంత పాడు జేసె. కూచుండి తింటె కొండలైన తరుగుత యంటరు. సరుపంచి కారోబారి నౌకరియ్యవట్టి ఇప్పుడట్ల పొట్టకెల్లుతుంది''

స్వాతంత్ర్యానంతరం కొందరు రెడ్లు, భూ ములెక్కువగావున్న వాళ్లు పెద్దింటి వాళ్లలా ప్రవర్తించి కూచొని తినడం మొదలుపెట్టారు. కనీసం వ్యవసాయాన్ని చేయించుకోవ డంలాంటి పనులు కూడా చేయలేదు. దొరలని పిలిపించుకుంటూ ఉన్న భూములమ్ము కుంటూ తినసాగారు. వస్తున్న మార్పులను గమనించకుండా భేషజాలకు పోయి చాలా మంది చితికిపోయారు. అలాంటి కుటుంబా లు ఆ ఊళ్లో ఐదారున్నాయి. అందులో కారోబా రిదొకటి. మరికొందరు వస్తున్న మార్పులను గమనిస్తూ మునుపట్లా ఊళ్లలో వ్యవసాయాలు నడవయని తెలుసుకొని పట్టణాల్లో ఇండ్లు కట్టడం, చిన్నచిన్న పరిశ్రమల్లో భాగాలుతీసుకో వడం, లాడ్జింగులు కట్టడం, కాంట్రాక్టులు పట్టడంలాంటి పనులు చేస్తూ మరింత డబ్బు సంపాదించారు.

''ఒడలు బండ్లయితయి... బండ్లు ఒడలైత యంటరు. వెంకటేశ్వరరావు పంతులు పటా టోపమెట్లుండె? ఇప్పుడు కొడుకుల సంగతెట్లు న్నది?''

''వాళ్లేమన్న కర్ణపోల్లింట్ల పుట్టినట్టే చే స్తంర్డా? గౌండ్లవాళ్ల ఇంటికి పోయి కల్లుదాగిరి. మాంసం తినిరి. చెడు తిరుగుల్లు తిరిగిరి. పనేం చెయ్యకపోయిరి. మరి వాళ్లకేం విలు వుంటది?''

''అవున్నిజమే... అయినా ఆ విషయాలన్ని మనకెందుకు తియ్యి. మన్నెపు పేరయ్య కొడు కును పోలీసులు తీసుకపోయింర్డటగద?''

''ఇది మన ఊళ్లళ్ల కొత్తనా? ఏ కొంచెం గడబిడయినా పోలీసులు పడుసోల్లను తీసుక పొయ్యి మన్ను కొడుతున్నరు. వాళ్లను విడు పిచ్చుటానికి వెయిలు ఖర్చులైతన్నయి''

''ఏమోనె... అంతెట్లనోవుంది. పోలీసోల్లు, రాడికలోల్లు ఒకల్నొకలు చంపుకోవట్రి. అటు వాళ్లు బెదిరిచ్చిరి. ఇటు వీళ్లు తన్నిరి. నడుమ మనం నలిగిపోతన్నం. మింగుమంటె కప్ప క్కోపం విడువుమంటె పాముక్కోపం''

''అగ్నిగుండంల ఉన్నట్టున్నం మనం. ఏద న్నయితె ఏం సంబంధం లేకున్నా అందర్ని కొడుతరి పోలీసులు''

వాళ్లు మాట్లాడుతూనే వున్నారు.

''పటేలా కర్రులు తీసుకరా?'' కొండమల్ల య్యను పిలిచాడు బక్కయ్య.

కొలిమి దగ్గరికెళ్లాడు కొండమల్లయ్య. తట్ట లోవున్న బొగ్గులు చూసి ''ఇంకొన్ని బొగ్గులు తేకపోయినవా పటేల..?'' అన్నాడు బక్కయ్య.

''రెండే కర్రులాయె... నగం తట్టెడు చాలవా?''

''కోపానికెందుకస్తవు? మరి వేసంగి పంట వచ్చినంక నాకిచ్చే గాసం (ధాన్యం) ఇయ్యకనే పోతివి'' అన్నాడు బక్కయ్య కొలిమిలో బొగ్గు లేసి కర్రుపై కొడుతూ.

''నేనియ్యనన్ననా? నువ్వే రాకపోతివి! వచ్చి కొలుసుకపోతె వద్దంటున్ననా?''

''తీరుతలేదు. రెండుసార్లు మా వచ్చిన. అప్పుడేమొ ఇంట్లెవ్వలు లేరు. తీసుకుంటా ఏడికి పోతయని ఊకున్న''

వగటేల (వగలు ) వస్తె ఇంట్ల ఎవ్వలుంట రు...? కొంచెం పొద్దెక్కిందంటె ఇంత తిని పనికి పోవుడేనాయె. ప్రొద్దున రా... లేకుంటె పొద్దుగూకినంకరా... అప్పుడయితె దొరు కుతం''

''రేపు వచ్చి తెచ్చుకుంట''

''తెచ్చుకో... నిన్ను వద్దనెటోల్లెవ్వలు? పని పాటలవాళ్ల సొమ్ము మాకెందుకు?'' అన్నాడు కొండమల్లయ్య.

ఇద్దరూ మాట్లాడుతున్నారు. పని సాగిపోతూ నేవుంది. ఇంకా రైతులు వస్తున్నారు. వాళ్లు ఆ ప్రదేశాలలో వున్న పరిస్థితులగూర్చి రకరకా లుగా మాట్లాడుకుంటున్నారు. అన్నల పేర్లు చెప్పుకొని వస్తున్న దొంగ అన్నలగూర్చి, వాళ్ల

దొంగతనాలగూర్చి మాట్లాడుకుంటున్నారు.

తన పని పూర్తికాగానే కర్రులు తట్టలో వేసుకొని ఇంటికెళ్లాడు కొండమల్లయ్య.



**కొ**త్త జంటలకు ఎడబాటును కల్గించి వాళ్ల ఆగ్రహానికి గురైన ఆషాఢమాసం వెళ్లిపోయింది. వర్షఋతువు నడుస్తోంది. ఓసారి పెద్ద వర్షం, మరోసారి చిరుజల్లు, ముసురు మొత్తంమీద వర్షాలు బాగానే కురుస్తున్నాయి. ఊర్నిండా ఈగలు, దోమలు, రోగాలు, రొష్టులు. శ్రావణమాసంలో డాక్టర్లకు చేతినిండా పని. ప్రతి సంవత్సరం ఎంతోమంది డాక్టర్ డిగ్రీలు తీసుకుంటున్నా పల్లెల్లో వైద్యసౌకర్యం ఇప్పటికీ మృగ్యమే. సర్వసంపదలకు సృష్టికర్తలైన పల్లె ప్రజలకు నాటువైద్యమే గతి. లేదా ప్రైవేట్ నర్సింగ్‌హోంలలో కొద్దిరోజులు పనిచేసిన కుర్రాళ్లు వైద్యులుగా చలామణి అవుతున్నారు. పి.యమ్.పి., ఆర్.యం.పి. సర్టిఫికెట్లు సంపాదించుకొని ఆ కుర్రాళ్లే వైద్యం చేస్తుంటారు. ఓదిక్కు అపరిశుభ్రత, అనారోగ్యం, రోగాలు... మరోదిక్కు రైతులకు, వ్యవసాయ కూలీలకు తీరికలేకుండా పని... కొందరు మడికట్టు దుక్కులు దుంతున్నారు. కొందరు నాట్లేస్తున్నారు. కొందరు మొదట్లో వేసిన పల్లి, పెసరు చేలల్లో కలుపుతీస్తున్నారు. కూలీలు దొరకడం కష్టంగా వుంది. నాలుగైదు రోజులు ముందే డబ్బిచ్చి కూలీకి మాట్లాడుకుంటున్నారు. కొంచెం పొద్దెక్కిందంటే రైతులు, కూలీలిండ్లలో పూర్తిగా పనులుడిగిన ముసలివాళ్లు తప్ప ఎవరూ ఉండటంలేదు అంతా వ్యవసాయపనుల్లో లీనమయ్యిన్నారు.

గోకుల అష్టమి పండుగ కూడా వెళ్లిపోయింది. గొర్రెలు రోగాలొచ్చి చనిపోయి నష్టం జరిగినా యాదవులు (గొల్లలు) కృష్ణజయంతి పండుగను బాగానే చేసుకున్నారు. గోపాలకాలువలు తీశారు. చిన్నికృష్ణుడు, గోపికల వేషాలేసి కృష్ణలీలలు ప్రదర్శించి పండుగను సంబరంగా జరుపుకున్నారు.

కొండమల్లయ్య స్వంతపొలంలో నాటేశాడు. కౌలుకు పట్టిన పొలాన్ని దున్నుతున్నాడు. పొద్దున్నే తయారయి జోల్లు పట్టుకొని పశువుల కొట్టందిక్కు పోవడానికి అరుగు దిగబోతున్నాడు. తల్లి మూల్గుతున్న శబ్దం విని ఆగాడు.

రైతుకుటుంబాల్లో, మధ్యతరగతి కుటుంబాల్లో తల్లిదండ్రులను బాగా చూసుకుంటున్నట్టు అనిపించుకోవాలనుంటుంది. తానే ఇతర్ల కంటె ఎంతో మెరుగ్గా కన్నవాళ్లను చూసుకున్నవాడిగా పేరు తెచ్చుకోవాలన్న తపనుంటుంది. కాని ఆర్థిక పరిస్థితులు, తీరికలేని పనులు మరెన్నో కారణాలవల్ల అది సాధ్యంగాదు. అట్లని తాను తల్లిదండ్రులను నిర్లక్ష్యం చేయడానికి ఏ రైతూ బుద్ధిపూర్వకంగా సాహసించడు. ఒకవేళ చేసినా ఆ విషయాన్ని ఒప్పుకోడు.

'మంచిపనులుండే సమయంలో నా వంతు కొచ్చింది. ఈ నెల దాటేవరకు అమ్మతోని కష్టమే' తనలో తాననుకున్నాడు కొండమల్లయ్య.

"ఏమయిందే అవ్వ... ఏం గావాలె?" తల్లి దగ్గరకు పోయి మంచంపట్టెమీద కూర్చొని అన్నాడు కొండమల్లయ్య.

ఆ వృద్ధురాలు అటూ ఇటూ కదిలింది.

"నోరంత చేదయింది కొడుక" అని అడిగింది.

"అయితేంది? ఏం గావన్నో చెప్పు?"

"ఓ కోడిపిల్లను కోసిపెట్టు" అంది తల్లి.

ఇంట్లో కోళ్లు లేవు. కొని కోయాలంటే పాతిక, ముప్పై రూపాయలకంటె తక్కువ కాదు. కరువుకాలంలో కొనడం కష్టమే. బంధువులెవరూ లేకుండా వ్యవసాయకుటుంబాల్లో సాధారణంగా మాంసాహారం వండుకోరు. మాంసాహారం తినడం విలాసవంతమైందిగా భావిస్తారు రైతులు. రోగాలొచ్చి ఊళ్లో గొర్రెలు చని

పోయే కాలంలోమాత్రం మాంసం తక్కువ ధరకుంటుంది కాబట్టి కొన్నిసార్లు తింటారు.

తల్లికేం చెప్పాలో ఆలోచిస్తున్నాడు కొండమల్లయ్య. ఇంతలో నర్సమ్మ అత్తమాటలు విని అక్కడికొచ్చింది.

అత్త ఏం కోరినా నర్సమ్మకు ఆమె వయసులో వున్నప్పుడు తానను భవించిన అత్తపోరు జ్ఞాపకం వస్తుంది. అటు పొద్దంతా తీరిక లేకుండా వ్యవసాయప్పని... సాయంత్రం ఇంటికొచ్చేసరికి ఏదో మిషమీద అత్త గుణింపులు... ఉమ్మడి కుటుంబంలో వున్నప్పుడు తోడికోడళ్లతో తగాదాలు. తన తమ్ముని కూతురని రెండవ కోడలుకే మద్దతునిచ్చేది అత్త. తనను తిట్టిన తిట్లు భర్తతో చెప్పి కొన్నిసార్లు కొట్టించడం అన్నీ మదిలో మెదిలాయామెకు.

"మునలితనానికి కోడికూర తినబుద్ధయితందా...? నంసారమెల్లెల్లుతదని మేం జూస్తుంటె కోడి గావాల్నట కోడి" అంది నర్సమ్మ.

"అట్లాగేలేవె నువ్వు" భార్యను వారించాడు కొండమల్లయ్య.

"ఆగుడులేదేంలేదు... పెట్టింది తినుకుంటూ ఉండక అది గావాలె, ఇది గావాలంటె ఎక్కన్నుంచొస్తాయి? ముప్పైరూపాయలు పెట్టి కోన్ని కొనుక్కస్తవా ఏంది?" అంది నర్సమ్మ.

"ఏం కొనుక్కరానుగని నీ ఉరుకులాటేంది?" భార్యను గద్దరించాడు కొండమల్లయ్య. తల్లి తలమీద చెయ్యేసి నిమిరాడు.

"అవ్వా... ఇంకొన్ని రోజులయితె గోదావరిఖనినుంచి రాజయ్యొస్తడు. ఇయ్యాల్లరేపట్ల కాంతవ్వ మామ గూడ వస్తడు. వాళ్లొచ్చినప్పుడు ఎట్లైన కోన్ని గోసుడే" అన్నాడు.

కొడుకు మాటలకు తలూపింది కొండమల్లయ్య తల్లి. "నేనేమన్ననని నీ పెండ్లాం మీదికురికస్తంది?" అంది.

"అత్తకోడండ్ల నడుమ ఇదెప్పటి కున్నదే. అందుకే అన్నరు కోడలు లేనత్త గుణవంతురాలు, అత్తలేని కోడలుత్తమరాలు అని. అవ్వ నేమనకు" నర్సమ్మతో అని అరుగు దిగి వెళ్లిపోయాడు కొండమల్లయ్య.

పద్మశాలి కిష్టయ్య వాకిట్లోకెళ్లేసరికి టపటప చినుకులు పడసాగాయి. పందిట్లో నిల్చొనివున్న కిష్టయ్య "వానొచ్చెటట్టున్నది... ఇటొచ్చి కూచోలేవె కొండమల్లన్న" అన్నాడు.

ఇద్దరూ అరుగుమీద వాల్చున్న మంచంలో కూర్చున్నారు. "ప్రొద్దున్నే ఎటో పోతున్న వేందే?" అన్నాడు కిష్టయ్య.

"నాగలి గట్టల్లని పోతున్న కొట్టంలున్న ఎడ్లదగ్గెరికి. కాపుదనపోల్లకు చస్తామన్నా తీరని కాలమిది"

"నీకారాటం బాగ... పిల్లలందరు పెద్దోల్లయింద్రు. ఇంకా రందెందుకు నీకు?" అని వాకిట్లోకి చూశాడు కిష్టయ్య.

చినుకులుగా పడ్తున్న వర్షం కురవడం మొదలయింది.

"ఈరోజు జెండావందనం చెయ్యనిచ్చెటట్టే లేదు వాన. పిల్లలంత ఉతికిన బట్టలేసుకొని బడికి పోయింద్రు. ఊరేగింపు తిరిగే టైముకు వాన రావట్టె" అన్నాడు కిష్టయ్య.

"ఇయ్యాల్లేంది?"

"నీకు తెలువదానె పంద్రాగష్టు"

"అంటేంది...?"

"స్వతంత్రదినం... మునుపు మన దేశాన్ని ఇంగ్లీమవాళ్లు పాలించెటోల్లు. గాంధిమహాత్ముడు, నెహ్రూ, ఇంకా చాలామంది కొట్లాడి వాళ్లనెల్లగొట్టింద్రు. ఇప్పుడు మనదేశాన్ని మనమే ఏలుకుంటున్నం"

"ఓ... జెండవందనమా ఇయ్యాల్ల... మరిచేపోయిన. నాకయితె ఎవ్వలేలినా అంతే అనిపిస్తంది"

"పరాయిదేశపోడు మనదేశాన్ని ఏలినదానికున్నూ మనదేశాన్ని మనమే ఏలుకున్నదానికి తేడా లేదా? ఇంగ్లీపోడు మనదేశాన్ని దోచి వాళ్లదేశంల కూడబెట్టిండు. ఎంతయినా ఇప్పుడు మునుపటంత దోపుకం లేదు! కొంత నయమే" అన్నాడు కిష్టయ్య.

కిష్టయ్య తండ్రి, తాతలు ఊళ్లో మగ్గంనేస్తూ బ్రతికేవారు. బట్టపొట్టకెళ్లడమే కష్టంగా వుండేది. కిష్టయ్య ఎదిగిన తర్వాత ఆదిలాబాద్ జిల్లాకు పోయి గిరిజన ప్రాంతాల్లో బట్టల ముక్కురావడం మొదలుపెట్టాడు. కిష్టయ్యొక్క

డే కాదు చాలామంది పద్మశాలీలు బట్టలు తీసుకెళ్లి అక్కడమ్మేవారు. అమాయకులైన గిరిజనులకు ఇరవై రూపాయల చీరను అరవై కమ్మడం, చిన్న చిన్న అప్పులు పెట్టడం మొదలుపెట్టాడు. కొంత డబ్బు సంపాదించా డు. ఊళ్లో పొలం కొనుక్కున్నాడు. తండ్రికా లంలో తిండికి కూడా కష్టంగానే వున్న కిష్టయ్యా కుటుంబం ఆర్థికంగా కొంత బాగుపడింది. ప్రస్తుతం గిరిజనులక్కడ తిరుగబడుతుండ టంవల్ల చాలామంది వ్యాపారానికై అటు పోవ డంలేదు. అందులో కిష్టయ్యకూడా ఒకడు. తాను తండ్రికంటె మంచిగా బ్రతకడానికి కారణం స్వాతంత్ర్యమేనని కిష్టయ్యా నమ్మకం.

''అప్పుడు నయమో, ఇప్పుడో... నాకు తెలు వది. దోపుకం ఎప్పుడెక్కువుందో కూడా నాకు తెలువది. కాని నేను వేరు పడ్డప్పుడు నాకు పదెకరాల భూముండె. నేను పుట్టి బుద్దెరిగిన ప్పట్నుంచీ ఎద్దు ముడ్డి పొడుసుకుంటనే బతు కుతన్న. ఎండల, వానల, చలిల శరీరం దాచుకోకుంటనే పన్జేత్తన్న. ఇంట్లోల్లందరం మట్లె మట్టయి బొర్లతున్నం. కాని, ఎంత జే సినా మా నాయన పంచిచ్చిన భూమినన్న కాపాడుకోలేదు నేను. ఇప్పుడు నాకు మూడెక రాల భూమే ఉంది. దానిమీద గూడ అప్పులు న్నయి. ఎప్పటికాలం మంచిదో నాకు తెలుస్తలే దు'' అన్నాడు కొండమల్లయ్యా.

వాన తగ్గి చిన్నగా తుంపర పడుతోంది. మంచంలోంచి లేచి నిల్చున్నాడు. కిష్టయ్యా దిక్కు చూశాడు.

''మంచిదే కిష్టన్న... పొద్దుపోతంది. నాగలి పట్టాలె'' అని అరుగు దిగుతున్నాడు కొండమ ల్లయ్యా. అతన్తోపాటు కిష్టయ్యా కూడా అరుగు దిగాడు.

''వర్షం పూర్తిగ తగ్గనేలేదు. కొద్దిగాగలేవె?'' అన్నాడు కిష్టయ్యా.

''ఈ తుంపరుకేమైద్ది? పోవాలె'' అని కొట్టం దగ్గరికెళ్ళాడు కొండమల్లయ్యా. ఎడ్లను పొలంలోకి తోలుకెళ్ళాడు. నాగలి కట్టాడు. నడ వలేక నడుస్తున్న వలువపెద్దును అదిలిస్తూ నాగలి దున్నాడు. పగలు భార్య తెచ్చిన అన్నం తిని మళ్ళీ దున్నాడు. సాయంత్రంవరకు నాగలి నడిపి విడిచాడు.

''మూడు చాల్లయింది. ఇంకొక చాలు దు న్ని నాటెయ్యాలె'' తనలో తాననుకున్నాడు. చెలుకలో ఎడ్లను కడుపునిండా మేపాడు. కొంచెం రాత్రయేవరకుండి ఎడ్లను తోలుకొచ్చి కొట్టంలో కట్టేశాడు. మేతేసి ఇంటికెళ్ళాడు. ఇంట్లో రాజయ్యను చూసిన కొండమల్లయ్యా ముఖం వెలిగింది.

''ఎప్పుడచ్చినవు బిడ్డ...?'' కొడుకు మీద చెయ్యేస్తూ అన్నాడు.

''రెండు గంటలయింది'' అన్నాడు రాజ య్యా.

డిమ్‌గా వున్న కరెంటు మసక వెలుతుర్లో కొడుకును పరీక్షగా చూశాడు కొండమల్లయ్యా. చిన్నప్పట్నుంచీ వ్యవసాయం చేస్తూ, మోటు కష్టంతో బతికిన రాజయ్యా, ఈ స్వల్పకాలంలో బావిపని చేస్తూ ఎలిసిపోవడం కొండమల్ల య్యకు ఆశ్చర్యంగా వుంది.

''ఏంది బిడ్డ? బక్కగైపోయినవు?'' అన్నా డు రాజయ్యా పక్కనే మంచంలో కూర్చుంటూ.

''ఎక్కడ బాపు? మంచిగనే ఉన్న మీ కండ్లకు బక్కపడ్డట్టనిపిస్తున్ననా? ఏం బక్కప డలే'' అన్నాడు రాజయ్యా.

''లేదుబిడ్డ... కంటె బొక్కలు కనవడ్తు న్నయి'' అని కొడుకు మెడఎముకలను పట్టి చూశాడు కొండమల్లయ్యా.

''కొత్తపని గాదా బాపు... అలవాటయెదాక కొంచెం వెలిసిపోయినట్టయితరు'' అన్నాడు రాజయ్యా.

''లేదుబిడ్డ... నువ్వు బాగ దివాల్దీసినవు. ఎట్లుండెటోనివి ఎట్లయినవు? మా కండ్ల ముందటుండుమంటె ఉండక పోతివి. అంతా పైలమే కదక్కడ?''

''అంతా మంచిదే... ఆయుమ గూడినంక ఎక్కడున్నా తప్పది. చావు నెవ్వలన్న ఆపుతరా బాపు?'' అన్నాడు రాజయ్యా.

''అట్లెందుకంటవు బిడ్డ?'' అని లేచి బావి దగ్గరికి పోయాడు. ముఖం, కాళ్ళు చేతులు కడుక్కొని వచ్చాడు.

ఊళ్ళోకెళ్ళిన తిరుపతయ్యా ఇంటికొచ్చి అన్నను చూశాడు.





"ఎప్పుడొచ్చినవే అన్న?" అన్నాడు.

జవాబు చెప్పాడు రాజయ్య.

"వదిన బాగుందా?"

"మంచిగనే వుంది"

"లక్ష్మిని తీసుకరాకపోయినవా బిడ్డ? రెండ్రోజులుండి ఇద్దరు పోయెటోల్లు గద" అంది నర్సమ్మ.

"వదినె నెందుకు తీసుకరాలేదే?" అంది కాంతమ్మ.

"నేను మారమ్మన్న. అదే రానంది. బలవంతమెందుకని తీసుకరాలే... ఈ సారొచ్చినప్పుడు తీసుకస్త"

బొగ్గుబావిపని గూర్చి, అందులోని కష్టసుఖాల గూర్చి, లీడర్లగూర్చి, మేనేజర్లగూర్చి అన్నదమ్ములిద్దరూ మాట్లాడుకుంటున్నారు. నర్సమ్మ భోజనానికి లెమ్మనగానే ముగ్గురూ లేచి వంటింట్లో కెళ్ళారు. మాట్లాడుతూ భోజనం ముగించారు.

తెల్లవారి కొంచెం పొద్దెక్కేసరికే నగునూరి నుంచి లస్మయ్య వచ్చాడు. వాకిట్లో నిల్చుని వియ్యంకున్ని చూసి కొండమల్లయ్య-

"కాంతవ్వా మీ మామ వచ్చిండు, కాళ్ళకు నీళ్లియ్యి" అన్నాడు.

కాంతమ్మ చెంబుతో నీళ్ళుదెచ్చి మామ చేతికిచ్చింది. చెప్పులు విడిచి కాళ్ళు కడుక్కొని అరుగెక్కి మంచంలో కూర్చున్నాడు లస్మయ్య.

"నువ్వెప్పుడొచ్చినవుర రాజయ్యా?"

"నిన్న సాయంత్రం"

"వదినె మంచిగుందానె అన్న?"

"మంచిగనే వుంది. మొన్నటాక జరమచ్చి తగ్గింది"

"శ్రావణమాసం వెల్లుటానికచ్చె... ఇప్పుడానోయ్ బావ నువ్వచ్చేది? కోడలు మీద బాగనే పట్టింపున్నట్టుందిగద"

"ఏం జెయ్యన్నోయ్ పనేమన్న తీరినత్తుందా? చినుకు పడ్డప్పట్నుంచి గోక్కుందామంటే తీరుతలేకపాయె" అని అక్కడేవున్న మునలమ్మ మంచం పట్టెమీదికి మారాడు.

"మంచిగున్నావె అత్త?" అన్నాడు లస్మయ్యఆమెపై చెయ్యేసి.కొంచెంసేపు బాగాచూసి గుర్తుపట్టి.

"నువ్వా బిడ్డ? తొందరగ చావొస్తె మంచిగుండు" అంది.

"ఏంది? అంత కష్టమైతందా? తినుండుటానికి?" నర్సమ్మ మాటలువిని మూల్గింది మునలమ్మ.

"చూడు బిడ్డ... నేనిప్పుడేమన్న అందరికుంది చాలు"

అత్తమాటలకు జవాబు చెప్పబోయింది నర్సమ్మ.

"ఆగలేవె చెల్లే. చాతగానిది దాని జోలికెందుకు పోతవు?" లస్మయ్య అనగానే ఊర్కుంది.

వియ్యంకులిద్దరూ కొద్దిసేపు మాట్లాడుకున్నారు.

"ఊళ్లోదాక పొయ్యొస్త" అని లేచి రుమాలు చుట్టుకొని బయటకుపోయాడు కొండమల్లయ్య.

కొండమల్లయ్యకిప్పుడు చాలా సంతోషంగా వుంది. అటు నౌకరి చేస్తున్న కొడుకొచ్చాడు. ఇటు వియ్యంకుడొచ్చాడు. ఎంత పనున్న కాలమైన సరే ఈ రోజతడు పనికిపోదలుచుకోలేదు. ఉద్యోగం చేస్తున్న కొడుకును, కూతురు మామను మంచిగా మర్యాదచేయాలనుకున్నాడు. అన్నగౌడు ఇంటికెళ్ళి నాలుగుబుడ్ల తెల్లకల్లు చెప్పాడు. ఓ కోడిని కొనుక్కొచ్చి కోయించాడు.

మధ్యాహ్నం భోజనాలు చేసి అంతా మాట్లాడుతూ కూర్చున్నారు. కొద్దిసేపు మంచాల్లో ఒరిగారు. నర్సమ్మ పూరీలు చేసింది. నాలుగ్గంటలవరకు కల్లు తీసుకొచ్చాడు అన్నగౌడు. కోడిని కోసి, పూరీలతో కల్లు విందుచేస్తే వ్యవసాయ కుటుంబాల్లో మంచి విందు చేసినట్టు లెక్క. రాజయ్యను, లస్మయ్యను చెరోదిక్కు కూర్చోబెట్టుకొని కోడికూరతో పూరీలు తింటూ కల్లు తాగుతున్నాడు కొండమల్లయ్య. తిరుపతయ్యకు తాగడం అలవాటు లేకున్నా వాళ్ళ దగ్గర కూచుని పూరీలు తింటున్నాడు. మాట్లాడుతూ పని కానిస్తున్నారు వాళ్ళు.

"పర్మనెంటయినావుర రాజయ్యా" అడిగా

డు లస్మయ్య.

"ఒక్కొక్కలు ఏండ్లకొద్ది పనిజేసినా పర్మ నెంటు కారు నేనెట్లయితఽ?"

"అదిగాదు బిడ్డ నేననేది... ట్రేనింగుంటద టకద... అదయిందా?"

"నెలరోజుల క్రిందనే అయిపోయింది"

"నువ్వు చేసేదేంపని?"

"లాడీసులు నింపుడు"

"జీతమేపాటెత్తుతన్నవు?"

"నాగవేకుంట జేత్తె పదిగేను వందలు మావన్తయి"

"పనలుకగనే వుంటదా బిడ్డ?" అడిగాడు కొండమల్లయ్య.

మైళ్ళతరబడి భూగర్భంలోకి నడవడం, లోపల జారుడు, నీళ్లతడి, ఉక్కపోత, బొక్కటో పీలు తలలపై పెట్టుకొని లోపలికెళ్ళడం, లోపల రాత్రి పగలుకు తేడాయే తెలియక పోవడం...చీకటి, విపరీతమైన వేడి, బొగ్గు తేమలోనే అప్పుడప్పుడు కొంత విశ్రాంతి తీసు కోవడం, లాడీసుల కొరకు ఎదిరి చూడటం, కొంచెం చప్పుడైతే ఉలిక్కిపడటం, ప్రతిక్షణం గండంగా భావించడం, బయటకొస్తే పునర్జన్మ గానే భావించడం, ఎంత పనిజేసినా పై అధికార్లతో మాటలు, బొగ్గుతో స్నానమాడి నల్లని ఆకారాలతో, చెమటకంపుతో బయటకు రావడం, ముక్కుల్లో, నోట్లో, శరీరమంతా బొగ్గు పొడి, బయటకొచ్చింతర్వాత ఇంటికెళ్ళడానికి కాళ్లీడ్చుకుంటూ మైళ్ళదూరం నడువడమో, సైకిల్ తొక్కడమో చేయడం.

ఇంకా... ఇంకా... ఎన్నో జ్ఞాపకం వచ్చాయి రాజయ్యకు. దూరపు కొండలు నునుపని భావించి బావిపనికి పోయిన తన బతుకు దినదినగండంగా వుంటుందని చెప్పడానికి మనసొప్పడంలేదతనికి. బొగ్గుపెళ్ళ కూలి తను పనిచేస్తున్న పక్క గులాయిలోనే ఇద్దరు కార్మికులు చనిపోవడం అతని కళ్ళముందు కదిలింది. తండ్రికేం జవాబు చెప్పకుండానే ఓ గ్లాసు కల్లుతాగాడు రాజయ్య.

"పనెట్లుంటదంటె చెప్పవేంది బిడ్డ? చాలా కష్టమా?"

"మృత్యుగర్భంలోకి పోయినట్టు లోపలికి పోవాలి. రోజా గండంగానే వుంటుంది. హారన్ వినిపించిందంటే గుండెదడ. డ్యూటీ సమ యమయితే కాళ్ళు చేతులు వణుకుతాయి. అందులో నైట్ షిఫ్టుంటే ఇంకా కష్టం. కండ్లు నిలబడి పోతూవుంటే పనిచేయాలి. పని నుంచి వచ్చి పొద్దంతా పడుకున్నా నిద్రచాల దు. పగలు హాయిగా నిద్రపోదామంటే ఇంట్లో పనతుండదు. చాలీచాలని కొంప, ఈగలు, దోమలు, మురికి, ఛీ... ఏం బతుకులో" పని యిన కొత్తలో అందరనుకున్నట్టుగానే అనుకు న్న రాజయ్య ఇలా చెప్పాలనుకున్నాడు. కాని, ఒక్క మాటకూడా నోట్లోంచి బయటకురాలేదు. తానే పట్టుబట్టి బావిపనికి పోయి, అందులో సుఖం లేదని చెప్పి తల్లిదండ్రులకు బాధ కల్గించకూడదనుకున్నాడు.

"పనిదేముందే? ఎనిమిదిగంటల డ్యూటీ అన్నట్టేకాని ఎనిమిదిగంటలు పనుంటదా? చదువుకున్నవాళ్లకయితె కష్టంకాని నాలాంటి మోటుకష్టం చేసినోనికి ఆ పనేం బిపాయిదా? ఆడుతు పాడుతు చెయ్యొచ్చు"

కొడుకేదో దాస్తున్నట్టనిపించింది కొండమల్ల య్యకు. "అయితె నువ్వు నాగలేకుంట పన్తె త్తవా? మా ఊళ్ళె చాలా మందున్నరు బాయి పనిజేసెటోల్లు. నాగలేకుంట చేయడం కష్టమే నటగద"

లస్మయ్య ఆ మాటలనేసరికి ఇరకాటంలో పడ్డాడు రాజయ్య. నిజానికి ఆబ్సెంట్ లేకుండా బావిలో పనిచేయడం దాదాపు అసా ధ్యం. నూటికొక్కరైనా అలాంటి వాళ్ళుండటం కష్టం. తల్లిదండ్రులను సంతృప్తిపరచడానికై రాజయ్య పని సులభమని చెప్పాడు కాని, నిజానికి బావిపని కష్టతరమైందే. లోపలకు దిగి పనిచేసి బయటకొచ్చేసరికి కాళ్ళు విపరీ తంగా గుంజుతాయి. ఒళ్ళంతా భరింపరాని నొప్పులుంటాయి. ఉమ్మేస్తే నోట్లోంచి బొగ్గుపొడి వస్తుంది. అందుకే నాలుగైదు రోజులకొకసా రైనా ఆబ్సెంటవుతారు కార్మికులు. ఇప్పుడు రాజయ్య ఒక్కరోజు విడువకుండా పనిచేస్తు న్నానంటే డబ్బు బాగానే వస్తుందనుకుంటా రు. పని కష్టంగా వుందని చెబితే బాధపడుతా రు. ఏం చెప్పాలో అతనికర్థంకావడంలేదు. ఏదేమైనా భవిష్యత్తులో డబ్బుగురించి గొడవ లు రాకుండా వుండటానికి నిజం చెప్పడమే





మంచిదనుకున్నాడు రాజయ్య.

"లోపలికి దిగి మీది కొచ్చేవరకు ప్రాణాలు కొలికిలకస్తయి. నాగవోకుంట చేసుడు కష్టమే" అన్నాడు.

కొడుకుదిక్కు జాలిగా చూశాడు కొండమల్లయ్య. లస్మయ్య మళ్ళీ ఏదో అడగబోయాడు. మధ్యలో తిరుపతయ్య కల్పించుకొని-

"ఆగలేవు మామ... అన్న పనికి పోయిందే మొన్నమొన్న... కొద్దిరోజులయితె పనలవాట యిద్ది" అన్నాడు.

అంతటితో ఆ విషయాన్ని వదిలిపెట్టాడు లస్మయ్య. అరుగుమీద ముసలమ్మ మూలుగుతోంది. కల్లు తేవడం, కోడిని కొయ్యడం మంచంలోంచే గమనించింది. పూరీలు చేయడం వాసనద్వారా పసిగట్టింది. ఎంత సేపయినా తనకు కల్లు, పూరీలు ఇవ్వకపోయేసరికి ఆమెకు వినుగొచ్చింది. కోడల్ను లోపల్లోపలే తిట్టుకుంది. అందరికీ వినబడాలని గట్టిగా దగ్గింది. తల్లి దగ్గు విన్న కొండమల్లయ్య వృద్ధురాల్ని మరిచిపోయినందుకు తనను తానే నిందించుకున్నాడు.

"అవ్వకు పూరీలు పెట్టినవా?" నర్సమ్మను అడిగాడు.

"పండ్లేలేకపాయె... దంగుతయా?" అంది నర్సమ్మ.

'ఈ ఆడవాళ్ళు స్వార్థపరులు. తన తల్లికయితే దగ్గర కూర్చుండి తినిపించేది. అత్తనేనరికి?' తనలో తానే అనుకున్నాడు కొండమల్లయ్య.

"మెత్తటి ముక్కలు, పూరీలు అవ్వకియ్యిపో. చిగుర్లతోని చప్పరించుకుంట అదే మింగుతది" అన్నాడు.

నర్సమ్మ గిన్నెలో పూరీలు కూరవేసి అత్తకిచ్చి వచ్చింది. కొండమల్లయ్య గ్లానునిండా కల్లుపోసి భార్యకిచ్చి తాగుమన్నాడు.

"నాకెందుకు వద్దు" అంది నర్సమ్మ.

"తాగలేవా! వద్దనుడెందుకు?" అనగానే తాగింది.

బిడ్డకు, భార్యకు, తల్లికి తేపకోసారి గ్లానుల్లో కల్లు పోసిన్తూ తాగమంటున్నాడు కొండమల్లయ్య. మాట్లాడుతూ విందు చేనుకుంటున్నారు.

"అక్క చెల్లెండ్లకు చీరలు పెట్టడంమల్ల వచ్చిందట కద. దుకాండ్ల చీరలు మస్తు అమ్ముడు పోతన్నయట. తోడుబుట్టినోల్లకు నెల లోపల చీరబెట్టకుంటె మంచిది గాదట. అందరనుకుంటంద్రు. ఎంత దూరంలున్నా చీరె కొనిపెడుతంద్రు" అన్నాడు లస్మయ్య.

"ఆడబిడ్డలకు ఏదో కొంత ముట్టజెప్పాలని ఇట్లాంటియి పుట్టిస్తరు. పుకార్ల లేపుతరు. చక్కెర కుడుకలు పోయడం, అక్క చెల్లెల చీరల కాలమచ్చిందనడం అన్నదమ్ముల నుంచి అక్కచెల్లెండ్లకుకొంత ముట్టజెప్పటానికే" అన్నాడు కొండమల్లయ్య.

"అక్క చెల్లెల చీరలంటె యాదికచ్చింది అన్నా! కొంతవ్వకు శ్రావణపట్టీ దెచ్చినావె?" అంది నర్సమ్మ.

"వాళ్ళ వంశానికి తీసుకునుడే కాని ఇచ్చుడు అలవాటులేదు" తిరుపతయ్య ఎత్తి పొడిచేసరికి కోపంగా చూశాడు లస్మయ్య.

"నీకెందుకు బిడ్డ? మేం లేమా మాట్లాడుటానికి?" తిరుపతయ్యతో అని-

"మాట్లాడవేంది బావ?" లస్మయ్యతో అన్నాడు కొండమల్లయ్య.

"మొన్ననే కొత్తకోల్యాగను కొన్న. కొంచెమంత పైసలు ఎల్లకుంటున్నయి. పైసల్లు పండిన తర్వాత మాకొంట చీర"

లస్మయ్య మాటలు విని ఇంటికొచ్చిన అతిథిని గుణిపించొద్దని "సరె తియ్యి బావ! మీ కోడలు మీ ఇష్టం. కొన్నా మీ కోడలు మీదనే ఉంటది" అన్నాడు కొండమల్లయ్య.

"అవును నిజమే మాకొంట చీరె" అన్నాడు లస్మయ్య.

మాట్లాడుతూ విందు ముగించారు.

తెల్లవారి కోడలును వెంటబెట్టుకొని నగునూరుకు పోయాడు లస్మయ్య. ఆ రోజుండి మరునాడు రాజయ్య బియ్యం తీసుకొని గోదావరిఖనికి వెళ్ళిపోయాడు. కూతురుకు, కొడుక్కు ఎన్నో జాగ్రత్తలు చెప్పి వంపింది నర్సమ్మ.

★ ★ ★

నేలంతా [illegible]నట్టుగా వుంది. చెరువులు, కుంటలు, ఒర్రెలు, వాగులు అన్నీ

నిండున్నాయి. ఏరు ఒడ్లను ఒరుసుకుంటూ నిండుగా ప్రవహిస్తోంది. అసలేట్లో (ఆశ్లేష) ముసలెడ్లు రంకెలేస్తాయంటారు. పచ్చిగడ్డి తిని పుష్టిగా తయారై పశువులు రంకెలేస్తు న్నాయి. ఒకదాన్నొకటి పొడుచుకుంటూ కొట్లా డుతూ పరుగులు తీస్తున్నాయి. పశువులన్నీ కండబట్టున్నాయి.

పొలాల కలుపులు పూర్తయ్యాయి. పెసరచే లు విరగకాస్తున్నాయి. పల్లీలు పాలుపట్టి అప్పుడప్పుడే విత్తులవుతున్నాయి

పొద్దున్నే లేచి బయటికి పొయ్యొచ్చాడు కొండమల్లయ్య. కాళ్ళు చేతులు ముఖం కడు క్కున్నాడు. రుమాల్తో ముఖం తుడుచుకుంటూ మంచంలో కూర్చోబోయాడు. 'కలుపయింది... పొలమెర్రబడుతుంది మందెయ్యాలి. మందు బస్తాలొచ్చినయో లేదో కారొబారినడిగి రావాలి. తనలో తాననుకొని రుమాలు చుట్టుకున్నాడు. బయటకు వెళ్ళబోతున్నాడు. తమ్ముడు వెంక టయ్య తన ఇంటిదిక్కే రావడం చూసి ఆగిపో యాడు. అన్న దగ్గరికొచ్చి నిల్చున్నాడు వెంక టయ్య. అతని ముఖంలో దైన్యం. ఏదో కోల్పో యిన వాడిలా చిన్నబోయున్న ముఖంతో వున్న తమ్ముణ్ణి చూసి కొండమల్లయ్య-

"ఏందిర వెంకటయ్య... ఎట్లనో ఉన్నవేంది? కూచో' అని మంచం చూపెట్టాడు. వాకిట్లో వున్న మంచంలో అన్నదమ్ములిద్దరూ ఒకరి పక్కనొకరు కూర్చున్నారు.

కళ్ళలో తిరుగుతున్న నీటిని రుమాల్తో తు డుచుకున్నాడు వెంకటయ్య.

"నాకీ ఊరి నీళ్ళు బాకిలేవే అన్న" అన్నా డు బాధగా.

"ఏమైంది తమ్మి... ఏమైంది?" ఆతురతగా అడిగాడు కొండమల్లయ్య.

"నీకు తెలువందేమున్నదే అన్న? నీకంటె గోరంగుంది నా సంగతి. ఉన్న మంచి భూ మంత అమ్ముడుపోయింది. నిన్ననే పొలమమ్మి బాకి గట్టిన. మిగిలింది రెండెకురాల చెలుక. దానిమీద కూడా కొన్ని బాకీలున్నయి. దాన్ని దున్నుకుంట కుటుంబమంత బతుకుడు కష్టమే. ఐదుగురు పిల్లలు, మేం ఉన్న భూమి తోనెట్ల బతుకుతం? అందుకే అందరం కలిసి పెద్దపెల్లికి పోతున్నం. అక్కడ బండి గొట్టు కుంట బతుకుత. చేతినిండ పని మా దొరుకు తదక్కడ. పెద్దొల్లనిద్దర్ని అడ్తి (వ్యవసాయ మార్కెట్) దుకాండ్లనన్న ఇంకే దుకాండ్లనన్న ఉంచుత. కిందికో మీదికో పొట్టపోసుకుంటం. ఇక్కడ బతుకుడిగ కష్టమే" అని తల వంచు కున్నాడు వెంకటయ్య. కడుపులోంచితన్నుకొస్తు న్న దుఃఖాన్నాపుకోవడానికై ప్రయత్నిస్తున్నా డు.

తమ్ముని మాటలు విన్న కొండమల్లయ్యకు కడుపులో చెయ్యిబెట్టి దేవినట్టయింది. ముగ్గు రన్నదమ్ముల పరిస్థితీ దాదాపు ఒకేవిధంగా వుంది. అలా ఎందుకవుతోందో, కిటుకెక్క డుందో అతనికి అర్థంకావడం లేదు.

"తమ్మీ! ఇది మన రాతగాకుంటేందిర? మన మేమన్న కాయ పాయగ (హాయిగ) తింటిమా? తాగి తందనాలాడితిమా? పన్జెయ్యా కుంట ఉంటిమా? పుట్టి బుద్దెరిగినప్పట్నుంచి మనం మోటు కష్టమే చెయ్యవడితిమి. ఎంత జేసినా మన సంగతి రోజురోజుకు హీనమే గావట్టే. మనది పాడు రాతగాకుంటేంది?" చేతుల్తో తల కొట్టుకుంటూ అన్నాడు కొండమ ల్లయ్య.

"ఏంజేద్దామే అన్న... ఎట్లుంటె అట్లయి తది! ఏమైనా ఒక్క ఎవుసం మీదనే సంపా యించినోల్లు తక్కువే. పండని సంవత్సరం పండకనేపాయె. పండినేడు ఆ పంటకు ధరుండకపాయె. ఏ వంటయితె వండదో దాని కాయేడు మస్తు ధరుండె. దానికి ధరుందని ఆ వంటేస్తే పంట చేతుల కచ్చేవరకు దాని ధర తగ్గె. ఇగ ఎట్ల బతుకుతడే అన్న వ్యవసాయ దారుడు? పంట నిలువుంచుకుందామంటెనే మొ మనకెల్లకపాయె. కల్లంలది కల్లంలనే అమ్ముడాయె. మరి పంటచేతులకచ్చే సమ యానికి ధరుండకపాయె. అది మన చేతు ల్నుంచి అవుతల పడ్డంక ధర పెరిగె. అయ్యో ఇప్పుడమ్మితె బాగుండని మొత్తుకుంటేమొ స్తది? మల్ల అన్ని వస్తువుల ధరలు అగ్గి లెక్కనే వుండె. మన సంగతి కొనబోతె కొరివి అమ్మబోతె అడివేలుందే అన్న. ఇప్పుడివ్వన్నెందుకు కాని నిన్ను కలిసిపోదామనొచ్చిన" అన్నాడు వెంక




టయ్యా.

"ఎప్పుడు పోతున్నవు మరి పెద్దపెల్లికి?"

"ఈరోజే"

"ఇన్నిరోజులు ఒక్కమాటన్న అనకపోతివి... నేనేమన్న పరాయోణ్ణిర తమ్మి?"

"నెల రోజుల్నుంచే అనుకుంటన్న... కాని, నా మనసుల్నే పెట్టుకున్న. ఎవ్వలతోని చెప్పలే. అయినా చెప్పి చేసేదేముంది? మిమ్ముల్ని బాధపెట్టుడు తప్పుతె?"

అన్నదమ్ముల మాటలు వింటున్న నర్సమ్మ

"ఒక్కనివే పోతన్నవా? అందరు పోతున్నరా వెంకటయ్యా?" అంది.

"అందర్ని తీసుకపోతున్న వదినె"

"ఎక్కడుంటవు మరి పెద్దపెల్లిల"

"కుమ్మరి రామయ్యున్నడు చూడు... ఇన్ని రోజులు దేశ్‌ముఖ్‌పాలేరుండె... ఇప్పుడు కూర గాయలమ్ముకుంటండు. ఇప్పటికైతె అయినె గుడిసెనే వుంట. అటెనుక ఇల్లు కిరాయికి తీసుకుంట. గుడిసెల ఓ మూల వండుకుంటె ఐపోతది? ఎన్ని రోజులు? పది రోజుల్ల ఏదన్న ఇల్లు మా దొరుకుతది. నేను పోయేవరకే ఇల్లు చూసి ఉంచుతనన్నడు రామయ్యా. దొరుకుతె మంచిదేనాయె" అన్నాడు వెంకటయ్యా.

కొండమల్లయ్యా తమ్మునిపై చెయ్యేసి దగ్గ రకు తీసుకున్నాడు.

"ఒక్క సాయం చెయ్యాల్నే అన్న" అన్నా డు వెంకటయ్యా.

"ఏందో చెప్పు?"

తలవంచుకొని చెప్పడానికి తటపటాయిస్తు న్నాడు వెంకటయ్యా.

"నాదగ్గెర దాచుడెందుకు తమ్మి చెప్పు!" అన్నాడు కొండమల్లయ్యా.

"ఇంకో రెండు మూడు రోజులయితె అమా వాస్యవస్తది. ఈ రెండ్రోజులు అవ్వను మీ ఇంట్లుంచుకో. అమాస్యనాడు కొండయ్యన్న తీసుకపోతడు. ఈ నెలన్నదే వంతు"

వెంకటయ్యా మాటలు విని నర్సమ్మేదో అన బోయింది. కాని, కొండమల్లయ్యా ఆమెను మాట్లాడనివ్వలేదు.

"ఈ రెండ్రోజులకేమచ్చే. అవ్వను తీసుకచ్చి నా దగ్గరుంచు. రెన్నెల్లయినంక నీ వంతుక స్తది గద మల్ల? అప్పుడేం జేస్తవు మరి?" అన్నాడు.

"రెన్నెల్లవరకు ఏ రాజేపట్నమేలుతడో ఎవ్వలకెరుక? పూర్తిగ అధ్వాన్నమైంది అవ్వ. అప్పట్రాక బతుకుతెచూసేది. అప్పుడు నేన చ్చి తీసుకపోత. లేకుంటె మీ ఇద్దర్లో ఒక్కలకు దాని ఖర్చులకిందికి ముందే పైసలిచ్చిపోత"

ఊరినే వదిలిపోతున్న తమ్మునితో తల్లి విషయం గూర్చి ఖచ్చితంగా మాట్లాడాలని పించలేదు కొండమల్లయ్యాకు. మాట్లాడాలను న్నా మనసొప్పలేదు.

"సరే... అవ్వందీసుకచ్చి ఇక్కడుంచు" అన్నాడు.

వెంకటయ్యా తల్లిని తీసుకొచ్చి కొండమల్ల య్యా ఇంట్లో వదిలాడు. అన్నదమ్ములిద్దరూ బిగ్గరగా కౌగలించుకున్నారు. ఊరొదిలిపోతు న్న తమ్ముని కుంటుంబాన్ని చూసిన కొండమ ల్లయ్యా కళ్ళలో నీళ్ళు తిరిగాయి. వెంకటయ్యా అన్నను కౌగలించుకొని ఏడ్చాడు. యారాల్ను (తోడికోడల్ని) పట్టుకొని కొంత సేపేడ్చింది నర్సమ్మ. తమ్ముని కుటుంబాన్ని ఊరిబయటి వరకు సాగనంపాడు కొండమల్లయ్యా. ఊరికి దూరంగా పోతున్న ఎడ్లబండిదిక్కే చూస్తూ కొద్దిసేపు నిల్చున్నాడు.

'కాలమెట్లచ్చింది? రాడికలోల్ల భయానికి కొందరు ఊళ్ళువిడిచి పోతుంటే, బతుకుదె రువు లేక కొందరు పోవట్టిరి' తనలో తానను కుంటూ ఇల్లుచేరుకున్నాడు కొండమల్లయ్యా. వాకిట్లో బరిసె పట్టుకొని నిల్చున్న సుంకరిని చూసి "ఏంది సాయులు? ఎందుకొస్తివి?" అన్నాడు.

"తాసీలింకెప్పుడు గట్టుతవు? ఎన్నిసార్లు రావాలె నీ దగ్గరికి? వసూల్చేసుకోటానికి క్లర్కొ చ్చిండు. నిన్ను తీసుకురమ్మన్నడు. వినాయక చవితి పండుగముందట తాసీలు కట్టమంటె పైసలు లెవ్వంటవి? ఇప్పుడన్న కడతవా లేదా? మీతోని తిప్పలే వచ్చింది నాకు. నేంది రుగాలె!" అన్నాడు సాయులు.

"ఇప్పుడే మా తమ్ముడు ఊర్ను విడిచిపెట్టి





పెద్దపెల్లికి పోతుంటె సాగదోలి వస్తన్న. ఇంటిక చ్చేవారకు యమునోలె నువ్వుంటివి. నేనిప్పు డు పొలంకాడికి పోవాలె. సాయంత్రం వచ్చి మా కడుతపో''

''నేను వట్టిచేతులతోని పోతె నన్ను తిడుత రు. అక్కడికయితె రా. వచ్చేమన్న చెప్పుకో'

''ఇంత ఖచ్చితమైతె ఎట్ల సాయులు? నరె కని పదెకురాలకంటె తక్కువ భూముంటె తాసీలు లేదన్నిగద! దేవుడు వరమిచ్చినా పూజారి వరమివ్వడంటె గిదేనేమొ?''

''నాకు ఆ విషయాలన్ని తెలువయి వటేల! నాకు అవ్వన్ని తెలిసినంక నుంకరితన మెందుకు చేస్త? అవ్వేదో కచ్చీరుకాడికచ్చి వాళ్ళనే అడుగు. ఇప్పుడైతె నాతోనిరా''

ఇక తప్పేట్లు లేదనుకున్నాడు కొండమల్ల య్య. మందు బస్తాకోసమని దాచిన డబ్బు జేబులో పెట్టుకొని చావడి దిక్కు నడిచాడు.

తాను చిన్నవయసులో వున్నప్పుడు, అటు తర్వాత మొన్నటివరకు కూడా తహసీలు వసూలప్పుడు ఎంత హడావిడి వుండేదూళ్ళో? తహసీలు కట్టే సమయమొస్తుంటే చాలు రైతు లు గజగజలాడేవారు. పట్వారి నుంకరిని వంపాడంటే డబ్బు చెల్లించాల్సిందే. రేపు మాపని వాయిదా వేయడానికి వీల్లేదు. తాను సర్కారు మనిషినని నుంకరే పేద రైతులపై నగం పట్వారీల అధికారం చలాయించేవాడు. రజాకార్ల కాలంలోనైతే మరీ అధ్వాన్నంగా వుండేది. తహసీలు సమయానికి చెల్లించని వాళ్ళను నుంకర్లు చావడి దగ్గరకు ఈడ్చుకుపో యేవారు. పనిలో వున్న రైతులను ఉన్నవాళ్ళ నున్నట్టుగా నుంకర్లు లాక్కుపోవడం తాను చూశాడు. ఇంట్లో కెళ్ళి బిందె, చెంబు, పళ్ళాలు ఏవి కనబడితే అవి తీసుకెళ్లడం తనకు తెలుసు. ఒక్కోసారి నాగటి మీదెద్దును తీసుకె ళ్ళి చావడి దగ్గర కట్టేసేవారు. నుంకరే దొరలా ప్రవర్తించేవాడు. ఇక పట్వారి, పోలీసుపటేళ్ల అధికారాలకయితే హద్దులే ఉండేవి కావు. రైతెంత కష్టపరిస్థితుల్లో వున్నా ముక్కుపిండి వసూలు చేసేవారు. తన నాన్న చెప్పగా విన్నా డు తాను. భూమిశిస్తు కట్టలేక దాక్కునేవారట రైతులు. కొందరు శిస్తుకిందికి భూములనే వదులుకునేవారట. నైజాం కాలంలో రెవెన్యూ ఇన్స్పెక్టర్ (గిరుదావరి) ఊళ్ళోకొచ్చినా, తహ సీల్దారు ఊళ్ళోకొచ్చినా చెప్పలేని హడావి డి...భయం...భయం. బజార్లో ఎవ్వరి కోడి కన బడినా నుంకర్లు తీసుకెళ్లేవారు. అదేంటని అడగడానికి వీల్లేదు. దేశ్ముఖ్, గిరుదావరి, తహసీల్దార్లకు రాత్రుల్లో ఆడవాళ్ళను కూడా పంపేవారు పట్వారి, పోలీసుపటేలు.

నైజాం పాలన పోయిన తర్వాత కూడా రైతు ఎంతకష్టపరిస్థితిలో వున్నా పన్నులు కట్టక తప్పలేదు. దొరలు, ఊరి పెద్దలు బాగానే సాగించుకున్నారు. ఎవ్వరు పోయి ఎవ్వరొ చ్చినా తనలాంటి వాళ్ళ పరిస్థితులలాగే వున్నాయి.

పూర్వపరిస్థితి, ఇప్పటి పరిస్థితి గూర్చి ఆలో చిస్తూ చావడి దగ్గరకు చేరుకున్నాడు కొండమ ల్లయ్య. ప్రభుత్వం ప్రకటించిందని తాను విన్న భూమిశిస్తు మాఫీ గురించి అడిగాడు. అతని మాటలెవరూ పట్టించుకోలేదు. చేసేదేం లేక డబ్బు చెల్లించి ఇంటికొచ్చాడు. పెనళ్ళు పండింతర్వాత అమ్మి డబ్బులిస్తానని షావుకా ర్ని బతిమిలాడి అరువు బేరంపై యూరియా బస్తా కొనుక్కొచ్చాడు. బండ్లో బస్తా తీసుకెళ్ళి తన స్వంత పొలంలోనూ, కౌలుకు దున్నిన పొలంలోనూ యూరియా చల్లాడు. అంతకు ముందు ప్రశాంతంగా వున్న ఆకాశం మేఘా లతో నిండిపోయింది. కొండమల్లయ్య ఇంటి ముఖం పట్టేసమయానికి పరీక్షకన్నట్టుగా వర్షం కురవడం మొదలైంది. మొదట్లో చిన్నగా ప్రారంభమైన వర్షం అతడింటికి చేరు కునేసరికి ఉధృతంగా కురవసాగింది. తడిసి ముద్దయి ఇంటికెళ్ళిన కొండమల్లయ్య బట్టలు మార్చుకున్నాడు. ధారాపాతంగా కురుస్తున్న వర్షాన్ని చూస్తూ తనలో తానే అనుకున్నాడు.

'ఇంతవరకు ఆకాశంలో ఒక్క మేఘంకూడా లేదు. కడిగి బోర్లేసిన పల్లెంలా వుండేదాకాశం. మందేయడం అయిపోయేవరికి మేఘాలు కమ్ముకొచ్చె. మందేసిన తర్వాత వాన రావట్టే. ఒక్క రెండు గంటలాగినా మందు వరికి పట్టేది. మందంత కొట్టుకపోతుందేమొ? డబ్బు దండుగవుతుందేమొ? ఓ మడిలోంచి ఇంకో మడిలోకి నీళ్ళు పోకుండా గండ్లన్ని మూసేశా ను. అయినా కుండపోత వానకు గండ్లు పడ



కుంటుంటయా? మందు వరికి పట్టడం కష్టమే. ఏంజేద్దాం మరి నా అదృష్టం ఎట్లుంటె అట్లయితది. చూడుచూడుమని ఈ రోజే మందెయ్యాల్నా నేను?'

ముంతపోతగా కురిసే వర్షాన్ని చూస్తున్న కొండమల్లయ్య ముఖంలో విచారం.

★ ★ ★

పొద్దుగుంకి చాలా సేపయింది. భోజనం చేసి మంచంలో నడుం వాల్చాడు కొండమల్లయ్య. అలసిన శరీరం నిద్రలో కొరుగబోతోంది.

"డొడ్డొంక డొం... డొడ్డొండ డొం" డప్పు చప్పుడు విని లేచి కూర్చున్నాడు. హనుమంతు ఊరు చాటింపు చేస్తున్నాడు. డప్పుపై హనుమంతు కొడ్తున్న లయబద్ధమైన దెబ్బలు తన గుండెపై కొడ్తున్నట్టనిపిస్తుంది కొండమల్లయ్యకు. కరువులో ప్రభోజనం ఖర్చులా మరేదో విపత్తు రాబోతుందనుకుంటున్నాడతను. మంచంలో వెల్లకిలా పడుకున్నాడు. హనుమంతు చెప్పబోయే మాటలు వినడానికి చెవులు రిక్కించి చూస్తున్నాడు. ఏదైనా విని తట్టుకోవడానికి తననుతాను తయారుచేసుకుంటున్నాడు. హనుమంతు కొండమల్లయ్య ఇంటిదగ్గర బజాట్లో ఆగాడు. డప్పు చప్పుడాగిపోయింది. హనుమంతు మాటలు వినడానికి సిద్ధంగా వున్నాడు కొండమల్లయ్య. డప్పుమీద టక్‌టక్‌మని రెండు దెబ్బలు కొట్టాడు హనుమంతు. రెండు క్షణాలాగాడు.

"విన్నోల్లైవరో? విననోల్లైవరో? ఇంతవరకు ఎల్.ఎం.బి (లాండ్ మార్టిగేజ్ బ్యాంకు) బాకి తీసుకున్నవాళ్ళు బాకి కట్టాలట. రెండు మూడుసార్లు నోటీసులిచ్చినా కట్టలేదట చాలా మంది. వాళ్ళంతా వడ్డీతో కట్టాల్నట డబ్బు. ఎల్లుండి బ్యాంకు వాళ్ళస్తరట. బాకీలున్నోల్లు పనికిపోకుంట ఉండాల్నట. ఈసారి బాకి గట్టకుంటే ఏదుంటె అది కొంచవోతరట. అందరు పైసలు తయారుగుంచుకోవల్నట ఓహో..." తను చెప్పాల్సింది బిగ్గరగా చెప్పి డప్పుమీద టక్‌టక్‌మని రెండు దెబ్బలేసి-

'డొడ్డొంక డొం... డొడ్డొంక డొం' అని డప్పు కొడుతూ వెళ్ళిపోయాడు హనుమంతు.

హనుమంతు డప్పు చాటింపు మాటలువిన్న కొండమల్లయ్య వణికిపోయాడు.

'ఊళ్ళో బాకీలే చాలా వున్నాయి. ఇప్పుడే సర్కారు బాకి? మెడమీద కూర్చొని బాకి తీర్చమంటెలా తీర్చడం? ఇప్పుడేమన్న పంటొచ్చిందా? పంటొచ్చినా తాను బాకీలు తీర్చే స్థితిలో ఉన్నాడా? ఉన్న భూమినైనా దక్కించుకోవడం తనవల్లకాదా?' తనలోతానే మధనపడుతున్నాడు కొండమల్లయ్య.

ఎల్.ఎం.బి. బాకీ గూర్చి ఆలోచిస్తూ సర్కారు బాకీల సుడిగుండంలో తానెలా ఇరుక్కున్నది జ్ఞాపకం తెచ్చుకున్నాడు.

తనకు బాకీలు చెయ్యడమంటే అసహ్యం. ఏం నిలువ చేయకున్నా మంచిదే కాని బాకీలు లేకుండా ఉన్నదాంతో గుట్టుగా సంసారం వెళ్ళదీలయాలకున్నాడు. వేరు కాపురం పెడ్తున్న సమయంలో అప్పటివరకు తండ్రి చేతిలో పెత్తనముంది కాబట్టి సంసారమెలా జరుగుతుందో తనకు పెద్దగా తెలిసేదికాదు. వేరుపడింతర్వాత కాని రైతు జీవితంలోని ఆటుపోట్లు తనకు తెలిసిరాలేదు? కష్టసుఖాలు ఆ తర్వాతే అవగాహనయ్యాయి. రైతు బాకీలు చెయ్యకుండా ఉండడం ఎంత అసాధ్యమో క్రమక్రమంగా తెలియసాగింది. ఎంత వద్దనుకున్నా బాకీలు చెయ్యక తప్పని పరిస్థితి వచ్చేది. ఒకసారి పండిన పంట నమ్ముకుంటే తిరిగి పంట వచ్చేవరకు, అంటే దాదాపు ఆరు నెలలవరకు తనలాంటి రైతుకు ఏ ఆదాయమూ ఉండదు. ప్రతిరోజో, వారానికో ఆదాయం రావడానికి కూరగాయలు పండించి అమ్మడం ఊళ్ళోలేదు. ఎవరైనా కూరగాయల చెట్లు పెట్టినా ఇంటి అవసరాలు తీరేందుకు పెట్టుకునే వారు. తోట్లోకెళ్ళితే ఉచితంగా ఇచ్చేవారే కాని డబ్బులు తీకుకునేవారు కాదు. కూరగాయలు పండించి అమ్ముకోవడానికి వీలుగా తన గ్రామానికి ఏ బస్తీ దగ్గరగా లేదు.

పంటమ్ముతే వచ్చిన డబ్బు అంతకు ముందు పెట్టిన పెట్టుబడులకు, మరెన్నో గృహావసరాలకు కొద్దిరోజుల్లోనే ఖర్చయిపోయ్యేది. పిల్లికి రొయ్యల మొలతాడులా ఎన్నో అవసరాలముందు ఆ డబ్బు చూస్తూండగానే అయిపోయేది.

తర్వాత ఏ చిన్న అవసరమొచ్చినా అప్పు





తప్పేది కాదు. అనారోగ్యాలు, పండుగలు, పెళ్ళిళ్ళు, కట్నాలు, కానుకలు, చావులు, మంచి చెడూ కార్యాలన్నిటికీ డబ్బే అవసర ముండేది. వీటికి తోడు వ్యవసాయానికి, పెట్టు బడులకు కలుపుకు, నాటుకు, మందు బస్తాలకు, ఒక్కోసారి విత్తనాలకు, ఇంకెన్నో అవస రాలకు డబ్బవసరమయ్యేది. ప్రతి చిన్న అవస రానికీ అప్పు చేయడమొక్కటే మార్గంగా కనబ డేది. వచ్చిన పంట అప్పులవాళ్ళకు కొలువగా మిగిలేది సున్నే. ఒక్కోసారి ఇంకా అప్పులే మిగిలేవి. అవి పెరుగుతూ పోయేవి.

ఇక తప్పని పరిస్థితుల్లో తాను, తనలాంటి రైతులు షావుకార్లదగ్గర, ఊరి మోతుబరులద గ్గర వాళ్ళు కోరినంత వడ్డీ ఇవ్వడాని కొప్పుకొని మళ్ళీ అప్పు తెచ్చుకునేవారు. తమ అవసరాల ను చూసి వాళ్ళు మరింత బిగుసుకొని కూర్చుండేవారు. ఆ వడ్డీని భరించడం తమకు కష్టమే అయినా అప్పు తప్పేది కాదు.

ఊళ్ళో అప్పులతో సతమతమవుతున్న సమయంలో సర్కారు అప్పుల గూర్చి చెప్పా డు పైరవీకారి నర్సయ్యా ప్రభుత్వం రైతులకు బ్యాంకులద్వారా అప్పులిస్తుందని, భూమిని తనఖాపెట్టి ఆ అప్పుల్ని తీసుకోవచ్చుని, ఆ అప్పుల్ని సులభ వాయిదాలలో చెల్లించవ చ్చుని, వడ్డీ కూడా తక్కువే వుంటుందని చెప్పా డు నర్సయ్య. అప్పుడు నర్సయ్యా రైతులందరి కీ ఆపద్బాంధవుడిలా అగపడ్డాడు. తక్కువ వడ్డీకి అప్పులిస్తున్నారంటే తీసుకోని రైతెవ్వ రు? పోగా ఆ డబ్బు ఒకేసారి కట్టాల్సిన అవసరం లేదు. కాబట్టి తాను తనలాంటి రైతులు బేంకుల నుండి కూడా బాకీలు తీసుకో వడం మొదలుపెట్టారు. భూమి తనఖాపెట్టి ఎల్.ఎం.బి. అప్పులు తీసుకోవడం మాత్రమే కాకుండా బావుల్లో పూడికతీయటానికి ఎరువు లు కొనుక్కోవడానికి చిన్నచిన్న మొత్తాల్లో అప్పులు, క్రాప్‌లోన్లలాంటివి కూడా తీసుకో వడం మొదలుపెట్టాడు తాను. బాకీలు తీసు కొని తిరిగి చెల్లించుతున్నకొద్దీ ఆ అప్పుల్లోని బండారం తనకు తెలియసాగింది. ప్రైవేటు అప్పులతో పోలిస్తే వడ్డీ తక్కువే అయినా ఆ అప్పు రావడానికయ్యే ఖర్చులు, సమయానిక ప్పు చెల్లించకుంటే చెల్లించాల్సిన అపరాధరు సుము, లంచాలు, పట్టుకోవడాలు అన్నీ కలు పుతే ప్రైవేట్ అప్పుల్లాగా వడ్డీ పడేది. కొన్నిసా ర్లు బ్యాంకాఫీసర్లు మంచివాళ్ళుండి లోన్లు మంజూరు చేద్దామని ప్రయత్నిస్తే, పైరవీకార్లు కాకుండా చేసి, తాము ప్రయత్నం చేసి ఇప్పించినట్టుచేసి డబ్బు లాగుతారనీ తెలి సింది.

ఓసారి భూమి తనఖాపెట్టి ఎల్.ఎమ్.బి. నుండి ఐదువేల రూపాయల అప్పుకోసం దర ఖాస్తు పెట్టుకున్నాడు తాను. దరఖాస్తు ఫారం నింపింది మొదలుకొని అప్పుడున్న పట్వారీకి, గిరదావరికి, పైరవీకారికి, బేంకు క్లర్కుకు, సూ పరింటెంటెట్‌కు, బ్యాంకు మేనేజర్‌కు వీళ్లందరి కీ ముడుపుల రూపంలో పదిహేను వందల వరకు ఖర్చయింది. అంతే కాకుండా పైరవీకా రివెంట రమ్మన్న ప్రతిసారీ తాను తనలాంటి రైతులు ఎన్నోసార్లు పనిమానుకొని పోయారు. బస్సు కిరాయిలకు, హోటలు ఖర్చులకు, సిగరెట్, కిల్లీలకు, తాగడానికి ఖర్చులన్నీ తామే భరించారు. డబ్బు వచ్చింతర్వాత మరుసటి సంవత్సరం నుంచి ఏడాదికి ఎని మిది వందల చొప్పున పదేండ్లు చెల్లించాడు తాను. ఇక ప్రభుత్వ అప్పుల్లో వడ్డీ తక్కువెక్క డుందో తన కర్థమయ్యేదికాదు. వరమియ్యని పూజార్లలా చుట్టూ తింపుకునేవారధికార్లు.

బాకీల వసూళ్ల విషయంలో బేంకు అధికా ర్లకు దయాదాక్షిణ్యాలసలే వుండేవి కాదు. షావుకారితోనైనా కొంత మాట్లాడి ఒప్పించవ చ్చు. కాని వాళ్ళు మాట్లాడనిచ్చేవారే కాదు. మాట్లాడినా ఎవరూ వినేవారుకాదు. బేంకధికా ర్లు బాకీ వసూళ్ళకు ఊళ్ళోకొస్తున్నారంటే గొర్రె లమందమీద తోడేలు పడ్డట్టనిపించేది. రైతు లంతా వణికిపోయేవారు. సాయుధులైన గార్డు లతో జీపులో వచ్చిన అధికార్లంటే రైతులకు భయముండేది.

మొదట బాకీ చెల్లించాల్సిన తేదీని తెలుపు తూ నోటీసులు పంపేవారు. నోటీసులు పంపినా బాకీలు చెల్లించకుంటే అపరాధరు సుముతో చెల్లించాలని మళ్ళీ నోటీసులు పంపే వారు. అప్పుడు కూడా చెల్లించకుంటే జీపు తీసుకొని స్వయంగా వచ్చేవారు. ఉన్నఫళంగా బాకీ చెల్లించాలని ఒత్తిడి చేసేవారు. ప్రా ణంమీద నిల్చుండి బాకీలు వసూలు చేసుకు

పోయేవారు. వచ్చిన అధికార్లకు బత్తా కిందికి డబ్బులు, జీపు ఖర్చులు, అపరాధ వడ్డీతోసహా వసూలు చేసేవారు. అలాంటి సమయాల్లో తనలాంటి రైతులు ఊళ్ళోని వడ్డీవ్యాపారుల ను శరణువేడక తప్పేదికాదు. కీలెరిగి వాతవె ట్టినట్టు తమ అవసరాలను చూసి వాళ్ళు మరింత ఎక్కువ వడ్డీ గుంజేవారు. అయినా తీసుకోక తప్పేదికాదు. రైతుకాఏడు పంట పండకున్నా చీడపీడలు తగిలి పంట పాడ యినా, అతివృష్టి, అనావృష్టిలాంటి ప్రకృతి వైపరీత్యాలవల్ల రైతు నష్టపోయినా బేంకధికా ర్లు పట్టించుకునేవారు కాదు. రైతు బాకీ చె ల్లించలేనిపరిస్థితులున్నాయన్నావినేవారు కా దు. ఎన్నో సార్లు భూములు, నాగటిపైని ఎద్దు లు, ఇంట్లో ఉన్నసామాన్లు వేలంవేసి డబ్బులు వసూలుచేసుకుపోయారు. ఓసారి తన నాగటి మీదెద్దును వేలం వేసి తీసుకెళ్ళితే తనకు చెయ్యి విరిగినట్టుకాగా అంగలార్చాడు, ఏడ్చా డు. అయినా ఎవరు విన్నారు? ఎవరు పట్టించుకున్నారు? తమముందే తమ వస్తువు లు వేలంవేయబడుతుంటే తనలాంటి రైతు లు గుడ్లునీళ్ళు కుక్కుకొని నిస్సహాయంగా నిల్చుండేవారు.

ఎన్నోసార్లు ప్రభుత్వబాకీలు చెల్లించలేక తా ను, తన లాంటి రైతులు అవమానాలపాలైనా, బాకీ ఇకముందు తీసుకోవద్దనుకుంటూనే తెచ్చుకునేవారు. తెచ్చుకోక తప్పేది కాదు. ఓసారి మోటబావిలో పూడిక తియ్యడానికి తీసుకున్న బాకీ తీర్చలేక భార్య మీదున్న బంగారు కడియమమ్మాడు తాను.

ఓసారి చేండ్లో బంటాలు తీస్తామన్నారు అధికార్లు. తాను వద్దని మొత్తుకున్నాడు. భూ సారం కాపాడటానికి బంటాలు తీయడం తప్ప దని, తహసీల్‌దార్‌గారి ఆర్డరని వద్దన్నా విన కుండా చేండ్లో బంటాలు తీశారు. భూసారం మాట దేవుడెరుగు కాని తనమీద ఆకాలంలో ఐదువందల అప్పువడింది. తోడిన భూమి కింద, తోడిన మన్ను పోసిన చోట భూమి నష్టమైంది. బంటాలు తీసిన తర్వాత భూ సారం పెరిగి వంట ఎక్కువ రావాలి. కాని అందుకు విరుద్ధంగా భూమి వైశాల్యం కొంత తగ్గడంవల్ల పంట తగ్గింది. అయినా ఏడ్చు కుంటూ, తూడ్చుకుంటూ ఆ బాకీ చెల్లించక తప్పలేదు.

ఓసారి పది పన్నెండేళ్ళక్రితం చుట్టపు చూ పుగా లక్సెట్టిపేటకు పోయాడు తాను. ఆ రోజే ఆ ఊరికి వ్యవసాయ మంత్రి వస్తున్నాడు. వేలాది మంది మంత్రిని చూడటానికి గ్రౌండు కెళ్ళుతున్నారు. రోడ్లనిండా పోలీసులు. తాను కూడా వ్యవసాయమంత్రి వ్యవసాయం గూర్చి ఏం చెబుతాడో విందామని మీటింగ్ జరిగే చోటికెళ్ళాడు. తనలాగే చాలా మంది రైతులొ చ్చారు మీటింగుకు. గ్రౌండు నిండా జనం. పోలీసులు లాఠీలు ఝుళిపిస్తూ అల్లరికాకుండా చూడటానికి ప్రయత్నిస్తున్నారు. రెండు గంట లాలస్యంగా మంత్రిగారొచ్చారు. చిరునవ్వు నవ్వుతూ రెండు చేతులు జోడించి జనాలకు నమస్కరించాడు. మీటింగు మొదలైంది. మొ దట్లో లోకల్ ఎమ్.ఎల్.ఏ, కొందరు లీడర్లు మాట్లాడారు. ఆటు తర్వాత మంత్రిగారు లేచి మాట్లాడారు. రైతే రాజని, రైతే దేశానికి వెన్నె ముకని, రైతు అభ్యున్నతే దేశాభ్యున్నతని తమ కర్థంకాని పెద్దపెద్ద విషయాలు మాట్లాడాడు. తమ ప్రభుత్వం రైతుల సంక్షేమంకొరకెన్నో పథకాలు చేపట్టిందని, ప్రతిపక్షాలు తమపై చేస్తున్న తప్పుడు ప్రచారాన్ని నమ్మవద్దని ఏమేమో చెప్పాడు మంత్రిగారు. మంత్రి మాట్లాడటం ముగించి కూర్చున్నాడు. వెంటనే స్టేజికి కొంతదూరంలో నేలపై కూర్చొనున్న ఓ రైతు లేచి నిల్చుని చేతులు పైకెత్తాడు.

"ఓ మంత్రి దొరా! నువ్వేదేదో చెప్పినవు... గవర్నమెంటు మా కోసం పెద్దపెద్ద పనులు చేస్తుందన్నవు... ఇదువరకున్న నాయకులు, మంత్రులు గూడ ఇట్లాంటి మాయమాటలే చెప్పింర్రు... మీరు మా కోసమే అన్నీ చేస్తున్నా రు. కాని మేము రోజు రోజుకు దిగజారి పోతున్నం. మా వ్యవసాయాలు మూలపడుతు న్నయి. భూములన్ని అమ్ముడు బోతున్నయి. రైతే రాజని మీరు మమ్ములను ఉబ్బిస్తరు మరా రాజు సంగతేమైందో తెలుసా? మొన్నటి కి మొన్న సర్కారు బాకి వెల్లక కట్టలేదు నేను. అప్పుడేంజేసింర్రో తెలుసా? నా నాగటిమీది రెండెడ్లను వేలమేసి తీసుకపోయింర్రు. నాకు చేతులిరిగినట్టయినయి. తలదీసినట్టయింది. నా మొకం మందిల నల్లమొకమైంది. ఇగో మా




రైతులందరికి బుద్ధిరావల్నని నేను ఎండ్రిన్ తాగుతన్న. మీ ముందట్నే తాగుతన్న'' అని జేబులోంచి సీసా తీసి గటగటా నోట్లో పోసుకొని మింగేసాడు.

జనంలో కలకలం... ఆ రైతు దగ్గరకు పోలీసులు పరుగెత్తుకొచ్చారు. మీటింగు భగ్న మైంది. ఆ రైతును పోలీసు జీపులో వేసుకొని హాస్పిటల్‌కు తీసుకెళ్లారు. అతడు తాగిన మందును కక్కించడానికి డాక్టర్లు ప్రయ త్నించారు. మంత్రి ముందు జరిగిన కేసవ డంవల్ల ప్రభుత్వయంత్రాంగమంతా కది లింది. డాక్టర్లు సర్వ ప్రయత్నాలూ చేసి విషం కక్కించారు.

ప్రమాదం గడిచి ఆ రైతు ప్రాణాపాయం నుండి బయటపడ్డాడని తెలిసింది. అయితే అటు తర్వాత ఆత్మహత్యా ప్రయత్నం నేరం కింద అతన్ని అరెస్ట్ చేశారని తెలుసుకొని తాను ఆశ్చర్యపోయాడు.

ప్రభుత్వ బాకీల సుడిగుండం, తన కళ్ల ముందే ఎండ్రిన్ తాగిన రైతు జ్ఞాపకం వచ్చి కళ్లవెంట నీళ్లు తిరిగాయి కొండమల్లయ్యకు.

తనలాంటి వాళ్లకలాంటి పని తప్పదేమో! ఆంధ్రప్రాంతంలో రైతులు అప్పులు భరించ లేక ఆత్మహత్యలు చేసుకున్నారని తిరుపత య్యా పేపరు చదివి తనతో చెప్పాడు.

కొండమల్లయ్యా కిప్పుడేం చేయాలో అర్థం కావడం లేదు. బాకీ తీర్చడానికి మరో బాకీ చేయడానికి అతని మనసంగీకరించడంలేదు. చేద్దామన్నా ఇంకా బాకీ పట్టడం కష్టమనే తోస్తోందతనికి.

తనలాంటి నోట్లో నాలుకలేని రైతులపైన్నే ఈ అధికార్లు జబర్దస్తీ చేస్తారు. ప్రక్క ఊరి వెలమదొర బ్లాకు ప్రెసిడెంటుగా వున్నప్పుడు అరవై వేల అప్పు తీసుకొని వాటికేవేవో కారణా లు చెప్పి చెల్లించకుంటే ఏం చేసారు? పైరవీ కారి భూమయ్య గొల్లవాళ్లకు గొర్లు కొనుక్కోవడా నికి డబ్బులిప్పిస్తానని ఒక్కొక్కరి దగ్గర నాలు గైదు వందలు వసూలు చేశాడు. తర్వాత అందరి పేర్లమీద డబ్బు తీసుకొని పరారయ్యా డు. బాకీలు చెల్లించమని గొల్లవాండ్లకే నోటీసు లొచ్చాయి. పాపం ఏడ్చుకుంటూ వాళ్లు చె ల్లించక తప్పలేదు. భూమయ్య కొద్దిరోజులు ఎక్కడెక్కడో తిరిగి ఊళ్లోకొచ్చాడు. అందరూ అతన్ని తిట్టి ఊర్కున్నారు కాని ఏం చేయలేక పోయారు. బరితెగిస్తే ఎవ్వరేం చెయ్యలేరన్నది నిజం.

ఇంతకూ రెడ్డికి మాత్రమేమయింది? ఒకే పొలాన్ని అమ్ముతానని ముగ్గురి దగ్గర బాకీలు తీసుకున్నాడు. ముగ్గురికీ అమ్మినట్టు తెల్లకాగి తంపై రాసిచ్చాడు. ముగ్గురికీ తెలియకుండా అదే భూమిని తనఖాపెట్టి బ్యాంకులో అప్పుతీ సుకున్నాడు. నిజం తెలిసిన తర్వాత అప్పులి చ్చినవాళ్లు మొత్తుకున్నారు. అయినా రెడ్డినేం చేయలేకపోయారు. బ్యాంకు అప్పును ముగ్గు రు తీర్చేసి ఆ భూమిని పంచుకున్నారు. ఆ భూమి ధరకంటె రెండున్నర రెట్లు పడింది వాళ్లకు.

తనలాంటి రైతులలా చేయగలరా? ప్రాణం పోయినా అలాంటిపని చేయలేడు తాను. అన్నమాట తప్పడాన్ని తనలాంటివాళ్లు అవ మానంగా భావిస్తారు. తామమ్ముడు పోయైనా సరే బాకీ తీర్చడానికి ప్రయత్నిస్తారు.

ఎల్లుండి తీర్చాల్సిన బేంకు అప్పు గూర్చి రకరకాలుగా ఆలోచిస్తున్నాడు కొండమల్లయ్య. భయపడుతున్నాడు. మళ్లీ తనకు తానే సమా ధానం చెప్పుకుంటున్నాడు.

''ఈ పరిస్థితుల్లో అన్నలే దిక్కు. అన్నలొచ్చి ఈ గండం గట్టెక్కిస్తే బాగుండేది'' తనలోతానే అనుకున్నాడు మొదటిసారిగా.

అర్ధరాత్రి దాటింతర్వాత కాని అతని కంటి మీదికి కునుకు రాలేదు.

కొండమల్లయ్య భయపడ్తున్న ఆ ఎల్లుండి రానే వచ్చింది. ఏం జేస్తారు బేంకువాళ్లు. తలదీసి మొలేస్తరా? ఏదైతే అదవుతది. ఇప్పు డైతే చేతిలో చిల్లిపైన కూడా లేదు? తనలోతాన నుకుంటూ చావడి దగ్గరికెళ్లాడు. అప్పటికే చాలామంది రైతులక్కడికి చేరుకున్నారు. బేంకు జీపుందక్కడ. చావడిమీద కుర్చీల్లో బేంకు అధికారి, ఇద్దరు క్లర్కులు చేతుల్లో కాగితాలతో కూర్చొనున్నారు. వాళ్లకు సమీ పంలో సాయుధులైన గార్డులిద్దరున్నారు. ఊరి పెద్దలు, సర్పంచ్, మాజీ పట్వారి, పోలీసుపటే లు, కొంతమంది యువకులున్నారక్కడ. కొండ

మల్లయ్య అక్కడకు చేరుకున్న కొద్ది నిమిషాల తర్వాత క్లర్కు బాకీ కట్టాల్సిన వాళ్ల పేర్లు చదివి-

"అందరూ వచ్చినట్టేనా?" అన్నాడు.

"ఆం... అందరొచ్చింంద్రు" రైతుల్లోంచి ఒక తనన్నాడు.

ఎవరెంత చెల్లించాలో చదివి చెప్పాడింకో క్లర్కు.

"ఇప్పుడేమన్న పంట చేతికొచ్చిందాసార్? ఇప్పుడొచ్చి బాకి గట్టుమంటెట్ల? పొలాలు కోతలయినంక వస్తె మంచిగుండేది కద!" అన్నాడో రైతు.

"ఈ డబ్బు పోయిన పంట పండింతర్వాత చెల్లించాల్సిన వాయిదాదేనాయె. అప్పుడు నోటీసులిచ్చినా కొద్దిమందే చెల్లించారు బాకీ? ఆగినందుకు మమ్మల్నే అంటున్నారా మళ్లీ" అన్నాడు బ్యాంకు అధికారి.

"నిజమే కాని సార్... రోజులు వెళ్లడంలేదు. వెళ్లితె ఇట్లెందుకు చేస్తం? ఎప్పుడైన బాకి బాకేనాయె"

"ఇప్పుడు మీద కూచుండి బాకి గట్టమంటె ఎట్లసార్...? పైనలేన్నుంచి తెమ్మంటరు?"

"ఎక్కన్నుంచి తెస్తారో మాకనవసరం. మాకు లోన్లు వసూలు చేయమని పైనుంచి ఒత్తిళ్లు న్నాయి. ఇంతవరకు రెండుసార్లు నోటీసులిచ్చినా డబ్బు కట్టలేదు. ఈరోజు డబ్బివ్వకుంటే చర్య తీసుకోవాల్సొంటుంది" అన్నాడు అధికారి.

"పొలాలు కోతలయ్యేదాకనన్న ఆగుంంద్రి... ఎట్లనో చేసి బాకీలు గడుతం"

"అది మా చేతుల్లో లేదు" అన్నాడు క్లర్కు.

"మీరన్న చెప్పుంంద్రి పంతులు... ఇప్పుడెల్లమని" అన్నాడు కొండమల్లయ్య మాజీ పట్వారీతో.

"నేంజెప్పుతె మాత్రమింటరా? సర్కారు బాకంటె కరాకండిగ కట్టాల్సొంటది. అయినా వాళ్లు మాత్రమేం జేస్తరు? వసూల్జెయ్యమని పైనుంచి వచ్చినంక వాళ్ల చేతుల్లేముంటది? మీరే ఎక్కడనన్న అప్పుదెచ్చి బాకి గట్టెయ్యంంద్రి" అన్నాడు పంతులు.

"మీకు గవర్నమెంటెంత సాయం జేస్తున్నా



కృతజ్ఞతనేది లేదు. బాకీలు తీసుకోవడం ముద్దే, కాని తీర్చమంటె ఏడుపొస్తది. ఇదేమన్న పద్ధతేనా?'' అన్నాడు అధికారి.

ఆ మాటలు విని నడుము పూర్తిగా వంగున్న ఓ వృద్ధ రైతు ముందుకొచ్చాడు. లోతుగా గుంటల్లోవున్నట్టున్న కండ్లను రెండుమూడు సార్లు మూసి తెరిచాడు.

"నిజమే దొర...? మాకు గురిమర్యాదనేది లేదు. మేము బే ఇమాన్‌గాల్లం. మాకందరూ సాయం జేసెటోల్లే. అందుకే బాగ బలిసినం. మా బలుపెంతో చూడుండ్రి. వ్యవసాయం చేసే ఒక్క రైతు శరీరం మీదనైన ఒక్క చటాకు మాంసముందేమొ చూడుండ్రి. మేము రాత్రనక, పగలనక మన్నుల మన్నయి పనిజేస్తె మాకు చినిగిపోయిన గుడ్డపేగులు కూడ మిగులుడు కష్టమైతంది. ఎంతజేసినా పుట్టెడప్పులే ఉంటన్నయి. మీరిచ్చిన బాకీల కింద మిగిలిన కొంచెమంత భూమిని జప్తుచేసుకొని మాకు చిప్పలు చేతికియ్యండ్రి... చిప్పలు చేతికియ్యండ్రి దొరా?'

ఎండిపోయున్న ఛాతీని చేతుల్తో చరుచుకుంటూ అన్నాడా వృద్ధుడు.

రైతులెంత బ్రతిమిలాడుతున్నా బేంకువాళ్లు వినడంలేదు. ఇక తప్పదని డబ్బు తీసుకొచ్చిన కొందరు రైతులు అప్పు చెల్లించడానికి సిద్ధమవుతున్నారు. మరికొందరు ఈ అప్పు తీర్చడానికి మరో అప్పు చేయడానికి ఎవర్నడగాలా అని ఆలోచిస్తున్నారు. ఇంతలో అక్కడకు నలుగురు యువకులొచ్చారు. వాళ్లలో



ఇద్దరికి గడ్డాలున్నాయి. మరో ఇద్దరి భుజాలకు సంచులున్నాయి. వాళ్లను చూసి-

''అన్నలొచ్చింద్రు... అన్నలొచ్చింద్రు'' అన రిచారు యువకులు.

బ్యాంకధికారి, క్లర్కుల ముఖంలో భయం చోటుచేసుకుంది. కుర్చీల్లోంచి లేచి నిల్చున్నారువాళ్లు. వాళ్ల వెంటున్న సాయుధ గార్డులు తుపాకులు చేతుల్లోకి తీసుకొని సిద్ధంగా వున్నారు.

''రైతులిప్పుడు బాకీలు చెల్లించరు. పంట వచ్చింతర్వాత చెల్లిస్తారు. వాళ్లనుండి బలవంతంగా బాకీలు వసూలు చేస్తే బాగుండదు. మీరు, మీ బ్యాంకులూ పేలిపోతాయి'' అన్నాడు గడ్డం యువకుడు.

రైతుల ముఖంలో ఆనందం...

బ్యాంకధికారికి ఏమనాలో తోచడంలేదు. అటుపై నుంచి ఒత్తిడి. ఇక్కడ డబ్బులు వసూలు చేద్దామంటే ఈ పరిస్థితి. అతని పరిస్థితి అడకత్తెర మధ్య పోకలావుంది. కొద్దిసేపాగి ఏదో చెప్పబోయాడధికారి. కాని వాళ్లాతన్ని మాట్లాడనివ్వలేదు.

''మీరేం చెప్తారో మాకు తెలుసు. ఏం మాట్లాడకుండా జీపెక్కండి'' అన్నాడింకో యువకుడు.

బ్యాంకు వాళ్లంతా జీపెక్కి కూర్చున్నారు. మరుక్షణంలో అది స్టార్టయి వెళ్లిపోయింది.

రైతుల దిక్కు చూస్తూ అన్నాడు యువకుడు.

''మీరంతా వెళ్లిపొండి. మీకేం భయం లేదు. మీకండగా మేమున్నాం. మిమ్మల్ని బేంకువాళ్లు బలవంతం చేస్తే మాకు తెలుస్తుంది. మాకు టైం లేదు. వెళ్లొస్తాం'' గబగబా వెళ్లిపోయారా యువకులు. ఆ యువకులకు మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకుంటూ రైతులు తమ ఇళ్లకు వెళ్లిపోయారు.

* * *

తెలంగాణాలో కొన్ని జిల్లాల్లో 'అన్నలు' సమాంతర ప్రభుత్వాన్ని నడుపుతున్నారు. కొన్ని ప్రాంతాల్లో ప్రభుత్వ యంత్రాంగంపై కంట్రోలు సాధించారు. పోలీసులు, అన్నల మధ్య ప్రచ్ఛన్న యుద్ధం కొనసాగుతోంది. కొంత కాలం పోలీసుల్ది, కొంతకాలం అన్నలది పైచేయిగా నడుస్తోంది. కాల్పులు, ఎదురు కాల్పులు, ఎదురు కాల్పుల పేర కాల్పులు ఎక్కడో ఓ చోట జరుగుతూనే వున్నాయి. ఆవుల కొట్లాటల మధ్య లేగదూడల్లా ప్రజలు అరచేతుల్లో ప్రాణాలు పెట్టుకొని భయంభయంగా బ్రతుకుతున్నారు.

పెరిగే ధరలతో పాటు కూలీ రేట్లవీ పెరగడం మామూలే అయినా పోరాటాలవల్ల రేట్లు మరింత పెరిగాయి. కాని అన్నల పోరాటాలవల్ల మధ్యతరగతి, వ్యవసాయ కుటుంబాలకు పెద్దగా ఒరిగిందేంలేదు. వాళ్ల పోరాట పంథాతో ఎవరు ఏకీభవించినా ఏకీభవించకున్నా వాళ్లమార్గం సరియైందైనా కాకున్నా వాళ్ల పోరాటాలవల్ల తెలంగాణాలో ఫ్యూడల్ దోపిడీ, పెత్తందార్ల అధికారం, దౌర్జన్యాలు చాలావరకు తగ్గాయి. కులవృత్తుల పేర్లమీద జరుగుతున్న అమానుషం ఊళ్లలో పోరాటాలు ప్రారంభమైన తర్వాత తగ్గింది. పెళ్లిళ్లయితే పల్లకి మోస్తూ చాకళ్లు పరుగెత్తాలి. వెనుక పరుగెత్తుకొస్తున్న సవారు బండ్ల కందకుండా పరుగెత్తాలి. దొరలు పటేండ్లు సవారెడ్ల బండ్లో ఊరెళ్లితే ఆ బండిముందు చాకలిఉరకాలి హరిజనులకు క్షవరం చేసేప్పుడు మంగలి గొంగళి ధరించి మరీ చేసేవాడు. హరిజనులు గుళ్లోకి పోవడానికి భయపడేవారు. ఇలాంటివన్నీ ఇప్పుడు తగ్గిపోయాయి.

బేంకు బాకీలు చెల్లించకుండా అన్నలెదిరించారని పోలీసులకు తెలిసింది. అన్నలను పిలుచుకొచ్చిందెవరని పోలీసులు ఊరిమీదబడి రైతులను వేధించసాగారు. వాళ్లతో ఎవరికి సంబంధాలున్నాయని చాలామందిని కొట్టారు. యువకులను ఇష్టమున్నట్టు బాదారు. మాకేం తెలియదని మొత్తుకున్నా విన్లేదు. వారం రోజులు ఊరుమీద పడి దొరికినవాన్నల్లా కొట్టి, కొంతమందిని అరెస్ట్ చేసి తీసుకెళ్లి మళ్లీ కొట్టి వదిలిపెట్టారు.

ఈ బాధల కంటె బాకీలు కట్టడమే మంచిది. ఎట్లయినా కొంతాలస్యమైనా బాకీలు చెల్లించడం తప్పదు. దానికదీ, ఇటు పోలీసు దెబ్బలు... ఉల్లిగడ్డలు, చెప్పుదెబ్బలు, డబ్బు




లు మూడూ దండుగ చెల్లించిన వాడి కథలా అయింది మా బతుకు. అన్నల్ని రమ్మన్న వాళ్లెవ్వరు? అటు తర్వాత పోలీసుల్తోని చావు. వెనుకకు పోతె గొయ్యి, ముందుకు పోతె నుయ్యిలావుంది మా సంగతి. తమలోతాము అనుకున్నారు రైతులు.

ఆశ్వయుజమాసం పండుగల సీజను. వర్షాలు వెనుకకు బట్టాయి. వరి గొలును విడిచింది. పెసరు చేలు ఏరుతున్నారు. అందరివీ దాదాపు ఒకేసారి రావడంవల్ల కూలిమనుములు దొరకడం కష్టంగావుంది. పంటలో ఆరవపాలు కూలీగా ఇస్తామన్నా కూలీలు దొరకడంలేదు. మేఘాలొస్తే, చినుకులొస్తే రైతులు భయపడుతున్నారు. పెసరు ఏరడానికొచ్చింతర్వాత పెద్ద వర్షాలు పడితే పంటచేల్లోనే మొలకలొస్తుందని రైతుల భయం. అలా ఎన్నోసార్లు జరిగింది. చేతికొచ్చిన పంట నోటికి రాదన్న జంకుతో నాల్గవభాగం కూలీగా ఇస్తామని కూలీలను తీసుకెళ్తున్నారు.



దసరా పండుగ దగ్గర్లో వుందని కూతుర్ని తీసుకొచ్చాడు కొండమల్లయ్య. కూలీలు దొరికిన్నాడు కూలీలతో పాటు తాము పోతూ, దొరకన్నాడు తామిద్దరే చేల్లో కెళ్లి నర్సమ్మ, కాంతమ్మ పెసరు పంట ఏరుకొస్తున్నారు. గర్భవతియైన కూతురుకు పని చెప్పవద్దని నర్సమ్మనుకుంటున్నా చెప్పక తప్పడం లేదు. మరోదిక్కు తల్లి చెప్పకున్నా వద్దంటున్నా కాంతమ్మ తల్లితోపాటు పనిచేస్తోంది. నాలుగైదు రోజుల్లో ఏరడం పూర్తయింది. కొండమల్లయ్య, తిరుపతయ్య వాట్ని కట్టెలతో కొట్టారు. నర్సమ్మ, కాంతమ్మ చేటలతో చెరిగి పెసళ్లను సంచుల్లో నింపారు. ఇంటి కవసరమయ్యేటన్ని ఉంచుకొని మిగిలినవి అమ్మేసాడు కొండమల్లయ్య.. వెయ్యి రూపాయలొచ్చాయి. ఫర్వాలేదనుకున్నాడు. అందులోంచి కొంత డబ్బు కిరాణా దుకాండ్లో ఖాతా క్రిందికికట్టాడు. మిగిలిన డబ్బుతో కూతురుకు, భార్యకు పండుగకు చీరలు కొనాలనుకున్నాడు. గర్భవతైన కూతురుకు మంచి చీర కొనాలనుకుంటున్నాడు. కాని, గోదావరిఖని నుంచి రాజయ్య పండుగ కెలాగూ వస్తాడు. తల్లికి, చెల్లెకు చీరలు తెస్తాడు. ఒకవేళ లేకుంటే అప్పుడు కొనొచ్చని సరిపెట్టుకున్నాడు.

రాజయ్య ఉద్యోగమైనప్పట్నుంచీ డబ్బనలే ఇవ్వలేదు. ఈసారి కొడుకును డబ్బడగాలి. నెలకు కొంత డబ్బు పంపించమనాలి. పండుగ పోయింతర్వాత కొడుకుతో అన్నీ మాట్లాడాలి అనుకుంటున్నాడు కొండమల్లయ్య.

బతుకమ్మ పండుగ... దేశంలో ఎక్కడాలేని ఈ పండుగ ఒక్క తెలంగాణాలోనేవుంది. తెలంగాణా అంతటా ముఖ్యంగా గ్రామాల్లో ఈ పండుగను ఉత్సాహంగా జరుపుకుంటారు స్త్రీలు. ఆశ్వయుజమాసం ప్రవేశించింది మొదలుకొని వారం రోజులు ఈ పండుగ జరుపుకుంటారు. మొదట్లో మేదరివాళ్లు అల్లిన చిన్న చిన్న చిబ్బుల్లోకాని, చిన్నచిన్న ఇత్తడి తాంబాళాల్లో కాని పూలు పేర్చి బతుకమ్మపాటలు పాడుతూ సాయంత్రాలల్లో ఆడుకుంటారు. ఈ పండుగకు ఎంత దూరంలోవున్నా ఆడబిడ్డలను తల్లిగారింటికి పిలుచుకుంటారు. ఎంత పేదవాడయినా తండ్రి కూతుళ్లకు కొత్త బట్టలు తప్పకుండా కొంటాడు. పనులున్న కాలమైనా సాయంత్రాల్లో స్త్రీలు బతుకమ్మ పాటలు పాడుకుంటూ ఆనందిస్తారు. దసరాకు రెండు రోజుల ముందొచ్చే 'పెద్దబతుకమ్మ' పండుగ రోజు స్త్రీల హడావిడి, ఆనందానికి హద్దులేవుండవు. రకరకాల పూలు పోగుచేయడం, పోటీపడి ఒకరికంటె ఒకరెక్కువ పెద్దదిగా బతుకమ్మ పేర్చడం చేస్తారు. కొత్తచీరలు కట్టుకొని సాయంత్రాల్లో అందరూ ఒకే చోట గుమిగూడి పాటలు పాడుతారు సంబరంగా. ఇచ్చుకో



పుచ్చుకో వాయినాలాడుతూ ఒకరి చద్దులొకరికి చ్చుకుంటారు. రాత్రయే వరకు సంబరంగా గడిపి పేర్చిన బతుకమ్మలను నీట్లో వేసి ఇండ్లకు తిరిగొస్తారు. అంతకు ముందు పను లతో ఎంత అలసిపోయున్నా ఆర్థిక ఇబ్బందు లతో సతమతమవుతున్నా పండుగరోజు తా త్కాలికంగానైనా అన్నీ మరిచిపోయి ఆనందంగా గడుపుతారు. ఉన్నవాడికి రోజూ పండుగే అయినా, పండుగల ఉద్దేశ్యం లేనివా డికి తాత్కాలికానందమైనా కల్గించడమే నేమో...!

ఊళ్ళో పండుగ సందడుంది. సద్దుల బతు కమ్మ (పెద్ద బతుకమ్మ) రేపనగా లక్ష్మిని వెంట బెట్టుకొని వచ్చాడు రాజయ్యా. కొడుకు, కోడలు రావడం కొండమల్లయ్యకు; నర్సమ్మకు సంతో షంగా వుంది. కాని, కళ్ళు, చెంపలు లోతుకు పోయి, మెడదగ్గర ఎముకలు తేలి సన్నబడు న్న రాజయ్యా ఆకారం చూసిన ఆ దంపతుల కండ్లు చెమర్చాయి. లక్ష్మి మరింత రంగుదేలి ఆరోగ్యంగా కనబడింది వాళ్ళకు. కోడల్ను చూ సిన నర్సమ్మకు సహజంగానే అసూయ కల్గింది.

కాళ్ళు చేతులు ముఖం కడుక్కొని అరుగు మీద వాల్చున్న మంచంలో కూర్చున్నాడు రాజ. య్యా. తల్లిదండ్రులతో, తమ్మునితో ఆప్యా యంగా మాట్లాడాడు. సంచీ తెరిచి పండుగ కొరకని తల్లికి తెచ్చిన నూలుచీర తీసిచ్చాడు. చెలెల్లికోసం కొనుక్కొచ్చిన చీరనామె చేతిలో పెట్టాడు. తండ్రికోసం తెచ్చిన ధోవతులు, చొక్కాబట్ట తల్లిచేతికిచ్చాడు. దసరా పండుగ నాడు తండ్రి తాగుతాడని తెచ్చిన నాలుగు బీరు సీసాలు తల్లికిచ్చి దాయమన్నాడు.

రాజయ్యా అందరితో కలుపుగోలుగానే వున్నా లక్ష్మి ముభావంగా వుంది. ఆమెకిప్పు డు భర్త తప్ప వేరే వాళ్ళతో సంబంధం లేనట్టు, భర్త తప్ప మిగతా వాళ్ళంతా పరాయి వాళ్ళయినట్టు ప్రవర్తిస్తోంది. వాళ్ళంతా కలుపు గోలుగా ప్రవర్తించినా దూరదూరంగా వుంటోంది. ఆమె ఈ పండుగకు తన తల్లిగా రింటికే పోదామనుకుంది. కాని ఓ ఉద్దేశ్యాన్ని మనసులో పెట్టుకొని, ఆ కుటుంబంతో కొన్ని విషయాలు తేల్చుకోవడానికి ఈసారి భర్తతో ఇక్కడికొచ్చింది. ఆడబిడ్డతో, అత్తతో ఆమె అంటీ ముట్టనట్టుగా ప్రవర్తిస్తోంది.

ఆరోజు ఉదయమే కొండమల్లయ్యా గుట్ట కుపోయి తంగేడు పూవు కోసుకొచ్చాడు. తిరుప తయ్యా చెలుకల్లోకి పోయి గుణుగుపువ్వు కోసుకొ చ్చాడు. పండుగరోజు తెల్లవారకముందే కాంత మ్మ, నర్సమ్మ నిద్రలేచి ఇంటి వెనుకున్న గుమ్మడి చెట్టు వువ్వులు తెంపి నీళ్ళలో వేసా రు. కొంచెం ప్రొద్దెక్కేవరకు అక్కడక్కడ తిరిగి బంతిపూలు కోసుకొచ్చారు. గోరంట్లపూలు తెచ్చారు. తిరుపతయ్యా పొలాల కంచెల వెంట తిరిగి కట్లపూలు తీసుకొచ్చాడు. కొండ మల్లయ్యా చెలుకల్లోకి పోయి పార్వతిపూలు తెచ్చాడు.

ఉదయం భోజనాలు ముగించి బతుకమ్మ పేర్చడం మొదలుపెట్టారు. నర్సమ్మ, కాంత మ్మ లక్ష్మికెంత ప్రాముఖ్యతిచ్చి పిలిచినా పట్టించుకోవడం లేదు. ఏదైనా పనిచెబితే అయిష్టంగానే చేస్తుంది. బతుకమ్మ పేర్చడాని కి రెండు గంటలపైన పట్టింది. తర్వాత చద్దులు తయారు చేసింది నర్సమ్మ.

సాయంత్రం నాలుగ్గంటలవరకు ఆడవా ళ్ళు ముగ్గురు కొత్తచీరలు కట్టుకున్నారు. లక్ష్మి కట్టుకున్న చీరముందు తన చీర వెలవెలబో వడం చూసిన కాంతమ్మ ముఖం చిన్నబుచ్చు కుంది. కోడల్ను కూతురును చీరల్లో పోల్చిచూ సిన నర్సమ్మ కోడలిపై అసూయపడింది.

'కొడుక్కు మేము కనబడకుంటయ్యాం. అంతా భార్యే అయిపోయింది' తనలో తానే అనుకుంది నర్సమ్మ.

పెద్దబతుకమ్మను నర్సమ్మ తలపై ఎత్తు కుంది. చిబ్బిలో పేర్చిన చిన్నబతుకమ్మను లక్ష్మి చేతిలో పట్టుకుంది. మొక్కజొన్న పేలా లతో, వేయించిన పల్లీలతో, నువ్వుల పిండితో తయారుచేసిన చద్దులను ముల్లెలుగా కట్టి తువ్వాల్లో కట్టి కాంతమ్మ పట్టుకుంది. బతుక మ్మలు చావడిదగ్గరపెట్టి చప్పట్లు కొడుతూ, చుట్టూ తిరుగుతూ కొంతసేపు పాటలు పాడా రు. తర్వాత డప్పుల చప్పుడుతో బతుకమ్మలె త్తుకొని ఏటి ఒడ్డుకు చేరుకున్నారు. అక్కడున్న ఖాళీ ప్రదేశంలో అక్కడక్కడ బతుకమ్మలు పెట్టారు. వాటి చుట్టూ తిరుగుతూ, చప్పట్లు




కొడుతూ ఆడవాళ్ళంతా పాటలు పాడుతున్నారు. రెపరెపలాడుతున్న రంగురంగుల చీరలతో, పాటల మోతతో ఏటిఒడ్డున వాతావరణమంతా ఆహ్లాదకరంగా వుంది.

మగవాళ్ళు మిత్రులతో మాట్లాడుతున్నారు. రాజయ్య, తిరుపతయ్య స్నేహితులతో బాతఖానీ చేస్తున్నారు. ఉద్యోగం చేస్తున్న రాజయ్యను అతని స్నేహితులు గౌరవంగా చూస్తున్నారు. అక్కడి విశేషాల గూర్చి అడుగుతున్నారు. కొండమల్లయ్య తన వయసువాళ్ళతో మంచి చెడ్డలగూర్చి, సుఖదుఃఖాల గూర్చి, ప్రస్తుతకాలం, పాతకాలం గూర్చి మాట్లాడుతున్నాడు. హరిజన యువకులు కర్రలతో కోలాటమేస్తూ పాడుతున్నారు. కొండమల్లయ్య అక్కడ కొద్దిసేపుండి ఎడ్లను చూడాలని ఊళ్ళోకెళ్ళాడు. ఆడవాళ్ళు చీకటిపడేంతవరకు బతుకమ్మలాడారు. తర్వాత బతుకమ్మలను ఏట్లో వేశారు. వెంబడి తీసుకొచ్చిన ఫలహారాలతో ఇచ్చుకో పుచ్చుకో వాయినాలాడారు. వాళ్ళు పాటలు పాడుతూ పోతూంటే, వాళ్ళవెనకే పురుషులు మాట్లాడుతూ ఊళ్ళోకెళ్ళారు. ఊరి జనానికంతా ఆరోజెంతో సంతోషంగా గడిచింది.

బతుకమ్మ పండుగ తెల్లవారి లేక మరునాడు దసరా పండుగ. ఆ రోజు మాంసాహారం తిననివాళ్ళు తప్ప మిగతా వాళ్ళంతా మాంసమే తింటారు. చాలా మంది ఏ పరిస్థితుల్లో వున్నా కొంచెమైనా తాగుతారు.

కొండమల్లయ్య ఉదయమే పద్మశాలి మచ్చయ్య కోసిన గొర్రె మాంసంలోంచి ఓ భాగం తీసుకొచ్చాడు. నర్సమ్మ గరమ్‌మసాల వేసి దాన్ని వండింది. పొద్దున్నే పూరీలు చేసింది. అంతకు ముందు రోజే గారెలు చేసింది. సాయంత్రంమైతే తాగి గొడవచేస్తారని నాలుగైదేళ్ళుగా ఉదయంపూటే జంబి చేస్తున్నారు. స్నానం చేసి జంబి దగ్గరికెళ్ళాడు కొండమల్లయ్య. పురోహితుడు పూజ చేస్తుండగానే అప్పటికే తాగున్న యువకులు కొందరు జంబి మొక్కను పీకేశారు. కొంత అల్లరి జరిగింది.

'ఎవర్నీ ఏమనేట్టులేదు. ఒకరిమాట ఒకరు వినడం లేదు. చిన్న పెద్ద మర్యాద లేకుంటయింది. పూజయ్యేదాకనన్న ఓపిక లేకపాయె పడుచువాళ్ళకు' తనలో తానే గొణుక్కుంటూ జంబాకు జేబులో వేసుకున్నాడు కొండమల్లయ్య. అక్కడున్న వాళ్ళకు జంబాకు చేతుల్లో పెడుతూ, తనకు వాళ్ళిస్తే తీసుకుంటూ ఆప్యాయంగా కౌగలించుకున్నాడు. తనకంటె చిన్న వాళ్ళను దీవించాడు. ఇంటికెళ్ళాడు. కొడుకులు, కోడలు, భార్య, కూతురు జంబాకు చేతుల్లో పెట్టి అతని కాళ్ళు తాకుతూ నమస్కరించారు.

'చల్లగా బతుకు' అని భార్యను దీవించాడు.

'ఇద్దరు కొడుకులు, ఇద్దరు బిడ్డలతో మంచిగ బతుకుండ్రి'' అని పిల్లల నాశీర్వదించాడు.

అందర్నీ కూచోబెట్టుకొని పూరీలు తింటూ కొడుకు తీసుకొచ్చిన బీరు తాగాడు. తమ్మునింట్లో వున్న తల్లి చేతుల్లో జంబాకు పెట్టి కాళ్ళకు నమస్కరించాడు. సాయంత్రం గరుత్మంతున్ని పాలపిట్టను చూసి దండంపెట్టాడు. ఆ రోజంతా తింటూ, తాగుతూ ఆనందంగా గడిపాడు. రాత్రిభోజనం చేసి నిశ్చింతగా నిద్రపోయాడు.

తెలతెలవారుతుండగా మెలకువొచ్చింది కొండమల్లయ్యకు. రాత్రివరకు తాగిన 'మందు' మత్తు దిగింది. రెండు మూడు రోజులుగా పండుగ సందడిలో మరిచిపోయిన ఇబ్బందులు జ్ఞాపకం వచ్చాయి. అవసరాలు జ్ఞాపకం వచ్చాయి. అప్పులూ జ్ఞాపకం వచ్చాయి. ఆర్థికస్థితంతా జ్ఞాపకం వచ్చింది.

'రేపు రాజయ్య గోదావరిఖనికి వెళ్ళిపోతాడు. ఈ రోజే కొడుకును డబ్బుగురించడగాలి. రాజయ్య ఇంటిని గురించి పట్టించుకునేట్టు కనబడుటంలేదు. అయినా అడగాలి' తనలో తానే అనుకున్నాడు కొండమల్లయ్య. మంచంలోంచి లేచి ఊరిబయటకు పోయొచ్చాడు. కాలకృత్యాలు తీర్చుకున్నాడు. మధ్యాహ్నం భోజనాలయింతర్వాత ఇద్దరు కొడుకులను చెరోదిక్కు కూర్చోబెట్టుకున్నాడు. క్షీణించిన రాజయ్య ఆరోగ్యాన్ని చూస్తుంటే కొండమల్లయ్యకాతన్ని డబ్బడగడం మంచిగనిపించడంలేదు. కాని, కొడుకు ఇంటిని గూర్చి పట్టించుకోందే వెళ్ళే పరిస్థితిలేదు. అందుకోసం అడగాలనే నిర్ణయించుకున్నాడు. ఏమడగాల్లో, ఎలా మాట్లా



డాలో తనలో తానే మననం చేసుకున్నాడు. కాంతమ్మ, నర్సమ్మ అరుగుమీదున్న మొగరాని కానుకొని కూర్చున్నారు. లక్ష్మి వాళ్ళకు కొంచెం దూరంలో భర్త కెదురుగా కూర్చుంది.

"ప్రాణం మంచిగుండడంలేదా కొడుక? పూర్తిగెట్లనో అయినవేంది?" రాజయ్యా . తల నిమురుతూ అన్నాడు కొండమల్లయ్య.

ఆ ప్రస్తావనెందుకో రాజయ్యకు తెలుసు. అంతకుముందే లక్ష్మి అతనికి బాగా నూరిపోసింది, ఎన్నో మాటలు చెప్పింది. ఏం మాట్లాడాలో చెప్పింది. తల్లిదండ్రులకు ఏ మాత్రం అవకాశం ఇవ్వవద్దంది. అంత్యనిష్ఠూరంకన్నా ఆది నిష్ఠూరమే మేలనుకున్నాడు రాజయ్య. ఉన్నదానికి మరికొంత జోడించి చెప్పాలనుకున్నాడు.

"గ్యాసు వడటంలేదు. ఆరోగ్యం మంచి గుండటంలేదు" అన్నాడు.

"బావిపని చేసేవాళ్ళందరికిట్లనే ఐతదా?"

"చాలామంది ఆరోగ్యాలు దెబ్బతింటయి. లోపల వేడి, గ్యాసువాసన... బాయిపని చేసేవాడికి గొంతుల్నుంచి కడుపుల పేగుల్దాక బొగ్గు పొడే వుంటది. కాండ్రకించి ఉమ్మితె నల్లగ ముద్దలకు ముద్దలు పడుతది. మరిగ ఆరోగ్యం పాడుగాకుంటె మంచిగెట్లుంటది?" అన్నాడు రాజయ్య.

ఇదువరకొచ్చినప్పుడు మాట్లాడిన కొడుకు మాటలకు ఇప్పుడు మాట్లాడ్తున్న మాటలకు గల తేడాను గమనిస్తున్నాడు తండ్రి.

"దవాఖానలున్నయిగద మందులియ్యరా?"

"పేరుకు మా ఉన్నయి. కాని, వేల మందికి ఏం సరిపోతయవి? దొరలకు అంటే, అండర్ మేనేజర్లకు, మేనేజర్లకు మంచిగనే చూస్తరు. తట్టమోసే లేబరోన్ని ఎవ్వలు దేకుతరు? పోతె ఇన్నన్ని రంగు నీళ్ళు మా పోస్తరు. వాటితోని రోగాలు పెరుగుడేకాని తగ్గవు. బైట చూపించుకుంటె యాభైలు, నూర్లు. ఒక్కనూది గుచ్చి ఎనిమిది, పదంటరు" అన్నాడు రాజయ్య.

తన బాధలు చెబుతూ తండ్రిని డబ్బడగడానికి ఇరకాటంలో పెడ్తున్నాడు రాజయ్య.

"కష్టం జేసినా కడుపునిండ తింటె ఆరోగ్యం మంచిగుంటది. కోడలు ఇంట్ల మంచిగ వండిపెడుతందా?"

మొదటిసారి రాజయ్య వచ్చినప్పుడు మాట్లాడినదానికి సరిగ్గా విరుద్ధంగా కొడుకు పరిస్థితి పర్వాలేదని అనిపించాలని కొండమల్లయ్య, తాను చాలా కష్టపడుతున్నట్టు తెలుపాలని రాజయ్య ప్రయత్నిస్తున్నారు. అందుకు కారణం వాళ్ళవాళ్ళ పరిస్థితులు, ఆర్థిక స్థితిగతులు-

"ఇల్లు... అదో కొంపా? దానికంటె పందుల గుడిసెనయ్యం. రెండు చాపల వెడల్పు స్థలంలో ఉండాలి. అన్నీ అందులోనే జరిగిపోవాలి. గుడిసె చుట్టు బురద. జుబ్బర జుబ్బర ఈగలు. సంగీతం పాడుతూ దోమలు. కూం...కూం... అని అరుస్తూ పందులు. రాత్రి డ్యూటీ చేసొచ్చి పడుకుంటె నిద్రెక్కడ వస్తది? కాల్లు గట్టిగ చాపుతె బోల్లు తాకుతయి. పొద్దున, సాయంత్రం ఊర్నిండ ఊపిరి తీసుకోకుండా బొగ్గు పొయ్యి అంటేసిన పొగ. ఎంత వండిపెట్టిఏమైతది?"

"మరేం బాముకుంటానికి అంత దూరం పోవుడయింది? ఇక్కన్నే వుంటే బాగుండేది కద!" కొంచెం నిష్ఠూరంగా అన్నాడు తండ్రి

"ఎక్కడికిపోయినా తిప్పలు తప్పవు" అన్నాడు రాజయ్య.

కొడుకు డబ్బడగడానికి అవకాశం ఇవ్వడంలేదని గమనించాడు కొండమల్లయ్య. కాని అడగక తప్పదు. ఇప్పుడు వెళ్ళిపోతే మళ్ళీ రావడానికి రెండు, మూడు నెలలవుతుంది. తాను కదపకుండా డబ్బు గూర్చి మాట్లాడేట్లులేదు. అందుకోసం డబ్బు గూర్చి మాట్లాడాలనే నిర్ణయించుకున్నాడు.

"నిజమే బిడ్డ... ఎక్కడి కష్టాలక్కడే ఉన్నయి. వచ్చేది మొట్టమొదటి దీపావళి. చెల్లెకు, బావకు కట్నాలు వెట్టాలి. చెల్లి వర్థిమ నిషిగూడ కాదు. నీ దగ్గర పైసలేమన్నుంటే ఇచ్చిపో"

ఏమాటయితే తండ్రినుంచి రావాలని రాజయ్య ఊహిస్తున్నాడో, ఎదురు చూస్తున్నాడో ఆ మాట రానే వచ్చింది. రాజయ్య భార్యదిక్కు చూశాడు. లక్ష్మి ధైర్యాన్నిస్తూ నంజ్ఞచేసింది. రాజయ్యకు ధైర్యమొచ్చింది. ఏం మాట్లాడాలో





ఇంతకుముందే నిర్ణయించుకున్నా అతని పరిస్థితి అడకత్తెరలో పోక మాదిరిగా వుంది. ఓ దిక్కు కన్న తల్లిదండ్రుల ఆర్థికదుస్థితి, మరో దిక్కు స్వంతబతుకు.

ఆరోగ్యాన్ని పణంగాపెట్టి ప్రమాదభూయిష్ఠమైన పని చేస్తున్న తాను మిగుల్చుకుంటున్న కొద్దిపాటి డబ్బును కూడా కుటుంబానికివ్వదలుచుకోలేదు. అదృష్టం బాగాలేక దినదిన గండంలాంటి పనిలో తనకేమన్నా అయితే? తన భార్య గతేం కావాలి? పుట్టబోయే పిల్లల గతేం కావాలి? తాను కొద్దిపాటి డబ్బిచ్చినా దాంతో అప్పులు తీర్చడం సాధ్యంకాదు. ఎలాగూ భూమినమ్మాలి. అలాంటప్పుడు తానైనా బాగుపడితే? కాని తనపై తల్లిదండ్రులు ఎన్నో ఆశలు పెట్టుకున్నారు. వాళ్ళు కష్టాల్లో వుంటే తాను చూస్తూ ఊర్కోవడమా? ఊర్కోక చేసేదేముంది? బతుకు భద్రతలేని ఉద్యోగం చేస్తున్న తాను తన భవిష్యత్తును కూడా చూసుకోవాలి. ఇవన్నీ పక్కకుపెట్టి తాను ఇంటికి సాయం చేద్దామన్నా లక్ష్మి ఊర్కోదు. తన ఇల్లు నరకమవుతుంది. అవన్నీ తాను భరించలేడు. అయినా లక్ష్మి చేప్పేదాంట్లో తప్పెక్కడుంది.

లక్ష్మి రోజూ రాజయ్యకు చేస్తున్న భోధలు, సంసారం గూర్చి, తమ భవిష్యత్తుగూర్చి రాబోయే పిల్లల ముందుజీవితం గూర్చి చెప్పిన హితవచనాలు జ్ఞాపకం వచ్చాయతనికి. ఇన్ని రోజులుగా భార్యవున్నా దాదాపు ఎడబాటులాంటిదే అనుభవించిన రాజయ్యకు, గోదావరిఖనిలో డ్యూటీ చేసి అలసిపోయి వచ్చింతర్వాత భార్య తనను దగ్గరకు తీసుకొని సుఖాలందిస్తూ చెప్పిన మాటలు సత్యాలుగానే తోస్తున్నాయి.

ఈ కాలంలో ఎవరికివారేనని, ఒకర్నొకరు చూసే పరిస్థితిలేదని, అలా చేయడంవల్ల చేతికి చిప్పలే వస్తాయని చెప్పింది లక్ష్మి. తన మేనమామ పెద్దకొడుకు ఇంటికోసం జీవితాన్నంతా ఎలా అంకితం చేశాడో, తమ్ములు పెద్దవాళ్ళయింతర్వాత సగం వయసుపోయిన అతన్నెలా దూరం చేశారో చెప్పింది. తమ భవిష్యత్తు జీవితాన్ని సుఖమయం చేసుకోవడానికి ఇప్పటినుంచే ముందుచూపు ఉండాలంది. లక్ష్మి చెప్పిన మాటలు తనకు సబబుగానే తోస్తున్నాయి.

లక్ష్మి తిరుపతయ్య గూర్చి కూడా ఎన్నో విషయాలు చెప్పింది. తిరుపతయ్య బి.ఏ. వరకు చదువుకున్నవాడు. ఎప్పుడో ఓసారి రాజయ్యలా కష్టపడే ఉద్యోగం కాకుండా మంచి ఉద్యోగమొస్తుంది. అప్పుడాతడు తన స్వార్థం చూసుకోకుండా కుటుంబానికి సాయం చేస్తాడా? మరి తామెందుకు కష్టపడి మిగుల్చుకున్న డబ్బును ఉమ్మడి కుటుంబానికివ్వాలి? చేతుల్లో ఏం లేకుండా చేసుకొని తర్వాతెందుకు బాధపడాలి? అందుకే తాను ఇంటికి డబ్బివ్వదలుచుకోలేదు.

ఏం మాట్లాడకుండా మౌనంగా వున్న రాజయ్యా నుద్దేశించి-

"ఏం మాట్లాడవేంది బిడ్డ?" అన్నాడు కొండమల్లయ్య

"ఏం మాట్లాడలె బాపు? నాదగ్గరేమున్న ఇచ్చుటానికి?" చావు కబురు చల్లగా చెప్పాడు రాజయ్య.

తిరుపతయ్య అన్న వదినల దిక్కు మార్చి మార్చి చూస్తూ మౌనంగా వున్నాడు. కాంతమ్మ, నర్సమ్మ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. కొండమల్లయ్య అందర్నోసారి చూశాడు. రుమాలు తీసి మంచంలో పెట్టాడు. తల గోక్కున్నాడు.

"అట్లంటెట్ల బిడ్డ? పద్నాలుగు, పదిహేను నూర్ల జీతం మీ ఇద్దరికే సరిపోతలెవ్వంటె ఎట్ల?"

"అ పని అబ్బొంటు గాకుంట చేసుడయితెదా? మల్ల అక్కడి ఖర్చుల సంగతి మీకేం దెలుసు? ఉప్పుతోని ముప్పయారు కొనుడేనాయె. దేనికి తక్కువ ధరుంది?"

కొడుకు మాటలు విన్న నర్సమ్మ మౌనంగా ఉండలేకపోయింది.

"ఏం కొనుక్కుంటన్నవుర రాజయ్యా? పెద్దదినుసు, బియ్యం, పప్పు ఇక్కన్నుంచే తీసుకుపోవడితివి" అంది.

అత్త మాట్లాడిన తర్వాత తాను మౌనంగా ఉండదలుచుకోలేదు లక్ష్మి. కొండమల్లయ్యకు మద్దతుగా నర్సమ్మ మాట్లాడితే తన భర్తకు




మద్దతుగా లక్ష్మి రంగంలోకి దిగింది.

"తర్వాత ఇట్లంటరని నాకు తెలుసు. అందుకే బియ్యం కొంపోవద్దన్న. నల్లమొకపోడు వింటెనా? ఒక్క బియ్యంతోనే ఐపోతదా? అక్కడి ఖర్చులు మీకెట్ల తెలుస్తయి?"

"నువ్వే సంసారం చేస్తన్నవు కాని మేం జేస్తన్నమా? మాకు ఖర్చుల సంగతేడ తెలుస్తది?" అంది నర్సమ్మ వ్యంగ్యంగా.

ఆ ఎత్తిపొడుపుకు కోపమొచ్చింది లక్ష్మికి. పైగా కార్మికుడుగా నెల నెలకు జీతాన్ని కండ్ల జూసే తన భర్త, తన కుటుంబం, వ్యవసాయం చేస్తూ బతికే అత్త కుటుంబంకంటె భిన్నమైనదిగా, తమ అవసరాలు, ఖర్చులు వాళ్ళకంటె వేరైనవిగా భావిస్తుందామె.

"నువ్వు మా చేస్తున్నవు సంసారం? నీ తీరుగ గంటెల నూనెపోసి తాలుపు (తాళింపు) పెట్టుకొని తినుడయితె ఏం ఖర్చుంటది? రోజు ఇంట్లున్న పప్పుతోనో, పచ్చిపులుసుతోనొ తింటె ఖర్చేమైతది? కాని, మా కట్ల తినబుద్ధిగాదు. కూరగాయలు, ఉప్పు మిరపకాయలు, మసాలాలు, ఉల్లిగడ్డ, ఎల్లిగడ్డ కాన్నుంచి అన్ని కొనుడేనాయె. ఎప్పుడన్న కొంటెనేమొ తెలుస్తది. కారంతోని తినేటోల్లకు ఇవ్వన్నేం దెలుసు?" అత్తకు దీటుగా అంది లక్ష్మి.

లక్ష్మి మాటలు విన్న నర్సమ్మ లేచి నిల్చుంది. చేతులూపుకుంటూ "అవు బిడ్డ... ఇయ్యాల్ల మేము తాలుపు పెట్టుకొని తినెటోల్లమైనం. నువ్వేమొ వేపుడు తినెదానివైనవు? ఇన్రోజులు నువ్వెట్ల తిన్నవో ఇదంత? ఈరోజు నీ మొగనికి నౌకరయిందని మురుస్తన్నవా? బొడ్లె వరాలు పోసుకొని పుట్టినట్టే చెయ్యవడితివేంది?" అంది.

కూర్చొనున్న లక్ష్మికూడా లేచి నిల్చుంది.

"నువ్వంటె బొడ్లె వరాలు పోసుకొని పుడితివి? మేం బుట్టలా"

"సరె బిడ్డ మీరిద్దరే సుఖపడుండ్రి... నౌకరి పైసలు మిగిలిచ్చుకొని బంగ్లాలు గట్టుకోండ్రి. పోలెల్లేసుకోని తినుండ్రి. గటుక మంచినీళ్ళు తాక్కుంట మేం మా బతుకుతం" కోడలుతో అని భర్తను చూస్తూ-

"నల్లమొకపోడ.... కొడుకు నౌకరిజేస్తండని పైసలడుగుతన్నవా? ఇప్పుడు కొడుకేమన్న కొడుకోలె ఉన్నడా? నౌకరిగాడయిండుగదా! వాళ్ళే సుఖపడనియ్యి" అంది నర్సమ్మ.

"మీ ఇంట్ల వడ్డప్పట్నుంచి కొద్దిసుఖమా నాకు? ఇక్కడ మోకాలుబంటి సుఖముండె. ఈ సుఖాన్ని విడిచిపెట్టి గోదావరిఖనికి పోయిన. అక్కడ మెడల్దాకుంది సుఖం. నీ కొడుకుంజేసుకొని కొద్ది సుఖపడ్తున్ననా?" అంది చేతులు తిప్పుతూ లక్ష్మి.

"మరి మిమ్ముల నెవ్వలు పొమ్మన్నరక్కడికి. నువ్వే పోరువెట్టి తీసుకపోయినవ్‌గద. కుండల గలది కలో, గంజో తినుకుంట ఇక్కన్నే వుంటె కాకపోవునా?" అంది నర్సమ్మ.

"నీ జమీను నూరెకురాలుండె. పుట్లకొద్ది పంట రావట్టె. అవి తినుకుంట ఉండమన్నవా? ఇక్కన్నె వుంటె పుట్టే పోరగాండ్లకు చిప్పలేగతి"

కొడుకును బలవంతం చేసి బావిపనికి తీసుకుపోవడమే కాకుండా రెండు దిక్కులా తమదే తప్పయినట్టు మాట్లాడుతున్న లక్ష్మి వాదన వాళ్లకు వింతగా వుంది. ఆ మాటల్లో లక్ష్మి తాను గర్భవతినని సూచన ప్రాయంగా తెలిపినా ఎవరూ అర్థంచేసుకునేస్థితిలో లేరు.

"మీ తల్లిదండ్రులంటె జమిందార్లయిరి. నువ్వు నూర్లెకురాలున్న ఇంట్ల పుడితివి. మా కేడివి భూములు?" అంది నర్సమ్మ.

"అట్ల పుట్టినంక ఈ లేకిడింట్లెందుకు వడుదు?"

తన తల్లిని, తన వంశాన్ని కించపరిచినందుకు ఇంతకు ముందయితే, రాజయ్య లక్ష్మిని చితకబాదేవాడే. కాని ఈ మధ్యకాలంలో, తామిద్దరే గోదావరిఖనిలో వుంటున్నప్పుడు లక్ష్మి తన అందంతో, మాటల చాతుర్యంతో భర్తను తన కనుకూలంగా మార్చుకుంది. రాజయ్యేం మాట్లాడకుండా బెల్లంకొట్టిన రాయిలా కూర్చున్నాడు.

"నువ్వే లేకిడిదానివి" కోడలు మాటకు జవాబుగా అంది నర్సమ్మ.

అత్తాకోడల్ల మధ్య వాగ్వాదం చిలికి చిలికి గాలి వానయ్యేట్టుందని గ్రహించిన కొండమల్లయ్య గద్దరించి ఇద్దర్నీ ఆగమన్నాడు. ఒకర్నొకరు కోపంగా చూసుకుంటూ కూర్చున్నారువాళ్ళు.



కొడుకు పూర్తిగా కోడలు ఆధీనంలో వున్నాడని గ్రహించాడు కొండమల్లయ్య. కొడుకిక డబ్బిస్తాడన్న ఆశ లేకున్నా "మరీ బాకీలన్ని ఎట్ల తీరాలె?" అన్నాడు.

"ఉన్న భూమి నమ్మెయ్యి. వ్యవసాయం బందుజెయ్యి. తర్వాతెట్లనో బతకొచ్చు" అన్నాడు రాజయ్య.

ఆ మాటలకు కోపం, బాధా రెండు కలిగాయి కొండమల్లయ్యకు.

"ఎంత సిపాయి కొడుకువు పుట్టినవ్‌రా?. ఉన్న భూమమ్మి చిప్పలు పట్టుకొని తిరుగుమంటన్నవా? మాకు బువ్వెయ్యిండ్రని మీ చుట్టు తిరగడమా? కంటె ఇటువంటి కొడుకులనే కనాలె. భలే సిపాయి కొడుకువు" అన్నాడు కోపంగా.

తండ్రి మాటలు, వెక్కిరింపు రాజయ్యకు సూటిగా తగిలి బాధ కల్గింది. కాని తన పట్టువిడిచి మెత్తబడదలుచుకోలేదు. "నువ్వు మమ్ముల్ని కని కొంచెముద్ధరిచ్చినవా?"

కొడుకు మాటలు కొండమల్లయ్యకు శూలాల్లా తగిలాయి.

"ఏదో బిడ్డ మేం బట్టపేలికలోల్లం. మాకు చాతనైనట్టు బతుకుతన్నం. మీరు మీ పిల్లలను కలెక్టర్లం జెయ్యిండ్రి. లక్షలు సంపాయించియ్యిండ్రి" అన్నాడు.

మామ మాటలకు లక్ష్మిమూతి తిప్పింది.

రాజయ్యేం మాట్లాడలేదు. కొద్ది క్షణాలు నిశ్శబ్దం... "నరెబిడ్డ... మిమ్ములకన్నం నిజమే... కాని మీ రాతలు కన్నమా? మా గతెట్లుంటె అట్లయితది. మీరన్న సుఖంగ బతుకుండ్రి. చూసుకొని బతుకుతం. నరెగని పెళ్లయి గిన్నేల్లాయె... ఇంకా పిల్లలు కాకపోయిరి. ఓసారి డాక్టరుకన్న చూపకపోయినవు లక్ష్మిని!"

తండ్రి మాటలు విని ఇరకాటంలో పడ్డాడు రాజయ్య. ఇంత అల్లరైన తర్వాత లక్ష్మి గర్భవతని చెప్పాలా? వద్దా? అని కొద్ది క్షణాలు తటపటాయించాడు. తుదకు చెప్పడమే మంచిదని నిర్ణయించుకున్నాడు.

"దానికిప్పుడు మూడు నెలలు" అన్నాడు.

కొండమల్లయ్య, నర్సమ్మ ముఖంలో ఆనందం. అంతా లక్ష్మి దిక్కు చూసారు. ఆమె సిగ్గుపళ్లేదు. కాని ముఖం తిప్పుకుంది. కడుపులో కోపం పెట్టుకొని నర్సమ్మ ఆమెను పైకి మెచ్చుకునే స్థితిలో లేదు. కాంతమ్మ లేచి లక్ష్మి దగ్గరికెళ్లింది.

"నువ్వు బిడ్డనే కనాలె వదినె. నేను కొడుకును కంట" అంది.

లక్ష్మి ఏం మాట్లాడలేదు.

"రాజయ్యా! నువ్వు మాకేమియ్యకు. కాని, నీ నౌకరి కోసమైన బాకీ పైసలన్న ఇయ్యి" అన్నాడు కొండమల్లయ్య.

రాజయ్య దగ్గర ఆ ప్రశ్నకూ జవాబు సిద్ధంగానేవుంది.

"తమ్ముని చదువుకు వేలకొద్ది ఖర్చయిందా లేదా? ఆ ఖర్చు కిందికి నాకేమిచ్చినవు? నా నౌకరికోసం చేసిన ఖర్చు తమ్ముని చదువు ఖర్చు వంతు కనుకో" తలవంచుకొని అన్నాడు రాజయ్య.

ఆ మాటలకంతా అవాక్కయ్యారు. అందరి హృదయాలూ భారమయ్యాయి. తిరుపతయ్య గురించి ఎప్పుడూ ఒక్కమాటనని రాజయ్య-తన తమ్ముడు బి.ఏ. వరకు చదివాడని గర్వంగా చెప్పుకునే రాజయ్య అలా మాట్లాడుతాడని ఎవరూ ఊహించలేదు. తండ్రిని బాధ పెడ్తున్నందుకు రాజయ్యకూ బాధాకరంగానే వుంది. కాని తన సంసారం అనే పరిధిలో తాను, భార్య, పిల్లలు అని గిరిగీసుకున్న రాజయ్య, భార్య మాటల చాతుర్యానికి లోబడిన రాజయ్య ఆ బాధ నణచుకున్నాడు. డబ్బు, అవసరాలు, పరిస్థితులు మనుషుల్లోని ప్రేమానురాగాలను, బంధుత్వ మమతలను, మమకారాలను, సమీపత్వాన్ని ఎలా దూరం చేస్తాయో ఆలోచిస్తున్నాడు తిరుపతయ్య.

కొడుకు నుంచి ఇక ఏమాత్రం తన కుటుంబానికి ఆర్థిక సహాయం లభించదని అర్థం చేసుకున్నాడు కొండమల్లయ్య. అయినా ఒకేసారి తెగేవరకు లాగకూడదనుకున్నాడు. మరింత ఖచ్చితంగా మాట్లాడితే కొడుకు ఇంటికి కూడా రాకపోవచ్చనుకున్నాడు. ఆశ లేకున్నా తర్వాత మాట్లాడొచ్చని ఊర్కున్నాడు.

తెల్లవారి రాజయ్య, లక్ష్మి గోదావరిఖనికి వెళ్లిపోయారు. డబ్బివ్వకున్నా నరే బియ్యం




తీసుకెళ్లమంటే విన్లేదు.

"మన అంటు, సొంటు ఏది పట్టించుకునె టట్టులేడు కొడుకు. కోడలుకైతె మన వాసనే పడెటట్టులేదు" అంది నర్సమ్మ కొడుకు, కోడల్ను సాగనంపి వచ్చి.

"అడ్డాలనాడు బిడ్డలు కాని, గడ్డాల నాడా?" వేదాంత ధోరణిలో అన్నాడు కొండమల్లయ్య.

కుటుంబ ఆర్థిక పరిస్థితిని కొంతైనా మెరుగు పరచడానికి కొండమల్లయ్య కొడుకుపై పెట్టుకున్న ఆశలు అడియాసలు కాగా అతనికి ఆశాభంగమైంది. భవిష్యత్తాతనికి అంధకార బంధురంగా కనబడ్తోంది. హృదయం మూగగా రోదిస్తూంది.



మొక్కజొన్న పెనల్లు కోతలయ్యాయి. పల్లి పంట చేతికొచ్చింది. వాట్నమ్మి కొన్ని చిల్లర బాకీలుచెల్లించాడు కొండమల్లయ్య. బేంకు కిస్తి చెల్లించాడు. అల్లునికి దీపావళి కట్నాలు తీసుకెళ్లాడు. వచ్చిన డబ్బయిపోయింది. కొడుకు నుంచి డబ్బొస్తుందన్న ఆశ అతనికి లేదు. తీర్చాల్సిన బాకీలు భయంకరంగా కనబడ్తున్నాయి. భూమమ్మి వాట్ని తీర్చడం తప్పవేరే మార్గం కనబడటంలేదు. ఉన్న కాస్త భూమమ్మి పూలమ్మిన చోట కట్టెలమ్ముకోవడానికాతనికి మనసొప్పడంలేదు. ఏ పని చేస్తున్నా అదే ఆలోచన. భూమి లేకుండా ఉండడం అనే విషయాన్నాతడు జీర్ణంచేసుకోలేకపోతున్నాడు. జరిగేది జరుగుతుందిలే అని వేదాంత ధోరణిలో ఆలోచిస్తూ తననుతాను నరిపెట్టుకున్నాడు. కాని, ముందున్న బాకీలాతన్ని నరిగా నిద్ర పోనీయడం లేదు.

కార్తీక మాసం... శరదృతువు... ఆకాశం నిర్మలంగా వుంటుంది. రాత్రుల్లో పిండారబోసినట్టు చక్కని వెన్నెలలు కాస్తున్నాయి. చలి మొదలయింది. కొండమల్లయ్య పొలం కోత చివరికొచ్చింది. పాటలు పాడుతూ ఆడవాళ్లు పొలం కోస్తున్నారు. తిరుపతయ్య వరికట్టలు గడుతున్నాడు.

రాజమ్మ తిరుపతయ్యకు వదిన వరుసవుతుంది. అతడు దగ్గరికొచ్చినప్పుడు పరాచికాలాడుతూ పని చేస్తుంది. కొండమల్లయ్య బండ్లో వరివేసి ఊళ్లో కొట్టం దగ్గరున్న కల్లంలోకి చేరవేస్తున్నాడు. బండి తోలుకొచ్చి పొలానికి దగ్గరున్న తోవలో ఆపాడు కొండమల్లయ్య. ఎడ్లను విడిచి చెట్టుకు కట్టేసాడు.

"తిరుపతయ్యా! వరికట్టలు తీసుకరాంౘ్రి!" కేకేసాడు.

ఆ కేకవిని కోతనాపారు ఆడవాళ్లు.

తిరుపతయ్య వరికట్టలెత్తుతూ ఆడవాళ్ల తలలపై పెడుతున్నాడు. వాళ్లవి తీసుకెళ్లి బండ్లో నిల్చున్న కొండమల్లయ్యకు అందిస్తున్నారు. వాట్నాతడు బండ్లో పేరుస్తున్నాడు. తిరుపతయ్య వరికట్టలు రాజమ్మ మీదికెత్తుతుండగా అతని చెయ్యి తాకిందామెకు.

"కొంచెం చూసుకుంటెత్తు" అంది వరాచికంగా రాజమ్మ.

"చూసుకుంటూనే ఎత్తుతున్న" రాజమ్మ ఛాతీ దిక్కు చూస్తూ అన్నాడు తిరుపతయ్య.

కొంగు నరిచేసుకుంటూ... "తొందరగ పెళ్లి చేసుకో. లేకుంటె చెడిపోతవు" అంది.

"నీ లాంటి అమ్మాయి దొరుకుతె మా చేసుకుంట"

"పిల్లగాడు బాగ దూరమే పోతున్నడు..." అంది రాజమ్మ. ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ వరికట్టలు మోసుకొని బండి దగ్గరికెళ్లింది. వాట్నే బండ్లో నిల్చున్న కొండమల్లయ్యకందిస్తూ-

"మామా! నీ కొడుక్కు పెండ్లి చెయ్యి తొందరగ... అంతెత్తునో మాట్లాడుతున్నడు" అంది.

"మా తిరుపతయ్య ఎవ్వల జోలికిపోయెటోడుగాడు. నువ్వేవాన్నేదో అనుంటవు. నిన్నేమ



న్నదు కోడలా?'' వరి బండ్లో పేరుస్తూ అన్నాడు కొండమల్లయ్య.

''అంటె నేనేడ ఊర్కుంట? మరిది వరున గద... అందుకే అట్లంటున్న''

''నేను మా చేస్తనంటున్న. ఎంత చెప్పినా వింటలేదు. నేం జెప్పుతె వింటలేదు. నువ్వు వదినెవుగద... నువ్వు చెప్పు వింటడేమో చూద్దాం''

''చదువుకున్నాయినె నేం జెప్పుతేడ వింట డు? ఏదో మాటవరునకట్లంటి'' అని నవ్వు కుంటూ వెళ్లిపోయింది.

కథలు చెప్పుకుంటూ, జానపద గీతాలు, బతుకమ్మ పాటలు, కథాగేయాలు పాడు కుంటూ పనులు చేయడం పల్లీయుల కలవా టు. శ్రమను మరిచిపోవడానికి కొన్నిసార్లు హాస్యాన్ని కూడా ఆశ్రయిస్తారు. వరుసలున్న వాళ్లు పరాచికాలాడుకుంటారు. ఒక్కోసారి హాస్యం శృతిమించి కొన్ని గొడవలకు దారి తీస్తుంది. అయినా హాస్యం వాళ్ల జీవితంలో భాగంగానే వుంటుంది. కొందరు పరాచికంగా మోటు మాటలు మాట్లాడినా పెద్దగా పట్టించు కోరు. తిరుపతయ్యను మాట్లాడిస్తూ వరి మోస్తోంది రాజమ్మ. భీవండిలో మరమగ్గాలపై పనిచేస్తున్న తన భర్తగూర్చి గర్వంగా చెబు తుంది. అతనికి తనపై ఎంత ప్రేముందో చెబుతుంది. అక్కడ ఉండడానికి ఇల్లువసతి లేనందువల్ల తాను పోవడంలేదని చెబు తుంది. తామిద్దరు దూరంగావున్నా ఒకరి మన సొకరి మీదనే వుంది ఎప్పుడూ జ్ఞాపకాల్లోనే వుంటారని చెబుతుంది.

బండి గుజ్జలవరకు నిండింది. రెండు గుజ్జ లను కలుపుతూ తాడుతో బిగించి కట్టాడు కొండమల్లయ్య. మరింత వరి దానిపైనుండి పేర్చాడు. బండిపైన గజం ఎత్తుకు పైగా వచ్చేంతవరకు మెలిగాడు. ఇక చాలనగానే స్త్రీలంతా మిగిలివున్న పొలం కోయడానికి పోయారు. తిరుపతయ్య బండిదగ్గరికొచ్చాడు. కొబ్బరితాడును బండివెనుకనుంచి ఇరునుకు కట్టాడు. నీరటి గుండయ్య నొగలక్రిందినుంచి తాడు తీసి మళ్లీ వెనక్కి వేశాడు. బండిపైన కొండమల్లయ్య వెనుక తిరుపతయ్య ముందు గుండయ్య లాగుతూ తాడు బిగించారు. దాన్ని బండి వెనుకభాగంలోని కొట్టెకు బంధించాడు తిరుపతయ్య. బండి దిగాడు కొండమల్లయ్య. బండికి ఎడ్లను కట్టడానికి తయారవుతున్నా డు. నీరడి, సుంకరి తమకు వరికట్టలివ్వమ న్నారు. సరేనని వాళ్లతో పాటు పొలంలోకెళ్లాడు కొండమల్లయ్య. పెద్ద పెద్ద మోపులు కట్టి వుంచారు వాళ్లు. వాట్ని చూశాడు కొండమల్ల య్య.

''ఏం మోపులవి? మూడు కంచాల వడ్లు రాలుతయి. తీసెయ్యండ్రి వరి...'' అన్నాడు.

''ఏపాటుంది పటేల ఉండనియ్యండ్రి...'' అన్నాడు సుంకరి.

''ఉండనిచ్చేదేంటి...? మనిషికి ఇంత మోపులిస్తె మాకేం మిగుల్తయి...?'' కొండమల్ల య్య మాటలు విని మోపులు విప్పారు వాళ్లు. కొంచెం వరితీసి పొలంలో వేశారు.

''ఏం తీనుడది... నగం తీసెయ్యిండ్రి. నావంటోని దగ్గర అంత మోపులు తీసుకుంటె ట్ల?''

''మేమెట్ల బతుకాలె పటేల...? దేవుడెత్తుకో వాలె, పంట పండాలెకాని మాకు పెడితె పోతదా...?'' అన్నాడు నీరడి.

''ఏం పండినా లాభం లేదు...'' అని నగం తీసి పక్కన పెట్టాడు కొండమల్లయ్య.

''మిగిలిన వరి గూడ నువ్వే ఉంచుకో'' అని అలిగిపోబోయారు వాళ్లు.

''మొకం మాడ్చుకొని పోవడితిరేంది? రాండ్రి...'' అని తీసిందాంట్లోంచి నగం తీసి వాళ్ల మోపుల్లో వేశాడు.

తృప్తిగా వాట్ని తీసుకెళ్లారు వాళ్లు.

కొండమల్లయ్య బండి దగ్గరికొచ్చి కొడుకు సహాయంతో బండిగట్టాడు. బండెక్కి పగ్గాలు చేతిలోకి తీసుకున్నాడు. తాను వచ్చేసరికి మిగి లిన కోత, కట్టలు కట్టడం పూర్తిచేయమని తిరుపతయ్యకు చెప్పాడు. ముల్లుగర్రతో కొట్టి ఎడ్లనదిలించాడు. బండి కొట్టందిక్కు నడు స్తోంది.

'విత్తనాలకు, కలుపుకు, నాటుకు, ఎరువు లకు, ఇంకా ఇతర ఖర్చులకు రెండువేలకు పైన్నే ఖర్చయింది. పంటేమొస్తుందో చూడాలి. ఎంతొచ్చినా దండుగే. చిన్న కొడుక్కు ఉద్యోగం లేదు. నౌకరయిన కొడుకు ఇంటిని పట్టించుకో




పడంలేదు. కాలమంతెట్లొచ్చింది...? ఒకర్నొక రు చూసేట్టులేదు. తమ్ముని చదువు ఖర్చు గురించడిగాడు రాజయ్య. రాజయ్యెంత మారి పోయాడు...? మునుపున్న ప్రేమలు, అన్నద మ్ములమధ్య అనుబంధాలు, బంధువులమధ్య అనురాగాలు అన్నీ పోయాయి. ఎవరికివారే యమునాతీరే అన్నట్టు తయారవుతోంది. చాలామందికి బ్రతుకుదెరువు లేకుంటయిపో తుంది. బ్రతుకుడే కష్టమయ్యేట్టుంది. ఉన్న భూమి పోయేటట్టేవుంటి. ఇక వర్తి చేతుల్తో బ్రతకడమేనా...?'

బండ్లో కూర్చున్న కొండమల్లయ్యలో ఎన్నో ఆలోచనలు... బండి ఎడ్లకొట్టానికి సమీపంలో వున్న కల్లంలోకి చేరుకుంది. నర్సమ్మ కల్లందగ్గ రే వుంది. కట్లు విడిచి తాడు తీసేశాడు కొండమల్లయ్య. ఇద్దరు కలిసి బండి విడిచా రు. బండెక్కి వరికట్టలు వరికుప్పపై వేస్తున్నా డు కొండమల్లయ్య. నర్సమ్మ వాట్ని వరుసగా పేరుస్తోంది. కొద్దిసేపట్లో బండి ఖాళీ అయింది. వరికుప్ప ఎత్తు పెరిగింది. ఇంటికి పోయి నీళ్లు తాగొచ్చాడు కొండమల్లయ్య. మళ్ళీ బండి కట్టుకొని పొలం దగ్గరికెళ్లాడు. అతడు పోయేసరికి సాయంత్రమయింది. కోత, కట్టలు కట్టడం పూర్తయింది. చీకటి పడేవరకు వరిజేరగొట్టడం పూర్తయింది. ఒకరి తర్వాత ఒకరు కొండమల్లయ్య, తిరుపతయ్య ఇంటికెళ్లి భోజనం చేసి వచ్చారు. చలి విపరీ తంగా వున్నా తండ్రీకొడుకులిద్దరు కలిసి తెల్లవారు జామున బంతి కట్టడానికి అలుగం వేశారు. కొండమల్లయ్య గొంగడి కప్పుకొని అల గంపైన్నే పడుకున్నాడు. తిరుపతయ్య బండి కింద పడుకున్నాడు. బంతి కట్టడానికి పిలు చుకొచ్చిన కూలిమనిషి కూడా అక్కడే పడుకు న్నాడు. పొద్దంతా అలసిపోయున్న శరీరాలు త్వరలోనే నిద్రలోకొరిగాయి.

తెల్లవారు జామున నాలుగు గంటల ప్రాంతంలో కొండమల్లయ్యకు మెలుకువొ చ్చింది. ఉలికిపడి లేచికూర్చున్నాడు. చలిగా వుంటే చెవుల్నిండా రుమాలు చుట్టుకున్నాడు, గొంగళి మునుగేసుకున్నాడు. లేచి నిల్చొని ఆకాశందిక్కు చూశాడు.

'తెల్లవారే చుక్క పొడిచింది. బాగా రాత్రి లేదు... పడుకుంటే మెలకువ రాలేదు. బంతి కట్టాలి' తనలోతాను అనుకుంటూ కూలిమ నిషి దగ్గరికి వెళ్లాడు. అతన్ని తట్టి లేపాడు. మూలుగుతూ లేచి కూర్చున్నాడు మొండెయ్య.

"రాత్రి బాగుంది... కొంచెమాగి బంతి గడుదాం..." కండ్లు నులుముకుంటూ అన్నా డు మొండెయ్య.

"గొరుకొయ్య చుక్కలు ఎంత వంగినయో చూడు... రాత్రి లేదేంలేదు... లే..." కొండమల్ల య్య అనగానే లేచి నిల్చున్నాడు మొండెయ్య.

వాళ్ల మాటల చప్పుడు విని తిరుపతయ్య లేవబోయాడు. "నువ్వు పడుకో బిడ్డ... కొంచె మాగి నేను లేపుత" కొండమల్లయ్య అనగానే కాళ్లు దగ్గరగా ముడుచుకొని పడుకున్నాడు.

కొండమల్లయ్య రెండెడ్లను, ఇతర్లవి ఆరెడ్ల ను తోలుకొచ్చి రెండు బంతులు కట్టారు. బంతి నడుపుతూ చుట్టు తిరుగుతున్నారు. జుయ్‌మని చలిగాలి వేస్తోంది. చేతులు కొంక ర్లు పడుతున్నాయి. కొంతసేపు తిరిగేసరికి వాళ్ల శరీరంలో వేడిపుట్టింది. గొంగడి మునుగు తీసేశాడు కొండమల్లయ్య. గంటపైగా రెండు బంతులు నడిపారు. గడ్డి చేతుల్లోకి తీసుకొని చూశాడు కొండమల్లయ్య.

"దంగినట్టుంది... వెన్ను పొడుద్దాం" అని "లేబిడ్డ లే..." అని తిరుపతయ్యను నిద్రలేపా డు.

ముగ్గురూ వరుసగా వంగి గడ్డిని రెండు చేతుల్తో లేపుతూ, వడ్లను నేలపై దులుపుతూ, గడ్డిని వెనుకేస్తున్నారు. అణగివున్న వరిగడ్డిని తీస్తుంటే వాళ్ల చేతులు నొప్పిపెడుతున్నాయి. ఆ అలుగం పూర్తిగా వెన్నుపొడిచే (మర్లే యడం) నరికి అంత చలిలోనూ ముగ్గురికీ చెమటలొచ్చాయి. ఆ పని పూర్తికాగానే "నేను దొడ్డికి పొయ్యస్త... బంతి కొట్టు" తిరుపత య్యకు చెప్పి కాలువదిక్కెళ్లాడు కొండమల్ల య్య. అతడొచ్చింతర్వాత మొండయ్య, అటు తర్వాత తిరుపతయ్య కాలకృత్యాలు పూర్తిచే సుకొని వచ్చారు. ముగ్గురు కలిసి మరోసారి గడ్డిమర్లేశారు. కొంచెం పొద్దెక్కేనరికి ఆ వరి పూర్తిగా దంగింది. ముగ్గురూ మూడుచోట్ల నిల్చుండి గడ్డి దులిపి కుప్పగా వేస్తున్నారు. కొంత కుప్పయిన తర్వాత కల్లం బయట

వలుచగా పరిచి వస్తున్నారు.

''గడ్డిల వడ్లు పోనియ్యకు బిడ్డ... మంచిగ దులుపు'' కొడుక్కు చెప్పాడు కొండమల్లయ్య.

''మంచిగానే దులుపుతున్న బాపూ!'' అని తన పని చేస్తునాడు తిరుపతయ్య.

అలుగం దులపడం పూర్తయింది. కల్లంలో పడున్న వడ్లలోకి చెయ్యి పోనిచ్చాడు కొండమల్లయ్య.

'ఈ సంవత్సరం పంట బరుకతి ఉండెటట్టుంది... పుట్టిన్నరో, రెండు పుట్లో మారాలుతాయి' తనలో తాననుకున్నాడు.

అటు తర్వాత మళ్లీ అలుగమేశారు. అలుగం వెయ్యడమైన తర్వాత ''కొంచెం చల్లబడి వస్త'' అన్నాడు మొండయ్య.

''ఇంత పొద్దున్నే ఆకలయితందా? నువ్వు పొయ్యేవరకు వంటగూడ కాదు. కొంచెమాగి పో...'' అన్నాడు కొండమల్లయ్య.

''అలుగం తీసెవరకు కడుపుల భగభగ మండుతుంది. చలిబువ్వ మా ఉందింట్ల, తినస్త'' అని వెళ్ళిపోయాడు మొండెయ్య.

తండ్రికొడుకులిద్దరు బంతులు నడిపిస్తున్నారు. ఎడ్లు నిగనిగలాడుతున్న వరి కర్రల నందుకొని గబగబ మేస్తున్నాయి.

''మెరిగ తిననియ్యకు... నాలుగు చుట్లు తొందరగ పోనియ్యి'' కొడుక్కు చెప్పాడు కొండమల్లయ్య.

గబగబ బంతులు నడిపిస్తున్నారిద్దరు.

రెండురోజుల్లో బంతి కట్టడం, వడ్లు తూర్పార పట్టడం కూడా అయిపోయింది. వడ్లరాశిని చూసుకొని సంతృప్తిపడ్డాడు కొండమల్లయ్య. తిండికి కొన్నుంచుకొని మిగిలినవి బీటికి (వ్యవసాయ మార్కెట్‌కు) తీసుకెళ్ళి అమ్ముకు రావాలనుకుంటున్నారు. ప్రస్తుతం ధరలేదు కాబట్టి వారంరోజులాగి పోవాలన్న ఆలోచనలో వున్నారు. రాత్రివరకు వడ్లను ఇంటికి తీసుకెళ్లాలని యోచిస్తున్నారు.

షావుకారి కల్లంలోకొచ్చి నిల్చున్నాడు.

''కొండమల్లయ్యా! వడ్లు కొలుస్తవా?'' అన్నాడు.

''లేదు... నేను బీట్లె అమ్ముకచ్చుకుంట...''

''అదే ధర నేంబెడుత''

''వద్దు... నేనక్కడనే అమ్ముత''

''సరే... నీఇష్టం... కాలం మునుపటితీరుగ లేదు... అమ్ముకొచ్చిన తర్వాత వడ్డి గట్టుమరి'' అని వెళ్లిపోయాడు షావుకారి.

''కుక్కినపేండ్లయింద్రు వీళ్లు. అంతకు ముందు వీళ్ల పటాటోపం కొద్దా...? వద్దన్నా జబర్దస్తీగా కల్లంలనే కొలుసుకపోయిరి'' అని చుట్టంటుబెట్టుకున్నాడు కొండమల్లయ్య.

రాశిదిక్కు చూస్తూ పొగ పీలుస్తున్నాడు. నర్సమ్మ, తిరుపతయ్య అక్కన్నే వున్నారు. ఇంటికెళ్లిన కూలిమనిషి మొండయ్య వచ్చిన తర్వాత వడ్లు ఇంటికి తీసుకెళ్లాలని చూస్తున్నారు. కల్లంలో ఎడ్లబండి, 'బోరెం' సిద్ధంగా వున్నాయి. రాశిని చూస్తూ పొగ పీలుస్తున్న కొండమల్లయ్య కొండయ్య కూతురు పరుగెత్తుకు రావడం చూశాడు. శ్వాస పైకి పీలుస్తూ ఆ పాప-

''పెదబాపు.. పెదబాపూ... నాయనమ్మ చచ్చిపోయింది'' అంది.

గభాలునలేచి తమ్మునింటిదిక్కు పరుగెత్తుతున్నాడు కొండమల్లయ్య. అతని వెనుకే నర్సమ్మ, తిరుపతయ్య పరుగెత్తారు. ఎదురుగా వస్తున్న మొండయ్యను కల్లం దగ్గరుండమని చెప్పాడు తిరుపతయ్య. కొండమల్లయ్య తమ్ముని ఇల్లు చేరుకునేసరికి శవం వాకిట్లో నేలపై పడుంది. కొండయ్య భార్య, మరికొంద రాడవాళ్లు ఏడుస్తున్నారు. నర్సమ్మ వాళ్లలో చేరి ఏడ్వసాగింది.

కొండయ్య అన్నయ్యను కౌగలించుకుని కొద్దిసేపేడ్చాడు.

''వడ్లు తీసుకురావటానికి బోరెం తీసుకపోదామని వచ్చిన్నే అన్న, ఇంట్లెవ్వలు లేరు. అవ్వ మెదలకుంట పండున్నది. అనుమానమచ్చి చెయ్యివట్టి చూసిన. ధాతు దొరుకలే. బజార్లో ఆడుకుంటున్న వరవ్వను పిలిచి కల్లంకాడున్న వాళ్ల అవ్వ దగ్గరికి తోలిన. ఆటెనుక మీ దగ్గరికి పొమ్మన్న. చచ్చిపోయిన మనిషిని మంచాలుంచొద్దని కిందేసిన'' ఏడుస్తూ చెప్పాడు కొండయ్య.

కొద్దిసేపట్లో చుట్టుపక్కలవాళ్లంతా గుమిగూ





డారు.

"ఏడిస్తె ఏమొస్తది? తొందరగా పనిగాని య్యాలె?"

"మునలవ్వకు బిడ్డలమీద ప్రేమ. వాళ్లు రావాలె"

"పీనుగును రాత్రి ఇంట్లో ఉంచద్దు"

"మరి బిడ్డలు కండ్లనన్న జూసుకోవద్దా?"

"చచ్చిపోయింతర్వాత ఎవ్వరొచ్చినా రాకు న్నా ఒక్కటే"

"అట్టంటెట్ల. చివరి చూపన్న దక్కద్దా... కొడుకన్న రావాలి"

"పొద్దు గూట్లోపడే యాలయింది. ఇయ్యాల్ల దానంగాదు. రేపు చెయ్యాలె. అప్పటివర్కు అందినోల్లందుతరు"

అక్కడికొచ్చినవాళ్లంతా రకరకాలుగా మాట్లాడుకుంటున్నారు. తెల్లవారింతర్వాతే దహనం చెయ్యడానికి నిర్ణయించుకున్నారు. పెద్దపల్లిలో వున్న వెంకటయ్య దగ్గరికి, ఆ వృద్ధురాలి ఇద్దరు కూతుర్ల దగ్గరికి, దగ్గరూ ళ్లలో వున్న బంధువుల దగ్గరికి మనుమలను పంపారు. రాత్రి ఎవరి కంటిమీదా కునుకులే దు. ఎవరూ అన్నం తిన్లేదు. ఏడ్పులతోనే రాత్రంతా గడిచింది. తిరుపతయ్య వడ్లరాశి దగ్గర పడుకున్నాడు.

కొంచెం పొద్దెక్కేనరికి మునలవ్వ బిడ్డలు, వెంకటయ్య, మరికొందరు బంధువులు పిల్లల తోనహా వచ్చారు. కూతుర్లు తల్లి శవంపైపడి వల్లిస్తూ ఏడుస్తున్నారు. ఎందరాపినా ఆగ డంలేదు. కడుపులోని సోదంతా తగ్గేవరకు తనివితీరా ఏడ్చారు.

వాళ్ల ఏడ్పును చూసినవాళ్ళు-

"ఎంతైనా బిడ్డలు... బిడ్డలే. బిడ్డలకున్న దుఃఖం కోడండ్ల కెందుకుంటది?" అనుకున్నా రు.

శవదహనానికి అన్ని ఏర్పాట్లు జరిగాయి. కొండమల్లయ్య అగ్గికుండ చేతిలో పట్టుకొని నడుస్తున్నాడు. కొండయ్య, వెంకటయ్య, మరో ఇద్దరు పాడెనెత్తుకుని అతని వెనుక నడుస్తు న్నారు. ఆడవాళ్లు శోకాలు తీస్తూ నడుస్తున్నా రు. "గోవిందా... గోవిందా" అని అరుస్తూ పాడెపై బేలు ప్యాలాలు చల్లుతున్నారు కొంద రు. డప్పు చప్పుడుతో, ఏడ్పులతో, గోవిందా అరుపులతో శవం శ్మశానం చేరుకుంది. శవం కాష్టంపైకి ఎక్కించే సమయానికి రాజయ్య, రాంరెడ్డి వచ్చారు. లక్ష్మి, కాంతమ్మ గర్భవతు లని తీసుకురాలేదు. కొంచెం పొద్దువంగే సమ యానికి శవదహన కార్యక్రమాలయిపోయాయి. తెల్లవారి కర్మనాటికి వస్తామని కొండమల్లయ్య చెల్లెండ్లు, రాజయ్య, రాంరెడ్డి వెళ్ళిపోయారు. పనులున్న కాలమవడంవల్ల వాళ్లనెవరూ ఆప లేదు. మరునటిరోజునుంచి ఎవరిపనుల్లో వాళ్లు మునిగిపోయారు. కొండమల్లయ్య వడ్ల ను ఇంటికి చేర్చాడు. కర్మ తర్వాత బీటికి తోలాలని నిర్ణయించుకున్నాడు.

వ్యవసాయ కుటుంబాల్లో, కూలినాలి కుటుంబాల్లో పుట్టుక, చావు పెద్ద విశేషాలు కావు. వాటికంత ప్రాముఖ్యతా వుండదు. పొట్ట నింపుకోవడానికి జీవనసమరంలో పాల్గొనడమే వాళ్ల నిత్యకృత్యం.

పెద్దకర్మ నాటికి కొండమల్లయ్య, చెల్లెండ్లు, వియ్యంకులు మిగతా బంధువులంతా వచ్చా రు. ముగ్గురన్నదమ్ములు కలిసి ఓ గొర్రెను కోసి అందరికీ చావువిందు చేశారు. తెల్లవారి తల్లి మీదున్న కొద్దిపాటి సొమ్ములు తమకే చెందుతా యన్నారు కొండమల్లయ్య చెల్లెండ్లు. నర్సమ్మ ఆమె తోడికోడళ్లు ఇవ్వమన్నారు. కొంత గొడవ జరిగింది. కాని ఇవ్వక తప్పలేదు.

మరునాటికంతా వెళ్లిపోయారు. రాజయ్య గోదావరిఖనికి పోయాడు. తనవంతుకొచ్చిన ఖర్చు డబ్బు ఇచ్చేసి వెంకటయ్య, పిల్లలతోపా టు పెద్దపల్లికి వెళ్ళిపోయాడు.

కొండయ్య, కొండమల్లయ్య ఇండ్లలో శ్మశాన వైరాగ్యం చోటుచేసుకుంది.

★ ★ ★

పుట్టిన ప్రతి ప్రాణికి చావు తప్పదు. చావు అనివార్యమని మనిషికి తెలుసు. అయినా ఆత్మీయుల దగ్గరివాళ్ల ఎడబాటుకు మనిషి దుఃఖించకుండా వుండడు. ఎంత ఆత్మీయు లైనా, ఆ ఎడబాటు ఎంత దుఃఖాన్ని కల్గించినా, ఆ చావు ఎంత నష్టాన్ని పూడ్చుకోలే నిదైనా కొద్దికాలం తర్వాత మామూలు జీవనప్ర వంతిలో కలిసిపోక తప్పదు. ఈ విషయాల్లో




ఆర్థిక స్థితిగతులను బట్టి కొంత తేడా లుంటాయి. అగ్రకులాల్లో, ఆర్థికంగా వెనుకబా టున్న కుటుంబాల్లో భర్త చనిపోతే స్త్రీలు నెలల తరబడి, సంవత్సరాల తరబడి బయటకు రారు. స్త్రీ విషయంలో అలా జరుగదు. కాని ఆ కుటుంబాల్లో ఎవరు చనిపోయినా చాలారోజు లవరకు సానుభూతులు ప్రకటించడం, మామూలు పనుల్లో లీనం కాకపోవడం వుంటుంది. కాని రెక్కాడందే డొక్కాడని కుటుంబాల్లో, వ్యవసాయిక కుటుంబాల్లో చాలా తొందరగానే ఎంత దుఃఖమున్నా మామూలు జీవన స్రవంతిలో కలిసిపోవాల్సుంటుంది. పనిపాటల్లో పాల్గొనాల్సి వుంటుంది.

కొండమల్లయ్యకు తల్లిచావు బాధాకర మైందే. అయినా పెద్దకర్మ పూర్తికాకముందే కొన్ని అత్యవసర వ్యవసాయపనులు చేయక తప్పలేదు. తల్లి కర్మయిన మరునాటినుంచి పూర్తిగా పనుల్లో మునిగిపోయాడు. వడ్లకు ధరుందని విని రెండుబండ్లలో తీసుకెళ్లి వ్యవ సాయ మార్కెట్లో అమ్ముకొచ్చాడు. మరో రెండు బండ్లలో నింపివుంచాడు. రాత్రే ఉదయం చద్దికొరకు అన్నం వండించి నర్సమ్మ అల్యూ మినియం డబ్బగిన్నెలో పెట్టుంచింది. తెల్లవా రుజామున లేచిపోవాలని రాత్రి బండిలోనే పడుకున్నాడు. నాలుగుగంటల రాత్రి లేచా డు. తిరుపతయ్యను నిద్రలేపాడు. చద్దిగిన్నెను బండిగుంజలకు కట్టాడు. ఇంకో నాలుగు బళ్ల తోపాటు కొండమల్లయ్య, తిరుపతయ్య చెరో బండి నడిపిస్తూ బీటికెళ్లారు. అక్కడకు చేరు కునేసరికి ఉదయం పదిగంటల సమయమ యింది. బండ్లక్కడికి చేరుకోగానే సేట్ల గుమా స్తాలు తమ దగ్గరకు రావాలని బండ్లకు అడ్డం తిరిగి పిలువసాగారు... తమకు ఇంతకు ముందు పరిచయమున్న సేటు బీటికి పోత మన్నారు రైతులు. కొండమల్లయ్య, అతనితో వచ్చిన రైతులంతా జగ్గయ్య షావుకారి బీటి దగ్గర బండ్లనాపారు. స్థలం చూపించాడు గుమాస్తా. బండ్లు విడిచి బోరాలు విప్పి వడ్లను కుప్పలుగా పోశారు. బండినొగలకు ఎడ్లు కట్టేసి మేతవేశారు. దగ్గరున్న బావి దగ్గరికెళ్లి పుక్కిలించి ఉమ్మి ముఖం కడుక్కున్నామని పించారు. అందరు కలిసి తీసుకెళ్లిన ఇత్తడి పాత్రలో నీళ్లు తెచ్చుకున్నారు. కొండమల్లయ్య, మిగతా రైతులు బండ్లనీడకు కూచొని చద్దన్నం మూటలు విప్పారు. తిరుపతయ్యను అంతకు ముందే హోటల్లో తినిరమ్మన్నాడు కొండమల్ల య్య. అతడు పోనన్నా ఆ అన్నం అక్కడ తినలేడని బలవంతంచేసి పంపించాడు. చద్దిఅన్నంలో పెట్టిన చింతకాయ చట్నీతో అన్నం కలుపుకుంటూ తింటున్నాడు కొండమ ల్లయ్య.

ఇంతలో "గుర్ గుర్"మంటూ ఓ పంది వచ్చి వడ్లలో మూతి పెట్టబోయింది. కొండమ ల్లయ్య గబుక్కున లేచి "ఛీ నీయవ్వ పంది నాశినంగాను" తిడుతూ దాన్ని తరిమేశాడు. కూర్చుని అన్నం తింటున్నాడు. నాలుగు బుక్క లు గబగబ మింగేసరికి స్వరం తప్పింది. ఇత్తడిపాత్ర లేపి గటగట నీళ్లు తాగాడు. మళ్లీ స్వరం తప్పింది.

"ఎవరో యాదిజేస్తండ్రే కొండమల్లన్న నిన్ను" అన్నాడు ఓ రైతు.

"నన్ను యాది చేసేటోళ్లెవ్వలు...? మా కాంతవ్వ గావచ్చు"

"ఎందుకు నీ కొడుకు రాజయ్య జ్ఞాపకం చెయ్యడా...?"

"యాదిజేసే కొడుకైతే బాగనేవుండు. వాని కిప్పుడు అవ్వయ్యలు కనవడుతలేరు. ఏం మరుగుమందు పెట్టిందో ఏమో? పెండ్లాం మాటలానికి బెల్లమయినయి. మమ్ములను పట్టించుకుంటనే లేదు"

"లోకమంత అట్లనే వుంది. నా కొక్కడే కొడుకా? ఎదిగిన పిల్లంజూసి పెండ్లి జేసిన. పెండ్లయినంక వానికి అదే లోకమైంది. నా మీదనే ఏరువడ్డడు..."

"ఇయ్యాల్ల రేవటి పిల్లగాండ్ల నేమనెటట్టు లేదు..."

మరోరైతు ఎద్దు కాలికింద పగ్గంపడి అది తన్నుకుంటోంది. అతడు లేచి చెయ్యి కడు క్కొని ఎద్దు కాలికిందినుంచి పగ్గం తొలగించి దాన్ని దగ్గరగా కట్టేసాడు. చేతులు కడుక్కొని వచ్చి అన్నం తినసాగాడు.

"దినునుకు ధరేం బడుతదో?"

"వాళ్ల దయాభక్తి. వాళ్లెంతంటే అంతే...



మన చేతుల్లేముంది?''

''జోకెప్పుడైతదో ఏమో...?''

''ఇదువరకే మొదలైంది. పాలిచ్చేయాలకు (మధ్యాహ్నం సుమారు 2 గం. ప్రాంతంవరకు) మనదైపోతది''

మాట్లాడకుంటూ అన్నం తినడం ముగించారు వాళ్లు. గిన్నెలు తీసుకెళ్లి బావిదగ్గర కడుక్కొచ్చారు. కడుపునిండ నీళ్లు తాగారు. గిన్నెలను గుడ్డల్లోకట్టి బండి గుజ్జులకు తగిలేశాడు. ఒక్కొక్కరు తమ ఎడ్లను తీసుకెళ్లి నీళ్లు తాగించుకొచ్చారు.

ముచ్చులు చూసి ధాన్యం ధర నిర్ణయించే సేటు రాకకోసం ఎదురుచూస్తున్నారు రైతులు. కొద్ది సేపయింతర్వాత చిట్టికుండంత బొర్రున్న ఓ వ్యక్తి వాళ్ల బండ్ల దగ్గరికొచ్చాడు. అతనికిరువైపులా ఇద్దరు మనుమలున్నారు. ఆయాసపడుతూ వంగి వడ్లరాశిలోంచి ధాన్యం తీసిచూశాడు. పక్కనున్న వాళ్లకేమో చెప్పాడు. అలాగే అందరి వడ్లరాశులను చూస్తూ వెళ్లిపోయాడు.

మరోరెండు గంటల తర్వాత జనువ సంచుల మూటను, పెద్ద త్రాసును కొంత మంది కూలీలు తీసుకొచ్చి అక్కడ పెట్టారు. హమాలీలు వచ్చారు. గబగబా సంచులు నింపుతున్నారు. నిర్లక్ష్యంగా అటూఇటూ పారబోస్తున్నారు. వాళ్ల నిర్లక్ష్యాన్ని చూస్తుంటే ఆ ధాన్యానికి సృష్టికర్తలైన కొండమల్లయ్య, అతని సహచరుల మనసులు విలవిలకొట్టుకుంటున్నాయి. సంచుల్లో వడ్లన్నీ నింపి కాంట దగ్గరకు తీసుకెళ్లారు. ఒక్కో సంచి కాంటమీద పెడుతూ తూస్తున్నారు. సంచిలో వడ్లెక్కువైతే గమేలతో తేడి ఖాళీ సంచిలో పోస్తున్నారు. తక్కువైతే ఇందులోవి అందులో పోస్తున్నారు. నిర్లక్ష్యంగా ధాన్యం అటూ ఇటూ పారబోస్తూ వడ్లను తూకం వేస్తున్నారు.

''కొంచెం మెల్లగ జోకుండ్రి (తూచండి) సేటు...'' అన్నాడు కొండమల్లయ్య.

''నువ్వొక్కనివే ఉన్నవా? ఎన్ని జోకాలో చూడు'' అని గబగబా లెక్కబెడుతూ తూచుతున్నాడు. ఆ లెక్కలనర్థం చేసుకోవడానికి తికమక పడ్తున్నాడు కొండమల్లయ్య. తిరుపతయ్య ప్రక్కనే నిల్చొని నోట్ చేసుకుంటున్నాడు.

మొత్తం తూచడమయింతర్వాత...

''పన్నెండు క్వింటళ్ల యాభై కిలోలు... యాదికుంచుకో'' అని ఓ కాగితంపై రాసి కొండమల్లయ్య చేతికిచ్చాడు సేటు మనిషి. ఆ కాగితం అపారం చొక్కాజేబులో పెట్టుకున్నాడు కొండమల్లయ్య. ఇంకొద్ది సేపట్లో మిగతా రైతుల ధాన్యం తూచడం కూడా పూర్తయింది. అందరూ బండ్లు కట్టుకొని డబ్బు తీసికోవడానికై సేటు ఇంటికెళ్లారు. రోడ్డుమీద బండ్లు విడిచి వాకిట్లోకెళ్లారు. ముందున్న చెక్కబల్లమీద చేతులాచ్చుకొని పరుపుల మీద కూర్చున్నాడు జగ్గయ్య. మెల్లకన్ను అటూ ఇటూ కదిలిస్తూ లెక్కలు చేస్తున్నాడు జగ్గయ్య. కొండమల్లయ్య, మిగతా రైతులు అతని దగ్గరకు పోయి నిల్చొని-

''దండాలు సేటు...'' అన్నారు.

జగ్గయ్య తలపైకెత్తి చూసి-

''మీరా పటేండ్లు... చాల రోజుల్నుంచి మీరు మా బీటికొస్తలేరు. ఇంకెవ్వరి దగ్గరికన్నా పోతండ్రా?'' అన్నాడు.

''లేదు సేటు... మీరుండంగ వేరే బీటికెందుకు పోతం? ఊళ్ళనే అమ్ముకుంటున్నం. అయినా రెండు, మూడేండ్ల నుంచి పంటేడిది? ఈ యేడే ఓ తీరుగ పండింది'' అన్నాడు కొండమల్లయ్య.

''అట్లనా?'' అని లెక్కల్లో మునిగిపోయాడు జగ్గయ్య.

''చాలదూరం పోవాలె సేటు... పొద్దంగుతుంది. బాగ రాత్రయితె మంచిగుండది. దొంగ భయం... తొందరగ పైసలిస్తె మేమెల్లిపోతం...'' అన్నాడు రైతు.

''తొందరగనే పంపిస్త... మిమ్ములనాపుతె నాకేమొస్తది? ఒకరి తర్వాతొకర్ని పంపిస్త'' అన్నాడు జగ్గయ్య.

జగ్గయ్య ప్రక్కన కూర్చున్న గుమస్తా రైతుల దగ్గర్నుంచి కాగితాలు తీసుకొని లెక్కలు చేసి జగ్గయ్యకిస్తున్నాడు. జగ్గయ్య మరోసారి వాట్ని సరిచూసి డబ్బులెక్కబెట్టి రైతులకిస్తున్నాడు.

కొద్దిసేపట్లో అందరికి డబ్బిచ్చాడు జగ్గయ్య.





"ధరెంత వడ్డది సేటు?" అడిగాడు కొండ మల్లయ్య.

"క్వింటలుకు నూటెనభై..."

"మొన్న నూటతొంభై వడ్డదిగద సేటు"

"నిన్నట్నుంచే పది రూపాయలు తగ్గింది"

'ధరలెప్పుడు పెరుగుతాయో, ఎప్పుడు తగ్గుతాయో ఆ భగవంతుడికి కూడా తెలియదు' తనలోతానే గొణుక్కున్నాడు కొండమల్లయ్య.

డబ్బు చేతికొచ్చేసరికి సాయంత్రం నాలుగ్గంటలయింది.

"బండ్లు గడుదామిగ" అన్నాడు కొండమల్లయ్య.

"ఏమన్న కొనుక్క పోదాం"

"అల్పెం (ఆలస్యం) చెయ్యద్దు... రాత్రయితది. మన దగ్గెర పైసలున్నాయి. దొంగో? దొరో? తొందరగ పోవాలె"

కొండమల్లయ్య ఓ పది రూపాయలు చొక్కా జేబులో పెట్టుకొని మిగిలిన డబ్బు ధోవతి చింగుల్లో కట్టి నడుముకు చుట్టుకున్నాడు. మిగతావాళ్లు కూడా అలాగే చేశారు.

రైతులంతా తలో అరడజను అరటివళ్లు కొన్నారు. బండ్లు కట్టడానికి సిద్ధమవుతున్నారు.

"కోపెడంత చా దాగి పోదాం" అన్నాడో రైతు.

"చా దాగుతేమొస్తది? ఊళ్లె తాళ్లు బాగున్నాయి. తలో బింకెడు కల్లుదాగుదామక్కడ" అన్నాడు కొండమల్లయ్య.

"ఆఁ ఊరికి పొయ్యేవారకు రాత్రయితది. కల్లుదొరుకదేం దొరుకది. అయినా పైసలు దగ్గర పెట్టుకోని కల్లు దాగుడేంది? మంచయితది.. చెడ్డైతది... వద్దు మనిషికో కోపెడు (కప్) చా దాగి బండ్లు కడుదాం"

టీ తాగడానికే అందరూ నిర్ణయించుకున్నారు.

అక్కడే వున్న హొటల్లోకెళ్లి కూర్చున్నారు రైతులు. మాసిన బట్టలతో అనాగరికులుగా కనబడుతున్న ఆ రైతులను చూసి కనురుకున్నాడు సర్వర్.

"మంచిగ కూచోండ్రి" గద్దించినట్టన్నాడు. వాళ్లు బయటకు చాపుకున్న కాళ్లను టేబుల్స్ క్రిందికి పెట్టారు. గ్లాసుల్లో నీళ్లు తెచ్చివాళ్ల ముందుపెట్టి-

"ఏం గావాలె" అన్నాడు సర్వర్.

"ఐదు కోపుల చాయలియ్యి"

కప్పుల్లో టీ తెచ్చి వాళ్లముందుంచాడు. మరీ చిన్నగావున్న టీ కప్పులను చూసి ఆశ్చర్య పోయారువాళ్లు.

"ఒక్కొక్క కోపుల నాలుగు చంచాలన్న వడుతదా?"

"ఎంతో ఇగ... మనం ఇంట్ల తాగినట్టు గ్లాసెడు కావన్నంటె పోస్తరా మరి?"

"వెనుకట చాయలుండెనా? నా చిన్నప్పుడైతె ఒక్క దొరింట్ల, కర్నపోల్లిండ్లల్ల. నలుగురైదుగురు రెడ్ల ఇండ్లల్ల ప్రొద్దున చాయలు తాగెటోల్లు. ఇప్పుడైతె చా దాగని ఇల్లు లేదు" అన్నాడు కొండమల్లయ్య.

రెండు బుక్కల్లో టీ త్రాగడం పూర్తి చేశారు. బిల్లు కాగితం తీసుకొచ్చి వాళ్లముందుంచాడు సర్వర్. ఆ కాగితమెవరు తీసుకోవాలో అర్థంకాక అతని దిక్కే చూస్తున్నారు వాళ్లు.

"ఐదుగురి బిల్లు అందులోనేవుంది" అన్నాడు సర్వర్.

"తర్వాత చూసుకుందాం" అని కొండమల్లయ్య నాలుగు రూపాయల బిల్లును తానే చెల్లించాడు.

వాళ్లంతా బండ్ల దగ్గరికి వెళ్లేసరికి ఊళ్లోకి వెళ్లివచ్చిన తిరుపతయ్య బండిమీద కూర్చొనున్నాడు.

"చా దాగుతవా బిడ్డ... మేం దాగినం..." అన్నాడు కొండమల్లయ్య.

"వద్దు బాపు... నేనిదువరకే తాగిన" అన్నాడు తిరుపతయ్య.

పోదామని బండ్లుకట్టారు వాళ్లు. బండ్లు నడుస్తున్నాయి. బండ్లో కూర్చున్న కొండమల్లయ్యలో ఎన్నో ఆలోచనలు-

ఈ సంవత్సరం పంట బాగానే పండింది, మంచిగ పండిన సమయంలో వచ్చిన ధాన్యం ముప్పై క్వింటాల్లు... వీటికొచ్చే మొత్తం డబ్బు

ఐదువేల నాల్గువందలు... పెట్టిన ఖర్చు రెండు వేల పైన్నే మిగిలింది దాదాపు మూడు వేలు. ఈ మూడు వేల్లోంచే కుటుంబమంతా తినాలి, బాకీలు చెల్లించాలి, ఎన్నో అవసరాలు తీర్చుకోవాలి. ఈ డబ్బు ఐదు నెలల కాలం ముగ్గురు మనుషులు, రెండెడ్లు రాత్రి పగలు కష్టపడితే వచ్చింది. రోజు మనిషి కూలీ కెళ్లితే ఇరవై రూపాయలిస్తారు. అంటే ఐదు నెలలు రోజు కూలీ దొరికితే ఒక్క మనిషికే మూడువేలు వస్తాయి. అంటే వ్యవసాయంలో కూలి కూడా గిట్టడంలేదన్న మాట! పంటపండిన సంవత్సరమే ఇలా వుంటే కరువు కాటకాలొచ్చిన సంవత్సరాల్లో పెట్టిన ఖర్చులైనా రావు. ఏ రెండు మూడేండ్లకో ఓసారి మంచి పంటొస్తుంది. మరి రైతులకు అప్పులు కాక ఏం మిగుల్తాయి? భూములమ్ముడు పోకుండా ఆపడమెలా సాధ్యం? మరి తనలాంటి వాళ్ల నాదుకునేదెవరు? చదువుకున్న కొడుక్కు ఉద్యోగం లేదు. ఉద్యోగమున్న కొడుకు ఇంటిని పట్టించుకోవడంలేదు. వ్యవసాయం సంగతిలా వుంది. మరి బాకీలెలా తీరాలి?

కొండమల్లయ్యకు బ్రతుకు దుర్భరంగా కనబడుతోంది. భవిష్యత్తు అంధకారంగా దర్శనమిస్తోంది. భూమిని వదులుకోనిదే బాకీలు తీరే అవకాశం లేదని తెలిసినా ఉన్న కాస్త భూమమ్మి ఖాళీగా ఉండటానికాతని మనసొప్పడంలేదు. రకరకాలుగా ఆలోచిస్తూ బండి నడిపిస్తున్నాడు. తన రాతెలా వుంటే అలా అవుతుందని తనకుతానే సమాధానం చెప్పుకుంటున్నాడు.

రాత్రి పది, పదకొండు గంటల ప్రాంతంలో ఊరు చేరుకున్నాయి బండ్లు. బండ్లను విడిచి ఎడ్లను కొట్టాల్లో కట్టేసారు. బోరాలు మోసుకెళ్లి ఇంట్లో వేశారు. చప్పుడు విని గాఢనిద్రలోవున్న నర్సమ్మ లేచింది. నడుముకు బిగించి కట్టిన ధోవతి విప్పి డబ్బు తీసి భార్య చేతికిచ్చాడు కొండమల్లయ్య.

"పెట్టెల దాయి... ప్రొద్దున వడ్డీగట్టి రావాలె" అన్నాడు.

"వడ్డీకి గాకుంటె బంగారం చేయించుమంటినా?" అని ఆ డబ్బు తీసుకొని గదిలోకెళ్లింది నర్సమ్మ.

తండ్రీ కొడుకు లిద్దరు బావి దగ్గరికి పోయి కాళ్లు, చేతులు, ముఖం కడుక్కొని వచ్చారు. భోజనం ముగించి పడుకునేసరికి అర్ధరాత్రి దాటింది.



మార్గశిర మాసం... ఎముకలు కొరికే చలి... వేసంగి పంట మొక్కజొన్న విత్తనాలేయడానికి చేను దున్నుతున్నాడు కొండమల్లయ్య. పదును తక్కువగా ఉండటంవల్ల మట్టి పెళ్లలు లేస్తున్నాయి. మట్టి పెళ్లలమధ్య నడుస్తూ దుంతుంటే చెప్పులాగడంలేదు. చెప్పుల ఉంగటాలు, గూడలు తెగిపోతున్నాయి. చెప్పు లేకుండా దున్నుతుంటే కాళ్లు చీరుకుపోయి మండుతున్నాయి. పదును పూర్తిగా ఆరిపోక ముందే దున్ని విత్తనాలేయాలని కొండమల్లయ్య ఆరాటం. మొదటి పంట తర్వాతే ఎద్దును కొనాలనుకున్నాడు. కాని, వచ్చిన డబ్బు వడ్డీలు కట్టడానికి, ఇతర ఖర్చులకే అయిపోయింది. ఆ ఎద్దుతో ఈ పంట వెళ్లదీయడం కష్టమే అయినా వేరేమార్గం లేదతనికి. ఈ ఒక్క పంట తీసిన తర్వాత వేసవిలో వ్యవసాయం మానుకోవడమో, ఏం చేయడమో నిర్ణయించుకోవాలనుకుంటున్నాడు. తిరుపతయ్య తండ్రికి వ్యవసాయం మానెయ్యమనే సలహా ఇస్తున్నాడు. ఉన్న మాగాణి భూమమ్మి బాకీలు చెల్లించి తండ్రిని రుణవిముక్తుడ్ని కమ్మంటున్నాడు. తాను కరీంనగర్‌పోయి ఏ ప్రైవేట్ స్కూల్లోనైనా చేరి నాలుగైదు వందలైనాసరే సంపాదిస్తానంటున్నాడు. లేదా సింగరేణిలో కష్టపడి ఉద్యోగం సంపాదించుకుంటా




నంటున్నాడు. ఏ విషయమైనా వేసవిలో తేల్చు కుందామని ఈ ఒక్కవంట తీయడానికి పూను కున్నాడు కొండమల్లయ్య. సంక్రాంతికి ఇంటికొచ్చినప్పుడు చివరిసారిగా రాజయ్యనడిగి డబ్బు సర్దుతాడో లేదో తెలుసుకోవాలనుకుంటున్నాడు. ఆతడిస్తాడన్న నమ్మకం లేకున్నా చివరి ప్రయత్నం చేయాలనుకున్నాడు.

ఎన్నో విషయాలాలోచిస్తూ సరిగ్గా నడువని ఎడ్లతో తంటాలు పడుతూ నాగలి దున్నుతున్నాడు కొండమల్లయ్య. అతని కాళ్లన్నీ పగిలి తెల్లగా వున్నాయి. చలికి ముఖం పగిలింది. ఓదిక్కు ఎండున్నా చలిగాలి వీస్తూనేవుంది. మనసంతా కోళ్లు కెలికిన చెత్తలా గందరగోళంగా వుంది. అతనికి భవిష్యత్తేం ఆశాజనకంగా కనబడుటంలేదు.

నాగలి నడిపిస్తూ అవతలి ఒడ్డుకు చేరుకున్నాడు కొండమల్లయ్య. ఒడ్డు దున్ని వుండటం చూసి మండిపడ్డాడు. అసలే చిరాకుగా వున్న కొండమల్లయ్యకు ఆ పని కోపం తెప్పించింది. అది తమ్ముని కొడుకు పనయివుంటుందనుకున్నాడు.

ఏ రైతూ తన భూమిలో అంగుళం ఆక్రమించుకున్నా సహించడు. ఆ పని తన రక్తం పంచుకుపుట్టిన కొడుకు చేసినా, తనతో ఒకే రక్తం పంచుకు పుట్టిన సోదరుడు చేసినా రాజీపడడు. అందుక్కారణం జీవితకాలమంతా మట్టిలో మట్టై పనిచేసే రైతుకు ఆ మట్టితోవున్న అనుబంధం... ఆ మట్టిపై వున్న ప్రేమ... భూమినాతడు తన సంతానంగా, తన ప్రాణంగా, ప్రాణంకంటె ఎక్కువగా భావిస్తాడు.

కొండమల్లయ్య నాగలాపాడు. అతని భూమి పక్క నున్న చేలోనే కొండయ్య కొడుకు నాగలి దున్నుతున్నాడు.

''ఇట్రారా...'' తమ్ముని కొడుకును పిలిచాడు... అతడు నాగలాపి దగ్గరికొచ్చి నిల్చున్నాడు.

''ఏంది?'' తల పైకెగరేస్తూ పొగరుగా అన్నాడు.

ఆ బాబు ముఖంలో ఇంకా పసిదనపు లేతదనం పోనేలేదు అప్పుడప్పుడే మీసాలొస్తున్నాయి.

దున్నిన ఒడ్డును చూపెట్టాడు కొండమల్లయ్య.

''గెట్టునెందుకు దున్నినవు..?'' అడిగాడు.

''నేను దున్నలేదు...'' నిర్లక్ష్యంగా జవాబిచ్చాడు.

''ముంజేతి కంకణానికి అద్దం గావన్నార...? ఓదిక్కు కనవడుతనేవుంటె అబద్ధమెందుకాడుతవు? ఇది మనిద్దరి నడుమున్న ఒడ్డు. మనం గాకుంటె మంది వచ్చి దున్నిపోయింద్రా? నువ్వో, నేనో దున్నాలె...'' అన్నాడు కొండమల్లయ్య.

''ఇక్కడ గెట్టు వంకరుంధి. చక్కగుండల్నని పాతిన ఖనికి నూటిగ దున్నిన... దుంతేందిమరి...?''

''అంటే మీ భూమిని మేం కలుపుకున్నమా?''

''అవు మరి... ఆ మూలకున్న ఖని జూడు...''

''ఎక్కడ్రా మేం గలుపుకుంది? ఖనికి సూటిగ చూడు. ఒడ్డు మాదిక్కు లోపలికుందా..? మీదిక్కా..?''

తానే దున్నాడు కాబట్టి పెదనాన్న ఖచ్చితంగా అడిగేసరికి అతనికేం చెప్పాలో తోచలేదు.

''నేనట్లనే దున్నుత... ఏం జేసుకుంటవో చేసుకో పో'' అని అక్కడ్నించి పోబోయాడు.

''ముద్దికి పండ్లచ్చినాయిర గాడిదికె. ఒడ్డు దున్నుతవు. మల్ల గర్రగ మాట్లాడుతవ్'' అని చేతిలో వున్న కట్టెతో కొట్టబోయాడు కొండమల్లయ్య.

భర్తకు చద్దన్నం తెచ్చిన నర్సమ్మ వాళ్ల మధ్యకొచ్చింది. ''ఆగాగు... గా పోరనితోనేంది వాళ్ల నాయిన్నతోని మాట్లాడు. మీసాల్రాని పిల్లగానితోని జవుడం పెట్టుకుంటె మందేమందురు? పెద్దమనిషిట్ల చేస్తడా అని నీదే తప్పంటరు'' అంది భర్తతో.

''వాడేమన్న చిన్నపిల్లగాని లెక్కనే మాట్లాడుతన్నడా?'' అని బాబుదిక్కురిమి చూశాడు కొండమల్లయ్య.

ఆ మాటలకే మాత్రం భయపడకుండా, విలువివ్వకుండా నిర్లక్ష్యంగా తల ఎగిరేసి

అక్కణ్ణుంచి వెళ్లిపోయి నాగలి దున్నసాగాడా బాబు.

"గాడిదికొడుక్కెంత కావురమో చూడు. చిన్నపెద్ద మర్యాదన్నదే లేకుంటయింది" అని నాగలి పట్టాడు కొండమల్లయ్యా.

నర్సమ్మ చద్దిగిన్నె ఒడ్డుపై పెట్టి వెళ్లిపోయింది.

ఒడ్లుదున్ని వైరాలు పెంచుకొని జానెడు భూమికోసం తగవులాడి తలలు పగులకొట్టుకున్న రైతుకుటుంబాలెన్నో వున్నాయి. ఏమాత్రం విలువ చేయని భూమికోసం, పట్టుదలతో తమ మాటే నెగ్గాలన్న వంతంతో పంచాయతీలు, దండుగలు కట్టినవాళ్లూ వున్నారు. ఊరిపెద్దలు రెచ్చగొడితే వంతాలకుపోయి కొద్దిగజాల నేలకోసం కూడా కోర్టులకెక్కి బికారైన భూమి పుత్రులున్నారు. కొంతసేపయిన తర్వాత కొండయ్యా వచ్చాడక్కడికి. తమ్ముణ్ని పిలిచి కొడుకు ప్రవర్తన గూర్చి చెప్పాడు కొండమల్లయ్యా. కొండయ్యకు తన కొడుకు పొగరుబోతని తెలును. అందరితో పేచీలు తీసుకొచ్చే పనులు చేస్తాడనీ తెలును.

"అన్నా... ఈ పోరనితోనేంది తియ్యలేవె. వాడు రంకుల (గడుచు) పోరడే. అంతట ఇట్లనే చేస్తడు. చేనంత దున్ని వండిచ్చి ముల్లెలు గట్టినం. ఒడ్లు దున్ని వంట వండిచ్చి నంపాయిస్తం తియ్యిగ" అని ఒడ్డు దున్నినచోట మట్టిపెళ్లలతో హద్దుగా పెట్టాడు కొండయ్యా.

కొడుకు దగ్గరికెళ్లాడు.

"పెద్ద నాయన్నతోనే నటర నువ్వు కొట్లాట పెట్టుకునేది? నీ కెప్పుడురా బుద్ధచ్చేది?" అని మందలించాడు.

"నేనేమన్న నా మీదికే కొట్టకొట్ట రావట్టె" అన్నాడా బాబు.

"నరెతియ్యి... పెద్దమనిషో మాటంటె పడితె తప్పా? మాటకు మాటెందుకనాలె?" కొడుకును తిట్టి చద్దన్నంగిన్నె ఇచ్చి వెళ్లిపోయాడు కొండయ్యా.

అన్నంతిని సాయంత్రంవరకు నాగలి దున్నాడు కొండమల్లయ్యా. నాగలి విడిచి చెలుకలో ఎడ్లను మేపుతున్నాడు. చలి విపరీతంగా వుంది. వగిలివున్న కాళ్లు మండుతున్నాయి. 'ఇంటికి పోయింతర్వాత కాళ్లకు నూనె రానుకోవాలి' అనుకున్నాడు. రాత్రివరకు ఎడ్లను మేపాడు. అవి కడుపునిండా గడ్డి మేసాయన్న తృప్తి కల్గింతర్వాత వాట్ని తోలుకొని ఊళ్లోకొచ్చాడు. కొట్టంలో కట్టేసి ఇంటికెళ్లాడు.

కొద్దిరోజుల్లో చేను దున్నడం పూర్తయింది. మొక్కజొన్న విత్తనాలేసి కాలువనీళ్లు ఓ తడి గట్టాడు.

తర్వాత పొలం దున్నడం ప్రారంభించాడు. ఎడ్ల కాళ్లకు పుండ్లయ్యాయి. అవి మునిగాళ్ల మీద నడుస్తున్నాయి.

'ఎడ్లకు గాలయింది. కొద్దిరోజులు పనిలేకుంటె మంచిగుండేది.' తనలోతానే అనుకున్నాడు కొండమల్లయ్యా.

కాని, ఆ నమయం విశ్రాంతి దొరికే నమయం కాదు. నాగలి దున్నుతూ నడవని ఎడ్లను ముల్లుగర్రతో పొడుస్తున్నాడు కొండమల్లయ్యా. అయినా అవి మాటిమాటి కాగిపోతున్నాయి. ప్రక్కపొలంలో దున్నుతున్న రాజమల్లు "ఏం వటేల ఎడ్లు నడుస్తలెవ్వా?" అన్నాడు.

"నడుస్తలెవ్వాయ్. వీటిని నక్కల్దిన. అందరి పొలాలు దున్నడం అయిపోతున్నది. ఇవ్వేమొ నన్ను తిప్పలు పెడుతున్నయి"

"వలువటెద్దు పూర్తిగ మునల్దయినట్టుంది. ఎన్ని 'దుక్కు'లుంది?"

"ఎన్ని దుక్కులేడిది? పన్నెండు దుక్కులుండవచ్చు. ఆరేండ్లకింద గర్రెవల్లి అంగట్ల కొన్న దీన్ని. అప్పటికే ఆరు దుక్కుల్దని చెప్పిండు, అమ్మెటయినె. కొనెటప్పుడు కొమ్ములను జూస్తె అంతేననిపించింది" అన్నాడు కొండమల్లయ్యా.

ఎడ్లనదిలించాడు. అవి ఆయాసపడుతూ కాళ్లు లేవుతూ వేస్తున్నాయి.

"ఎడ్లకు బాగా గాలయింది. వాట్ని పొడిచి చంపకు. ఎంత పొడిచినా నడవవు అవి" అన్నాడు రాజమల్లు.

"మరి పొలమెట్ల పొతంగావాలె? నీకేంది తీరిపొరిగున్నవు. అట్లనే అంటవు" అన్నాడు




కొండమల్లయ.

"కిరాయపెట్టి దున్నియ్యి. వాట్ని కోసినా నడువయవ్వి"

"నువ్వెన్నైయిన చెప్పుతవు. అటు గొర్లు, ఇటు వ్యవసాయం ఓటిగాకుంటె ఓటి ఆదు కుంటున్నయి. నాకు ఇదొక్కటేనాయె" అని నాగలి నడిపిస్తున్నాడు కొండమల్లయ్య. రాజ మల్లు ఏం మాట్లాడలేదు. ఎడమచేత్తో పొలె పట్టుకొని ఎడ్ల నదిలించాడు కొండమల్లయ్య; తిప్పలు పడుతూ దున్నుతున్నాడు.

కొంత ఆలస్యమైనా పొలం దున్నడం పూర్తి చేశాడు. చివరిదశలో ఎడ్లు నడవవని మొరా యిస్తే బాడుగకు దున్నించాడు. గొర్రె ఎరువు, పందుల ఎరువు అసహ్యించుకోకుండా వెన్నలా దున్నబడిన పొలంలో చల్లాడు. పొట్టి బందర్ వడ్ల వరి నాటేపిస్తున్నాడు పొలంలో. మూడు రోజుల్లో ముగుస్తుందనుకున్న నాటు పని నాల్గురోజులు పట్టింది.

'మాగికాలం (చలికాలం) కూలి మరువక చెయ్యాలంటారు. చలికాలం దినం తక్కు వుంటుంది. రాత్రెక్కువుంటుంది. పనిలోకి పోయేనరికే ఉదయం పదకొండు గంటలవు తుంది. నాలుగయ్యేనరికి పొద్దు వంగి ఎండ తగ్గుతుంది. ఇక పోతామంటారు కూలివాళ్లు. అయిదుగంటలకే పొద్దుగూట్లో పడుతుంది. పనెక్కువ కాదు' తనలోతాను గొణుక్కున్నాడు కొండమల్లయ్య.

మరికొద్దిరోజులు గడిచాయి.

భోజనంచేసి చుట్టతాగుతూ నులక మంచంలో కూర్చున్నాడు కొండమల్లయ్య. తిరుపతయ్య వచ్చి తండ్రి ప్రక్కనే కూర్చున్నా డు.

"బాపూ... ఓ బాపూ!" పిలిచాడు తిరుపత య్య.

కొడుకు దిక్కు తిరిగి- "ఏంది?" అన్నాడు కొండమల్లయ్య.

"నాన్నా... నువ్విలా ఒక్కడివి కష్టపడు తుంటే చూస్తూ ఖాళీగా కూర్చోవడం నాకు సిగ్గుగా వుంది. ఉద్యోగం.కోసం తిరిగి తిరిగి నా కాళ్లరుగుతున్నాయి. ఈ చదువుతో నాకు ఉద్యోగం దొరకడం కష్టమే. రోజురోజుకూ మన ఇంటి పరిస్థితి దిగజారుతోంది. అన్న ఇంటి గుర్చి పట్టించుకోడని తేలిపోయింది. ప్రైవేటు స్కూల్లో పనిచేద్దామన్నా ఆ పనీ దొరకడంలే దు. కష్టపడి సంపాదించుకున్నా వాళ్లిచ్చే నాలుగువందల రూపాయలు ఏ మూలకు సరిపోతాయి? అందుకోసం నాకొక్కటే మార్గం కనబడ్తుంది. నేను చెప్పేదర్థం చేసుకో..." అన్నాడు తిరుపతయ్య.

"ఏం చెప్పుతవో చెప్పు?"

"నేనూ అన్నలాగే బావిపనికి పోవడమొ క్కటే మిగిలింది. ఏదైనా ఉద్యోగమొస్తే ఆ పని వదిలిపెట్టొచ్చు"

తిరుపతయ్య చెప్పిన మాటలన్నీ వాస్తవాల నిపించినా చదువుకున్న కొడుకు బావిపనికి పోతాననడం కొండమల్లయ్యకు నచ్చడంలేదు.

"పాడిందే పాడురా పాచిపండ్ల దాసరని అదే పాటెందుకు పాడుతావు? మీ అన్న బావిప నికిపోయి సంపాదించింది సాలదా? నువ్వు పొయ్యేం సంపాయిస్తవు?"

"బాపూ... అందరు అన్నలాగే చేస్తారనుకో వడం తప్పు. అయినా అన్న అన్నదాంట్లో తప్పేముంది? ప్రాణాన్ని పణంగాపెట్టి పనిచే స్తూన్న అన్న తన కష్టార్జితాన్ని తానే అనుభ వించాలనుకున్నాడు. వ్యవసాయం చేస్తున్న వాళ్లు మాత్రమలా చేయడం లేదా? ఎంత మందిని చూపాలి నీకు? ఏపని చేసినా మను మలను బట్టి వుంటుంది. కాని పనినిబట్టి కాదు" అన్నాడు తిరుపతయ్య.

"మరి అవ్వయ్యలు చిప్పలు పట్టుకొని పోవ న్నా? ఎదిగిన కొడుకులు ఎవ్వల సంగతాళ్లు చూసుకుంటె ముసలోల్ల గతేం కావాలె?"

"వ్యవసాయం బందుచేసి బాకీలనీ తీర్చేస్తే అన్న మీ ఖర్చులకోసం నెలకొంత డబ్బు పంపిస్తాననాడుకద బాపూ! అయినా మీ కోసం అన్న డబ్బు పంపాల్సిన పనిలేదు. మీరు నాతోనే వుంటారు"

"ఉన్న భూమమ్మి, ఎడ్లు, ఎవుసం విడిచిపె ట్టి నీతోని వచ్చి కూచుండి తినన్నా? ఈగలు గొట్టుకుంట కూసోవన్నా? మీ మోచేతికింది నీళ్లు తాగన్నా?



"కొడుకు ఇంట్లో వుండటం మోచేతికింది నీళ్లు తాగినట్టవుతుందా నాన్నా? మనమిలా మీనమేషాలు లెక్కబెడుతూ కూర్చుంటే మరింత కష్టమవుతుంది. ఇప్పుడైతే ఇల్లు, అరెకరమో, ఎకరమో భూమి దక్కవచ్చు. ఇంకో రెండు మూడేండ్లు గడిస్తే ఉండడానికి ఇల్లు కూడా మిగులదు. నా మాటవిని నేను చెప్పినట్టు చెయ్యి"

కొడుకు మాటల్లో కఠోర వాస్తవికతున్నా భూమిని వదిలి, చిన్నప్పట్నుంచీ చేస్తున్న వృత్తిని వదిలి, పుట్టిపెరిగిన ఊరును వదిలి, ఆ మట్టితోవున్న అనుబంధాన్ని వదిలి కొడుకుతో కాలరీ ఏరియాకు పోవడానికి, తింటూ ఖాళీగా కూర్చోవడానికి కొండమల్లయ్యకు మనసొప్ప డంలేదు.

"నేనీ మట్టిల్నే పుట్టిన.. ఈ మట్టిల్నే పెరిగిన. ఈ మట్టిల్నే మన్నయి పోత" అన్నాడు కొండమల్లయ్య రోషంగా.

"బాపూ! నీకు నాతోని రావడం ఇష్టం లేకుంటే ఇక్కడే వుండు. నేనొద్దనడంలేదు. కాని వ్యవసాయాన్ని మానెయ్యి. భూమమ్మి అప్పులు తీర్చేద్దాం. తిండికెలాగో వెళ్లదీసుకోవచ్చు"

"ఎటుపెట్టి భూమినమ్మాలంటవు. అంతే కద నువ్వు చెప్పేది?" కోపంగా అన్నాడు కొండమల్లయ్య.

"నన్నర్థంచేసుకో బాపూ! భూమ్మీద ప్రేముండని రైతు ఉండడనేది నిజం. ఏ రైతైనా భూమిని ప్రాణం కంటె ఎక్కువగానే చూసుకుంటాడు. మొదట్నుంచీ తన బ్రతుకుతో పెనవేసుకొనున్న భూమితో సంబంధాన్ని తెంచుకోవడం రైతుకు కష్టమే. కాని బ్రతుకే దుర్భరమై, వెళ్లని పరిస్థితి వచ్చినప్పుడు భూమిని అమ్మక ఎవరు మాత్రమేం చేస్తారు?"

"నువ్వు నాకు చెప్పవల్సిందేంలేదు. భూమి సంగతి తర్వాతకని నువ్వు బాయిపని మాటెత్తకు. పనికిపోక ముందు అన్నెట్లుండె? ఇపుడెట్లయిండు? అన్ననేమన్న చూడచ్చెటట్టున్నడా? బాయిపనికి పోయిన చాలామంది ఏనుగోలె న్నోల్లు పీనుగోలె ఐతండ్రు"

"నాన్నా! నాకు చదువుంది. ముందు తట్ట మోసుడైనా సరే పనయితె దొరకనీయి. అటు తర్వాత ఏదన్న సులభమైన పని సంపాదించుకుంట. ముందు నన్ను పనికి పోనియ్యి. నాకింత కంటె మంచి మార్గం కనబడటంలేదు" అన్నాడు తిరుపతయ్య.

"నిన్ను పైసలు సంపాయించుమని ఎవ్వలు బలవంతం చేస్తండ్రు? మా కండ్ల ముందటుంటె చాలు, ఆ పనికద్దు"

"బాపూ! ఎన్నిసార్లు చెప్పినా నువ్వదే మాటంటవు... మీముందుండక ఎటుపోతన్న నేను.... మీరిద్దరు నాతోనే వుంటారు. సరే... వ్యవసాయం చేస్తూ ఉందామన్నా అప్పులు పోగా భూమెంత మిగుల్తుంది? నన్నర్థం చేసుకో. ఇంకా కాలం గడుపుతే కష్టమవుతుంది. చేతికి చిప్పలు తప్పవు" కోపంగా అన్నాడు తిరుపతయ్య.

తన పైకి ఎప్పుడూ కోపానికిరాని తిరుపతయ్య కోపాని కొచ్చేసరికి కొండమల్లయ్యకేం మాట్లాడాలో తోచలేదు. తాను పట్టుదలగా వుందామన్నా కొడుకువాదం అన్నివిధాలా సరియైందిగానే తోస్తుందతనికి. మౌనంగావున్న తండ్రితో-

"నాన్నా! భూమమ్మి అప్పులు తీర్చేద్దాం. నువ్వు వద్దన్నా నేను సింగరేణికి పోక తప్పదు. ఇప్పటికే అక్కడ తట్టమోసే పనైనా దొరకడం కష్టమవుతోంది. ఇంకొద్ది రోజులైతే అదీ దొరకదు" అన్నాడు తిరుపతయ్య.

"సరే... సంకురాత్రి పండుగకు రాజయ్యొస్తడు. వానితోని ఓసారి మాట్లాడి ఏం చేసుడో ఆలోచించుదాం"

"మళ్లీ అదేమాట" కోపంగా అని ముఖం మాడ్చుకొని లేచి ఊళ్లోకి వెళ్లిపోయాడు తిరుపతయ్య.

★ ★ ★

సంక్రాంతి పండుగ దినాలు. తెలంగాణాలో సంక్రాంతి పండుగకు చకినాలు చేసుకోవడం ప్రత్యేకత. అందులో కరీంనగర్‌జిల్లా చకినాలకు చాలా ప్రసిద్ధి. ఆర్థికంగా ఉన్నవాళ్లూ, లేనివాళ్లూ పండుగకు నాలుగైదు రోజులు ముందునుంచే చకినాలు చేయడం మొదలు పెడుతారు. విపరీతంగా చలివుండే రోజలయినా తెల్లవారు జామున చకినాల పిండి




దంచే లయబద్ధమైన రోకండ్ల ధ్వని పండుగ ముందు దినాల్లో ప్రతి గ్రామంలోనూ వినబడు తుంది.

ఇంట్లో ఎవరైనా చనిపోతే ఏడాది వరకు పండుగలు, శుభకార్యాలు జరుపుకోరు. కొండ మల్లయ్య తల్లి చనిపోవడంవల్ల ఆ సంవత్సరం వాళ్లకు పండుగ లేదు. పండుగ లేకున్నా పిల్లలు మంది ముఖం చూడటమెందు కని చకినాలు, అరిసెలు చేసింది నర్సమ్మ. పండుగ దినాల్లో గర్భవతియైన కూతుర్ని అత్త వారింట్లో ఉంచడమెందుకని తీసుకొచ్చాడు కొండమల్లయ్య. పండుగ నాలుగు రోజులుండ నగానే వచ్చాడు రాజయ్య. రెండు రోజులున్నాడు. పండుగకుండమంటే పండుగే లేనప్పు డెందుకుండాలని విన్లేదు. పోగా పండుగ రోజు పనిచేస్తే త్రిబుల్ మస్టర్ (మూడు రోజుల జీతం) పడుతుందని వెళ్లిపోయాడు. కొండమల్లయ్య ఇంటి పరిస్థితిగుర్చి చెప్పాడు. పెరుగుతున్న అప్పుల గుర్చి చెప్పాడు. కాని రాజయ్య తనకేం బాధ్యత లేనట్టుగా మాట్లాడాడు. ఉన్న భూమమ్మి బాకీ కట్టమన్నాడు. తల్లిదండ్రుల్ని తానొకర్ని తమ్ముడొకర్ని పోషిస్తానన్నాడు. దిగజారుతున్న కొడుకు ఆరోగ్యాన్ని చూసిన, మాటలు విన్న కొండమల్లయ్య డబ్బుగుర్చి ఇక బలవంతం చేయకూడదనుకున్నాడు. వెళ్లిపోతున్న కొడుకుతో అన్నాడు-

"సరె బిడ్డ... మా తిప్పలేవొ మేం పడతం. నీ ఆరోగ్యం మంచిగ కాపాడుకో. అట్లున్న మనిషి కోడలు... దాన్ని మంచిగ చూసుకో మాకేమియ్యకున్నా మంచిదే మీరైతే మంచిగ బ్రతుకుండ్రి. కొన్ని పైసలు వెనుకేసుకొని భూమి కొనుక్కో నెలకోసారన్న ఇంటికచ్చిపో"

కొడుక్కు ఎన్నో జాగ్రత్తలు చెప్పాడు కొండ మల్లయ్య. అన్నిటికీ తలూపుతూ బస్సెక్కాడు రాజయ్య. కొడుకుపై పెట్టుకున్న చివరి ఆశ కూడా అడియాసయింది.

సంక్రాంతి ముందురోజు భోగి పండుగ. అది రైతులకు పెద్ద పండుగ. దాన్ని పశువుల పండుగగా లెక్కిస్తారు. సంవత్సరమంతా తమ కెన్నో పండుగలుంటే, తమకు జీవనాధారమైన పశువులకు అదొక్కటే పండుగని రైతులా పండుగను ఎంతో సంబరంగా చేసుకుంటారు. ఆరోజు పశువులన్నిటినీ శుభ్రంగా కడిగి కొమ్ములకు జాజు పూస్తారు. రంగులు పూస్తారు. అరచేతిని రంగుల్లో ముంచి వాటి శరీరాలపై ముద్రలు పడేట్టు చరుస్తారు.సాధారణంగా ఆరోజు మరీ తప్పని పరిస్థితి అయితే తప్ప నాగళ్లు కట్టరు. ఎడ్లకు విశ్రాంతినిస్తారు. సాయంత్రం పశువులన్నిట్నీ ఊరవతలికి తోలుకెళ్తారు. రెండు కట్టెలు దూరంగా పాతి, వాటిని కలుపుతూ తోరణం కడతారు. పశువుల న్నిట్నీ ఆ తోరణం బయట జమకూడేట్టు చేస్తారు. ఓ ఇత్తడి పాత్రలో అక్కడనే 'పాశెం' (బెల్లవన్నం) వండుతారు. అందులోంచి కొంత తీసి ఆకుల్లో నైవేద్యం పెడతారు. తర్వాత ఒకరు పశువుల చుట్టూ చొక్కాలే కుండా పరుగిడుతుంటాడు. మరోవ్యక్తి పాశెమున్న ఇత్తడి పాత్రను చేతిలో పట్టుకొని అతని వెంట పరుగిడుతాడు. పాత్రలోని అన్నం చేత్తో తీస్తూ ముందు పరుగిడుతున్న వ్యక్తి వీపులో పడేట్టు విసురుతాడు. ముందు పరుగిడుతున్న వ్యక్తి వీపులో పడ్డ అన్నంలో చేతికందినదాన్ని తింటూ పరుగిడుతాడు. అలా పశువుల చుట్టూ మూడుసార్లు తిరుగుతారు. మిగిలిన అన్నాన్ని ఆ ఇద్దరు అక్కడే తింటారు. అటు తర్వాత పశువులను తోరణం క్రిందినుంచి బయటకు పరుగెత్తిస్తారు. వాట్ని తరుముతూ, కేకలు వేసుకుంటూ ఊళ్లోకొస్తారు. అలా చేయడంవల్ల పశువులపైకి ఏ దుష్టశక్తీరాదని, బాగా వుంటాయని రైతుల నమ్మకం. ఆ పండుగనే కాటిరేవుల పండుగని కూడా పిలుస్తారు.

అది పచ్చిగడ్డి విరివిగా లభించే కాలమే అయినా ఎడతెరపి లేకుండా పనులుండే కాలమవటంవల్ల ఎడ్లకు గాలయింది. అవి వెలసిపోయున్నాయి. తమ కుటుంబానికా ఏడు పండుగ లేకపోవడంవల్ల కొండమల్లయ్య ఎడ్లను కొట్టంలోనే వుంచాడు. తానొక్కడే కాటిరేవులు చేసే చోటికి వెళ్లి వచ్చాడు. ఎడ్లకు మేతేసి అన్నం తిని పడుకున్నాడు.

తెల్లవారింది. ఆరోజే సంక్రాంతి పండుగ... వారంరోజుల్నుంచి వాకిళ్లనిండా రకరకాల ముగ్గులుంటున్నాయి. పండుగరోజు ఆవుపేడతో చేసిన గొబ్బెమ్మలు, వాటిపక్కన నవధాన్యాలు, కాలు పెట్టడానికి సందులేకుండా వాకిళ్లలో

మంచం వాల్చుకొని కూర్చున్నాడు కొండమల్ల య్య.

అతనిముఖంలో పండుగ సంబరంలేదు. కళ్లముందు తీర్చాల్సిన అప్పులు కదులుతు న్నాయి. తాను రాలిపోయేంతవరకైనా ఉన్న భూమిని దక్కించుకునే మార్గమాతనికి కనబ డటంలేదు. అప్పులు తీర్చాలంటే భూమమ్మక తప్పేట్టు లేదు. భూమినే నమ్ముకొని బ్రతుకు తున్న ఆ రైతు బిడ్డకు భూమి లేకుండా ఉండటమనే ఆలోచనే బాధాకరంగా వుంది. వ్యవసాయం మానేయడం అనే విషయం వేద నగా వుంది.

ముగ్గులున్నాయి. పండుగముందు దినాల్లో ప్రతి ఊళ్లోనూ జానపద బిచ్చగాళ్లు తిరగడం మామూలు. గంగిరెద్దులవాళ్లు సన్నాయి ఊదు తూ ఎడ్లనాడిస్తూ తిరుగుతున్నారు. అంబప లుకు, జగదంబ పలుకవే అని బుడబుక్కల వాళ్లు తిరుగుతున్నారు. తలపై ఇత్తడి చెంబుతో, చిరుతలు వాయిస్తూ ఉరుకుల య్యోర్లు బియ్యం అడుక్కుంటూ తిరుగుతు న్నారు.

వాకిలూడ్చి అలుకు చల్లింది నర్సమ్మ. పండుగలేనందువల్ల వాకిట్లో పండుగ ముగ్గు లు వేసి, గొబ్బెమ్మలు పెట్టలేదు. వాకిట్లో



శూన్యంలోకి చూస్తూ ఆలోచిస్తోన్న కొండమల్లయ్య 'టింగ్... టింగ్' అంటూ బుర్ర ఊపుకుంటూ వచ్చిన బుడబుక్కలవాని చప్పుడు విని బజార్లోకి చూశాడు. వాడేదో పాట పాడుతూ వచ్చి వాకిట్లో నిల్చున్నాడు. "అంబ పలుకు జగదంబ పలుకవే" అని పాడుతూ లయబద్ధంగా బుర్రనూపుతున్నాడు. అరుగుమీదున్న కాంతమ్మను చూశాడు...

"అవ్వది లక్ష్మిగల మొకం... అంబ పలుకవే... అవ్వ కడుపుల రాజులాంటి కొడుకు పుడుతడు... జగదంబ పలుకవే... వంశానికి పేరు తెస్తడు..." అని పుట్టబోయే శిశువు గురించి ఏమేమో చెబుతున్నాడు.

విషాదంగా వున్న కొండమల్లయ్య ముఖం ఆ మాటలతో వెలిగింది. "కాంతవ్వా... రెండ ప్పాలు తెచ్చెయ్యి" అన్నాడు.

కాంతమ్మ ఇంట్లోకెళ్లి రెండు చకినాలు తీసుకొచ్చి బుడబుక్కలవాని జోలెలో వేసింది.

"చల్లగా బతుకు తల్లీ... మారాజులాంటి కొడుకును కను... మెల్లగా నడువు తల్లీ... అట్లున్న మనిషివి... నీ కడుపు చల్లగుండ" అని దీవించి 'అంబ పలుకు జగదంబ పలుకవే' అనుకుంటూ వెళ్లిపోయాడు. కొండమల్లయ్య లేచి ఊళ్లోకెళ్లాడు. మచ్చయ్య కోసి భాగాలు చేసిన గొర్రెమాంసంలోంచి నగం పోగు తెచ్చాడు. అన్నగౌడుకి చెప్పి కల్లు తెప్పించాడు.

సంక్రాంతి పండుగరోజు మామూలుగానే గడిచిపోయింది. మరో రెండురోజులు గడిచాయి. కొట్టంలో ఎడ్లను కట్టేసి ఇంటికొచ్చాడు. రాత్రయింది. చలి విపరీతంగా వుంది. చెవుల చుట్టూ వచ్చేట్టు రుమాలు చుట్టుకున్నాడు. అన్నం తిన్నాడు. అతనికేం తోచడంలేదు. ఈ ఒక్కవంటే తాను తినే చివరి వంటన్న ఆలోచన వస్తే అతని మనసెక్కడెక్కడో తిరుగుతోంది. చావడిదగ్గర వీధిభాగవతులాడుతున్నారని విన్నాడు. గొంగడి మునుగేసుకొని అక్కడికెళ్లాడు. చావడి గోడనానుకొని కూర్చున్నాడు.

కొండమల్లయ్య భారతమంటే చెవికోసుకుంటాడు. భాగవతులు ప్రదర్శిస్తున్న నాటకం కర్ణ... ఆట మొదలైంది. కర్ణ పాత్రధారి తన పాత్రలో లీనమై నటిస్తున్నాడు. మిగతా నటులంతా తమ పాత్రలకు న్యాయం చేకూరుస్తున్నారు. కర్ణుడికి కలిగిన శాపాలు, అడుగడుగునా అడ్డంకులు, అవమానాలు చూస్తున్న కొండమల్లయ్యకు కళ్లలో నీళ్లూరుతున్నాయి. తుదకు నిరాయుధుడైన కర్ణున్ని అర్జునునిచే చంపించాడు శ్రీకృష్ణుడు. నిరాయుధున్ని చంపినందుకు విచారిస్తున్నాడు అర్జునుడు. అర్జునుడి మాటలు విని గంభీరంగా నవ్వాడు శ్రీకృష్ణ పాత్రధారి. నువ్వే అమాయకుడివన్నట్టు పసివాన్ని చూసినట్టుతన్ని చూశాడు.

"అర్జునా... కర్ణుని నువ్వు చంపానను కుంటున్నావు. కాని, నువ్వాతన్ని చంపిందే ముంది? కర్ణుడెప్పుడో చంపబడ్డాడు. అటు భూదేవి శాపం, గురువైన పరశురాముడి ఘోర శాపం, కపటోపాయం పన్ని ఇంద్రుడు కవచ కుండలాలు తీసుకెళ్లడం, తల్లి కుంతికిచ్చిన మాట, సారథిగా వుంటూనే కించపరుస్తూ, నిరుత్సాహపరుస్తూ శల్యుడు చేసిన శల్యసారథ్యం... ఇవన్నీ కర్ణుడినెప్పుడో చంపేశాయి. నువ్వు చంపింది కర్ణుడి శవాన్ని మాత్రమే... నువ్వొక్కడివే అతన్ని చంపాననుకోవడం నీ భ్రమ..." కర్ణుడి చావుకు గల కారణాల గూర్చి చెబుతున్నాడు శ్రీకృష్ణ పాత్రధారి.

కర్ణుడి చావుకు, తనలాంటి రైతుల పతనానికి చాలా పోలికలున్నట్టనిపించింది కొండమల్లయ్యకు. ప్రైవేటు అప్పులు, ప్రభుత్వ అప్పులు, ప్రకృతి వైపరీత్యాలు, ధరల గడబిడ, కూలి రేట్లు, వ్యవసాయ ఖర్చులు, మధ్యదళార్లు... ఇంకా... ఇంకా ఎన్నో విషయాలు రైతు దుస్థితికి కారణాలవుతున్నాయనుకున్నాడు కొండమల్లయ్య. కర్ణుడు దానకర్ణుడే... మరి రైతు..? ఇంటికొచ్చిన అతిథిని సంతృప్తిపరచడానికి అప్పుచేయడానికేమాత్రం వెనుదీయడు. జీవితం నేర్పిన పాఠాలతో రైతు దుస్థితికి గల కారణాలను అవగాహన చేసుకుంటున్నాడు కొండమల్లయ్య.

కర్ణుడి చావుతో తనలాంటి రైతుల స్థితిని పోల్చుకున్న కొండమల్లయ్య కళ్లవెంట పటపట నీళ్లుకారాయి. గతజీవితమంతా కళ్ల ముందు కదిలింది. హృదయం భారమ

యింది. లేచి నిల్చున్నాడు. కళ్లవెంట కారుతున్న నీటిని రుమాలుతో తుడుచుకున్నాడు. ఇంటిదిక్కు నడుస్తున్నాడు.

అర్ధరాత్రి దాటింది... చీకటి చిక్కపరుచుకొనున్న కాళరాత్రి... కుక్కలు భౌభౌమని భయంకరంగా అరుస్తున్నాయి. మధ్యమధ్యన ఏడుస్తున్నాయి. శోకాలు తీస్తున్నాయి. గుడ్లగూబలరుస్తున్నాయి. ఊరంతా నిశ్శబ్దంగా నిద్రబోతోంది. చావడిదగ్గరమాత్రం సందడిగా వుంది. కొద్దిసేపట్లో నాటకం ముగియబోతోంది...

ఇల్లు చేరుకున్నాడు కొండమల్లయ్య. కాళ్లు కడుక్కున్నాడు. అరుగెక్కబోతున్నాడు. జీపు చప్పుడు విని అలాగే నిల్చున్నాడు. బజార్లో జీపాగింది. ఆ ధ్వనికి నర్సమ్మ, తిరుపతయ్య, కాంతమ్మ అంతా నిద్రలేచారు. జీపులోంచి లక్ష్మి ఏడుపు వినబడుతోంది. కొండమల్లయ్య మనసు కీడును శంకించింది. అందరూ ఆశ్చర్యపోయి చూస్తుండగానే గోదావరిఖనిలో పనిచేసే అంజయ్య, లచ్చయ్య, మరిద్దరు గనికార్మికులు జీపులోంచి దిగారు.

"నా అయ్యో... నన్నిడిసిపోతివా అయ్యా! నీ కష్టుడే నూరేండ్లు నిండినయా అయ్యా!" ఏడుస్తూ కొట్టుకుంటున్న లక్ష్మిని జీపులోంచి దింపారు వాళ్లు. అంజయ్య, లచ్చయ్య కలిసి రాజయ్య శవాన్ని కిందికి దింపారు. కొడుకు శవాన్ని చూసిన నర్సమ్మ శవంపైబడి మొత్తుకుంటోంది. కాంతమ్మ కంటికో కడివెడేడుస్తోంది. కొండమల్లయ్య, తిరుపతయ్య భోరు భోరున దుఃఖిస్తున్నారు. నిశ్శబ్దంగా వున్న రాత్రి ఏడ్పులతో, పెడబొబ్బలతో విషాదంగా మారింది.

"కొడుకో... కొడుకా! ఎంతపనాయెరా కొడుకా! నన్నిడిసిపోతివా కొడుకా?" మొత్తుకుంటోంది నర్సమ్మ.

అన్న శవంపైబడి రోదిస్తోన్న కాంతమ్మనాపడానికి ఎవరితరం కావడంలేదు. వల్లిస్తూ, కాళ్లు, చేతులు, తల నేలకేసి కొట్టుకుంటూ ఏడుస్తున్న లక్ష్మి దుఃఖదేవతలా వుంది. రాజయ్య ముఖాన్ని చేతుల్లోకి తీసుకొని ఏడుస్తున్న కొండమల్లయ్య, అన్నకాళ్లదగ్గర కూర్చొని రోదిస్తున్న తిరుపతయ్య మూర్తీభవించిన శోకాల్లా వున్నారు.

ప్రశాంతంగా నిద్రపోతున్న వాడ మేల్కొంది. ఒకరినుంచొకరికి ఊరంతా ఆ వార్త పాకింది. అర్ధరాత్రే ఊరంతా నిద్రలేచింది. భాగవతం చూసి ఇండ్లకు వెళ్లేవాళ్లంతా కొండమల్లయ్య ఇంటిముందాగారు. ఇంటివాళ్లంతా రాత్రంతా ఏడుస్తూనే వున్నారు. ఏడ్చి, ఏడ్చి లక్ష్మి, కాంతమ్మ, నర్సమ్మ నేలవాలిపోయారు.

"పొద్దున డ్యూటీకి పోయిండు రాజయ్య. డ్యూటికెక్కి గంట కూడ కాలేదు. తట్టమోస్తుండంగ రూఫ్ కూలి పెళ్ల మీదపడ్డది. దవాఖానకు తీసుకపోయేటప్పుడు దార్లోనే చనిపోయిండు" రాజయ్య మరణం గూర్చి చెప్పాడు అంజయ్య ఉదయం.

"ఊళ్లో బతుకుదెరువు లేదనిపోతె ఎంత కర్మమాయె? ఎంత మంచోడుండె రాజన్న? నడుమంత్రాన్నే చచ్చిపాయె... భార్య నీళ్లుపోసుకుంది. కొడుకునో, బిడ్డనో కండ్లజూసుకోకపాయె"

"ఆ పోరిగతేం కావాలిప్పుడు?"

"వాళ్ల నాయిన బాయిపని వద్దని మా చెప్పిండు. విన్లేదు రాజన్న. పట్టుబట్టి పోయిండు. కొడుకు గతిట్లాయె"

"పనిపాడుగాను... నల్లమొకపోడు... కుండలగలది తినుకుంట ఉండక ఊర్నిడిసిపోయి చనిపాయె"

"బాయి పనికి పోయినోల్లందరికి అట్లనే ఐతందా..? ఆయుమ కూడిన తర్వాత ఎవ్వలాగరు!"

"ఎట్లయిన రాజయ్య భార్యకచ్చింది కష్టం"

"దాని బలవంతంమీదనే పనికి పోయిండు"

"ఎట్లేడుస్తంది చూడు నర్సవ్వ...? నర్సవ్వ కడుపుకోతెట్ల దీరాలె? ఓ కొడుకేమొ అన్నలల్ల కలిసి చచ్చిపాయె. ఈ కొడుకేమొ ఇట్ల జచ్చె"

రాజయ్య శవందగ్గరికొచ్చినవాళ్లు అతని మరణాన్ని గూర్చి రకరకాలుగా మాట్లాడుకుంటున్నారు. ఆ కుటుంబంపై సానుభూతి చూపుతున్నారు. శవంపైబడి ఏడుస్తున్నవాళ్ల




నోదార్చడానికి ప్రయత్నిస్తున్నారు.

"పండుగకుండమంటె ఉండకపోతివి కొడుకా..? నా పానమసొంటి కొడుకవు కొడుకా... నేను తినకపోతె తినకపోదువు కొడుకా! నిన్ను ఎక్కడని చూడాల్రా కొడుకా! కనబడని దేశం పోతివా కొడుకా! దేశంగాని దేశం పోతివా కొడుకా" రాజయ్యా గుణగణాలగూర్చి వల్లిస్తూ కాళ్లు చేతులు నేలకేసి కొట్టుకుంటూ రోదిస్తోంది నర్సమ్మ.

"నేనే నిన్ను చంపినయ్యా! ఊళ్లో ఉండెటోన్నుండనియ్యలేదయ్యా! బలవంతంచేసి తీసుకపోతినయ్యా!" - తన భర్త చావుకు తానే కారణమని తనను తానే నిందించుకుంటూ చేతుల్తో తలకొట్టుకుంటూ, తలను నేలకేసి కొట్టుకుంటూ ఏడుస్తోంది లక్ష్మి.

కొండమల్లయ్య, తిరుపతయ్య కన్నీరింకిపోయేంతవరకు దుఃఖిస్తూనే వున్నారు.

ఆ ఇల్లే ఓ శోకగృహమయింది. లక్ష్మి తల్లింద్రులు, ఇతర బంధువులు, అయినవాళ్లంతా మధ్యాహ్నంవరకొచ్చారు. పుట్టిపెరిగిన నేలను వదిలిపెట్టి బ్రతకడానికెళ్లిన రాజయ్య చివరకు తనకు చిరపరిచితమైన మట్టిలోనే కలిసిపోయాడు.

భర్తచితిలో దూకడానికెళ్తున్న లక్ష్మినాపడం చాలా కష్టమైంది.

"నావి పాపపు చేతులు. నా బతుకే పాపపు బతుకు. తలకొరివి పెట్టించుకోవాల్సిన కొడుకులకు నా చెయ్యితోని తలకొరివి పెట్టిన... నాదేం బతుకు? ఏ జన్మల ఎవ్వలకు ద్రోహం చేసిన్నో..? నాకీగతి పట్టింది. నాది మొండిబతుకు. ఇటువంటి శిక్ష పగవానికైన వద్దు" మిత్రులతో చెప్పుకుంటూ ఏడుస్తున్నాడు కొండమల్లయ్య.

వాళ్లింట్లో శ్మశానవైరాగ్యం చోటుచేసుకుంది. ఎవరిముఖంలోనూ రక్తపు చుక్కలేదు. ఎవరిని కదిపినా వర్షించడానికి సిద్ధంగా వున్న మేఘాల్లా వున్నారు. రెండురోజుల్దాకా ఎవ్వరెంత బలవంతం చేసినా వచ్చి మంచినీళ్లు కూడా ముట్టుకోలేదెవ్వరూ!

పదకొండవరోజున పెద్దఖర్మ అయిపోయిం తర్వాత లక్ష్మిని వెంటబెట్టుకొని వెళ్లిపోయాడు ఆమె తండ్రి. చనిపోయినింట్లో గర్భవతినుంచకూడదని కాంతమ్మను తీసుకెళ్లాడు లస్మయ్య.

ఆ ఇల్లంతా బావురుమన్నట్లుంది. నేలబట్టిన భార్యతో, కొడుకుతో మొండిమానులా ఇంట్లో మిగిలాడు కొండమల్లయ్య.

★ ★ ★

శిశిర ఋతువు. చెట్లన్నీ ఆకులు రాల్చి కొండమల్లయ్య బ్రతుకులా మోడుల్లా వున్నాయి. కొండమల్లయ్యకు, నర్సమ్మకు కొడుకు వియోగం భరింపరానిదిగా వుంది. వాళ్ల ముఖాల్లో నెత్తురు చుక్కలేదు. ఎవరైనా కొడుకు విషయం కదిపితే చాలు భోరుభోరున దుఃఖిస్తున్నారు. ఒక్కోసారి వేదాంతిలా మాట్లాడుతున్నారు. ఇప్పుడాతనికి బ్రతుకంతా శూన్యంగా కనబడుతోంది. భవిష్యత్తు అంధకారంగా దర్శనమిస్తోంది. ఓ దిక్కు జటిలమవుతున్న ఆర్థిక సమస్యలు, మరోదిక్కు కొడుకు చావు. ఆతనికేం చేయాలో తోచడంలేదు. ఇవి చాలవన్నట్టు ఊళ్లో వారికి మరో సమస్య ఎదురైంది.

అన్నలు రకరకాల పోరాట వ్యూహాలను పన్నుతున్నారు. కిడ్నాపులు, హత్యలు ఇంకా... ఎన్నెన్నో. పోలీసులు, అన్నల మధ్య దాదాపు ప్రత్యక్షయుద్ధమే కొనసాగుతోంది. ఒకరిపైఒకరు దాడులు చేసుకుంటున్నారు. ఒకర్నొకరు హత్యలు చేసుకుంటున్నారు. అన్నలు, పోలీసులు రెండువైపులా ప్రాణాలు కోల్పోతున్నారు. ఒకరిపై ఒకరు పైచేయి సాధించడానికి ప్రయత్నిస్తున్నారు. పోలీసులు మరణించినప్పుడు ఊళ్లు అల్లకల్లోలమవుతున్నాయి. సామాన్యుడి బ్రతుకు దుర్భరమవుతోంది. అమాయకులెంతోమంది శిక్షకు గురవుతున్నారు. అన్నలు చనిపోయినప్పుడు బస్సులు తగలబెడ్తున్నారు. రైళ్లనాపుతున్నారు. విధ్వంసం సృష్టిస్తున్నారు. మాటిమాటికీ బందులవుతున్నాయి. అన్నలు బందు పిలుపిచ్చినప్పుడు బంద్ పాటించకుంటే అన్నలు, పాటిస్తే పోలీసులు ప్రజల్ని వేధిస్తున్నారు. మొత్తంమీద తెలంగాణ అగ్నిగుండంలా వుంది. బ్రతుకు దినదినగండంగా వుంది.

అన్నలు, ఓ పోలీసాఫీసర్ను చంపేసారు. హంతకులకొరకు గాలింపు పేరుమీద ఊళ్లలో భీభత్సం సృష్టించారు పోలీసులు. ఊరూరా

తిరిగారు. ఇంటింటికీపోయి ప్రజల్ని కొట్టారు. యువకులనందర్నీ చితకబాదారు. వాళ్ల ఆచూకీ చెప్పమని వేధించారు. అరెస్టులు చేశారు. వివరీతంగా హింసించారు.

అందులో భాగంగానే కొండమల్లయ్య గ్రామానికీ పోలీసులొచ్చారు. యువకులందర్నీ చితకబాదారు. కనబడినవాణ్ణల్లా ఇష్టమున్నట్టు కొట్టారు. అన్నలకు మద్దతునిస్తున్నారని అనుమానమున్న హరిజనుల గుడిసెలను, పెంకుటిండ్లను వాళ్లతోనే కూలగొట్టించారు.

ఈ భీభత్సాన్ని భరించలేక అప్పుడప్పుడే మీసాలొస్తున్న వయసువాళ్లనుంచి మొదలుకొని యువకులంతా ఊరొదలి వెళ్లిపోయారు. అందులో భాగంగానే తిరుపతయ్యా కూడా ఊరు వదిలి వెళ్లిపోయాడు. ఒక్కగానొక్క కొడుకు తిరుపతయ్యకు ఏమవుతుందోనని కొండమల్లయ్య భయపడుతున్నాడు.

యువకులైన కొడుకులను ఊళ్లోంచి పంపించి మీరున్నారా అని ముసలివాళ్లను కూడా కొట్టారు పోలీసులు. మాకేం తెలియదని ఎంత మొత్తుకున్నా విన్లేదు.

కొండమల్లయ్య ఇంటికొచ్చారు పోలీసులు. తిరుపతయ్య గురించడిగారు. అతని కన్నలతో సంబంధముందన్నారు. పెద్దకొడుకు వాళ్లలో కలిసి చనిపోయాడు. చిన్నవాడు కూడా కలుస్తున్నాడా అన్నారు. తనకు, తన కొడుక్కు ఆ విషయాలేం తెలియవని, వాళ్లతో ఎలాంటి సంబంధాలూ లేవని మొత్తుకున్నాడు కొండమల్లయ్య. అయితే వాడేడి అన్నారు. అందరు యువకులతోపాటు వెళ్లిపోయాడన్నాడు కొండమల్లయ్య. ఎక్కడికని ప్రశ్నించారు వాళ్లు. తనకు తెలియదన్నాడు కొండమల్లయ్య.

లాఠీతో నాలుగైదుదెబ్బలు కొట్టి వెళ్లిపోయారు. ఇలా మూడుసార్లు జరిగింది. ఊళ్లో చాలా మందినిలాజేశారు పోలీసులు.

ఊళ్లను పోలీసులు అల్లకల్లోలం చేస్తుంటే భరించలేక లోకల్ ఎం.ఎల్.ఏ.తో మొరపెట్టుకున్నారు గ్రామస్థులు. చుట్టూ తింపుకొని పోలీసులతో మాట్లాడాడు ఎమ్.ఎల్.ఏ. ఊళ్లోకి ఏ కొత్తవాడొచ్చినా పట్టుకోవాలని, అన్నల ఆచూకీ తెలిస్తే పోలీసులకు తెలియజేయాలని గ్రామస్థులకు చెప్పి దాడులనాపారు పోలీసులు.

ఇరవైరోజులుగా కకావికలైన గ్రామాల్లో ప్రస్తుతానికి ప్రశాంతత చోటుచేసుకుంది. కాని, ఏక్షణంలో ఏం విపత్తు వస్తుందోనని ఊరివాళ్లకు భయంభయంగానే వుంది. ఇరవైరోజులుగా ఊళ్లొదిలిపోయిన యువకులంతా తిరిగొచ్చారు. ఇరవైరోజుల తర్వాత వచ్చిన తిరుపతయ్యను పట్టుకొని ఏడ్చేరాతని తల్లిదండ్రులు. గ్రామంలో జరిగిన విషయాల గూర్చి చెప్పారు. అన్నీ విన్నాడు తిరుపతయ్య. తండ్రి వక్కన కూర్చున్నాడు.

"బాపూ... ఇక్కడ పరిస్థితెలా వుందో నీకు తెలియంది కాదు. పోగా, మనకిక్కడ వెళ్లే పరిస్థితులు లేవు. కష్టపడి వ్యవసాయం చేద్దామన్నా బాకీలుపోను భూమెక్కడ మిగుల్తుంది? అన్న స్థానంలో నాకు 'బావివని' దొరుకుతుంది. మనం గోదావరిఖనికే వెళ్లిపోదాం" అన్నాడు తిరుపతయ్య.

ఓ కొడుకును బలితీసుకున్న బావివనికే ఉన్న ఒక్కగానొక్క కొడుకును వంపడానికి మనసొప్పడం లేదు కొండమల్లయ్యకు. పోగా పరిస్థితులెంత దిగజారినా పుట్టిపెరిగిన నేలను, నమ్ముకున్న భూమిని వదిలివెళ్లడానికి అతనికి మనస్కరించడంలేదు. కొడుకు మాటలకు అంగీకారం తెలుపకుండా మౌనంగా వున్నాడు కొండమల్లయ్య.

"నాన్నా! ఇక్కడ పరిస్థితులు చూస్తూనే వున్నాం. ఊళ్లన్నీ అగ్నిగుండాల్లా మండుతున్నాయి. ఎప్పుడేమవుతుందో తెలియదు. అటు పోలీసులు, ఇటు అన్నలు మధ్య మనలాంటి సామాన్యులు. మింగమంటే కప్పక్కోవం, విడవమంటే పాముక్కోవం. ఎవరి మార్గమేదైనా, ఎవరి ప్రయోజనాలేవైనా, ఏది సరియైందైనా ఇక్కడి పరిస్థితి దినదిన గండంగానే వుంది. అట్లని అందుకోసం మాత్రమే ఊరువదిలి పోవాలనడంలేదు. ఇక్కడేంచేసి బ్రతుకుదామో చెప్పండి? మనకున్న బాకీలు తీర్చాలంటే రెండెకరాలు చేను పోగా ఉన్న ఎకరంలోంచి కొంత పొలం కూడా అమ్మాల్సి వస్తుంది. అమ్మకుండా ఉందామంటే వాటి వడ్డీతో కలుపుకుని ఇంకొద్దిరోజులకు ఇల్లు కూడా అమ్మాల్సిన పరిస్థితి




వస్తుంది. అందుకోసం మనమిక్కడుండి బాముకునేదేం లేదు... నామాట విను. ఇన్నిరోజులూ నేను గోదావరిఖనిలోనే వున్నాను. కార్మిక నాయకులతో, అధికార్లతో మాట్లాడాను. అన్న స్థానంలో నాకు ఉద్యోగం వస్తుంది. అది త్వరలోనే రావచ్చు. బాకీలు పెరుగుతుంటే చూస్తూ, మరోదిక్కు పోలీసు వేధింపులు భరిస్తూ ఇక్కడే ఉండకుంటే ఏంటి?''

కొడుకు మాటలనర్థం చేసుకుంటున్నాడు కొండమల్లయ్య.

''అక్కడ మాత్రమేమీ అల్లర్లు లేవా?'' అన్నాడు.

''ఉన్నా లక్షలాది జనం. మనల్ని పట్టించుకునేవాళ్లుండరు. మనకు బ్రతుకుదెరువు లేకున్నా ఈ అగ్నిగుండంలో ఉండడమెందుకు? అక్కడేపరిస్థితివున్నా ఉద్యోగంవల్ల వచ్చే డబ్బుతో కనీసం రెండు పూటలు తిండైనా తినొచ్చు. ఇక్కడ ఆ పరిస్థితీ లేదుకదా'' అన్నాడు తిరుపతయ్య.

''మొన్నమొన్ననే అన్న బావికి బలయిపోయిండు. తెలిసీ మళ్లీ నిన్నదేవనికి పంపన్నంటే భయమైతుంది బిడ్డ...''

''బాపూ... ప్రమాదాలు జరుగుతాయని భయపడితే ఏపనీ కాదు. కాలం మనది కానప్పుడు ఎక్కడున్నా జరిగే ప్రమాదం జరుగక పోదు. గొల్లకొంరయ్యా కొడుకు వ్యవసాయం చేసేవాడేకదా! మరాతడు పాముకుట్టి చనిపోలేదా? రాజనర్సు కొడుకు బస్సు ప్రమాదంలో చనిపోలేదా? ఏ పనికీ పోకున్నా అన్న పోలీసు కాల్పుల్లో చనిపోలేదా? చావంటూ వస్తే ఎక్కడున్నా తప్పదు. మనం బ్రతకాలంటే తినాలి. మరాతిండికొరకు ఏదో పనిచేయాలి. వ్యవసాయం మంచిదికాదని నేను చెప్పడం లేదు. కాని మనకాపనితో వెళ్లని పరిస్థితి వచ్చినప్పుడు, వ్యవసాయం చేయడానికి భూమంటూ లేనప్పుడు ఊరు విడిచిపోక చేసేదేముంది?'' అన్నాడు తిరుపతయ్య.

కొడుకు మాటలు జరిగిన సంఘటనలు, విషమిస్తున్న ఆర్థిక స్థితిగతులు ఇదువరకటిలా కాకుండా కొండమల్లయ్యతో కొడుకు మాటలకు ఒప్పుకునేట్టు చేస్తున్నాయి. అయినా ఏవేవో సందేహాలు. కన్నతల్లిలాంటి ఊరును వదిలిపోవాలంటే కష్టంగా తోస్తుందతనికి.

''ఊరును విడిచిపెట్టి పోవన్నంటే మంచిగనిపిస్తలేదు. భూమినే నమ్ముకున్న నాకు భూమి లేకుండ ఉండడం తలదీసేసినట్టనిపిస్తంది'' అన్నాడు కొండమల్లయ్య.

''నాన్నా... ఊరును వదిలిపెట్టిపోవడం ఎవరికైనా బాధాకరమే. కాని కాలం మనదికానప్పుడు చేసేదేంలేదు. పరిస్థితులు అనుకూలంగా లేనప్పుడు ఎవరైనా ఏంచేస్తారు? బ్రతుకులు దుర్భరమై ఎంతమంది వలసపోవడంలేదు? పైగా మనం ఇల్లు నమ్ముకోవడంలేదు. పరిస్థితులు బాగుపడితే మళ్లీ భూమి కొనుక్కుందాం. ప్రస్తుతమైతే పోకతప్పదు''

కొండమల్లయ్యేం మాట్లాడలేదు. ఊరును వదిలిపోవాల్సిన అవసరాన్ని గూర్చి మరెన్నో రకాలుగా చెప్పాడు తిరుపతయ్య.

''నాన్నా... మీరిక్కన్నే వుంటే పెద్దన్న జ్ఞాపకం వస్తాడు. చిన్నన్న జ్ఞాపకం వస్తాడు. రోజురోజుకూ దుర్భరమవుతున్న పరిస్థితులు మీకు మనశ్శాంతి లేకుండా చేస్తాయి. ఇంకో నెలరోజుల్లో నాకు బావివనవుతుంది. ఈలోగా ఇక్కడి పనులు ముగించుకుందాం. ఇహ ఇక్కన్నుంచి వెళ్లక తప్పదు''

కొడుకు మాటల గూర్చి కొద్దిరోజులు ఆలోచించాడు కొండమల్లయ్య.

రోజురోజుకూ దిగజారుతున్న ఆర్థిక పరిస్థితులు, ఉన్న భూమిని అమ్మందే బాకీతీర్చడం సాధ్యం కాని పరిస్థితులు, అగ్నిగుండంలా వున్న ఆ ప్రదేశంలోని పరిస్థితులు, వెంటాడుతున్న కొడుకుల జ్ఞాపకాలు. కొండమల్లయ్యతో కొడుకు మాటలకు ఔననిపించాయి.

రెండెకరాల చేను అమ్మేశాడు కొండమల్లయ్య. కాగితంపై వేలిముద్ర వేస్తున్న ఆ రైతుబిడ్డ కళ్లవెంట పటపట నీళ్లు గారుతున్నాయి. కడుపులోంచి తన్నుకొస్తున్న దుఃఖాన్ని బలవంతంగా దిగమింగుకుంటూ వేలిముద్ర వేశాడు. వచ్చిన డబ్బుతో ఊళ్లో వున్న బాకీలన్నీ తీర్చేశాడు. కొంత ప్రభుత్వం అప్పులనూ తీర్చేశాడు. మిగతా ప్రభుత్వ అప్పును ఏడాదికి కొంత తీర్చవచ్చనుకున్నాడు. ఎడ్లు, బండి

కూడా అమ్మేశాడు. పాతపానకజోల్లు, నాగలి లాంటి వ్యవసాయం పనిముట్లను తమ్ముడు కొండయ్య కిచ్చేశాడు.

ఇప్పుడు కొండమల్లయ్యకు ఎకరం పొలం మిగిలింది. అందులో సగభాగం వరదకొడ్డుడు కుంది. కొంచెం వానలెక్కువైతే చాలు వరదదెబ్బ, మోకాళ్లబంటి దిగుబాటుంటుంది ఆ పొలంలో. దాన్నమ్మినా పెద్దగా డబ్బులు రావు. ఆ పొలంతోపాటు కూలడానికి సిద్ధంగా వున్న తంత్రికాలంనాటి పెంకుటిల్లు మిగిలింది. ఇన్నేళ్లుగా బాకీల సుడిగుండంలో కొట్టుమిట్టాడుతున్న కొండమల్లయ్య దాదాపు ఋణవిముక్తుడయ్యాడు! అందుకు పణంగా తాను ప్రాణాధికంగా ప్రేమించిన నేలను వదులుకోవాల్సివచ్చింది.

తిరుపతయ్య సింగరేణి అపాయింట్‌మెంటు కొరకు నాలుగైదురోజులకోసారి గోదావరిఖనికి పోయివస్తున్నాడు. కొండమల్లయ్య రోజూ అమ్ముడుపోయిన తన భూముల్లోకి పోతున్నాడు. ఆప్యాయంగా అందులో తిరుగుతున్నాడు. మట్టిని చేతిలోకి తీసుకుంటున్నాడు. ఆ మట్టిలో మట్టైయిన శరీరాన్ని చూసుకుంటున్నాడు. ఆ మట్టిలో కార్చిన ఘర్మజలాన్ని జ్ఞాపకం చేసుకుంటున్నాడు. చిన్నప్పట్నుంచీ చేసిన ఏతం, మోట, జంబు, నాగలి, బండిగట్టడం...లాంటి వ్యవసాయ పనులను జ్ఞాపకం చేసుకుంటున్నాడు. ఆ మట్టితో తనకున్న అనుబంధాన్ని నెమరువేసుకుంటున్నాడు. ఆ మట్టితో బంధాన్ని తెంపుకొని ఊరునే వదిలిపెట్టి వెళ్లబోతున్న అతనికి ఆ మట్టిని చూస్తుంటే కన్నీరాగడంలేదు. ఇన్నిరోజులూ తన చెమటతో ఆ నేలను తడిపిన కొండమల్లయ్య ఇప్పుడు కన్నీటితో తడుపుతున్నాడు.

కొండమల్లయ్య, నర్సమ్మ నాలుగు దశాబ్దాలు దాటిన తమ సంసార జీవితాన్ని తలుచుకుంటూ, కష్టసుఖాలను నెమరు వేసుకుంటున్నారు. కొద్దిరోజుల్లో ఇన్నేళ్లుగా బ్రతికిన ఆ నేలతో, అక్కడ గాలితో, ఏటినీరుతో తెగిపోతున్న బంధాన్ని గూర్చి మాట్లాడుకుంటూ కన్నీరు కారుస్తున్నారు. కొడుక్కు వచ్చే ఉద్యోగం కొరకెదిరి చూస్తున్నారు.

జాజిరో... జాజిరో జంబినాగండ్లు
చక్కంగ దున్నురా సాయిరెడ్డి కొడుకా
ఇంకెట్ల దుంతర్ర కుక్కలా కొడుకా
ఆం... అంటే అరవై పుట్లూ
ఊం... అంటే ఇరవై పుట్లూ
కొట్టిపోనుకపాయె కొండయ్య పంతులు
తిట్టిపోనుకపోయె తిమ్మయ్య పంతులు
జాజిరిపాట పాడుతున్నారు పిల్లలు.

మంచంలో పడుకొని ఆ పాట వింటున్న కొండమల్లయ్యకు రైతుదుస్థితికిగల కారణాలెన్నో కళ్లముందు కదులుతున్నాయి. రైతెంత కష్టపడ్డా తన కష్టార్జితాన్ని దోసుకుపోయే కొండయ్యపంతుల్లు, తిమ్మయ్య పంతుల్లెవరో అతనికర్థమవుతోంది.

మరికొన్నిరోజులు గడిచాక గ్రాడ్యుయేటయిన తిరుపతయ్యకు, నిరక్షరాస్యుడైన అతని అన్న రాజయ్య స్థానంలో 'కోల్‌ఫిల్లర్'గా బొగ్గుగనుల్లో అతికష్టంగా ఉద్యోగమొచ్చింది.

పరిస్థితులు వికటించి, ఆర్థిక స్థితిగతులు తరిమివేయగా ఊరిని వదిలిపెట్టి కొడుకుతోపాటు వెళ్లిపోతున్న కొండమల్లయ్య ముఖంలో రక్తం లేదు. కొడుక్కు ఉద్యోగమొచ్చిందన్న ఆనందం అంతకంటే లేదు. భారమైన హృదయాలతో ఊరివాళ్లు, బంధువులు, ఆత్మీయులు ఎంతోమంది సాగనంపుతుంటే తమ కన్నీరు చిరపరిచితమైన నేలను తడుపుతుండగా బస్టాండుకొచ్చారు కొండమల్లయ్య, నర్సమ్మ, తిరుపతయ్య.

"ఓ కొడుకును పోలీసోల్లు చంపింద్రు. ఇంకో కొడుకును బొగ్గుబావి బలితీసుకుంది. కొడుకును బలితీసుకున్న పనికే ఉన్నొక్క కొడుకును పంపుతన్న. నేనూ ఊర్నిడిసిపోతున్న" అంటూ తమ్ముని, ఇతర రక్తసంబంధీకులను, మిత్రులను కౌగలించుకున్నాడు కొండమల్లయ్య. కళ్లవెంట పటపట నీళ్లు కారుతుండగా బస్సెక్కాడు.

పుట్టిపెరిగిన ఊరును, అయిదు దశాబ్దాలకు పైగా జీవిస్తున్న నేలను, పీలుస్తున్న గాలిని వదిలి వెళ్లిపోతున్న ఆ రైతుబిడ్డ కడుపులో అనంతమైన శోకముంది.

ఆ కుటుంబాన్ని ఊరునుంచి దూరంగా తీసుకెళ్తూ బస్సు పరుగెడుతోంది. ●




# 'క్షమ' పై చతుర సమీక్షలు

అక్టోబరు నెల 'చతుర'లో ప్రచురితమైన తనికెళ్ళ కళ్యాణి నవల 'క్షమ'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## ఆరోగ్యకర సాంప్రదాయం

(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

'క్షమ' మనుమల్లోని భిన్న మనస్తత్వాలకు ఒక ప్రతీక. నవల్లోని పాత్రలన్నీ ప్రత్యేక వ్యక్తిత్వంతో తీర్చిదిద్దబడ్డాయి. ఇందుకు ఉదాహరణగా స్వార్థానికి, లౌల్యానికీ ప్రాతినిధ్యం వహించిన 'సుందరి' పాత్రనీ, త్యాగానికి, సహనానికీ ప్రాతినిధ్యం వహించిన రఘు, రామారావు పాత్రలనీ చూపవచ్చు.

రామారావు ఉదాత్తమైన వ్యక్తి. రఘు అంతకన్నా ఉన్నత స్వభావి. మాధవి, సుమతి, శాంత, రాజా, మధుసూదనం, సరస్వతి, చక్రధరం... ఎవరూ ఎవరికీ తమ వ్యక్తిత్వం, ఔన్నత్యం, మానవత్వం విషయాల్లో తీసిపోరు. వీరందరూ ఇదే సమాజంలో ఉన్నారా అన్న ఆశ్చర్యం, ఉంటే అంతకన్నా కావలసిందేమన్న ఆనందం కలిగి, మనిషి మరో మనిషికి దూరమైపోతున్న నేటి ఆర్థిక విలువల ప్రపంచంలో బ్రతుకువట్ల భరోసానిస్తాయి. స్నేహం విలువని ఈ నవల బాగా ప్రాజెక్ట్ చేసింది. ఎన్ని ఒడిదుడుకులు వచ్చినా, ఎన్ని పరీక్షా సమయాలు ఎదురైనా తట్టుకొని నిలబడగలిగేవాడే మనిషనీ, వారినుండి లోకం ఉత్తేజాన్ని పొందుతుందనీ నమ్మకమిచ్చిందీ నవల. మనుమలమధ్య ఉదాత్తమైన ప్రేమాభిమానాల్ని నిరూపించిన ఈ నవల మానవ సంబంధాలవట్ల విశ్వాసాన్ని కలిగిస్తోంది. ఉన్నతమైన సంబంధాలూ, రాగద్వేషాలకు అతీతమైన వ్యక్తిత్వాలూ ఇచ్చే ఆనందం అనుపమానమైనదనీ, అది డబ్బూ, హోదా మరి ఏ ఇతరమైన భౌతిక సుఖాలకీ అతీతమైనదనీ ఈ నవల చెబుతుంది.

రహమాన్‌లాంటివాళ్ళు సుందరిలాంటివాళ్ళలోని స్వార్థాన్ని పెంచి పెద్దచేస్తారు. రహమాన్‌పట్లగానీ, సుందరిపట్లగానీ పాఠకులకు ద్వేషం కలగదు. పైగా సుందరిపట్ల జాలి, సానుభూతి కలుగుతాయి. మానవులలోని మంచిని ప్రత్యేకించి వెలుగులో వుంచి చూపించారు రచయిత్రి.

మొదట్లో మనం ద్వేషించిన వ్యక్తుల్ని కూడా నవల ముగిశాక కేవలం పరిస్థితుల ప్రభావంవల్లే వారలా ప్రవర్తించారని అర్థంచేసుకుంటాం. బతుకు బతకనీ అనే ఓ సమగ్ర జీవన సత్యాన్ని ఈ నవల చాటుతుంది. నవలలో కొన్ని లోపాలున్నాయి. సంక్షిప్తత లేకపోవడం, పాఠకులు తట్టుకోలేనంతగా పాత్రల్ని ఉదాత్తీకరించడం, పునరుక్తులూ, భావవాద ధోరణీ వుంది. అప్రమత్తంగా వుంటే ఇంకా బాగుండేది.

అసాంతం భావోద్వేగానికి గురిచేసి కళ్ళు చమర్చేట్టు చేయగలిగిన రచన ఉత్తమ సాహిత్యం కాకపోదు. రచయిత్రినీ, చతురనీ మనఃపూర్వకంగా అభినందిస్తూ నవలారచనలో ఆరోగ్యకరమైన సంప్రదాయం కొనసాగాలని కోరుకుంటున్నాను.

-ఎమ్.విజయభాస్కర్‌రెడ్డి,
హైద్రాబాద్.

## క్షమయా ధరిత్రీ..!

(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)

ఏనాడో నవలలు చదవటం మానేసిన నాకు యధాలాపంగా చదివిన నవల 'క్షమ' చాలా తృప్తినిచ్చింది. రచయిత్రి నేటి సమాజంలోని విలువలకు అద్దంపడుతున్నట్లుగా రచించి మా మనస్సులను దోచుకున్నారు. చాలారోజుల



తరువాత మంచి నవల చదివానన్న సంతోషం మిగిలింది. ప్రచురించిన మీకు చాలా థాంక్స్.

"తప్పు చేయడం మానవ సహజం. దానిని దిద్దుకోవడం వీరుల సుగుణం" అనే సూక్తిని తలపింపజేసేలా ఉంది రామారావు పాత్ర. తప్పు తెలుసుకుని పశ్చాత్తాపపడి క్షమించమని కోరినప్పుడు వారిని గొప్ప మనస్సుతో క్షమించడం ఉన్నతమైన వ్యక్తియొక్క వ్యక్తిత్వాన్ని తెలుపుతుంది. చివరిలో రామారావు సుందరి ఇంటికి వచ్చిందని తెలుసుకొని ఏవిధమైన ఆవేశమునకు గురికాకుండా ఆమెను తన ఇంటిలోనే వుండమని చెప్పి తన వ్యక్తిత్వమును నిలుపుకున్నారు.

నేటి సమాజంలో ఝాన్సీ, పావనీలాంటి పిల్లలకున్న ఆదర్శ స్వభావాలు అరుదు. ఈ సమాజం మనం ఏ తప్పు చేస్తే ఎత్తి చూపిద్దామా అనే చూస్తూవుంటుంది. మనం భయపడి పరిగెడితే ఇంకా తరుముతూ వుంటుంది. అలాకాక ఎదురుతిరిగి ధైర్యంగా నిలబడితే ఏమీ చేయదు. ఈ నవలలోని ఝాన్సీ నిజంగా ఆ ఝాన్సీరాణిని తలపింపజేసేలావుంది.

రఘు పాత్రలా ఎంతమంది ఈ కాలంలో తండ్రిని కాపాడేవాళ్లున్నారు? చివరివరకు తండ్రిని కాపాడి ఆ కర్తవ్యం నెరవేర్చుకున్నాడు. రఘు సుమతి ఇంటి గౌరవం నిలబెట్టడం, మాధవి వీరికి సహాయంగా వుండటం సుందరి ఇంటికి వస్తే ఆవేశంతోకాక సమయస్ఫూర్తితో లోనికి తీసుకొని వెళ్లడం బాగున్నాయి. కాంతమ్మలాంటివారు నేటి సమాజంలో ఎంతోమంది ఉన్నారు. తమ పిల్లలకు పెళ్ళిచేసే స్థోమతలేక గుండెలమీది కుంపటిని దించుకొంటేచాలునని రెండవపెళ్ళివారికి అయినా ఇచ్చి చేస్తున్నారు. కాని చివరికి జీవితంలో అన్నీ కోల్పోయిన సుందరి తిరిగి వస్తే పెద్దరికాన్ని నిలుపుకోలేకపోయారు.

సరస్వతమ్మ, మధుసూదనంల ఆదర్శం మెచ్చుకోదగినది. నేటి సమాజంలో ఎంతోమంది అవసరంకోసం స్నేహంచేసి ఆ తరువాత మరచిపోతారు. కాని 'కష్టసమయంలో ఆదుకున్నవాడే నిజమైన మిత్రుడు' అనే సూక్తిని తలపింపజేస్తూ ఎవరెన్ని మాటలు అన్నా జంకకుండా పావనిని తమ కోడలుగా చేసుకోవడం చాలా గొప్పవిషయం.

ఈ నవల కడవరకు చాలా ఆసక్తి కలిగించింది. తప్పుచేసినవారిని క్షమించడం చాలా గొప్ప అని ఈ నవలద్వారా రచయిత బాగా వివరించారు.

**ఎస్.కవితారెడ్డి,**
కడప.

## తెలుగు సినిమా

*(మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

'క్షమ' నవల చదువుతున్నంతసేపూ పాత తెలుగు సినిమా చూస్తున్న అనుభూతిని పొందాను. ఉదాత్త స్వభావాలూ, త్యాగాలూ, స్వార్థాలూ, బలహీనతలూ ఉన్న విభిన్న పాత్రల చిత్రణా, కథాగమనం, శైలీ అన్నీ అలా అన్పిస్తాయి. మధ్యతరగతి వాతావరణాన్ని చిత్రించడంలోనూ, సాహితీ ప్రేమికుడై, సున్నితమనస్కుడై, నిరాడంబర జీవితాన్ని గడిపే ఆదర్శవ్యక్తి రామారావును జీవితానికే ఉపాధ్యాయుడిగా ప్రతిబింబించడంలోనూ రచయిత్రి సఫలీకృతురాలయ్యారు. జీవితంలో జారుడు మెట్లు మన బలహీనతలైతే జారిపడ్డ మనిషిని చేయూతనిచ్చి ఆదుకునే క్షమా హృదయం ప్రతిమనిషికీ ఉండాలని చెప్పే ఈ నవలలో మన సంస్కృతీ, విలువలూ మనోహరంగా గోచరిస్తాయి. క్షమని భరించలేని సుందరి మనస్తత్వం కూడా సహజమే- ముగింపు బావుంది.

నవలలో పెద్దలోపం పొడవైన సంభాషణలు. పాత్రల గురించి పాఠకుల ఊహకి వదలక రచయిత్రి పదేపదే (రిపిటిషన్స్‌తో) తనకు తెల్సిందంతా తనే చెప్పేయాలని ప్రయత్నించడంతో నవల అందం కొంత దెబ్బతింది. సుందరి మానసిక భావాలని డైరీ ద్వారా చెప్పడం (ఆమె రెహమాన్‌తో వెళ్ళిపోవడానికి ముందు కూడా) అనమంజనం. ఏమైనా ఇది ఓ మంచి నవల రాయడానికి గట్టి ప్రయత్నంగానే అన్పించింది.

**- సుధారమ,**
బొంబాయి.




## పునరుక్తులు జాస్తి

*(రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

**'క్ష**మ'లో నాకు బాగా నచ్చింది పాత్రల సమయోచిత సంభాషణ. అంతగా నచ్చంది కొన్ని సన్నివేశాల చిత్రీకరణ. సుందరి బలహీన మనస్తత్వాన్ని అదే సందర్భంలో రఘు ఉన్నత హృదయాన్ని రచయిత్రి కళ్యాణి సూటిగా విశ్లేషించారు. కానీ ఒకే అంశంమీద దాదాపు అన్ని పాత్రలచేతా మాట్లాడించడం అనవసరం. పాఠకులకు ఆ పద్ధతి విసుగుపుట్టించవచ్చు.

తండ్రి సుగుణాల్ని పుణికిపుచ్చుకున్న రఘు అంతర్మధనం హృదయాన్ని ద్రవింపచేస్తుంది. కన్నకొడుకు కాకపోయినా అంతకు మించిన బాధ్యతను భరించిన అతనికి మిగిలింది దుఃఖ భారమే. 'అమ్మ' వల్ల చూపిన మన్నన, చెల్లెళ్ళపైగల ఆదరణ నేటి యువతరానికి ఎంతగానో కనువిప్పు కావాలి. సుందరి తెంపరితనాన్ని ఆమె మాటల్లోనే చెప్పాలంటే- ''పాపపంకిల'' జీవితాన్ని చదువరుల మనోనేత్రంముందు నిలిపారు రచయిత్రి. పాలకుండ వంటి కుటుంబంలో విషబిందువును కారాదని, అందుకే వెళ్ళిపోతున్నానని సుందరితో అనిపించడం రచయిత్రి ప్రతిభకు మచ్చుతునక. ఆఖరి లేఖ మొదటన ఉన్న 'పిన్ని'ని చివరన 'అమ్మ'గా మారడం కూడా మెచ్చుతునకే!

రామారావు ఉదారబుద్ధికి నిలువుటద్దం పట్టాలని రచయిత్రి ప్రయత్నించినా, అందులో లోపం కనిపించింది. ఇంతకీ ఆయనది ఉన్నత వ్యక్తిత్వమా లేక పిరికితనమా అని కొన్ని సందర్భాల్లో అనిపిస్తుంది. లోకానికి ఉపకరించేలా బతకడం ఒక కళ. అయితే విద్యారాహిత్యం, అవగాహనలోపించడం, అన్నిటికంటేమించి స్వార్థపూరిత దృక్పథం మానవజీవనాన్ని దుఃఖ భాజనం చేస్తున్నాయి. క్షణికావేశాలు, ఇంద్రియలోలత్వాలు వినాశనానికే దారితీస్తాయనీ నవలద్వారా తేటతెల్లమైంది. ''నాకే మీ అమ్మా అని పిలిపించుకోవాలని లేదు'' అంటూ ఒకప్పుడు విరుచుకుపడిన ఆమే అటుతర్వాత తన అంతిమయాత్ర 'కొడుకు' చేతులమీదుగా జరగాలనడం గమనార్హం. ఆ బలవత్తరకోరిక వ్యక్తమయ్యేందుకు తగిన స్థితి గతులను కల్పించడంలో రచయిత్రి కృతకృత్యులయ్యారు. పునరుక్తుల్ని సుభాషితాల పరంపరను పరిహరిస్తే బిగువు పెరిగి నవల మరింత బాగుండేది.

-జంధ్యాల శరత్‌బాబు
తిరుపతి

## కథనం ప్రధానం

*(రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

**'త**నికెళ్ళ కళ్యాణి'గారి నవల 'క్షమ' సాహిత్యపు విలువలలో ప్రధానమైన 'కథనం' అనే మాటకి న్యాయాన్ని చేకూర్చింది. వివిధ మనస్థత్వాలు కలిగిన 'భారతీయస్త్రీ'ని చూడటానికి ఒక అవకాశం కల్పించారు రచయిత్రి.

కథానాయిక సుందరి- ఒక పరాజిత. తీరని కోరికలు తీరే అవకాశం వచ్చిందేమోనన్న ఆశతో ఆమె 'రెహమాన్'తో లేచి వెళ్లిపోయింది. దాని మూలంగా తర్వాత తన జీవితం గురించి ముగ్గురు ఆడపిల్లల భవిష్యత్ గురించి ఆలోచించక పోవటం ఆవిడ దురదృష్టం. ఇలా జరగటానికి బలీయ కారణం కేవలం ఆమె తప్పుకాదు. ఆమె పెరిగిన పరిస్థితులు, కాంతమ్మ, శర్మల పెంపకం, అవకాశవాదాలు, అదుపులోపెట్టలేకపోయిన భర్త రామారావు నిర్లిప్తత, అతని క్షమాగుణాలు ఆమె ఈ ప్రవర్తనకు ఉత్ప్రేరకాలు. అదే పిల్లల పెంపకంలో సరస్వతమ్మగారి పద్ధతీ, తన కోడల్ని ఎన్ను కోవటం సమాజానికి సమాధానం చెప్పగలిగే విధానం నేటి సమాజపు స్త్రీకి చాలా అవసరం.

ఇందులో 'మాధవి' పాత్ర కూడా ఒక పరాజితే. ఒక వివాహితుణ్ణి ప్రేమించటం, తన తప్పు తెలుసుకోవటం, పర్యవసానంగా మార్పుకో లేకపోయిన ఆమె మనస్సు. మాధవి,

సుందరి పాత్రలలోని విద్యాభేదం సుందరి తొందరపాటు చర్యని చూపాయనవచ్చు. ఇద్దరి లోని ఈ తొందరపాటుని నేటి యువత గ్రహించాలి.

సుమతి, పార్వతి, నర్మద మరియు రజియా పాత్రలు సగటు కుటుంబాలలోని 'భార్య' అనే పదానికి ప్రతీకలు. ఇందులో రజియా పాత్ర వున్నతమైనది. తన భర్త ఎలాటివాడో తెల్సినా, అతన్ని మార్చలేక, సుందరిమీద ఈర్ష్య పడక తన భర్త మూలంగా బాధపడుతున్న సుందరిని పరామర్శించడం, జాలిపడటం ఆమెలోని సాటి స్త్రీపట్ల గౌరవభావాలను చూపాయి.

సహజంగా, పాత్రోచితంగా వున్న రామారావు క్షమాగుణం అతనినే కాక రఘునికూడా బాధపడేటట్టు చేసింది. నవసమాజంలో 'రఘు'లాంటి పాత్రలను చూడటంకద్దు. అతనిలోని మెత్తని గుణాన్ని హర్షించాలి. ఝాన్సీ, పావనిలు ప్రస్తుతకాలపు యువతుల పాత్రని చూపాయి.

ఇంత చెప్పినా 'ముగ్గురు పిల్లలు, సంసారం కల్గిన స్త్రీ వ్యామోహితురాలై వేరొకరితో వెళ్లి అక్కడా పరాజితురాలై తిరిగివస్తే ఆ కుటుంబంలో ఆ స్త్రీకి ఏ స్థానం యివ్వాలి? పూర్వపు తన స్థానం ఆమె సంపాదించుకోగలిగినా 'సమాజం' హర్షిస్తుందా? ఆమోదిస్తుందా? అన్న ప్రశ్నలు ప్రశ్నలుగానేవున్నాయి.

-శర్మ
వాల్తేర్.

## సమయం వృధాకాలేదు

*(రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

ఉదాత్తమైన కథావస్తువును తీసుకోవడమే నేటి సాహిత్యంలో అరుదు. 'క్షమ'వంటి థీమ్ ఎన్నుకుందుకు ముందుగా రచయిత్రిని అభినందించాలి. ఈ నవల యింకో విషయంకూడా చెబుతుంది. నేటి సమాజంలో వరకట్న బాధితులై, మగవారి అహంకారానికి బలి అయిపోయే స్త్రీలు వున్నట్టే, పురుషులను హింసించే స్త్రీలుకూడా కొంతశాతం వున్నారు. ఎంతో ఉన్నతుడైన వ్యక్తి రామారావుని మానసికంగా ఎంత హింసించాలో అంతా హింసించింది సుందరి. కానీ సద్గుణ సంపన్నుడయిన ఆయన సుందరి అలా వెళ్లిపోవడానికి తన బాధ్యతకూడా వుందీ అని నిజాయితీగా వొప్పుకుంటాడు. ఆ పాత్రద్వారా రచయిత్రి కొన్ని విలువైన సత్యాలు పలికించారు. పిల్లలు రామారావుని తప్పుచేసిన వారిని క్షమించడం గురించి అడిగినప్పుడు, 'చూడమ్మా... తప్పులు చేయనివారు ఈ పుడమిమీద లేరు. సకల సద్గుణ సంపన్నుడు భగవంతుడు ఒక్కడే...' అనీ, 'ఈ ప్రపంచంలో తెలిసో, తెలియకో అందరూ తప్పులుచేస్తారు.. వాటిని మనం సహించగలగాలి, క్షమించగలగాలి' అనీ చెప్తాడు. పాఠకులు యిది చదివాక ఒకసారి ఆత్మ పరిశీలన చేసుకుంటారు. ఆ విధంగా సాహిత్య ప్రయోజనం నెరవేరినట్లే కదా!

ఈ నవలలో కొన్ని లోపాలుకూడా లేకపోలేదు. 'రామారావుగారు', అనీ 'శర్మగారు' అనీ, పాత్రలకి వారి గుణాల్ని బట్టి గౌరవం యివ్వడం తెలుగు సాహిత్యంలో కొందరికి ఆనవాయితీగా వస్తోంది. ఇలాగ గౌరవ సూచకాలు యివ్వకుండా, రచయిత్రి సృష్టికర్తకాబట్టి, ఆ పాత్రలని పాత్రలుగా వదిలేస్తే బాగుంటుంది. కథనడిపించే తీరు కూడా ఎక్కడికక్కడ ముక్కలుగా కాకుండా ఒక స్రవంతిలా సాగిపోయివుంటే ఈ నవల యింకా హృద్యంగా వుండేది.

మొత్తం మీద నవల చదివాక మాత్రం మన సమయం వృధా కాలేదు అని తప్పకుండా అనిపిస్తుంది.

-బి.మోహనబాల,
హైదరాబాద్.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291, Anantapur 22977.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd.No. H/HC